1181

# విషయానుక్రమణిక

# చిత్రములు

త్రివర్ణచిత్రములు:—వసంతపూజ, శ్రీరామపట్టాభిషేకము

సాధారణచిత్రములు:— శ్రీ శ్రీ శృంగేరి జగద్గురు పూజ్యపాదులవారు, ౨. చాముండేశ్వరీదేవాలయము, మైసూరు; ౩. మహారాజా చామరాజేంద్ర వడయరు బహదరువారు, ౪. మహారాజా కృష్ణరాజవడయరు బహదరువారు, మైసూరు; ౫. శ్రీ కంఠీరవ నరసింహరాజ వడయరు బహదరువారు, యువరాజు, ౬. జయచామరాజ వడయరుగారు-యువరాజుగారి కుమారుడు; ౭. డాక్టర్ సర్ యమ్. విశ్వేశ్వరయ్యగారు, ౮. సర్ కే. పి. పుట్టణ్ణ శెట్టిగారు, ౯. సర్ కే. శేషాద్రిఅయ్యరుగారు; ౧౦. అశ్వపూజ, ౧౧. సారటు పూజ, ౧౨. గజపూజ-దసరామహోత్సవము, మైసూరు; ౧౩. పల్లకిపూజ, ౧౪. అలంకరింపబడిన ఆవులు, ౧౫. విద్యుద్దీపములచే నలంకరింపబడిన రాజ ప్రాసాదము, మైసూరు; * కీ శే. చెదలువాడ సుందరరామశాస్త్రి గారు, కీ. శే. పురాణపండ మల్లయ్యశాస్త్రి గారు; శ్రీ పద్మశాలీయ మహాజన చతుర్థ సభ, శ్రీయుత సక్లత్ వాలా గారు, వారి సతీమణి; శ్రీయుత సామి వెంకటాచలం శెట్టిగారు, శ్రీకావ్యకంఠ గణపతిశాస్త్రిగారు, శ్రీయుత గద్దె రంగయ్యనాయుడుగారు, శ్రీయుత నోరి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు, శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ గారు.

* ఈ ౧౫ చిత్రములను ప్రకటనార్థము దయతో నొసగిన 'కానరా' ముద్రాలయాధికారులకు కృతజ్ఞతా పూర్వకవందనముల నర్పించుకొనుచున్నాము.—సంపాదకుడు

# సవరణలు

భారతి సంపుటము ౨ సంచిక, ౧౦ పేజి, ౧౨౭ "నత్రికామ్లము (Nitric acid-నైట్రిక్ ఆసిడు") అను పారాలో "ఈవాయువును .........విలీనమైపోవును" అనుటకు మారుగా "ఈవాయువును (Gas) చల్లని నీటి గుండా పంపి చల్లార్చినచో అది ద్రవరూపమును జెందును (Liquify)." అని చదువుకొనవలెను.

ఈ సంచిక పేజి ౨౫ లో "ఉరులీడె..." అను పద్యము ౪-వ చరణము "శ్వేరకరుణాతిరేకము వశంబు ననో పెనుమార్పు..." అని చదువుకొనవలెను.

# ఫోటో బహుమానము

బహుమానము ఫోటోలు కొద్దిగ వచ్చినందునను, వచ్చినవానియందు బహుమానార్హములగువానిని నిర్ణయించుట కవకాశము లేనందునను, ఈ విషయనిర్ధారణము రాగల మాసమునకు నిలుపుదలచేసినందులకు పంపినవారలు మన్నించెదరు గాత!—సంపాదకుడు.



చెన్నపట్టణము నవంబరు ౧౯౨౫

సంపుటము ౨ క్రోధన సంవత్సరము, కార్తికమాసము సంఖ్య ౧౧

# క వి భృం గ ము

విశ్వనాథ సత్యనారాయణ గారు

కవిభృంగము

నే నాశాంతములన్ జరించి దిగిభస్నిగ్ధార్ద్ర గండస్థలీ
దానాంబూచ్చయ మాహరించుకొని నిత్యశ్రీమనోజ్ఞాకృతి
స్థానం బొదునటంచు పెంచుకొని యాశల్ ప్రోజ్వలద్గీతికా
నూనాంభోనిధులందు మున్కలిడుచుందున్ సాంధ్యకాలంబులన్.

ఇవి నానాప్రసవంబు లం దిడిన నా యీ పాద చిహ్నంబు లీ
నవమాధుర్యరసార్ద్ర వాహినులలోనన్ మత్పురాభ్యస్త వా
జ్నివహంబుల్ మధురంబునై మృదువునై నిర్ణీతమై చిక్కనై
ప్రవహించున్ దివిజాపగా గళిత జంబాలాంబుసంబంధమై.

కోకిలాంగన

చివురాకు కొసలోన చిటిలిన మెఱుపు
నవ మధుశ్రీదేవి ననసిన మఱుపు
లేజవ్వనమ్ము వాలిన పూవుకన్నె
గాజు వాటిన రేకగమి నవ్వుచిన్నె

నాపాట తేనెల్లో నవనవలాడ
నాపంచమమ్ములో నవకమ్ము దేల
ఇన్ని పూవులమీద నెసలార్చు తేటి
కన్నె క్రొంజివురాకు గమక మేమెఱుగు?

కవిభృంగము

నేను నీవలె ప్రపంచింతు పంచమము
తానమెత్తి మధుస్రుతములు పారింతు
సంజకెంజివురాకు చాయలో నిలచి
క్రొంజల్వమొగిలులో కొనరెల్ల వలచి
తొలిపూత మావి మోకలసిగ్గుపొరల
పులకించె నాగీతికల తేనె పెరలు.

శుకరాజు

ఫల రసంబులలోన గలసిపోయిన రుచుల్
పులకరించిన వేళ
చెలమలూరిన వేళ
నవరసా స్వాదనానంద వారిధిలోన
తటతరంగము విఱిగనే; కెరటాలు
చిటిలి యొడ్డున చిందెనే; చివురాకు
తుటుము లేటికి వచ్చునే; పువుదేనె
గటుత లెచ్చట దాగునే;

కవిభృంగము

చివురాకు చివరలో పువుకన్నెపొంగులో
నాపదమ్ములు సోకి
నారదమ్ములు దాకి
నవ్యప్రసూనాంగనా వయస్సరసిలో
పులకలై పలపలై చిలుపబుగ్గలు పుట్టి
పసరుపిందెలు పుట్టెనే; అవిపండి
ఫలరసాకృతి పొందెనే;
ప్రకృతి మీకై నాకునై కూడ యొకటిగా
చకితలోచన యార్ద్రశాంతమూర్తి వహించె

ధ్వనిమంజులమ్మై సుధాభారవహమైన
భోజనమ్ములలోని పొలుపులేటికి లెమ్ము
అహము నిర్జించి యానందమూర్తివి కమ్ము
పోదమందర మీసుధాదివ్యపథమున;

ఉద్యానము

తలిరాకు గొంతుకోతల సన్నజీర’సా
గిన తేనె బిగువు కోకిలమె యెఱుగు
మెత్తదనమెల్ల కోకిలే మేసిపోయె;

ఆశ్రమము

ఫలఖాది శుకరాజు వాగ్గుంఫనమ్ములు
వాగర్థసంపృక్తతాగమములు
సొగసు నుడికారమెల్ల మాశుకమె యెఱుగు.

సరసి

అమిత సుకుమారరాగమ్ము నాలపించి
దిక్కులను రంగవల్లుల దీర్చు పికము
పలుకు నుడికారమున సముజ్జ్వలతదాల్చి
కడగి వాఙ్నియంతృత్వ మాకట్టుచిలుక.

గుణముల్ దోషములేల యెన్నికలు నీకున్ సాటియేలేదు నీ
ధ్వని సౌందర్యము పుష్పవాటికలలో వ్యాఖ్యానరమ్యంబ యు
య్యేను సప్తస్వరముల్ భవద్గళమునం దేపారె దివ్యన్మహో
ధ్వని రాజ్యంబున నీకె కట్టితిమిరా! పట్టంబు పుష్పంధయా!

కవిభృంగము

సరసి నీశిశిరపృషత్పరంపర సోకి
విరియు పూవులలోన విశ్రాంతిగనుచుండు
సితతరంగములపై చెరలాడ చనుదెంచు
శ్రుతివాయువునకు స్వాగతము పాడుచునుండు
ప్రాచీదిగంగనా పలితహాసములలో
మోచాఫలశ్రీలు పొలపింతు గీతిలో
కమనీయమగు దేశకాలపాత్రములతో
నమృత మస్మద్గీత మఖిలమార్గము లేగు
నానామహాగీతి సవ్యరాజ్యములలో
నేను నేర్వనిదేమి నేనె సామ్రాట్టును.




(ఒక విమర్శనము)

ఆంధ్ర శేషగిరి రావు గారు [సారస్వత్రసమాజము]

౧

ఉ. "వ్రాసినవ్రాతలే తిరిగివ్రాసియు నీవు వినూత్నవైభవో
ల్లాసము లాస్యమాడగ నిలాతలమెల్ల నలంకరించె దే
రీ సరివార లిట్లు రససృష్టి నొనర్ప........ " —పెమ్మరాజు లక్ష్మీపతి

పుస్తకపఠనాభిలాషి విద్యాప్రియుఁడు నగు ఆంధ్రుఁడు వర్తమానమునఁ బట్టణములందు నివసించి త్వరజీవనము చేయుచున్నాఁడు. ఆతనికిఁ దీరిక తక్కువ. అందుచే నుద్గ్రంథములుకాని పెద్దనవలలుకాని తీరి కూర్చుండి ఆతఁడు చదువఁజాలఁడు. కాఁబట్టి స్వల్పకాలములో సమాప్తికాఁగల చిన్నకథల మీఁదికి ఆతనిచిత్తము పోయినది. చదువరుల యభిరుచి ననుసరించి వేషములు మార్చుకో వలసిన పత్రికలు క్రమక్రమముగాఁ జిన్నకథలను ప్రచురించి ఆదరణీయములు కాఁజొచ్చెను.

కొంతకాలమునకుఁ గ్రితము తెణుకులోఁ బ్రచురింపఁబడుచుండిన 'సువర్ణలేఖ' మాసపత్రిక చిన్నకథల ప్రచురణమునకు మార్గముఁ జూపినది. అందు పానుగంటి లక్ష్మీనరసింహారావు వ్రాసిన చిన్నకథలు 'సువర్ణలేఖాకథావళి' యనుపేరుతోఁ బ్రత్యేకసంపుటముగాఁ బ్రకటింపఁబడి ఆంధ్రులచే నాదరింపఁబడుచున్నవి. కోటంరాజు పున్నయ్య, ఆంధ్రపత్రికలలో వ్రాసినకథలు; మాడపాటి హనుమంతరావు 'మల్లికాగుచ్ఛము'; అక్కిరాజు ఉమాకాంతము, 'త్రిలింగకథలు' 'ప్రొద్దుపొడుపుఁబువ్వుల'లో వంగూరి సుబ్బారావు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, వేంకటపార్వతీశ్వరకవులు మొదలగువారు వ్రాసిన కథలును ఈ చిన్నకథల వాఙ్మయమును పెంపొందించినవి. యుద్ధము వలన కాగితములును ముద్రణాది పరికరములును హెచ్చువెలలకుఁ గాని లభింపనందున 1916-1920 వరకును పత్రికాప్రచురణమును పుస్తక వ్యాపారమును కుంటినడక నడచినవి. అనంతరము క్రమముగా ధరలు తగ్గినవి, ముద్రణసౌకర్యములు ప్రబలినవి. ఈదినములలోనే 'సాహితి' యనుపత్రికను ప్రారంభించి చిన్నకథలను ప్రచురించుటయే ముఖ్యోద్దేశముగఁ బెట్టికొని సాహితీసమితివారు స్తుతిపాత్రులైరి. 'శారద', 'భారతి' మాసపత్రికలలో సచిత్రములుగఁ బ్రకటింపఁ బడుచున్న కథలు ఆంధ్రదేశమున రుచి విశేషమును

కల్గించుచున్నవి. ఈ రుచివిశేషమునకుఁ దొలి పూఁతగా పండిత(శ్రీ)పాద సుబ్రహ్మణ్యశాస్త్రి 'పూలదండ'; చింతా దీక్షితులు 'ఏకాదశి'; అను చిన్ని కథల సంపుటములు ప్రచురితమైనవి.

సుబ్రహ్మణ్యశాస్త్రి విఖ్యాతిఁ జెందిన గ్రంథకర్త. ఆతనిలేఖిని సారస్వతశాఖలన్నిటియందును స్వేచ్ఛావిహారము సల్పినది. ఆతని **'మిథునానురాగము'** పేరు పొందిన నవల. 'వీరపూజ' విమర్శకదృష్టితో వ్రాయఁబడిన గొప్ప చారిత్రకగ్రంథము. 'భక్తవిజయ'మందలి శైలి ముద్దులు మూటగట్టి మురుపించుచుండును. 'పూలదండ' ఆంధ్రసారస్వత సుందరి కొక నవ్యాలంకారము.

'పూలదండ'లోఁ బందొమ్మిది కథలు గలవు. మొదటికథ 1915 వ సంవత్సరమున తొలుదొల్త ఆంధ్రపత్రికలోఁ బ్రకటింపఁబడినది. చివర నాలుగుకథలును 'ప్రబుద్ధాంధ్ర' మాసపత్రికలోఁ బ్రచురితమైనవి. మిగిలిన పదునాలుగు కథలును 'రెడ్డిరాణి' ముఖమునఁ బ్రకాశముఁ గాంచినవి.

చిన్నకథలు జాతీయభావ పరివర్తనమునకు మంచిసాధనము లని గ్రంథకర్త యభిప్రాయము. ఇది ముమ్మాటికి నిజము. నూతనభావోదయము, సంఘవిప్లవము, దురాచారబహిష్కారము చిన్నకథల ద్వారా కల్గించి గ్రంథకారుఁడు యుగప్రవర్తకుఁడు, ఒక్కొక్కచో మతప్రవర్తకుఁడు గూడనై రాణించును. వీరేశలింగముపంతులు తాను రచించిన ప్రహసనముల ద్వారా ఆంధ్ర సంఘమునందుదయింపఁజేసిన, పూర్వాచార తిరస్కారము, సంఘసంక్షోభము నేఁటికిని ఎల్లయెడల చూపట్టుచునేయున్నవి.

ఈ 'పూలదండ' చదివినపిమ్మట గ్రంథకర్త సాంఘికాభిప్రాయములను మనము పోల్చి పనిపట్టఁగలము. వితంతువివాహము లీగ్రంథప్రణేతకు సమ్మతములు.

"కాలం మారిపోయింది. పూర్వాచారాలే నిలవాలంటే కష్టం. శాస్త్రాలసంగతి యేలావున్నా ఇప్పటి బాలవితంతువులస్థితి మాస్తే జాలి కలగకమానదు. వీరేశలింగంగారిమనస్సు చాలా మెత్తనిదని తోస్తూవుంది. అందుచేతనే ఆయన ఈయూహాన్ని ప్రారంభించడానికి సాహసించివుంటారు :"

అని ఆతని అభిప్రాయము. 'రామలక్ష్మి'; 'వెలిపెడితే అల్లుడైనాడు'; 'ముందు హాలాహలము, పిదప అమృతము'; 'మేనరికము తప్పలేదు'; అనుకథలు వితంతూద్వాహమునకు సంబంధించినవి. ఇందు మొదటి మూఁడు కథలలోను పెద్దలను గాదని తరుణవితంతువులే సాహసించి వివాహములు కావించుకొనిరి. 'మేనరికము తప్పలేదు'; అను కథలోఁ బెద్దలే కార్యభారమును వహించి బాలవితంతువునకుఁ బెండ్లి యొనర్చిరి; వీనిలో 'రామలక్ష్మి'; యనుకథ బాగుగ నున్నది. సాధా గ్రామునుండి పెండ్లిఊరేగింపుటుత్సవము తిలకించుటతోపాటు (ఎదుటి మేడమీద నున్న) సూర్యారావును చూచి వలపుఁగొన్న తరుణవితంతువు— రామలక్ష్మి, రంగారావు మాయామాటలకుఁ జిక్కి పెక్కు ఇక్కట్లకు లోనై చదువరుల మనస్సుల నాకర్షించును. నగేంద్రనాధ బెనర్జి దయాదాక్షి

ణ్యములు, రంగారావు కుటిల కల్పన, దౌర్జన్యము, సూర్యారావు ధైర్యము,సద్వర్తనము ఇందు లెస్సగ వర్ణింపఁబడినవి. ఈకథ పఠించు తరుణ వితంతువులహృదయగగనమున వివిధ భావ విద్యుల్లతలు మిలమిల మెఱసిపోవును. వెన్నముబోలు యౌవనమును సంఘమునకు వెఱచి వనచంద్రికా వైభవవిభవము గావించుకొనుచున్న పెక్కుఱు యౌవనవితంతువు లిట్టి కథలు చదివి, చిత్తసంస్కారమునొంది సాహసించి పునర్వివాహము లొనర్చుకొని సుఖ సంసారములు చేయఁగల్గుదురు. అందుతో సంఘదురాచారములలో నొకటి మొదలంట నశించి దేశోన్నతికి రాచబాట నిర్మించును. కావుననే చిన్నికథలద్వారా సంఘమున గొప్ప పరివర్తనము గల్గింపవచ్చుననుట.

రజస్వలానంతర వివాహములుగూడ నీ గ్రంథ రచయిత కొప్పదలయే. 'జూనియరు కాదు, అల్లుడు' అనుకథలో గ్రంథకర్త యభిమానపాత్రమనఁదగిన ప్లీడరుగుమాస్తా చెంచు రామయ్య రజస్వలావివాహ మొనర్చుకొనుట, అవివాహిత యగు తనకుమార్తె రజస్వలయైనదని విని జరుగవలసిన ఉత్సవమంతయు యథాపూర్వకముగఁ జేయించిన చెంచయ్యపంతులు ధైర్యసాహసములు గ్రంథకర్త ప్రత్యేకమన్ననలకుఁ బాత్రము లయ్యెను.

సేవకావృత్తికంటె వ్యాపారవ్యవసాయము లుత్తమోత్తము లనునీతి నుపదేశించుటకీగ్రంథమున నాలుగైదు కథలు వ్రాయఁబడినవి. 'తహసీలుదారు గాదు-వర్తకుఁడు'; 'చీఁకటి-వెలుగు'; 'నలుగుర్ని పోషిస్తున్నా నిపుడు'; అనుకథ లీతరగతిలోనివి. వీనిలోఁ 'జీఁకటి-వెలుగు' అనుకథ మనోహరముగ నున్నది. స్కూళ్ల ఇనస్పెక్టరులకు పల్లెటూరి ఉపాధ్యాయులు చేయుదాస్యసేవ; ప్రాథమికపాఠశాలోపాధ్యాయుల దుర్భరజీవితము; ఇందు యథోచితముగ వర్ణింపఁబడినవి. తహస్సీలుదారీ చేయవలసిన వేంకటసుబ్బయ్య లంచగొండియై ఉద్యోగముతోపాటు పూర్వార్జితవిత్తమునుగూడ నూడఁగొట్టుకొని కొంపగోడి అమ్ముకొని బట్టలవర్తకము చేసి బాగుపడును. 'చీకటి-వెలుగు' అనుకథలో స్కూలు మేష్టరైన రామయ్య పైఉద్యోగులప్రేమకై తలకుమీరిన ధనవ్యయ మొనర్చి సర్వశూన్యుఁడై బదలాయింపులతో నుద్యోగముమీఁద అరుచి పుట్టగా కిళ్లీదుకాణము పెట్టి సుఖజీవనము చేయును. 'నలుగుర్ని పోషిస్తున్నా నిప్పుడు' అనుకథలో ముక్కవిల్లి సీతారాముఁడు బ్రాహ్మణుఁడగుటచే మునిసిపాల్టీలో నుద్యోగ మూడిపోవగా దర్జీపనివాఁడై బట్టలవర్తకుఁడై ధనసంపాదన మొనర్చి జీవయాత్ర చేయును. ఉద్యోగ వ్యామోహమున మగ్నులైనవారుసైత మీకథలు చదివిన తరువాత ఉద్యోగముకంటె వ్యవసాయ వాణిజ్యములే ధనసంపాదనమునకు సుఖజీవనమునకు గౌరవమును, సులభమునునైన సాధనములని నమ్మితీరెదరు.

సాంసారిక కథలు వ్రాయుటలో సుబ్రహ్మణ్యశాస్త్రి గడితేరిన జాణ. ఆతనిచే రచింపఁబడిన 'అనాథబాలిక'తుది ప్రకరణములు చదివినవారలకు ఇందలిసత్యము తేటతెల్లమగును.

ఆంధ్రసారస్వతమున సాంసారికమైన చిన్నికథలు స్వతంత్రించి వ్రాయుటకు సుబ్రహ్మణ్యశాస్త్రియే ప్రథమసాధకుఁడు 'పూలదండ' లోఁ బెక్కుకథలు సాంసారికములు. వానిలో 'తాహతుమాలిన పరుగు; 'ఇరువుర మొక్కచోటికే పోవుదము'; 'ప్రేమపాశము' 'జన్మాని కల్లా వక టే ముద్దు'; అనుకథలు శ్రేష్ఠతమములుగా నున్నవి. వానిని ప్రత్యేకించి విమర్శించుకొందము.

'తాహతుమాలినపరుగు'. భార్యయొత్తిడివలనను, కూఁతుళ్లయందుండు మమకారము కొలఁదిని వివాహసందర్భములలో తాహతుమాలిన పరుగులెత్తి సర్వభ్రష్టైన సామాన్య సంసారచరిత్ర మిందు వర్ణింపఁబడినది. కొడుకులఁగన్నమ్మలు ఆత్మజునిపరిణయకాలమున నెఱపు ఔద్ధత్యము, చూపుబిగింపు, ఇందు యథోచితముగఁ జిత్రింపఁబడినవి. ఈకథయందలి వియ్యపురాలికోరికలు చూచితిరా?

"నేను చెప్పేదేమిటీ? అచ్చటా ముచ్చటా వారికి తెలవదు కనకనా? అయిదురోజులూ అయిదు పెద్దకాసులు నామా, అయిదు పెద్దకాసులుపిల్లకీ యివ్వాలి. అయిదురోజులు చీరలివ్వాలి. అందులో రొండుచీరలు బనారసువీ, రొండు దక్షిణాదివీ వుండాలి. వెండి చేపలనీ, వెండి కోడిగుడ్లుఅనీ యిలాంటివన్నీ చెప్పక్కర్లేదు. పానకబ్బిందెలు రెండు ఇవ్వాలని మనం చెప్పనేఅక్కర్లేదు."

దాహతీర్థములకు అంగుడు లేకున్నదే? తిలకించితిరా? ఇంతతోనైన వియ్యపురాలి ఏనుగు దాహముకట్టువడలేదు. అత్తవారింటిలోనున్న ఆడుబడుచు నుద్దేశించి—

"సమయానికి పిల్ల అత్తవారింటిలో వుండిపోయింది. అది యింకా ఏమికావాలంటుందో యేమిటో."

అన్నదట. 'ఆశాపాశము దాఁ గడున్నిడుపు' అని ఉన్నది కదా!

వివాహములలోను, సంతర్పణలలోను, కోనసీమ బాపన సాములు చేయు అల్లరులు ఉత్తర సర్కారులలోనివా రందఱును ఎఱిఁగియున్న విషయమే. కోనసీమ'బాపనసాముల' సాము లిందుఁ గుప్తముగఁ జమత్కారముగ వర్ణింపఁ బడినవి. తిలకింపుఁడు:

"రెండవనాఁటి రాత్రి మగపెళ్లివారు పనసకాయకూర లే దనిపించిరి. సదస్యమునాఁడు నేయి లేదనిపించుటకు ప్రయత్నించి విఫలులగుటయేకాక ఒకరిద్దరు రామచంద్రపురము ఆసుపత్రికిఁగూడ వెళ్లిరి. మూఁడవ నాఁటి రాత్రి మిఠాయివడ్డింపలే దనిపించిరి. నాలుగవ నాఁడు పప్పు, నేయి కలిపిన అన్నముతో గోడలకు పిడకలచఱచి పప్పు లేదనిపించిరి. నాఁడు వడ్డనకు వచ్చిన ఒక ముసలి బ్రాహ్మణుని గుంజివిడిచిరి. మజ్జిగ కాలువలు కట్టించిరి. పులుసులోని ముక్కలతో ఆనకట్టలు కట్టిరి. బూరెలలో నేయివేసికొని విడిచివేసిరి. కొందఱువి స్తళ్లలోనే చేతులు కడుగుకొనిరి."

పానకము కొంచెము తెచ్చినందులకై పానకపు బ్రాహ్మణుని కసరుచు, 'మా కోనసీమకి వ స్తేకొబ్బరికాయలతో కప్పెడతాం' అని కోనసీమ విప్రుఁడన్నవాక్యము అర్థ గాంభీర్యమునుదాల్చి స్థలాభిమానమును సూచించుచున్నది. ఆంధ్రబ్రాహ్మణ సంఘమును దూష్యమొనర్చుచున్న దురాచారము లీక నెన్నో ఈ కథయందుఁ బ్రస్తావావసరమున చర్చింపఁబడినవి.

"ఇరువుర మొక్కచోటికే పోవుదము"

జగ్గారెడ్డి వెంకమ్మల విశుద్ధప్రేమ ఇందు ఆహాపుట్టునట్లు వర్ణింపఁబడినది. రెడ్లు గొప్ప భూస్వాములు; మంచి వ్యవసాయదారులు.

రెడ్డికులసంభవుఁ డగు జగ్గారెడ్డి వ్యవసాయపు టూసులే తఱచు వెంకమ్మతోఁ జెప్పుచుం డుట సహజము, సమంజసము. ఆత్మకుల ప్రసూతలగు నితర స్త్రీలవలెను వెంకమ్మ చిన్నతనమునుండియు 'పాడి'యందు విశేష మైనశ్రద్ధ కనుపఱచుచున్నట్లు వర్ణించుటయు స్తుతిపాత్రమే. ప్రేమరసమయజగత్తున విలీన మగుచు జగ్గారెడ్డియు వెంకమ్మయు వివాహ విషయమై చేసికొనిన భావికల్పనలు చదువ రుల మనములఁ దప్పక చూఱఁగొనును.

గ్రంథకర్త చిన్నతనమునుండియు రెడ్ల సహచర్యము కలిగి మసలినవాఁ డగుటచే నీ కథయందు రెడ్ల యాచారవ్యవహారములు చక్కగా వర్ణించెను. కన్యను తల్లిదండ్రులు పెండ్లికూఁతుఁ జేసినపిమ్మట బంధువ్రులుగూడ నామెను గొనిపోయిపెండ్లికుమార్తెనుగావించి సన్మానించుట రెడ్లకులాచారము. ఈ ఆచా రమే ఇక్కథయందలి వస్తువును నిర్వహించు చున్నది.

ఇది విషాదాంతమైన సాంఘికకథ. తమ విశుద్ధప్రేమ ప్రవాహమునకు, ప్రణయప్రసా రమునకు అడ్డంకికల్గుటచే జగ్గారెడ్డి, వెంకమ్మ మహేంద్రవాడయొద్దనున్న మురుగు కాలువ దుర్దమ ప్రవాహమునఁ బడి యొక్కచోటికే పోయిరి.

'ప్రేమపాశము'; 'జన్మానికల్లా ఒకటే ముద్దు' అనుకథలుకూడకష్టాంతకములే. అందు మొదటికథ నాటకరూపమున విస్తరింపఁబడి 'ప్రబుద్ధాంధ్ర'లోఁ బ్రచురింపఁబడు చున్నది. ఇందలి ముఖ్యపాత్రలగు పేరుభట్టు, బంగా రమ్మ, కాంతమ్మలను ఒకరి వెంబడి నొకరిని చంపివేసి కథను కష్టాంతముగ నొనర్చుటకు, గవి చూపిన వేగిరపాటు అనవసరము, అను చితము. 'జన్మానికల్లా ఒకటేముద్దు' అనునది 'పూలదండ'లోని కథలకుఁ దల మానికము. కథకు ఆదిమధ్యాంతములగు ఎత్తుగడ, నిర్వ హణము, సమాప్తి ఇందుపరిపూర్ణత్వ మొంది నవి. కళాభిరుచి, కల్పనానైపుణ్యము, ఔచిత్య గౌరవము, సంయోగిత, పాటించి వ్రాయు నిట్టికథలే సారస్వతప్రపంచమున చిరంజీవము లైయుండి వాఙ్మయసౌష్ఠవ మొనర్చును.

ఈ విమర్శనము ముగించుటకు ముందు 'ఫుల్లంరాజు' అను కథనుగురించి ప్రత్యేకించి కొంత వ్రాయవలసియున్నది. ఈకథ అనేక విషయములచే అనౌచిత్యపారమును గాంచి నది యని నా నిశ్చితాభిప్రాయము. ఈ కథకు రంగస్థానము 'దుప్పలపూడి' ఇది గోదావరి జిల్లాలోని 'అనపర్తి' స్టేషనున కొకమైలు దూరములోనున్న యొక కుగ్రామము. అట్టి చిన్నిపల్లెనుమహాసామ్రాజ్యమునకు రాజధాని యైన మహానగరముగావర్ణించుట యొకగొప్ప లోపము. అందును ఈకథ భూతకాలమునకు జెందినదిగా వర్ణించియుండినచో నిట్టి విరుద్ధ వర్ణనము కవిసమయముగాఁ బరిణమించి యుండును. కాని కథ వర్తమానమునకు సం బంధించినది. అట్లగుట 'దుప్పలపూడి మహా సామ్రాజ్య' మనుట విరుద్ధకల్పనగా నున్నది. 'దుప్పలపూడి'కి బదులు కల్పితనామ మేదైన వాడి యుండినచో సమంజసముగ నుండి యుండును.

ఈ కథయందుఁ గవి స్త్రీజాతిని గూర్చి వెలిపుచ్చిన నికృష్టాభిప్రాయము అశుచిప్రాపకముగ నున్నది. స్త్రీలకు బెట్టుసరి సిగ్గు సహజ భూషణములు. 'తమంతఁ దాము వలచివచ్చి' పురుషులఁ గలయఁగోరు వపూధునులు స్త్రీజాతియందు మిక్కిలి తక్కువ. పురుషుఁడే ప్రథమమున స్త్రీని లాలించి, వలపించి, తన వలలో వైచికొనును. ఈ విషయము మానవ స్వభావము పరిశీలించినవారల కెల్లరకు సువిదితమే. అట్టిచో—

"పీకేపోయీ మొగాళ్లని- పడుచువాళ్లనీ-అందు, లో పోకుగా వున్నవాళ్లనీ, 'ఓవోయి బావా' అనీ 'అల్లుడా! ఓమాటు వచ్చివెళ్లు' అనీ; 'మరదీ! మరిచిపోయావా' అనీ; 'మామయ్యా! నేనూ, యెరగవూ?' అనీ యిలాగ సిగ్గువిడిచి.................."

సంసారస్త్రీలు పిలిచిరని వ్రాయుటలో గ్రంథకారుఁడు క్షమింపరాని అనౌచిత్యమునకు, అసభ్యతకు నోడిగట్టి రసాతిరేకముఁ బట్టించెనని చేయెత్తి చెప్పుచున్నాను.

వేశ్యలవలన సంఘము పచ్చముపాడగుచున్నదని సంఘసంస్కర్తలెల్ల సంగీకరించిన విషయము. కాని సుబ్రహ్మణ్యశాస్త్రి యందులకీయకొనఁడు. వ్యభిచారముసంగతి యెట్లున్నను అభినయము, నృత్యము, సంగీతము ఇత్యాది లలితకళలు వేశ్యల మూలముననే హిందూదేశమునఁ జిరంజీవములై పారంపర్యముగ వెలయుచున్న వని గ్రంథకర్త యభిప్రాయము. లోకవిరుద్ధమైనను స్వాభిప్రాయప్రకటనము స్తుతిపాత్రమే కాని సుజన సమ్మతముమాత్రము కానేరదు. ఇట్టి విరుద్ధాభిప్రాయముపై నాధారపడియున్న ఈకథ సరసమతులకు రుచింపదు; సభ్యలోకమునకు ఏవ గూడఁ బుట్టించును.

పుల్లంరాజ చక్రవర్తి చేసిన ఇరువదియొక్క రోజుల ఉపవాసము లోకోత్తర పురుషుఁడగు గాంధి గావించిన ఉపవాసము నుద్దేశించి అలసందర్భముతో వ్రాయఁబడినదని నేను వాకొనక పూర్వమే ఆంధ్రలోక మూహించి యుండును. లోకపూజ్యుఁడగు మహాత్ము నుద్దేశించి అన్యాయముగ అనవసరముగ నిట్లు వ్రాయుట రచనాన్యూనతను చాటి చెప్పును. అట్లగుటనే ఇక్కథ అనేక విషయములచే ననౌచిత్యపాత్రము గాంచిన దనుట.

'పూలదండ'లోని పెక్కుకథలకు రాయవరమే రంగస్థానముగ నున్నది. 'రావులయ్య' అనుకథలోని రావులయ్య, భూలోకమ్మ అను పాత్రలు 'చీకటి-వెలుగు' అనుకథలోఁ గూడఁ బ్రవేశించి గ్రంథకారుఁ డీకథల వ్రాయుటలో రాయవరమునందలి కొన్నికుటుంబముల చరిత్రలు వర్ణించుచుండెనా యను సందేహమున కెడమీయకపోవు. కథల రంగస్థల నిర్దేశమున అనేకత్వ మవలంబింపకుండుట యొక గొప్ప లోపము. రంగస్థల నిరూపణమున వివిధత్వ మవలంబింపనిచో నాంధ్రప్రజాబాహుళ్యములో నిట్టి చిన్నికథలయం దభిరుచి, అభినివేశము కల్గించుట కష్టతరము కావచ్చును.

శైలి విషయమై కొలఁదిగఁ బ్రస్తావించి ఈవిమర్శన మింతతో విరమించెదను ఇందలి శైలి సంభాషణభాషకు మిక్కిలి సన్నిహితముగ నున్నది. సంభాషణమున సులభసుందరమైన వాడుకభాషయు, వర్ణనల సందర్భమున

ముగ్ధమధురమైన గ్రాంథికభాషయు నుపయోగించి గ్రంథకర్త శైలివిషయమున నూతన ఫక్కిఁ ద్రొక్కి స్తుతిపాత్రుఁ డయ్యెను. ఈ నూతనమార్గమును ఆధునికాంధ్రగ్రంథప్రణేతలాదరించి, అవలంబించుచోఁ, జిరకాలము నుండి సారస్వతవిమర్శకులను తబ్బిబ్బు పెట్టుచున్న గ్రామ్యగ్రాంథికభాషావివాదసమస్య మేఘమువలె విడిపోవుటయేకాక ఆంధ్రభాషాశైలి సుష్టుపడి నిండుచైతన్యము నొందును. సుబ్రహ్మణ్యశాస్త్రి ఈగ్రంథమున అన్యభాషాపదములను ఎడనెడ వాడి భాషాసౌలభ్యసంపాదన మొనర్చి శబ్దజాలము పెంపొందించెను. సామెతలను,జాతీయములను విరివిగ నుపయోగించి శైలికి నవరఁదనముఁ గొనితెచ్చెను.

భావిసంతతివారీ యుగమందలి సంఘాచారములఁ దెలిసికొనుటకీ 'పూలదండ' కొంతవఱకు తోడ్పడును. ఏలనన? కవి స్వతంత్రముగ వస్తుకల్పనచేసి సమకాలీనమైన ఆచార వ్యవహారములను, నాగరికతయు తన రచనలయం దంకిత మొనర్చియుండుటవలన.



## పద్మిని

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

చిఱునవ్వు నవ్వితేఁ—చెంగల్వరాయఁడే
అమృతంబు నీయింట నడుగరాఁడె!

ఒక్కింతచూచితేఁ—చుక్కలరాయఁడే
వలరుచుల్ నీకంట విలువరాఁడె!

తలయెత్తఁగలిగితేఁ—తెలితెక్కరాయఁడే
కలిమియై నీవెంటఁ గొలువరాఁడె!

చనవీయఁ దలఁచితేఁ—చలువలరాయఁడే
తావుల నీజంటఁ దనియరాఁడె!

పలుకు వినవుగాని, పట్టు వీడవుగాని
ఒక్కయినునె వలచియుంటి గాని
పద్మినీ! సొంకింత భావింపఁగలిగితేఁ—
కొనరి జగము జట్టిగొనవఁటమ్మ!




[ప్రతి విమర్శనమునకు నా జబాబు]

పారనంది జగన్నాథస్వామిగారు, యం. ఏ., యల్. టి.

గురుతులపట్టీ:

మా.—చూడండి　　　　నా.—అసలు నాటకము

వి.—అసలు విమర్శనము భారతి ౨-౧౧　　　　ప్రతి.—ప్రతివిమర్శనము భారతి ౨-౬

ఈగురుతుల తరువాత ఉండేఅంకెలు పుటలను, ఆపుటలోని కోలమును తెలియజేయును.

కృతికర్తలు విమర్శనలను ఉపేక్షిస్తున్నట్లే, విమర్శకులు ప్రతివిమర్శనములను ఉపేక్షిస్తే చాలా సరసముగా ఉండును. కాని మానవస్వభావము ఆలాగు ఊరుకోనివ్వదు... నేను వ్రాసే గ్రంథములో దోషములు గాని లోపములు గాని ఉన్నవని ఎవరైనా అంటే, వారిపై నాకు చాల ఆగ్రహము కలగడమే కాకుండా, వారు అట్లా వ్రాయుటకు ఏమేమో కారణమైయుండవలెనని అపోహపడి, వారికి నాపై శత్రుభావము ఉన్నదని నిశ్చయించి, వారిచర్చలను, వారి అభిప్రాయములను చర్చ లనీ అభిప్రాయము లనీ భావించక వాటిని శత్రుత్వ విలాసములుగా భావించి, వారిని నేను కూడా నిందించి కొంత మనశ్శాంతి పొందుతూ ఉంటాను. ఎందుకో ఇంత సన్నని హృదయము!

భీష్మప్రతిజ్ఞపై నేను వ్రాసిన వ్యాసములోని అభిప్రాయములు, గుణదోష నిరూపణ అందరికీ నచ్చవలసిన నిర్బంధమేమీ లేదు. వాటిని అందరూ ఒక్కలాగే అంగీకరిస్తారని నేనెన్నడూ తలచలేదు. నేను దోషములన్నవి ఇతరులకు గుణములుగా తోచవచ్చును. నా నిరూపణ నా అజ్ఞానఫలము కావచ్చు; లేదా రుచిభేదమువల్ల కావచ్చు. ఆలాగు భావించకుండా వృథాగా దూషించుట పరికాదని విన్నవిస్తున్నాను. ఎట్లంటే:

"నాటకముతో పరిచయముకొద్ది. అసంగతములు అసంబద్ధములునైన దోషములను ఉద్ఘాటించెను. గుణములను దోషములుగా పరిణమింపజేసెను. విమర్శనకు ఏమితోచక చిత్తమువచ్చినట్లు విమర్శించెను. నాటకము చదవక చదివినదానినైన నిష్పక్షపాత బుద్ధితో దిలకింపక విమర్శించెను." అని ప్రతివిమర్శకులు (కృతికర్తలు కారు) నిందించినారు.

నాటకము బాగా చదివేనో లేదో నావిమర్శనమే సాక్ష్యము. పక్షపాత దృష్టికి హేతువు లేదు. కవిగారిపై ఈర్ష్యగాని, కవిగారితో ఏక ఫలాపేక్షగాని నాకేమీ లేదు. శాస్త్రిగారిని నేను ఎరగను. వారి గ్రంథములద్వారా వారియెడల కలిగిన గౌరవము విమర్శన వ్రాసినప్పుడు, ఇప్పటికీకూడా నిలిచి ఉన్నదనే నానమ్మకము. ఆభావము నావిమర్శనలో వ్యక్తమవుతుంది. గుణములను దోషములుగా పరిణమింపజేయ శక్యమా ఎవరికైనా? శక్యమైనా అలాగుచేయుటకు ప్రయోజనము లేదు. ఇంతేకాదు గుణములను చూపియున్నానే. విమర్శనలలో అభిప్రాయభేదము లుండునని గ్రహించకపోతే సంభవించే ఇక్కట్టు ఇదే. ప్రతివిమర్శనలో ఉన్నదూషణములకు నేను ఇవ్వగలిగిన ప్రత్యుత్తరము ఇంతే.

ఇట్టిది మొదటిరకము ప్రతివిమర్శన. ఇకను రెండోరకము అంతా చిన్నచిన్న సంగతులగురించి చేసినని

ర్చలతోనే నిండియున్నది. నేనుచూపిన ముఖ్యదోషములను వ్యాపకములైన వాటిని విడిచివేసి, ఆచర్చలసందర్భములోఉన్న కొన్ని ఖండ వాక్యములను ఏరి, వాటిని పెద్దగాజేసి, ప్రతివిమర్శకులు ఏమేమో వ్రాసినారు. వారి అభిప్రాయములను చెప్పుటలోనూ, దమకుతోచినరీతిని వ్యాఖ్య ఒనర్చుటలోను నాకేమీతగవు లేదు. కానివారు సమాధానము ఇచ్చుటకు సంగ్రహించిన సంగతులు నేను చూపిన ముఖ్యదోషములు కావనిన్నీ, ఏచర్చా సందర్భములోవారు సమకూర్చిన వాక్యములు, అభిప్రాయములు వచ్చియున్నవో ఆసమయమున నేను చేసిన ముఖ్యతర్కము విడిచివేసి వారు వాదము నడిపినారనిన్నీ, నేను నొక్కిచెప్పకతీరదు. కాబట్టి వారిసమాధానము చదివిన తరువాతకూడా నావ్యాఖ్యానము మార్చుకొన నక్కరలేదు. ఇంతతో నాజబాబు ముగింపవచ్చును; కాని వారుచేసిన ఆక్షేపణలకు క్లుప్తముగానైనా జబాబుచెప్పకపోవుట ఉచితముగా కానరాదని ఆలోచించి వారు పొందుపరచిన వరుసనే ఆయా అంశములను ఎత్తుకొంటున్నాను.

## ౧

## * కథానిర్వహణము

1. "మొదటి అంకములోని దిగ్విజయము అశ్వమేధాంగముకాదు" కాదు నిజమే. అవునని నేను పొరపాటుపడ్డాను. అయితే? ఆపొరపాటువల్ల వ్రాసిన రెండువాక్యములూ ఉపసంహరించుకొంటే, మిగిలినచర్చ అంతా నిలిచిఉంటుందిగదా. ఆ రెండువాక్యములు ఏవిధానా ముఖ్యములుకావు. నేను చూపినదోషములు దిగ్విజయము గూర్చినవికాని, అశ్వమేధము గూర్చినవికావు. దిగ్విజయముకథ నాటకకథకు అప్రస్తుతము అని నా వాదము. ఆప్రసంగములోవచ్చిన అల్పసంగతులను గ్రహించి ప్రత్యాఖ్యానము చేసినంతమాత్రాన, నేను చూపించిన దోషము వారించలేదు! నావాదము నిలిచేఉన్నది.

2. తాపసాశ్రమములో దుందుభి ఎందుకు వాయించాలో అన్నదికూడా అట్టి అల్పసంగతే దానికికూడా ప్రసంగము దిగ్విజయకథాదోషమే. దుందుభికి యోగ్యమైనవి రణస్థలములుగదా; తాపసాశ్రమములు, రణస్థలములుకావుగదా. అక్కడ వీరు ఉండునని ఊహించుట సమంజసమా? ఒకడు ఉన్నాడని కవికి తెలుసును, కవికి తెలుసునని మనకూ తెలుసును; అంతేకాని శంతనుని సేనాని కథనికైనా తెలిసియుండునా? * అక్కడ దుందుభి వాయించమని ఏర్పాటుచేసిన సేనాని ఉద్దేశమేమైయుండును. ఎందుకైనా వాయించేస్తేమంచిదనా? ఇంతకూ నాటకము నడవాలికదా!

3. దేవవ్రతుని విద్యాప్రసంగము చాలా చిన్న సంగతి అనిన్నీ, నా చర్చకు అత్తింది కాదనిన్నీ, దానిని పుట అడుగున పరాగాఉంచివేశాను. దానిపై ఎంతో చర్చ పెట్టుకొన్నారు. "మూలాతిక్రమణ మున్నదనియు, అందుకు కారణము దురూహ్య" మనియు నేను వ్రాసినానట! నా వాక్యములు చూడండి. "ఇది చరిత్ర సంబంధమై ప్రమాణ మవుతున్నది. మూలము నుండి మార్పుకలిగి ఉన్నది. ఎందు కీమార్పు చేసినారో తెలియదు. సముడని అనుటకంటె నేర్చుకొనెను అని అంటే ఎక్కువ సమంజస మవునా?" చేసిన మార్పుకు సామరస్యము కానరాదని నేను అన్నానా, మార్పు చేయకూడదని నేను అన్నానా? కవికి స్వేచ్ఛవద్దా అని ఎందుకో ఆ విజృంభణ? మార్పుకు ప్రతివిమర్శకులు ఒక స్వారస్యము చెప్పారు. మూలముకంటె ఎక్కువ విద్యావంతుడుగా నాటకములో దేవవ్రతుడు మారినాడట. ఆలాగా? ఇంద్రునితో సముడని మూలములో ఉంటే, వసిష్ఠునివద్ద నేర్చుకొనెనని సవరించుటచేత ఎక్కువ విద్యావంతు డగునా? మూలములో వసిష్ఠునివద్ద వేదములు నేర్చుకొనెనని అంటే, నాటకములో ప్రసిద్ధ శాస్త్రములు చదివెను అని మారింది. ఈ మార్పులు పాత్రశీలపుష్టికిన్నీ, రసావిర్భావమునకున్నూ, కవికి ఉండవలసిన స్వతంత్రతాచిహ్నగానున్నూ ఉపయోగిస్తున్నవా? చదువరులు ఆలోచించండి.

4. ఈలాగే మరొకటి. శృంగారము ప్రధాన రసము కానేరదని వాదిస్తూ, ఎట్లు ఆరసము పొంథా

* ఇంతేకాకుండా తాపసాశ్రమములో దుందుభి వాయింపించుట సంప్రదాయముకాదని నా స్నేహితులొకరు నాకు జ్ఞాపకముచేశారు. ఇందుకు దుష్యంతుని ప్రవర్తనే నిదర్శనము.

శ్రమములో ప్రథమదర్శనసమయాన ఉండవలసినంత నిండుగా ఉండలేదనీ సూచిస్తూ ఉన్నప్పుడు, గాంధర్వ రాక్షస వివాహముల ప్రసంగమువస్తే, ఒక చిన్న అంశము ప్రధానచర్చకు అక్కర్తలేదని ఫుటఅడుగున చిన్నగా వ్రాసినాను. (వి. ౨౩). నాయిక గాంధర్వము మానినందుకు ఉపపత్తి చెప్పిన కవి, రాక్షసము రాజు అంగీకరించనందుకు చెప్పలేదనిన్నీ, ఉపపత్తి కానరాదనిన్నీ నేను ఆక్షేపిస్తే, ప్రతివిమర్శకులు ఒక ఉపపత్తి చెప్పారు. అది నాటకములో లేదు కాబట్టి నా ఆక్షేపణలో ఒకభాగము నిలిచే ఉంటుంది. ఇక వారు చెప్పిన ఉపపత్తిని గురించి పెద్దచర్చ అనవసరము. ఆ అంశము అంతచర్చకు తగినంత ముఖ్యమైనది కాదు. అందుచేత దీనికి జవాబు వ్రాయను.

5. చూ. వి. ౧౬. ii. " ఇది తెనుగుభారతము నుండి సంగ్రహించినది......దీనిని నాటకములో ఎట్లు మార్చినారో చెప్పెదను......ఇంతవరకు మూలము నుండిగల భేదమంతా......తప్ప మరేమిన్నీ లేదు." అని నేను వ్రాస్తే, " నాటకకథ మారకూడదను అభిప్రాయము కాబోలు " (ప్రతి ౨౩. i) అని కోపావేశముతో ఏదో వ్రాసినారు "మారకూడదు" అని అన్నానా ? " మార లేదు " అని అన్నానా ? పాఠకులు చిత్తగింతురు గాక.

6. ఆ సందర్భములో నేను వ్రాసిన ఒక చిన్న వాక్యఖండముపై ప్రతివిమర్శకులు పెద్దచర్చ పెట్టుకొన్నారు. పాంథాశ్రమములోని కథ శాకుంతలకథను అనుసరించి ఉన్నదని వ్రాస్తే, అట్లుండడము తప్పన్నానని అనుకోవడము ఎందుకో తెలియదు. నేను వ్రాసిన దానిలో ఉన్న అనుకరణ పదమునకు తప్పుపట్టి, అనుసరణము కాని అనుకరణము కాదన్నారు. " సత్యవతీ శకుంతలల సామ్యము సిద్ధముగాన అనుకరణమని ఆక్షేపించుట అనర్థము. "

(1) అనుకరణ, అనుసరణ పదములకు వాస్తవముగా భేదమేమైనా ఉన్నదా ?

(2) వారు చేసిన సిద్ధసాధ్యతాదోషముతో నాకు ప్రసక్తి లేదు. నా ప్రశ్న కావ్యముపైనిన్నీ, నాటకములో ఉన్న వస్తువర్ణనపైనిన్నీ. వర్ణన సిద్ధము కాదుకదా; మరి అది అనుకరణమే అయితీరవలెను.

(3) అనుకరణము నేను ఆక్షేపించలేదే. మీదు మిక్కిలి మంచిసంగతిగానే భావించాను. —(చూ. వి. ౨౩. )

(4) నేను అన్నది ఏమిటిఅంటే " దానిలో శకుంతలాపరిణయానుకరణము తప్ప మరేమిన్నీ లేదు " అని ఇదికాదు కాబోలు వారికి కోపము తెప్పించినది; దానిసమీపములో బ్రాకెట్సు మధ్యనున్న ఒక వాక్యఖండము కాబోలు. " నాయకునికి మాటలురాక పదువుకొన్న శకుంతలాకథ జ్ఞప్తికి వచ్చిందా అన్నట్లు " అని. ఈ ప్రస్తావన లేకుంటే ' నన్ను చేపట్టుము ' అని అపూర్వవైదికముగా అనవలసి వచ్చును " అట ! ప్రతీనాటకములో నాయకుడు ఏదో ఒక కాంతాపరిణయ ప్రస్తావన చేసే ఈ వైదికత్వము తప్పుకొంటున్నాడా ఏమిటి ? శకుంతలాపరిణయ ప్రస్తావనగానీ, మరేకాంతాపరిణయ ప్రస్తావనగానీ లేనట్టి నాయికా నాయకుల సంభాషణ రసవంతమైనది లేదని వాదించరుగదా !

(5) సత్యవతీ శకుంతలలకు సామ్యముంటే, శకుంతలా ప్రస్తావనచేయక తప్పదా ఏమిటి ?

(6) ఇంతకూ నేను ఆక్షేపించినది ప్రస్తావనచేశారని కాదు. ఆ భాగమున రసము బాగా పట్టలేదని నా వాదము. (చూ. వి. ౨౨. ii)

దీనిని గురించి ప్రతివిమర్శకులు మిక్కిలి శ్రమతీసుకొన్నారని ఈమాత్రము వ్రాయవలసివచ్చింది.

7. మరొక అల్పవిషయము. కుర్చీలు, వార్తాపత్రికలు త్రేతాయుగములో ఉన్నవా అని నేను అంటే, ఆసనసామగ్రి మనపూర్వులు ఎరగరా, " అసంది " అనే పదమునకు అర్థమేమిటని, వార్తాహరులు ఉన్నారు కాని పత్రికలు లేవు అని ప్రతివిమర్శకులు సమాధానము చెప్పారు.

(1) కుర్చీలు నా తగవునకు కారణము. ఆసనసామగ్రి కాదు. " ఆసంది " కుర్చీ కాదు.

(2) పత్రికలుకాని వార్తలనే ఆహారులు తీసుకొని పోయేవారా ?

నాటకములోని సభలు, ఆ సభలలో జరిగిన చర్చలు ఆధునికసభలవలె ఉన్నవి అని నేను అంటే శుక్రనీతి, చంద్రగుప్తుడు, రామాయణము ఈ కాలముల లోని పౌరజనసభలు నాకు జ్ఞాపకము చేశారు. ఇవి ఏవీ త్రేతాయుగమునకు సంబంధించినవి కావని నా జవాబు. రామాయణములో ఉన్న వర్ణన త్రేతాయుగములో జరిగిన సభలవర్ణనే అని వాదిస్తారా ఏమిటి? సభలు ఉండవచ్చును కాని, ఆ సభలలో జరిగిన కార్యక్రమమేమో? నాటకములో వర్ణించిన సభల కార్యక్రమముకూడా త్రేతాయుగములో ఉండెనా? అలాగు రుజువు చేస్తారా? ఇంతకూ ఇది చాలా చిన్నసంగతి. పోనియ్యండి.

ఈ ఏడు చిన్నసంగతులగూర్చి చేసిన చర్చలతో వారి కథానిర్వహణ భాగము పూర్తియైనది. నావ్యాసము సావధానముగా చదివేవారందరూ నేను వీటిని ముఖ్యములుగా చర్చించి ఉండలేదని గ్రహించెదరు. ముఖ్యములుగా నేను చర్చించిన విషయములు అలాగే ఉన్నవని మనవిచేస్తున్నాను.

## ౨

## రసపోషణము

ఈనాటకములో ఇది చాలా ముఖ్యమైన విషయము కాబట్టి, దానిని ఈక్రింది అంశములుగా విభజించి చాలా విపులముగా 19–23 పుటలలో చర్చించినాను. ఆ అంశములు ఏవంటే ;

(1) నాటకములో వీర రస వ్యంజకము లెవ్వి?

(2) ప్రథమాంకములోని దిగ్విజయము, శరసేతు నిర్మాణము, ఎంతవరకు వీర రస పోషకములు?

(3) ప్రథమాంకములోని వీరము సాంకర్యమెందినది.

(4) రెండో దిగ్విజయమైనా నిండువీరమును స్ఫురింప జేస్తున్నదా ?

(5) ప్రతిజ్ఞ వీరము కాగలదా ?

(6) శృంగార వీరములకుగల సంబంధమెట్టిది ?

(7) శృంగారమైనా ఎట్లు వర్ణింపబడినది ?

(8) మొత్తముపైని రసద్వైవిధ్యము సంక్రమించి రసము శూన్యగా అయిపోయింది.

అని, ఇందులోనుంచి రెండుఅంశములను, అనగా మొదటి అంకములో రససాంకర్యము లేదనిన్నీ, నాటకములో రసద్వైవిధ్యము లేదనిన్నీ అనే ఈఅంశములనే వారిచర్చకొరకు ఎంచినారు.

నాచర్చకు ఆధారము సాధారణరుచి జ్ఞానముతో పాటు ప్రాచీనుల అలంకారశాస్త్రమర్యాదలుకూడాను. ఆంధ్రదశరూపక కర్తలైన కృతికర్తలు అలంకారశాస్త్రమును వారినాటకములో పాటించే ఉంటూ రనే ఊహపైనే నావాదము నడిపాను. ప్రతి విమర్శకులుకూడా అలాగే వాదిస్తారని నాఊహ; నా ఊహ సరికాకపోతే నావాదమును మార్చవలసి ఉంటుంది.

మొదటి అంకములో రస సాంకర్యము ఉన్నదా, లేదా అంటే, తప్పకుండా ఉన్నదనికదా నావాదము. దీనిపైని ప్రతివిమర్శన ఏమిటంటే, "రసనిర్వచనము ప్రకరణము ననుసరించి యొనర్పవలయునుగాని ఒకటిరెండు వాక్యలేశముల బురస్కరించుకొని, వీరము శాంతము అను పదములతోడనే ఆయా రసములు పోషితములయ్యెననుట హాస్యాస్పదము". దీనికి నాజవాబు:

(1) ఒకటిరెండు వాక్యలేశములుకావు. ప్రకరణము అంతా చదవండి. సుమారు పదకొండుస్థలములు (వాక్యములుకావు) నిరూపించినాను.

(2) వీరము...అనే పదములతోడనే ఆరసములు పోషితములయ్యెనని నేను అనలేదు. ఏలాగు పోషితములైనా, అపోషితములైన రసములున్నవనే నావాదము.

(3) రసముల నామములను నాటకములో ఉచ్చరించుట దోషముకాదా?

(4) రససాంకర్యము అనగా ఎట్టిది? ఒక ప్రధాన రసవర్ణన మధ్యమధ్య ఇతరరసముల ఉల్లే

ఖనము రస సాంకర్యము కాకపోతే— ఇదే ప్రథమాంకములో ఉన్నది—రససాంకర్యమునకు ప్రతిపక్షులు లక్షణము చెప్పవలసి ఉంటుంది.

కవిని కేళికొట్టి హేళనచేసినానట! కేళికాదు హేళనకాదు. తత్వజిజ్ఞాసతోనే వ్రాసినాను. మూడు రసములకు కంఠోక్తిగా ఏకభావము చెప్పి, మరిమూడు రసములకు నిదర్శనములు వర్ణిస్తే, ఈమూడింటికీకూడా ఏకీభావము చేయలేదేమి అని అంటే అది కేళి ఎందుకు అవుతుంది? ఇన్నిరసములు ఒక్క ప్రకరణములో సమకూర్చిన కవిది తప్పుకాదుకాని, సమకూర్చినారని అన్న నాదా తప్పు? ఈదర్శనంతనూ సావధానముగా చదివితే, నేనెంత సద్భావముతో గౌరవపూర్వకముగా వ్రాసినానో విదితమవుతుంది. "ఆలంకారికులుకూడా .....; శబ్దత: ఉట్టంకించి ఉన్నారో...; ఇవన్నీ శబ్దదోషములు...; ఇట్టి రసముల...;" అనే వాక్యములు చూడవలెను. (వి. ౨౦—i)

రెండో అంశము రసద్వైవిధ్యము. దీని విచారణకు ప్రధానాంగరసము లెట్టివో మొదట తెలియవలసి ఉన్నదంటూ, ప్రతివిమర్శకులు లక్షణములు చెప్పినారు. ఆ నిర్వచనములతో తగవులేదు; కాని వాటిని పట్టించేటప్పుడే అభిప్రాయభేదము వస్తున్నది.

(1) నాయకు డెవడు అని ఒకప్రశ్న. నాటకము ఉన్నట్లూ అంటే దేవవ్రతుడు నాయకుడు కానేరడని నా వాదము. ఇందుకు ప్రతియుక్తముగా జీమూతవాహనుని పేర్కొన్నారు. కాని, ఈ నాటకములో ఉన్న సాంకర్యము నాగానందములో లేదు. అక్కడ జీమూతవాహనుడుగాక మరొకడు నాయకుడు కాగలవాడైనా ఎవడూ లేడు. అందులో ఉన్న రసములు రెండైనా అతనినే, ఆఒక్కడినే ఆశ్రయించి ఉన్నవి. అందుచేత ఒకటి ప్రధానము ఒకటి అంగము కాగలదు. ఇవేవినీ ఈనాటకములో పొసగవు.

(2) భీష్ముని ప్రతిజ్ఞ దానవీరముగా సమన్వయించినారు. దానమెక్కడ ఈ నాటకములో? దేనిని దానము చేసినాడు? "సౌఖ్యదానము" అని ప్రతివిమర్శకులు వర్ణించినది ఎన్నటికీ దానము కానేరదు. దానమునకు దాత, ప్రతిగృహీత, దేయము—ఈమూడు కావలసిఉన్నవి. సౌఖ్యము అట్టివస్తువుకాదు. దేవవ్రతుడు తనసౌఖ్యమును శంతనునికి ఇవ్వలేదు; అట్లు ఇచ్చుటకు ఎవ్వరికీ శక్యముకాదు. అసంభవము. భీష్ముడు చేసినది త్యాగము కాని దానము కాదు. తాను చేసిన త్యాగము ఒకరికి సౌఖ్యము సమకూర్చుటకు సాధనము కావచ్చును. అంతమాత్రాన వాడుచేసిన త్యాగము దాన మనిపించుకోదు. భీష్ముడుచేసినది అట్టి త్యాగము. తనకు కలిగియుండునని ఊహించే సౌఖ్యము తనకు కలుగకుండా ఉండేటట్లు అతడు ప్రవర్తించేడు. ఈ ప్రవర్తనకు దాన మంటారా? దానము త్యాగము అనే రెండింటికీ ఉన్న భేదము చక్కగా పోల్చనందున ఈచిక్కు సంభవించింది. *

(3) ప్రతివిమర్శకుల వ్యాఖ్యానము ప్రకారము ఈ నాటకములో వర్ణితములైన యుద్ధదానము లనే రెండురకముల వీరమునకు సమరస ఎట్లు? భీష్ముని దానవీరమునకు భీష్ముని యుద్ధ వీరము ఎట్లు అంగమోకదా! ఇట్టి రెండురకములవీరము ఒక్క నాటకములో ఒక్క పాత్ర విషయమై వర్ణించుట సంప్రదాయమా? వారి సమన్వయ ప్రకారమునకు యుద్ధ వీరమునకు గలప్రయోజనమేమి?

* ఈవిషయము నేనొకస్నేహితునితో చర్చిస్తూఉంటే వారొక తుల్యమైన ఉదాహరణము చూపినారు. దేశబంధు దాసుగారు న్యాయవాదివృత్తిని త్యజించి, వారి ఆస్తిని దానముచేసినారు. ఒకటి త్యాగము, ఒకటి దానము. వారిత్యాగమువల్ల ఎవరికి లాభమున్నదో, వారికి దాసుగారు దానముచేసినా రని భావించముగదా! ఇట్టి త్యాగమే భీష్ముడుచేసినదికూడా.

(4) భీష్మునిప్రతిజ్ఞకు శంతనుని వివాహమునకూ అంగాంగి సంబంధ మున్నదనుట అంగీకార మే. అయితే అంగి ఏది, అంగము ఏది? ఈ రెండింటిలో ఒకటి చరితార్థము ఒందించేది, ఒకటి ఒందేది; ఒకటి సాధనము, ఒకటి సాధ్యము; ఒకటి కారణము, ఒకటి కార్య ము. కార్యము, సాధ్యము, చరితార్థము వి వాహముకాని ప్రతిజ్ఞ కాదుగదా! వివాహ ముజరుగుటకు ప్రతిజ్ఞా, ప్రతిజ్ఞ జరుగుటకు వివాహమా? ప్రతిజ్ఞచేస్తే వివాహమయినది అందుచేత కారణము, సాధనము అయిన ప్రతిజ్ఞఅంగముకదా. ఇంత సుస్పష్టముగా ఉన్న సంబంధమును ప్రతివిమర్శకులు తారు మారుచేసి వాదిస్తే చేసేది ఏమిటీలేదు. ప్ర తిజ్ఞ వివాహమునకు కారణమని నాటకరీతి కాకారులు, నాటకకర్తలుకూడా అంగీక రించిఉంటే, ప్రతివిమర్శకులు ప్రతిజ్ఞనుఅం గిగా సమన్వయిస్తారు. అప్పటికీ ఈలోప షమును పూర్తిగా కప్పివేయ లేకపోయినా రు. "ప్రధానాంగమయిన ఏ శృంగారరసము ను నిర్వహించుచు అంగియైన ఏ దానవీరము" అని వ్రాసినారు. అంగ, అంగి అన్నమాటలకేమిగాని, "నిర్వహించుచు"అనే మాటను పరీక్షించండి. నిర్వహించేదేది? దానవీరముకదా? నిర్వహించేది సాధనము కాదా? సాధనము అంగికాగలదా? ఇప్ప డైనా నావాదము అంగీకరించరా?

(5) శృంగారము వీరమునకు అంగమనివ్రాసినారు. ఇది శాస్త్రసమ్మతమా?

(6) నాయికలేని నాయకుడు ఉండవచ్చునట! ఇది శాస్త్రసమ్మతమా? సంప్రదాయమా? ఇందుకు ఉదాహరణముగా "నాగానందము తుది రెండు అంకములలో వర్ణితమైన జీమూత వాహనుని దయావీరమునకు నాయిక ఎవరు? మలయవతి అనుట అసంగతము. అటులనే ఈ నాటకమున గూడ "ఊహించునది" అని ప్రతివిమర్శకులు వ్రాసినారు. ఇందుకు జబాబు.

(i) నాగానందమునకూ ఈ నాటకమునకూగాని, జీమూతవాహనునికి భీష్మునికీగాని, పోలిక లేదని ఇదివరకే చూపియున్నాను

(ii) జీమూతవాహనుని దయావీరముతో మాల్య వతికి సంబంధము లేకపోలేదు.

(iii) నాయిక నాటకమున కంతటికా? లేక కొన్ని అంకములకా? నాయిక రసమునకా? ఏమంటారు?

ఈ కారణములచేత వీరము ప్రధానమని చేసిన వాదము నిలవలేదని మనవిచేస్తున్నాను.

## 3
## పాత్ర పోషణము

**1.** శంతనుని శీలముగురించి తగవువచ్చినది. (వి. ౧౫. i) శంతనుని వివాహేచ్ఛా ప్రసంగము మూలము కంటె వేరుగా నాటకములో వర్ణితమయినది ఈమార్పు బుద్ధి పూర్వకముగాచేసి, "శంతనుని శీలము కవి బాగుప రచెనని రీతికాకారులు వ్రాసినదానితో నేను ఏకీభవించ లేకపోయినాను. నావాదమునకు తగిన నిదర్శనములుగా శంతనుని ప్రవర్తననుండి కొన్నిసంగతులను ఎత్తిచూపి యున్నాను. ప్రతివిమర్శకులు ఆసంగతులకు వేరొకస మన్వయము చెప్పవలసియున్నది. ఆలాగుచేయక, పది మార్లు నొక్కి నొక్కి శంతనుడు ధీరుడేఅని చాలా మాట లలో చెప్పినారు అది నా వాదమునకు సమాధానమవుతుం దా? ఏల అన్నందుకు నేను చూపిన హేతువులు ఆలా గే నిలిచిఉన్నది. "కామము అరికట్టే" ఉంటే, "వివా హవాంఛావిముఖుడే" అయియుంటే, "ధృతదీక్షుడై కళ త్రవాంఛను వీడగల్గే" ఉంటే శంతనుడు ఏలకాడు. కాని ఆలాగుచేయలేదు. చేసేఉంటే శంతనుడు స్వగత ములో అన్నమాటలు ఉండకపోవును; యజ్ఞతీర్థుల ఒక్కమాటపైని శంతనుడు బయలుపడక పోయియుం డును; దిగ్విజయము చేసివచ్చిన దేవవ్రతునికివింతగా కన బడకపోయియుండును. ఇంతెందుకు? భీష్మప్రతిజ్ఞ ఉం డకపోయియుండును!



శ్రీ శ్రీ శృంగేరి జగద్గురు పూజ్యపాదులవారు



చాముండేశ్వరీ దేవాలయము—మైసూరు

2. సత్యవతికి దేవవ్రతుని ప్రథమదర్శన మప్పుడు కలిగిన మనోవికారమును శృంగారవికారముగా నేను సమన్వయము చేశాను. ఆ లాగని నిశ్చయించలేదు. ఆలాగు ఊహించినందుకు నాకు మహాపాతకము వచ్చిందట. నేను జతపరచి చూపించిన వాక్యములు వ్రాసిన కవికి లేనిపాతకము, ఆవాక్యములనుఆధారముగా వ్యాఖ్యానము చేసిననాకా కలుగును? ఇట్టివికారము సహజమని లీనచైతన్య స్వరూపవేత్తలకు (Study of the Unconscious) తెలుస్తుంది........................ సత్యవతికి శంతనునిపై గాఢమోహమే పుట్టిఉంటే, గాంధర్వమే కుదిరిఉండును. గురుజనాజ్ఞ మోహము లేనప్పుడే అవసరము. శకుంతలకథే అందుకు ప్రమాణము. శంతనునిపై నిండుమోహమే ఉంటే, నేను జతపరచిన స్వగతములు అసంగతములు అసంభవములు అగును. మోహము పనులలో వ్యక్తముకావలెను. కాని పద్యాలలో కాదు. మాటలలోకూడా స్వగతములకు గల విలువ ఎక్కువ.

ఇంతతో విరమిస్తాను. ఇక ఈవిమర్శనవిషయమై మరివ్రాయను.*

[* మేమును దీనినిగూర్చి ఇఁక నేమియు ప్రకటింపఁ జాలము.—సంపాదకుఁడు.]



# వాగ్దేవతాభ్యర్చనము

ఓలేటి వేంకటరామ శాస్త్రి గారు

కడగంటం గనుఁగొన్న నాశ్రితుల భాగ్యశ్రీలు వర్ధిల్లఁజే
సెడు నిన్వోఁడినఁ బొల్లవోదని మదిం జింతించి సద్భక్తితో
మొడుపుం గేలు ఘటించి నెన్నుదుటిపై మోవంగ సంధించి నీ
యడుగుందామర పూలపై నిలిపి నిన్నర్చింతు వాగ్దేవతా!

శా. తల్లీ! నీ పదపంకజాతయుగళీదాస్యంబు వైదుష్య సం
పల్లాభం బొడఁగూర్పఁ గోమలవచః ప్రస్ఫూర్తియై ప్రాగ్విప
శ్చిల్లోకంబు గుణప్రశస్త నిజవాక్ఛ్రీసుధానిర్ఝరీ
కల్లోలంబుల ముంచి తేల్చి చనియెంగాదే జగన్మండలిన్.

మ. సదయంబైన భవన్మనంబున మదిచ్ఛాపూర్తిఁ గావింపఁ గో
ర్కి దృఢంబై విలసిల్లఁజేసి యనురక్తిం దల్లి! యెల్లప్డు నీ
పదపద్మంబులఁ గన్నులద్దుకొను సౌభాగ్యంబు నాకిచ్చి య
న్య దురాలక్ష్యము నీ నిసర్గగుణసౌందర్యంబుఁ గాన్పింపవే.

కం. అక్షయ రసమయ సద్గుణ, లక్షిత నిజ నిరుపమాన లావణ్యముతో
సాక్షాత్కరించి శీతల, వీక్షణముల నన్నుఁ దనుపవే వాగ్దేవీ!




చెన్నపురిలో నే నుండినకాలమున జార్జిటవునులో నొకస్థానమునఁ దములపాకులమ్ముచోటబాగుగఁ గపనుడునట్లు కట్టఁబడిన చిత్రమొకటి నామనము నాకర్షించుచుండెడిది. అది వంగదేశపుతీరునఁ జిత్రింపఁబడి జర్మనీలో ప్రసిద్ధచిత్రముద్రాయంత్రమున నచ్చొత్తింపఁబడినదని దానిపైననె తెలుపఁబడినది. ఆచిత్రమునఁజంద్రకాంత శిలానిర్మితమగు దశరథుని రాజనగరున—అంతఃపురమున—ఒక పడకటిల్లు కనఁబడుచున్నది. చక్కనిశిల్పము, అందమగు నలంకారములు, మంచిగవాక్షములతో, వెల్తురుతోడి గది. తెరలతో, పట్టుకుచ్చులతో నందముగఁ గనఁబడు పాన్పు నున్నది. అందు రాజకుమారి యొకర్తుక, 'చంద్రనిభాస్య' 'జలజాక్షుని సతిఁబోలు తరుణి' శయనించియె కొంచెము లేచియున్నది. ఈమెకు దగ్గరగ నొక కుబ్జ, తొందర, అసూయ పోతపోసినట్లు కనఁబడు భావముతో ఒకచేతిని గుండియపైన వైచికొని ఇంకొకచేతితో నా రాజకుమారి యిచ్చుచున్న ముత్యములసరమును కసరికొట్టుచున్నది. వీరు కైకేయి, మంథరయు! ఈకైకేయి 'శారదనిశం బొడగన్న చంద్రలేఖ'యు పోలె 'అతిహర్షము'ను దెల్పుమోముతో నున్నది. ఆనందమున మేను పొంగియున్నది. పరమమగు విస్మయమును దెల్పుచున్నది. మెఱుముపలె నొక్కమాఱుగఁ గైకేయీ మంథరల స్వభావములు,విషాదరామాయణమును నాకు స్ఫురించినవి.

షేక్సుపియరుమహాకవి—ఆంగ్లదేశపుకాళిదాసు—అద్భుతము లగు విషాదనాటకములను రచియించినాఁడు. ఆయనవిషాదనాటకములందెల్ల నొక విషాదభావము బాగుగఁ బోషింపఁబడుచుండును. కొన్ని విషాదపాత్రములు చిత్రింపఁబడుచుండును. కొందఱు దురదృష్టవంతులు ఆ భావమున కెరయగుచుందురు. కొందఱు దురాత్ములా భావమును బరిపక్వము చేయుచుందురు. ఒక విషాదకార్యము నొక విషాద కారణమును మన భావములందుఁ బ్రతిబింబించుచుండును. ఒథెల్లో అయాగోలు, లియరు గానరిల్లు రీగానులు, మేక్బెత్తుమాంత్రికురాండ్రు, షేక్సుపియరువిషాదపాత్రములు. ప్రపంచసారస్వతమున విషాదపాత్రములలో నెల్ల ముఖ్యములని చెప్పవచ్చును. ఈపాత్రములప్రాశస్త్యము నాటకకథాకల్పనమునను రసపోషణమునను విషాదభావము పరిపక్వము నొందుపట్లనె కనఁబడుచున్నది. మనరామాయణము నొకమహావిషాదకథగ—నాటకముగ—నెంచి అందలిపాత్రములవంక చూచితిమేని శ్రీరాముఁడు,సీతాదేవి,రావణాసురుడు, దశరథుఁడు, కైకేయి, మంథరయు నీవిషాదభావమును పోషించుచున్నట్లు తెలిసికొనఁగలము.

శ్రీరామచంద్రుని విషాదకథనెల్లఁజదువుచుఁ గన్నులనీరు గార్చినాము. శ్రీరామచంద్రుని—సీతాదేవి ఉత్తమచారిత్రమున కచ్చెరువంది పూజించుచున్నాము. రామాయణపువిషాదమును మన మనుభవించుచున్నంతసేపును—ఒక్కభాగముమాత్రము మనము మఱువలేము. అది కైకమ్మ చెయిది. మంథఱను మఱతుము. కాని కైకను మఱువము. భరతఖండమున ప్రజలెల్లరును కైకనెఱుఁగుదురు. కైకయే రామాయణమునకుఁ గారణమని ఎఱుఁగుదురు.

దశరథరాజు కథ—పుత్రసంతతిలేకపోవు టాదిగ శ్రీరాముని బాల్యము, కౌమారమువఱకు, సీతాకల్యాణానంతరము పట్టాభిషేకమువఱకును కథాకల్పనోపక్రమణము (Exposition) కైకమొదలు పట్టు (Complication) నని మన మెఱుఁగుదుము. విషాదము రామాయణమునఁ గైకతోడనె ప్రారంభమగును; కైకతో నంతమొందునని చెప్పు టతిశయోక్తి కానేరదు.

షేక్సుపియరు మేక్బెత్తునాటకమున మేక్బెత్తు డంకను రాజును చంపినాఁడు; దుఃఖమనుభవించినాఁడు.

లియరులో గానరిలు రీగానులు రాజుగుండెలు పగిల్చినారు. లియరు కార్డీలియా చరిత్రలు విషాదము. హేమలెట్టులో క్లాడియసు తనఅన్నను చంపినాఁడు. హేమలెట్టుచరిత్ర విషాదకరము. ఒథెల్లోలో ఇయాగో ఒథెల్లోమనసు చెఱచినాఁడు. ఒథెల్లో డెస్డిమోనాను చంపినాఁడు. విషాద మనుభవించినాఁడు. ఈ మహానాటకములందు దుఃఖముకలిగించినవా రొకరు; కలుగఁజేసికొన్నవా రొకరు; అనుభవించినవా రొకరు. మొత్తము మీఁద విషాదభావమున కీముగ్వురును గారకులె. ఇది యోజించితిమేని విషాదరామాయణమునకు సీతారాములె కాక కైకేయీదశరథులును, రావణుఁడునుగూడఁ బ్రధాన భాగస్థులనియు అందు ముఖ్యముగఁ గైకయె విషాద విగ్రహమనియుఁ జెప్పవచ్చును.

కైకేయి యొక ఉత్తమరాజపుత్రి. దశరథుని పత్నులలో నొకర్తుక. రాజు చిన్న భార్య. మంచితెలివి కలది. అందకత్తె. దశరథునియనురాగమునకుఁ బాత్రురాలయ్యెను. ఒకమాఱు అమరారులసమూహముతోఁబోరాడి వేళ వైరిబాణహతిని దశరథుఁడు సోలఁగ, నీమె నరకాసురయుద్ధమున సత్యభామవలె నతనినిఁ గపనమున నప్రమత్తతోఁ గాచెను. దశరథమహారాజు కౌసల్యాసుమిత్రల నొకయెత్తుగను, కైకనొకయెత్తుగను జూచుచుండెను. ఆమె యతని యాజ్ఞ మీఱక నడచుకొనుచుండును. అతఁడు నామెకుఁ జెప్పకుండఁగ నేపనినిఁ జేయఁడు. ఒక్కరోజైన నామెను జూడకుండ లేఁడు. మనుజతతిని రాముఁడొక్కఁడే ప్రియుఁడుగను వనితాచయమున నీమెయొకర్తుకయె ప్రియురాలుగను దలంచినాఁ డితఁడు! శ్రీరాముఁడన్ననో, కైక నొకతీరుగను గౌసల్య నొకతీరుగను చూచినవాఁడు కాఁడు. ఆమెకు శ్రీరాముఁడును భరతునివలెనె శుశ్రూష చేసెడువాఁడు. కైకయు దశరథునితో "భరతుఁడట్టిఁడ శ్రీరామభద్రుఁ" డనుచు నెన్నిమాఱులో పలికియుండెనని దశరథుఁడే చెప్పినాఁడు. అట్టి కైకేయి తనపడకటింట హాయిగ నిదురించుచుండినది నిష్కల్మషమగు—శాంతమగు—వేఱుతలంపులకు తావులేని సుషుప్త్యవస్థయం దుండినది.

అప్పుడు రాచనగరున విభవము లనుభవించుచుఁ, దనయంతరమునే మెఱచిన యొకపరిచారిక, మధ్యవయస్కురాలు, మంథర, నాలిముచ్చు మోముతోడి కుబ్జ. ఆమె సురాకాంక్షకు, భోగతృష్ణకు నవిరుద్ధమును అనరోధకమునగుతీరని కొఱఁత, మనసును బాధించుచుంటను దెలుపుభావముతో మెల్లగ అటు నిటుఁ జూచుచున్నది. తన విషమున కెరచేయుటకు పడగవిప్పి గూచుచున్న విషసర్పమువలెఁ జూచుచున్నది.

మంథర యెక్కడఁబుట్టినదో తెలియదు. తలిదండ్రు లెవ్వరో తెలియదు. రామునిగృహమునఁ బరిచారికలలో 'పరమనారి'కాని స్త్రీ యీమె యొకర్తుకయె. ఈమె కైకకు బంధుదాసి. పొట్టకూటికై విషువమునఁ గైకను గనిపెట్టుకొని యున్నది.

ఎక్కడిపీనుంగళఘోషములు, జనుల కలకలమని వితర్కించుచున్నది. ఆకసమునంటు హార్మ్యము నెక్కినది. అంతట జిమజిమలాడు దీపములు, జెదచల్లిన పుష్పములు, ధ్వజములు, మాల్యమోదకములతో నడచు విప్రబృందములు, హితవాద్య ఘోషము నీమె చూచినది. చూచి యబ్బురపడినది. ఏమిది యని యొకదాసి నడిగినది. రామునితల్లి దానము లిచ్చుచున్న దేమి? రాజేమైన శుభముఁ దలపెట్టినాఁడా యని ప్రశ్నించినది. అంతట నాదాది రేపు రామునికి యౌవరాజ్యపట్టాభిషేకము చేయఁదలఁచినారని చెప్పినది. ఈకుబ్జకు సహజమగు క్షుద్రస్వభావము దీనిని విని పడగవిప్పినది.

"ఆపలుకులు చెవిఁబడఁ గడుఁ;
గోపంబున మండిపడుచుఁ గుబ్జయుఁ గైలాఁ;
సోపమసౌధము డిగి చని
పాపపుమతి ననియె హాయిఁ బండినకైకన్"
——లేలెమ్మని!!

ఇదియె విషాంకురము— కాదు; విషాదాంకురము. మంథర స్వభావసిద్ధముగ క్షుద్ర. దుర్మార్గురాలు. షేక్స్పియరు చిత్రించిన అయాగోపాత్రమువంటిది. పాము విషమువలె ఆమెయందు దుర్మార్గము నిలువెల్ల నిండి యున్నది. ఈవిషయమును కైకయొక్క మనసున నెక్కింపఁ దలపెట్టినది మంథర! విషబీజమును నాటి మొలపించి వృక్షమును పెంచి ఫలింపఁజేయఁగల్గినది. శ్రీరామునివిషాదనాటకమునకుఁ గారణకార్యములు, మంథరాకైకలె.

కొంపమునిఁగినట్లె మంథర కైకను లెమ్మనినది. "దశరథుఁడు నీయాజ్ఞానువర్తియని విఱ్ఱవీగుచుందువు. నీసౌభాగ్యము, గౌరవము నేఁటి గలయుచున్నది లెమ్ము. యీూఘాతుకురాలా!" యనినది. కైక యిది విని విషాదము నొందినది. మంథరను చూచినది. అంతట మంథర జాలి నభినయించినది కైకకు రాఁబోవుదుస్థితికై వగచుదాని వలె! "ఏల నేఁడ్చె దీకరణి దీనవదనవై"యని కైక యడిగినది. అంతట మంథర ముఖ భావము మార్చినది. ఈమారు, రక్తలోచనయై కన్నుల నీరే కార్చినది. "నీకు వినాశము కల్గుచున్నది. నీక్షేమము కోరుదానను గనుక రామునికి రేపు పట్టాభిషేకము చేయుదు రని విని సైరింపగలేక, వచ్చితిని. "నీకు దుఃఖమొదవ నా కతిదుఃఖమగు, నీకు వృద్ధిగలుగ నాకువృద్ధి." నీవు మోసపోయితివి. రాజు నిన్నూరక తేనియమాటలతోఁ దృప్తిపఱచి కౌసల్యకే సకలైశ్వర్యముల నిచ్చుచున్నాఁడు. బంధువులఁ జూచుటకని మిషపెట్టి, నీకొమరుని దూరముగఁ బంపివైచి, దురాత్మర్గముతోఁ బెద్దపెండ్లాముకొడుకునకుఁబట్టము గట్టఁ బోవుచున్నాఁడు. వెనవుము, నీకొమరుని, నిన్ను నన్నుఁ గూడఁ గాచుటకు మార్గము. ఏమరి, చెడిపోకుము" అని హెచ్చరించినది. ఈవిషపుఁబలుకుల నన్నిటిని కైక తిన్నగ వినలేదు. శ్రీరామునికిఁ బట్టము కట్టుదురన్న సంగతి ఆమె కత్యంత సంతోషమును గలిగించి మైమఱచునట్లు చేసినది.

"...అతిహర్షమునన్
వే లేచె శారదనిశా
లీలం బొడతెంచు చంద్రలేఖయు పోలెన్.
ఆనందమ్మున మేనుపొంగఁ బరమం
బౌ విస్మయం బారఁగా,
మేనం దాల్చిన మేలిభూషణముఁ
గొమ్మొక్క యందు నొండిచ్చి యే,
ణీనేత్రామణి కుబ్జ కిట్టులనియెన్
నిన్నెచ్చితిన్ మంథరా
దీనిన్ నాపరమప్రియంబు దొలుతం
దెల్పంగ నీ వూనుటన్."

అనినది!! కైకేయి!!! పాపము — ఇంత మంచిమాట వినినందులకు అదిచెప్పిన మంథరకెట్టి సత్కారము చేయవలెనో ఈమెకుఁ దెలియలేదు. "రామునకు భరతునకు నేమాత్రము భేదమెఱుంగనట్టితటి రామునకుఁబట్టము గట్టి మనసు రంజిలకున్నే?"యని నది. మంథర తంత్రము వ్యర్థమైనది. విషబీజము నాటుటకు క్షేత్రము పదునుగ లేదు. మంథర తనపట్టువిడుచునా? వేఱొక వ్యూహము పన్నినది. రంగము, రసము, కూడ మార్చినది.

"కోపము దుఃఖము మదికిని
దాపంబిడ నీసుకలిమిఁ దటుకున సొమ్ముల్
వేపాఱవైచి మంథర
భూపాలక సతినిజూచి పొక్కుచుఁబలికెన్" ఏమని?

"ఇది సంతసమునకు వేళకాదు. శోక కీలామధ్యమునఁ బడిననీకు వివేకమే లేదు. రాజ్యముమ్మడిసొమ్ము. అందువలన భరతునకుఁ బ్రాణభయముకూడఁగలుగును. ఏల యన భరతుఁడన్న రామునకు భయ ముండనే యుండును" అని క్రొత్తదారిని ద్రొక్కినది. "ఇదిగాక న్యాయముగ భరతుఁడే ముందుపుట్టినవాఁడు. అదియోచించినచో నీతనికే రాజ్యము ముందుగ రావలసియున్నది. రాజ్యము సేయుటకును, దగినవాఁడు. వానికి జరుగుచున్న అన్యాయము తలఁచిన నాదేహము వణఁకుచున్నది. చూడుము" అని కొంతినటించి, నాతుల కత్యంతమృదులమును, ఆయువుపట్టును నగు సవతియదృష్టమును గూర్చిన చింతను బురికొల్పుచు "కౌసల్య యెంత యదృష్టవంతురాలమ్మ! చక్కఁగఁదన కొమరునకు యౌవరాజ్య పట్టాభిషేక మహోత్సవమును స్వయముగఁ జేయించుకొనుచున్నది." అని స్త్రీలకుఁ గంటకతుల్యమగు సవతిబాగు తన యోగును గలిపిన తంత్రులను మేళవించినది.

"సిరియును బ్రీతి కీర్తియును
జెన్నలరన్ సవతాండ్రు గుందగాఁ
గెరలెడి కోసలాత్మజకుఁ
గ్రిందయి చేతులు మోడ్చి దీనవై
పరవుడ మోపి చేయుచును
వర్తిలుచుందువు మమ్ముఁగూడి నీ
భరతుఁడు ప్రేష్యభావమున
బాధపడున్ రఘురాముఁ గొల్చుచున్."

అని రామునివారు సంతసింప, భరతునివారు చింతింపుదురు" అనిపలికినది. ఇది కైక వినినది. వర్షమువలన తడిసినభూమివలెఁ గైకమనసు కొంచెము మార్పుఁజెందినది. మొట్టమొదట రామునిపట్టాభిషేకమునుగూర్చి వినినప్పుడు కల్గినవిస్మయానందములు నిష్ఫలమ్ములైనవి.

పవిత్రములైనవి. అట్టి యాధ్యాత్మికానందపు మెట్టునుండి యొకమెట్టు దిగినది. సంతోషమునుండి, సహనమునకు దిగినది. శ్రీరామునిసద్గుణములను వర్ణించిచెప్పుచు, "మంథరా; నీవేలదుఃఖించెదవు? రాముఁడును దండ్రివలెనె యెల్లగను పాలింపఁగలఁడే. ఎన్నివత్సరములైననేమి? ఎప్పుడో యొకప్పుడు నాకొమరునికిని సంపద కలుగనేకలుగును. న్యాయరీతినిజూచి తృప్తిపొందవలదా? శ్రీరాముఁడును భరతునివలెనె మాన్యుఁడు. నాకును దనతల్లికంటె భక్తితోఁ బరిచర్యలు సలుపుచుండును. రామునకు వేఱుబుద్ధులు లేవు. నాభరతుఁడు రాజైనట్లె సంతసింతును." అని వాదబలమున కైక మనసు నూరటఁజెందించుకొనుచున్నదని— ఇది కేవలము అందఱానిద్రాక్షల కజ్జులు సాచలేక యూరకొనువాని సహనమువంటిదని— కైకేయి మెల్లగఁ దాను మార్పుకలిగించుచున్నదని మంథర గ్రహించినది. అందులకు సంతసించి ఎంతో బాధపడుచున్నట్లొకవేడినిట్టూర్పు నూర్చినది. "అయ్యో; ఓవెఱ్ఱిదానా! రాముఁడు రాజైనచో నా రాజ్యము వానికొమరునకె పోవునుకాదటె? చిన్నకొమరుఁడెంతటివాఁడైనను ప్రధమునకె పోవును. నీకొడుకనాథుఁడట్టివాఁడై పోవునని దుఃఖించుచు నిన్నిట్లు హెచ్చరించుచున్నాను. సవతియొక్క వైభవము, అభివృద్ధిని కోరియేనా నీవు నాకీబహుమతి నిచ్చుచున్నావు. ఇదీ!! నిజము చెప్పుచున్నాను వినుము: రాముఁడు రాజ్యముఁ బుచ్చుకున్నపిదప— ముల్లువలె నుండు నీకొమరు నడవులకో పరలోకమునకో పంపఁగలఁడని ముమ్మాటికి నమ్ముము. మేనమామయింటికిఁ బంపుటవల్లనే తండ్రికొమరులమోసము తెలియుచున్నది. ఈ స్నేహము, లీమర్యాదలు నెదుటనున్నంతవఱకె; రాజుగారి ప్రేమ యంతటిదే. అడవులలో నష్టముగనున్న పొదలును, ముండ్లచెట్లును, నఱుకబడుటను మనముచూచుటలేదా? రాముని లక్ష్మణుఁడు వదలఁడు. వారిరువురకును భేదమే లేదు. అందువలన నాతనికి భయములేదు అందువలన నీ కొమరుఁడు మేనమామయింటినుండి యడవులకుఁ బోవుట నిశ్చయము. రామునకులొంగి, విభవచ్యుతుఁడై భరతుఁడెట్లు బ్రతుకును? పూర్వము నీవుగర్వముతో రాజును లోఁబరచుకొని నీ సవతాండ్రను ధిక్కరించుచుండువు. అది రిత్త వోవునా? నీకుఁ బరాభవము తప్పదు.

"నీ సవతికొడుకు రాజ్య
శ్రీసహితుండైన భరతుచేతు నిజంబా
నీసుతుఁడు రాజ్యమేలఁ బ్ర
వాసిగ రాముండు గానుపాయముగనుమీ"

అని హెచ్చరించినది. సవతాండ్రవైభవమును కారము కైకకంటం బడినది. అదివిషమై నిలువెల్ల క్రమ్మినది; కన్నుమూసికొని పోయినది. తన పరాభవమును గూర్చినవంత దీనిని ప్రజ్వలింపఁజేసినది. ఆమె యొక వేఁడినిట్టూర్పు నూర్చినది. కోపరక్తనయనాంబుజయైనది. కుబ్జను చూచినది. అది చెప్పినమాట నిజమెయని యెంచినది. తల పంకించినది. ఏస్త్రీ తనసవతి తన్నుఁ బరాభవించుననను తలంపును సహింపఁగలదు? సవతి, పరాభవమను రెండుమాట లీమెను కృతనిశ్చయనుగఁ జేసినవి. రాముసే యడవులకంపి, భరతునకే పట్టముగట్టింపఁదలఁచినది దీనికుపాయ మా క్రౌర్యమునఁ దనంతటఁ దానూహింపలేక మంథరనే యడిగినది. ఆక్షణమునుండి కైకేయి తన యాత్మవిశ్వాసము, స్వయంకృషి, స్వశక్తులఁ గోల్పోయినది. ఆక్షణమునుండి మంథర కైకను గీలుబొమ్మవలె నాడించి క్రూరకృత్యములను జేయించినది. దశరథునిపైఁ గోపమువచ్చినట్లు నటింపుమని, పూర్వము తనకిచ్చిన వరముల నిప్పుడు కోరుమని, రామునిఁ బదునాల్గేఁడులు వనవాసమునకంపు టాదిగాఁగల కుతంత్రమును పన్నినట్లు చేసినది. కైకేయియు మాఱుమాటాడక నిదియెల్ల తన హితమె యనుకొని గ్రహించి ఆచరించి శాశ్వతాప్రతిష్ఠకుఁబాలయ్యెను. "కారాని తెరవులంజనఁ, గోరిన గోడిగ విధాన" కైక మంథరచేతిలోఁ బ్రవర్తించినది. అంతట దశరథునివిషాదము—అంతర్నాటకము నడచినది. కైకయీనాటకమునందు ముఖ్యనాయిక. ప్రపంచమున విషాదనాటకములందలి విషాదపాత్రముల యొక్క గుణములనెల్లఁ బ్రదర్శించుచున్నది. అంతట రాముఁడడవుల కేగినాఁడు. దశరథుఁడు విలపించుచు మరణించినాఁడు. రాచనగరున విషాదభావ మొక్కటె యలముకొనినది; కాని యింకను నాఁటికి యందలి "శాస్తి" రాలేదు. పాపము బ్రద్దలుకాలేదు. భరతుఁడువచ్చి కైకను దూరి రాజ్యము వలదనుటలో విషాదనాటకము పరిపూర్తియైనది. కైకేయి ఖిన్నదనముతో నూరకున్నది! విషాదఫలము పరిపక్వమై రాలిపోవుటకు సిద్ధముగ నున్నది.

శత్రుఘ్నుఁ డీసమయమున క్షుద్రపాత్రమునకుఁ దగినశాస్తి చేయఁదలఁచినాఁడు. మంథరను చంపఁదలఁచి నాఁడు కాని భరతుఁడు వారించినాఁడు. అంతట నాతఁ డామె నొకతన్ను తన్నినాఁడు. పూర్వపు అభిమానము విడువ లేక కాఁబోలు కైకేయి తన పాపఫలము ననుభవించు కొఱకు అవమానమును భరించి, మంథరను కొంచె మూరడించినది. అంతటితో యీదుష్టగ్రహము వదలినది.

అప్పటినుండి మఱల కైక మారిపోయినది. వత్సరములు గతించినవి. రాముఁ డరణ్యావాసముచేసి వచ్చి నాఁడు. శ్రీరామునికిఁ గైకేయిపైనఁ గోపములేనేలేదు. ఆమె నిమిత్తమాత్రయని, రామాయణము దైవసంకల్పమని, మంథరయే దుర్మార్గురాలని యితఁ డెఱుఁగఁడా? అయోధ్యకు రాఁగనే, దశరథునంతిపురిఁజొచ్చి మువ్వురు తల్లులకును నమస్కరించి దీవన లందినాఁడు! కైకరాహుగ్రస్తమై వెలువడిన చంద్రబింబముపగిదియైనది.



# కపోతకథ

వేటూరి ప్రభాకర శాస్త్రి గారు

శ్రీ నిరంతరానంద నిశ్శ్రేయసార్థసాధకము సర్వకిల్బిషబాధకము స
ముగ్రవిజ్ఞానదము మహామహిమఘనము, శరణమగు మాకు సద్గురుచరణయుగము.

క. గురుచరణమ్ములకు నమస్కరణ మ్మొనరించి కవనకౌశల మొప్పన్
విరచించెద నొకకబ్బము, శరణాగతరక్షణప్రశంసాపరమున్.

క. త్రోవరిపిండు ముదంపడ, నీ వరిప్రాసంగుదొట్టి నెఱిగల సస్య
శ్రీ వరియించినదై గోదావరి దరి తెలుఁగుసీమ తనరారుఁ గదా!

శా. ఆ గోదావరితీరమందు నొకరాజ్యం బిప్పు డొప్పారు ల
క్ష్మీగేహం బనునట్లు, లందుఁ బ్రభువుల్ చెన్నారుచున్నారు స
ద్యోగుల్ భోగులు ధర్మతత్పరులు ధీరోదాత్తు లత్యుత్తముల్
ఱాఁగల్ గాక ప్రజల్ విధేయులయి యారాధింతు రాభూపులన్.

ఉ. తాతలనాఁటనుండి బహుధర్మపరాయణులై చెలంగు నా
భూతలనాథులం దిపుడుపొల్చు నృపాలకుఁ డుత్తమోత్తమ
ఖ్యాతి గడించెఁ బోష్యజనకల్పకమంచును బుణ్యకార్యచ
ర్యాతతబుద్ధియంచు శరణాగతరక్షకుఁడంచు నెల్లెడన్.

ఉ. పొంగఁడు రాజ్యవైభవముఁ బొందితినంచును బాపచింతకున్
లొంగఁడు సంపదభ్యుదయలోలుపతన్ వెతలందఁ డెన్నఁడున్

ప్రౌంగఁడు రాజ్యనిర్వహణరూపభరంబును మోయుపట్టునన్
భంగమెఱుంగనట్టి నరపాలురు తత్సము లెందు నుందురే.

శా. అదాయమ్మును మించినట్టివ్యయ మత్యాసన్నమైయుండ నే
దేదో సల్పుచునుండు నెల్లపుడు సత్కార్యంబు నత్యుత్తమా
హ్లాదంబందుచునుండు రాజ్యసుఖమం దాసక్తుఁడుగాఁడు తాఁ
దాదాత్మ్యంబున నొప్పు నెప్పుడు సముద్యద్ధర్మకర్మాప్తితోన్.

సీ. తనమాట జవదాట కనయమ్ము వినయమ్ము, గల్గి కొల్చెడు కులకాంతవలన
తనయిచ్ఛకును నచ్చఁదగునట్లు పనిపాట్లు, జరుపుచుండెడు భృత్యసమితివలన
తనకూర్మికిని నోర్మికిని మెచ్చి చనవిచ్చి, వేడ్కఁగూర్చెడు బంధువితతివలన
తనయుత్తమసువృత్తమును జూచి కడునోచి, తిని జీవితముఁ బుచ్చుజనమువలన
గీ. భూమిపాలనవ్యాపారభూరిభరము, సర్వ మలవోకవోలెను నిర్వహింపఁ
దగినదై యుండె నా మహీందయితునకును, దాన నెంద మధ్యాత్మతత్త్వమునఁ దగిలె.

సీ. వేలకువేలుగా వెచ్చపెట్టుచునుండు, బడులకంచును వేద్పుగుడులకంచు
మితిలేని ధనమిచ్చి మెచ్చించు సత్కవి, నాయకులను మంచిగాయకులను
ఎంతసొమ్మైన దానేయిచ్చు బహుజప, మంత్రమ్ములకు యజ్ఞతంత్రములకు
వేఁడినదెల్ల మారాడకుండ నొసంగు, నార్తులకును పుణ్యమూర్తులకును
గీ. మంత్రులును బంధుగులు నతిమానమైన, వ్యయముఁదలఁచియు నృపుసత్స్వభావమునకు
లోఁగియుండి మారాడక మూఁగలయిరి, వెచ్చపెట్టు టంతంతకు హెచ్చఁజొచ్చె.

ఉ. బాల్యమునుండి యాతనికిఁ బ్రాణసఖుండుగ నుండువాఁడు సౌ
శీల్యము గల్గువాఁ డొకఁడు చేరి నృపోత్తమ! రాజ్యమందుఁ బ్రా
బల్యముఁ గూర్పకుంట తగవా! మిముఁ బోంట్లకు; సర్వలోక వా
త్సల్యమునే జపించెదవు సంపద పెంపునుగూడఁ జూడవో!

క. శరణాగతరక్షణ మది, సరిగా దనఁగాదుగాని సర్వస్వము త
త్పరతనె వెచ్చించుట మఱి, సరిగా దనఁగా నొకింత సాహసి నగుదున్.

శా. దండం బండితులున్ గవుల్ కథకులున్ దత్త్వజ్ఞులున్ యాచకుల్
మెండై యుండుట మెచ్చఁగాఁ దగినదే మిత్రోత్తమా! యాయపుం
బండాలమ్మును జూచుకొంచు వ్యయముం బాటింపఁగాఁ జెల్లు శ్రీ
భాండాగారము పెంపు నింపవలదే పల్మాఱు భూపాలకుల్.

క. అడిగినవారల కెల్లన్, విడఁబడి యీయంగఁ దగునె? విబుధాచలముల్
బొడవడఁగదె బహుయాచక, విడంబనముచేత, నెఱుఁగవే మది నిదియున్.

గీ. అనుడు నాభూమిపతి సుస్మితాస్యుఁ డగుచుఁ, దన్నయనుంగు భుజంబుపైఁ దాఁకి యిట్లు
చెప్పఁగాఁ బూనె నెయ్యుఁడా! తప్పఁదలఁచి, నాఁడ వొక్కింత నాపల్కుజాడ వినుమ!

క. అజ్ఞానుఁడనై రాజ్య మ, వజ్ఞాపాత్రమగు నన్న భయ మెఱుఁగక నే
యజ్ఞములని వ్రతములనియు, పజ్ఞారహితముగఁ జేయ వాంఛించితినే!

వ. ఎఱుఁగవుగాక నీకొక్కరహస్యం బెఱిఁగించెద వినుము.

ఉ. మందులవంటి ధర్మముల మర్మముల న్బహుసత్కథాసుధా
స్యందమునందుఁ జొన్పి మును శాంతనవుం డల ధర్మరాజు కో
రం; దను వంపసెజ్జపయి రాల్పడుచున్నను శాంతచిత్తుఁడై
విందులు వెట్టినట్టు రసవిస్ఫురణంబునఁ జెప్పె నొప్పగాన్.

ఉ. అంచితధర్మనిర్మలరహస్యము లెయ్యవి ధర్మరాజుతోఁ
గొంచక చెప్పె భీష్ముఁ డవి గొప్పగ విప్పఁగఁజేసి వ్యాసుఁడా
పంచమవేదమై వెలయు భారతమం దలశాంతిపర్వమం
దుంచి రచించె నందుఁగల దొక్కకథానక మేను జెప్పెదన్.

గీ. సరసచతురబుద్ధి శాంతనవునివంటి, ధర్మవేత్త మత్పితామహుండు
బాల్యమందు నన్నుఁ బఠియింపఁజేసె నా, సర్వకథలు శాంతిపర్వమందు.

గీ. సర్వసమయములందు నాశాంతిపర్వ, కథలె మెదలుచునుండు నాకడుపులోన
ఏపనిని జేయఁబూనిన నెపుడు నాకు, నాకథలె ధర్మనిర్ణయ మాచరించు.

వ. అని యాప్రభూత్తముండు శాంతిపర్వగతమగుకత నొకదాని నిట్లాతనికి వినిపింపం దొడంగె.

సీ. కానల కేఁగి మృగవ్యూహములఁ బక్షి,గణములఁ జాల మారణమొనర్చి
కణఁకతో వానిఁ బట్టణములయందు వి,క్రయమొనర్చి ధనంబు గణనచేసి
చేయుచునుండెను జీవయాత్ర నొకండు, బోయండు వాఁడొక్కప్రొద్దు పెద్ద
సన్నాహమున వేఁట సాఁగింపఁగాఁ గాన,నంబునకును బయనంబు చేసె

గీ. జాగిలంబులు వలలును డేగ లుచ్చు,లురులు జిగురుఁగండెలు పెక్కుతెఱఁగులయిన
సాధనంబులు గైకొని సాయ మన్యుఁ, డొక్కరుండును లేకయే యుక్కుమిగిలి.

వ. అక్కడ.

చ. ఉరులిడె మ్రాల్లు వెట్టె వలలొగ్గెను డేగల నాకసంబునం
బరపెను గుక్కజట్టుఁ బసిపట్టగ విడ్చెను, బెక్కుయత్నముల్
జరిపెను గొన్ని తోయముల జంతువులన్ గ్రహియించె నంత నీ
శ్వరకరుణాతిరేకమునఁ గావలయున్ బెనుమార్పు లేర్పడెన్.

చ. చెఱచెఱ సూర్యరశ్మి కడుఁజెమ్మటలూరఁగఁజేసె వాయుసం
చరణము లేకపోయెఁ బెనుసంకట మయ్యెను భూతకోటికిన్
సరిగ నొకింతసేపదియు సైఁచుట బోయకుఁగూడ నెంతొ దు
ష్కర మనిపించె నాకసముచాయి వెసన్ వెసఁ గ్రొత్త లేర్పడెన్.

చ. చిటచిటలాడున త్తఱిని జేరెఁడు మచ్చగ నుత్తరంబు ది
క్తటమున మబ్బు గానఁబడెఁ దత్క్షణమే యది చేఁటయంతగా
స్ఫుటముగఁ దోఁచె నంతఁ బహుమూలల నాకసమెల్ల నచ్చట
చ్చటఁ జిఱుపెద్దతున్కలయి సాఁగెను మూఁగెను బెద్దమబ్బుగాన్.

ఉ. ఉక్కం గ్రుక్కలు గ్రీష్మకోఁ గుదుర కెంతొ కష్టమైయున్న పే
రిక్కట్టున్ దొలఁగింపఁ గార్మొయిళ్లు లెంతే నంబరాంతంబులన్
నెక్కఁగాఁ జలచల్లనై సుఖదమై నిండారి మెండారి యా
చక్కిన్ వాయువు వీవఁగాఁదొడఁగె దుస్తాపంబుఁ జల్లార్చుచున్.

ఉ. వీచెను హోరుగాలి వనవీథుల నిండిన పండుటాకులున్
లేచె నభస్స్థలంబును మలీమసమయ్యెను ధూళిరేఁగఁగాఁ
గాచిన వృక్షకాండములు గాయలు పండులు రాల్చెఁ బక్షులున్
గీచురటంచుఁ గూయఁదొడఁగెన్ మృగముల్ చెలరేఁగె నత్తఱిన్.

చ. చిటపటమంచుఁ బెద్దపెదచిన్కులు రాలఁ దొడంగెఁ గాఱు క
మ్మట యధికంబుగాఁదొడఁగె భూమియు నాకస మన్న భేద మం
తటఁ గనరాకపోయెఁ జకితద్యుతితోఁ జెలరేఁగె మించులున్
బెటిలు పెటిల్లుమంచుఁ బెనుపిడ్గులు రాలెను మిక్కుటంబుగాన్.

సీ. భూమిభాగము జలప్లుతమయ్యె నభమెల్ల, గాఢాంధకారమ్ము కమ్ముకొనియె
అంతరిక్షము భూమి సంకరించెడుమాడ్కి, సంతతధార గా సాగె నప్డు
హోరనుమ్రోఁత నిండారెను మిట్టును, బల్లంబు నేకమై వెల్లి వారె
చెలరేఁగె నీఁదురు చలి మిక్కుటంబయ్యె, మృగములు ఖగములు బెగడఁదొడఁగె

గీ. తెరపియేర్పడదయ్యె నత్తఱిని గలకుం,బోయ మదిగూడఁ గడుభయంబున మునింగె
అడవిలో నాతనికి నిల్వ నెడముగాన,గాకపోయెను బెద్దచీకాకు గదిరె.

గీ. అస్తమించెను సూర్యుండు కస్తిగూర్చు, వాన యెంతయుహెచ్చె నక్కానలోన
బోయఁ డాతండు మిట్టయిన భూమిచాయఁ, జక్క నెదిగిన యొక వనస్పతిని దరిసె.

గీ. వందలకొలంది యేండ్లకు ముందుఁ బుట్టి, ప్రబలి జొంపముల్ గదిరి కన్పట్టుచున్న
యాధరాజముఁ జేరి యావ్యాధుఁ డొదిగి,యుండె నాదండ నొక పెద్దబండమీఁద.

ఉ. "రాతిరి యయ్యె నిత్తఱి ధరాజముపై వసియించుచున్న యో
భూతములార! పెఱ భయము పుట్టెడు నెట్టులు మండుటాకటన్
సీతున నిల్తునో యిచట సేమమొసంగి యనుగ్రహింపుఁడీ!
యాతురునిన్ ననున్ గరుణ నాపదలేవియుఁ జూపకుండఁగన్."

వ. అని ప్రార్థించి యాబోయం డయ్యెడ నొదిగియుండె నప్పుడు.

ఉ ఆతరుకోటరాంతరమునందు వసించు కపోత మొక్కఁ డా
రాతిరివేళఁ బ్రేయసి తోడన్ దరియన్ జనుదేరకుండుటన్
జేతము భీతిపాలుపడి చేడ్పడ నేడ్చున గొంతు రాల్పడన్
గూఁతలు వెట్టెఁ బక్షులకుఁగూడ వియోగ మశక్యమేకదా!

"సీ. ఏల రాదయ్యెనో యిందాఁక నాసాధ్వి, గాఢాంధకారమ్ము గ్రమ్ముకొనియె
గాలెనో యెందేని గాలివానకుఁ దాళఁ,జాల నయ్యెడ నాదుతన్విఁ బాసి
కువకువలాడుచు గూటిలో నాచెక్క,చాటున శయనించు చానలేదె?
ననుఁబాసి తానెంత వనరుచున్నదియొకో, కటకటా! ప్రాణాన గలదొ లేదొ!
గీ. ఏమిసేయువాఁడ నెచట వెదకువాఁడ, నేమిచిక్కు నాకిఁకేమిదిక్కు
అదరుచుండె గుండె నిదురయు రాదయ్యె, నింపుమాలె నాదు కొంప గూలె.

సీ. ఎందున్నదానవో యెలనాఁగ నాయీగ, తిం దలంతువొ లేదొ తెలియరాదు!
నాకుఁగా నీవెంత యేఁకారుచుందువో, విందువో వినవొ నా విలపనంబు!
ఇల్లాల! నీవులేక కోటరపుగూఁటఁ, జేరి కాపుర మెట్లుచేయఁగలను!
జీవించి యొద్దైన నీవున్నదానవా, కానవా! నాదు దుఃఖంబు వెల్లు
గీ. ప్రేయసీ! యెందుఁబోతివే ప్రియునిఁబాసి, యోసి యర్ధాంగలక్ష్మి! యెట్లోర్తు నింక
సంకటమ్ముల సైరింపఁజాల భావి, జీవితము నాకు బరువయ్యెనే వధూటి!"

వ. అంచుఁ బలవించుచుండ.

గీ. బోయవలలోఁ దగుల్కొని పొగులుచున్న, యాఁడుపావుర మాపల్కుజాడలు విని
డెంద మానందమునఁ బొంది తందరింపఁ, దాను దనలోన నీమాడ్కిఁ దలఁచు కొనియె.

ఉ. "నెమ్మది నాపయింబ్రియము నిండి మగండు మదీయవిప్రయో
గమ్ము సహింపఁజాలక పొకాలుట వింటిని బుణ్యసాధ్వులం
దెమ్మెయిఁ బేరుఁగాంచితి బలే! బలె! భర్తకు నార్తిఁ గూర్చువెర్
కుమ్ములమారి పెండ్లముల కుత్సితపుంగతి దప్పి యొప్పితిన్."

శా. ఆనందంబున నట్లు లోఁదలఁచి యాయాఁడుంబులుం గాడు "నో
హో! నా భాగ్యమ! జీవితేశ్వర! యిదే యుంటిన్ వలం జిక్కితిన్
నీ నానెయ్యము తియ్యముల్ ముగిసెఁబో! నేఁడింక జంకాడినన్
గానన్ రాదు ప్రయోజనం, బెవనికో గర్మంబుఁ దప్పింపఁగన్,

చ. ముసురున ముగ్గి యీల్గెనని పొక్కకు మిక్కడ బోయవచ్చి పై
విసరె వలన్ దగుల్పడితి వెల్వడిరా నిఁక రాదు గాన నా
యుసురునుగూర్చి యాసవిడు మోయనుఁగుం జెలికాఁడ! నీ విటన్
వ్యసనము వీడి ధర్మపథమందుఁ జరించుట యుంచితంబగున్.

ఉ. అదరుచు భూరుహాంతికమునం దలబోయ వసించి చత్తునన్
బెదరున భూతకోటి నదె వెల్లుగఁ బ్రార్థనసేయుచున్న వాఁ
డడి వినియుండు వార్తు శరణాగతుఁ బ్రోచుట ధర్మమూట నో
సదయమతీ! వెతన్ విడిచి సల్పుము వానికి సత్సహాయమున్.

క. ఒడలెల్లఁదడిసె సీతున, గడగడవడఁకాడుచుండెఁ గావలయున్ బో
యఁడు వానికి నేమేఁ దో, డ్పడుమా, యపకారబుద్ధిఁ బరికింపకుమా!"

వ. అనుటయు.





# యెంకిపాటలు - స్వర్ణ యుగము

దశిక సూర్యప్రకాశరావు గారు

నూనూగు మీసములవాఁడు నాయుడు బావ. ఇతఁడు నాయకుఁడు. వ్యవసాయము కలదు. తోఁట, దొడ్డి, అరక, ఏతాము మొదలయినవి కలవు. స్వయముగా పాటుపడి పండించుకొనును. పట్టి అమాయకుఁడు. స్త్రీల నిదివరకు నెఱుఁగఁడు. కేవలము సత్యకాలపువాఁడు.

ఇఁక యెంకి. ఈమె శూద్రబాలిక. తెలివి గలది. కాని జిత్తు లెఱుఁగదు. మంచి అందకత్తె. నీతిమంతురాలు. పతిభక్తిపరాయణ. నాయుఁడుబావనే దైవముగాఁ దలంచునట్టి కాంత.

వీ రిరువురును యెంకిపాటలలోని పాత్రలు. బాల్య యౌవనులు. కృషీవలులు. సుఖజీవులు. ఏకపత్నీవ్రతుఁ డొకవంక, పతిభక్తిపరవశురా లొకవంక. వీ రిరువురికిఁ గల ప్రేమ శాశ్వతానందరసానుభవమగు ప్రేమ—ఆత్మానందకరమగు ప్రేమ—హృదయతంత్రుల చేత మాత్రమే తెలిసికొనఁదగినట్టి ప్రేమ—పరస్పరైక్యమును గనఁబఱచునట్టి ప్రేమ—'యెంకిపాటల' నిండ సంపూర్ణముగా నిండి తొలఁకుచున్నది. అది నవయౌవనులకును రసికులకును మాత్రము గ్రాహ్యము. ఇతరులకు మృగ్యము. నూతనదంపతుల ప్రేమావేశమును, భావోద్రేకమును మానవస్వభావమున కనుగుణముగా నూతనముగాఁ దొలకరించిన స్వర్ణయుగపు మెఱుఁగులతో పాఠకజనరంజకముగాఁ, బండితుల కాహ్లాదకరముగా విందొనఁగూర్చెడు కవిత యెంకిపాటలనుండి తొలఁకుచున్నది. ఆ ముద్దుపలుకుల మాధుర్యము, ఆ కృషీవలదంపతుల నిరుపమానమగు ప్రేమ, ఆ స్వాభావిక వర్ణనల ఔచిత్యము, అతిమనోహరములు. అందుచే 'యెంకిపాటలు' పూర్వపురచనల కంటె వింతయందమును నూతనప్రకాశమును వెలిగ్రక్కుచున్నవి. ఆయందము, ఆ నూతన ప్రకాశము స్వర్ణయుగపువాఙ్మయచిహ్నాలు.

స్వాతంత్ర్యగీతానాదమే స్వర్ణయుగమునకుఁ బ్రాణభూతము. స్వర్ణయుగమును ఆంగ్లేయవాఙ్మయమున 'Romantic Period' అందురు. ఆకాలపుకళ స్వర్ణయుగపుకళ యందురు. స్వర్ణయుగపురచనలు స్వతంత్రములు. అనఁగా భాషాంతరీకరణము లుండవని కాదు. పోకడలు స్వతంత్రములు. భావములు స్వతంత్రములు. భావము పరితప్తమయి, రసము జాలువాఱినపుడే కవిత మూర్తీభవించును. స్వర్ణయుగపుకవిత యిట్టిది. కళ యిట్టిది. పరాధీనత

ఉండదు. సృష్టిచిత్రములు, ఇంద్రియగ్రాహ్యత్వజ్ఞానము, మానవస్వాభావికపరిణామములు, పాటక కృషీవలుల వాతావరణము, గీతానాదముల స్పర్శజ్ఞానము, వర్ణన సౌలభ్యము, సంచలన ప్రతినులను నేత్రములయెదుట ప్రదర్శించుట, నిశ్చలకార్యమునందలి అపూర్వ బోధ, శైలి, మాధుర్యము, భావసంపద ఇవి స్వర్ణయుగపు వాఙ్మయలక్షణములు.

అట్టి లక్షణములు "యెంకిపాటల"యందు స్ఫుటముగా గోచరించుచున్నవి. యెంకిపాటలలో స్వర్ణయుగపు లక్షణముల మనవి చేసెదను.

మొదట యెంకి పాటలలోని పాత్రలను గైకొందము. నాయుడుబావ, యెంకి, వీరు మన కాలపు అమాయకులగు పాటక జనమువలె నున్నారుగాని, దోషరహితులగు అసాధారణులగు వ్యక్తులవలె లేరు. ఎక్కడనో ఒక్క ప్రవరాఖ్యుఁడున్నాఁడనఁగా ఆ మహానుభావునివంటివానిని మన మెక్కడను జూచియుండము. వరూధిని యెదుటఁబడి మోహము వెళ్లఁబుచ్చినపుడు, పైఁబడినపుడు నిశ్చలుఁడైన ప్రవరాఖ్యునివంటి లోకాతీతులు తల్లినిగూర్చియు, తండ్రినిగూర్చియు, భార్యను గూర్చియు విలపించుట మానసిక వైరాగ్యసంపన్నులపట్ల కొంచెము అసంభవముగ గన్పట్టక మానదు. అట్టి మానవస్వభావ దూరములైన విషయములు మననాయుడుబావపట్ల గానము. ఇతనికి అన్ని ఆవేశములు గలవు. అన్ని కోరికలు గలవు. అన్ని లోపములుగలవు. ఇతఁడు మానవుఁడు. అందుచే మన స్వభావమునకు దగ్గరవాఁడు. గనుక ప్రేమపాత్రుఁడు. యెంకియు అట్టిదే.

నాయుడుబావకు యెంకిపైగల ప్రేమ పారము లేనిది. యెంకి కళ్లెత్తితేచాలు, "కనకాభిషేకాలు" గురియుచుండును. యెంకి యొక్క—

"వాక్కానవ్వే యేలు
వొజ్జిర వొయిడూరాలు."

రాల్చుచుండును. యెంకి,

"పదమూ పాడిందంటె
పాపాలు పోవాల;
కతలూ సెప్పిందంటె
కలకాలముండాల"

నాయుడుబావ "గుండె నమలిమింగిన పిల్ల" యెంకి. ఇదివరకు వనితయన నేమో యెఱుఁగని నాయుడుబావకు యెంకి దొరకినది. అతనికి ప్రేమరసము పొంగి పొరలఁ జొచ్చినది. నాయుడుబావ గీతములన్నిటిలోను ఈప్రేమరసమే నిండి తొలఁకుచుండును. ఈ గీతము చూడుఁడు:

1. జాము రేతిరియేళ
జడుపుగిడుపూ మాని
సెట్టుపుట్టాదాటి
సేనులో నేనుంటె
మెల్లంగవస్తాది నాయెంకి
సల్లంగ వస్తాది నాయెంకి

2. పచ్చన్ని సేలోకి
పండుయెన్నెల్లోన
నీలిసీరా గట్టి
నీటు గొస్తావుంటె

వొయ్యార మొలికించు నాయెంకి
వొనలచ్చి మనిపించు నాయెంకి.

ఓహో! ఆ దంపతుల ప్రేమానందము నిరుపమానము. నాయుడు బావ నూత్నయావనుఁ డగుటచే యెంకితోఁగలసి తీర్థయాత్రలు సేవించుట అతనికి మిక్కిలి సంతోషము.

"గోదారి గంగలో
కొంగుకొంగూ గట్టి
కరువుదీరా బుటక లేతామా
సరి గెంగతానాలు సేతామా"

"సంబరము కెదురుంగ
జంటగా నిలుసుండి
సామివోరికి దణ్ణ మెడదామా
సాపసుట్టుగ నేలబడదామా"

నాయుడు బావ పూర్వకాలపు వాఁడు. కనుక పూర్వకాలపు కోరికలు. మహానుభావుఁడు. నాయుడుబావకు యెంకే పరదైవతము.

"యేతాము కెదురుంగ
యెంకుంటె సాలు
వొంటరిగ సిటికేసి
కుంట కలిపేను"

నూతనవరుని ప్రేమ పరిపూర్ణము లగు చిహ్నాలన్నియునాయుడుబావయందు మూర్తీభవించియున్నవి. అతని ప్రణయకలహగీతము లందు సయితము తనకుఁగల అనిర్వాచ్యమగు ప్రేమశక్తి గోచరించుచుండును. మహానుభావుఁడు. యెంకి చక్కనిది, తెలివైనది.

"నాకాసి సూస్తాది
నవ్వు నవ్విస్తాది
యెల్లి మాటాడిస్తె
యిసిరి కొడతాదీ"

ప్రణయ సరసములు, ముగ్ధలకు సయితము సహజము కాఁబోలు. నాయుడుబావ "నీడలోన మేడగట్టుకొన్న పడతియెంకి" ఒక్క నిముసమయినను విడిచియుండలేదు. నాయుడు బావకొఱకు అర్ధరాత్రి చేలోకిపోవును. ఏతా మెత్తుచుండ ఎదురుగ కూర్చుండును. పూలు పుణుకుకొనుచు, గుడికి దణ్ణము పెట్టుకొనుచు, పూలబూర వాయించుచు నాయుడుబావకు పాలు, పూలు తెచ్చియిచ్చుచుండును. అతనిని విడిచి ఒక్క నిముస ముండదు. వియోగగీతము చిత్తగింపుడు.

"నన్నిడిసిపెట్టెల్లినాడే, నారాజు
మొన్న తిరిగొస్తనన్నాడే
నీతైనవోడె, నా
రాతెట్టగుంటాదొ?
కళ్లల్లొసత్తిముగ
కట్టినం టుంటాడె. న."

యెంకి నాయుడుబావలకు గల పరస్పరానుబంధము లెంత దృఢమయినవో

"యెనకజల్మములోన, యెవరమోనంటె"
అని నాయుడుబావ అనగానే

"సిగ్గొచ్చినవ్వింది,సిలకనాయెంకి" మనోహరము. మనోహరము. ఇందలి నిశ్చలకార్యమునందలి అపూర్వబోధ, స్ఫుటత్వము చూచితిరా! ఆ సిగ్గులో, ఆనవ్వులో ఎంత అర్థమున్నదో యూహింపుడు.

యెంకి,నాయుడుబావలను జూపించి, అభినవదంపతుల భావావేశము లివియని, ప్రేమ

పరిపూర్ణత యిట్టిదని యింతనిండుగాఁ జూపిన కవులు ధన్యులు. అది పాత్రలవిషయమై.

నిశ్చలకార్యముయొక్క స్ఫుటత్వముమనవి చేసితిని. ఇట్టివి స్వర్ణయుగపు కళచిహ్నాలు.

ఏతాము ఎత్తుట, పచ్చని చేలోకి అర్ధ రాత్రిపోవుట, తోటప్రస్తావన, కుంటకలుపుట మొదలగు వ్యవసాయకవిషయములు, హృదయానందకరములుగాను, విశ్రాంతి కరములుగాను, (Relaxation) ఉండును. ఇవి స్వర్ణయుగపు కళాచిహ్నాలు.

నాయికానాయకుల ప్రేమపరిణామ దశలు సంయోగవియోగముల స్వభావాను గుణమగు రచన స్వర్ణయుగపు కళ.

"ఘల్లుమని మెంకివచ్చుట" మొదలగునవి ఇంద్రియగ్రాహ్యత్వ (Sensuous) లక్షణములు. శైలి ఉచితము. వ్యవహారిక భాషయందు ఇంత ప్రవీణత చూపుట సుకృతము.

మెంకిపాటలు భావసౌభాగ్యమునం దేమి పాత్రపోషణయం దేమి, రచనా సౌకుమార్యమం దేమి, పామరజీవితమును హృదయానందకరముగఁ జిత్రించుటయం దేమి, మిక్కిలి ప్రావీణ్యమునుగని స్వర్ణయుగమున కమూల్యాలంకారములై విలసిల్లుచున్నవి. ఇట్టిరచనకుఁ బూనుకొన్న శ్రీపంతులుగారు ధన్యులు.



# పూర్ణిమ

గరిగిపాటి రామమూర్తి గారు

విబుధులెల్లరు నన్ను విడిచిపోయినను
హితులందఱును నన్ను సేవగించినను
నాప్రేమభాగ్యంపు నవ్వువెన్నెలలు
నాపైన బ్రసరింప నా కేటిభయము ?
కులమువా రెల్లరు వెలి వేయనిమ్ము
తులలేని సంపదల్ తొలగి పోనిమ్ము
నాప్రేమధామంపు నవ్వువెన్నెలలు
నాపైన బ్రసరింప నా కేటికొదువ ?
పూర్ణిమాచంద్రుండు పొడసూపగానె
ఉదధి సంతసముతో నుప్పొంగి, భువిని
నీరంబుతోడను నింపున ట్లేను
అఖిలయువజనచిత్తాంబుజంబులను
ప్రణయగానముతోడ బంధించివైతు.

# కవికి భాగ్యమేల?

శ్రీ శేషాద్రి రమణ కవులు

మలకపై తలక్రిందుగా మలల నుండి
సారెసారెకు సెలయేళ్లు పాఱుచుండు
శాంత రంగస్థలంబైన శైలభూమి
కవికిఁ బ్రజన్మమునయందుఁ గలుగుఁగాత.

మంచుముత్యాలు తలపై ధరించియున్న
గఱికిపోఁచలు గాలికిఁ గదలుచుండ
సహజసుందరముగ నొప్పు శాద్వలంబు
కవులదృగ్వీథికలముందుఁ గ్రాలుఁగాత.

వాన గురిసినపిమ్మట వరుసఁ దేరి
చనుచునుండిన మేఘరాజముల నంటి
యింపుగాఁ బ్రజ్వరిల్లెడియెండ వెల్గు
కవికి విజ్ఞానగీతికఁ గఱపుఁగాత.

శశి నుదాసించు సెలయేటిజాళ్ల యందు
విరియఁబూచిన మోదుగవిరుల సొబగు
గనుఁగొనఁగవచ్చు సాంధ్యరాగ ప్రశస్తి
కవి మనోవీథి నించుతఁ గౌశలంబు.

కటికిచీఁకటిలోనున్న కాఱుమొగులు
వెడలు క్రొక్కాఱు మెఱుపుల వెలుఁగువలన
గాననంబునఁ బూయు బంగారుపూఁత
నెలయుఁగావుతఁ గవిమనోవీథియందు.

అంబుదంబులు మిన్నెల్ల నాక్రమించి
కాఱుకొను నెండవెలుఁగులఁ గన్నబ్రేమ
సంతలోఁ దోఁచు నుదయరాగాతిశయము
పాటఁగావుతఁ గవికి సుస్వాగతంబు.

మర్మమెఱుఁగని బాలకుమధురవాక్కు
సిగ్గుఁ దెలియని బాలికచిఱుతనగవు
భయము గ్రహియింపలేని శాబకుని యేడ్పు
పాడుకొనుఁగాత సుకవి భావస్థలమున.

అతులగోదావరీపులినాంచలముల
జంపుగానున్న పైరుపచ్చలను గాయు
కాపుకొమిరె మనోహరకలరవమున
సలుపుగానంబు కవిమది నిలుచుఁగాత.

లలితగోదావరీకుశాంచలము లందు
విరియఁబూచిన పూఁతతో విందొనర్ప
తరలి పరతెంచు నుదయ సంధ్యాకుమారి
ఒసఁగుగావుతఁ గవికి నేత్రోత్సవంబు.

తొగరు చివురుల యెలమావితోఁటకెలన
లలితకలహంసయుతమైన కొలఁకుకెలన
రమ్యతరమైన సృష్టిచిత్రంబు గాంచు
కవికిఁ బ్రకృతికుమారి స్వాగత మొసఁగుత!

రమ్యశారదపూర్ణిమారాత్రులందు
తఱపివెన్నెలచే దిగంతరము లొందు
నూత్నశోభావిలాసదంతురము లరయు
కవికిఁ జంద్రిక గఱపుతఁ గౌతుకంబు.

* * * *

పరమశోభాభిరామమహా ప్రకృతిలక్ష్మి
కవికుమారునిఁ దనదునంకమునఁ జేర్చి
భువనసౌందర్యమును జూపఁ బూనునేని
కవికి భాగ్యంబులేల, సౌఖ్యంబులేల.




శ్రీ కోమాండూరి కృష్ణమాచార్యులు గారు [సాహితీసమితి]

(వెనుకటి సంచిక తరువాయి)

3

[భాగీరథీతీరవనప్రదేశము: రురుఁడు, ప్రమద్వర ప్రవేశము]

రురుఁడు

వేదచోదిత కర్మాంగ విధు లొనర్చ
ఐహికాముష్మికసుఖంబు లనుభవింప
భవమహార్ణవము తుదాఁటఁ బద్మభవుఁడు
భార్యయనునావఁ గల్పించి వంద్యుఁడయ్యె.

ప్రమద్వర

ఆర్యపుత్రా, మన కుటీరము వెనుకనున్న సాల వృక్షముపైని పారావతమిథునమును మీకుఁ బలుమాఱు చూపియుంటిని. జ్ఞాపకమున్నదా?

రురుఁడు

జ్ఞాపక ముండ కేమి? ప్రతిదినమును మనము వానికొఱకు నీవారధాన్యమును జల్లుచుంటిమి గదా?

ప్రమద్వర

వానిలో నాఁడు పక్షిని నీయపరాహ్ణమున నేను గన్నులారఁ జూచుచుండ, డేఁగ తన్నుకొని పోయెను! తరువాత, మగపులుఁగువచ్చి గూఁటి యందాఁడుపిట్టనుగానక వృక్షశాఖల యందు వలయాకారముగఁ దిరుగుచు జాలసే పతికరుణముగ నఱచుచు చుండెను. అది చూచినప్పటి నుండియు నాహృదయ మత్యంతవ్యాకులముగ నున్నది.

రురుఁడు

పాప, మవి మనయాశ్రమవృక్షమూలముల యందలి నీరుద్రావి, మనమొసఁగు నీవార ధాన్యబలులను దిని బ్రదుకుచుండెను.

ప్రమద్వర

మనయట్టి తాపసమిథునములకుఁ గూడ నట్లే కాలాంతరమున వియోగము సంభవించు నేమో, యెవ రెఱుఁగుదురు.

రురుఁడు

మన మెవరి కపకార మొనర్చితిమి?

ప్రమద్వర

పాప, మా పారావతమిథునముమాత్ర మా డేగ కొనర్చిన యపకార మేమి?

రురుఁడు

వానికి సహజవైరము గలదు.

ప్రమద్వర

ప్రాణులకు మృత్యువుగూడ సహజవైరియే కదా!

రురుఁడు

[విచారముతో] పరమసాధులమై,కందమూల ఫలాశనముచే నుదరపోషణము చేసికొనుచు 'ఆత్మవత్సర్వభూతాని' యను న్యాయమున సంచరించు మనకుఁగూడ నపమృత్యుభయ మున కవకాశ ముండునా ?

ప్రమద్వర

ఏమో ?

రురుఁడు

సాంద్రసౌహార్ద్రమునకు నాస్పదములయిన
హృదయముల దుఃఖబీజంబు లేలచల్లె
దమృత కిరణోదయంబయ్యె నమలగాంగఁ
పులినముల విశ్రమింపఁ బూఁబోణి, రమ్ము!

[అని ముందునకు నడిచి] ఈ మల్లికాకుసుమ ములనుగోసి నీ శిఖయం దలంకరింతును గాని రమ్ము.

ప్రమద్వర

ఈమల్లికాకుసుమములు ధావళ్యమునఁ జంద్రి కల నపహసించుచున్నవి.

రురుఁడు

ఈమల్లికాలత పర్ణములు గానరాకుండఁ బుష్పించినది. కుసుమాపచయ మొనరింతము గాని రమ్ము [కుసుమాపచయము నభినయిం చును.]

ప్రమద్వర

ఆర్యపుత్రా, ఇదియంతయు వనదేవత యగు వాసంతిక యనుగ్రహము. మీరుగోసినపుష్ప ములు నాకిండు, దండగ్రుచ్చుచుందును. [అట్లుచేయుదురు]

రురుఁడు

[పూలదండను జేతికిఁ దీసికొని] దీనిని నీ శిఖ యందు నేనే యలంకరింతును. [అట్లుచేయును.]

ప్రమద్వర

ఆర్యపుత్రులు నాకుఁగూడ నిట్టి స్వాతంత్ర్యము నను గ్రహింప చంపకమాలికచే మీ కంఠము నలంకరించెదను [అని చంపక కుసుమములను గోయుచుండును.]

రురుఁడు

[శాఖలుకదలుట నిరూపించి] నీయాననపద్మ మున విహరించు నేత్రమధుకరములఁ జూచి యీచంపకపుష్పము లెట్లు సంచరించుచున్న వో చూడుము.

ప్రమద్వర

[సర్పదష్టయై హీనస్వరముతో] ఆర్యపుత్రా, ఈమాలికచే మీకంఠము నలంకరించి చూచు భాగ్య మీ దీనురాలికి లేదు! [అని నేలపై కొరగును.]

రురుఁడు

[ససంభ్రముగసమీపించి ప్రమద్వరను బాహు వులతోఁ బట్టుకొని వృశ్చికమును నిరూపించి] హా! ప్రేయసీ! కాలసర్పము! కాలపాశము! మృత్యువు! [ఇరువురును నేలపైఁ జదికిలఁ బడుదురు]

ప్రమద్వర

[హీనస్వరముతో] ఆర్యపుత్రా, వివాహమై రెండుమాసములు కాలేదు. కన్నులారా, మీప్రేమరాశిని గడసారిచూడుఁడు! చేతు లారా, మీకల్పభూరుహమును గడసారి

కౌఁగిలింపుఁడు! అధరమా, అమృతపాన
మొసర్పుము–జీవితాశకలుగునేమో!

వనితాచకోర మెవ్వతె భవన్ముఖచంద్ర
పీయూషధార సంప్రీతయగునో?
ముగ్ధ యెవ్వతె భవద్భుజవప్రగుప్తిచే
విషమాస్త్రుఁ జాటుగావిలిచికొనునో?
అతివయెవ్వతెతుషారాద్రిపై మిముఁగూడి
కౌముదీయామినుల్ గడపఁగలదో?
పడఁతి యెవ్వతె దివ్యభాగీరథీపయః
కేళి మీతోఁ గూడఁ దేలఁగలదో?
అకట, మత్పాణిసంవర్ధితాశ్రమాంత
భూరుహవ్రాత మెవ్వతెఁ బొందునొక్కొ–?
హరిణశాబక మేగతియగునో? నేను
వ్యాళవిషవహ్ని నసువులఁ బాసినంత!

నాహృదయమునం దెన్నిభావములు. కన్నులు
దెరువరాకున్నవి–స్మృతిదప్పుచున్నది–వియో
గము! వియోగము! దుర్భరము.........

రురుఁడు

[ప్రమద్వర శిరమును దన తొడపై నిడుకొని
ముఖముపై దృష్టినిలిపి దుఃఖముతో]

కాంతముఖమున ఘర్మాంబుకణములింక
నారఁగాలేదు పెదవులనలఁతి నవ్వు
వాడిపోవదు ననుఁబాసి వారిజాక్షి
యపుడె లోకాంతరంబున కరిగెనకట!

తరుణి, తావక చికురబంధమున నేను
కోరిముడిచిన మల్లికా కుసుమమాల
బాల, నీకయ్యె నిపుడు నివాపమాల్య
మకట! విధియెట్లువంచించె నాటవికుల!

తరుణపల్లవ సంస్తర తలములందు
మేను జేర్చిన వసివాడు మృదులగాత్రి
వెట్టులోర్తువో వచియింపు మిందు వదన,
కఠినచిత్యధిరోహణకార్య మకట!

స్థావరజంగమాత్మకమైన విశ్వంబు
నాపాలి కిపుడు శూన్యంబకాదె,
ఫలభూరుహాకీర్ణ పాదపాశ్రమభూమి
దగ్ధఘోరారణ్యతలముగాదె,
చకితైణలోచన చాంచల్యములు నాకు
దారుణబాణసంతతులు గావె,
మధుమాసయామినీ మధురచంద్రిక లిప్డు
ప్రళయార్క–దుస్సహ ప్రభలుగావె,
ధైర్యకవచంబు నేఁటితో ధ్వంసమయ్యె
జీవితాశలు నేఁటితో జీర్ణమయ్యె
సౌఖ్య మీనాఁటితో దుఃఖజలధి మునిఁగె
భస్మమయ్యెను రురుతపఃఫలము నేఁడు!

హా! ప్రమద్వరా! [అని మూర్ఛిల్లును]

## ౪

[భాగీరథీపరిసరారణ్యము : రురుఁ డున్మత్తవేష
ముతోఁ బ్రవేశించును]

చకితకురంగచంచలవి
శాలదృగంచలసీమలందు నీ
వికసితనేత్రపద్మముల
బింబఫలం దధరోష్ఠసంపదల్
ప్రకటనటన్మయూరఘన
బర్హభరంబుల నీదుకైశికం
బకట, స్మరింతుఁ గాన భవ
దాకృతి యొక్క–పదార్థమం దిలన్.
యువతి, ప్రమద్వరా, నవన
వోత్పలపత్రవిశాలనేత్ర యం
చవిరళశోకగద్గదర
వారభటి న్నినుఁ బిల్వ నక్కటా

శ్రవణయుగంబు వ్రయ్య హిమ
  శైలబిలప్రతిశబ్దముల్ మనం
బవియఁగఁజేయు నీహృదయ
  హారివచస్సుధ లేదుగ్రోలఁగన్ !

పడఁతీ, స్వప్నసమాగమంబులభవ
  ద్బాహాపరీరంభమం
బడయన్ శూన్యతలప్రసారితభుజా
  ద్వంద్వుండనైయున్న నా
యడియాసం గనివృక్షషండములు నీ
  హారాంబుబాష్పంబులన్
బుడమిన్ రాల్చు శిలల్ గరంగు ఖగముల్
  పూబోఁడి, వాపోయెడున్.

ఆహా! ఏమిశైత్యము! ఈ జగత్ప్రాణుఁడు నాశరీరమున కమృతప్రాయుఁ డయినాఁడు. ఈ యగ్నిమిత్రునియం దిట్టి శైత్య ముండుటకుఁ గారణమేమి? ప్రమద్వర ప్రాణవాయువు లీతని యం దున్నవి. ఈసౌరభ్య మెచటిది? ప్రమద్వర ముఖమారుతమునందలిట. ఈ మాంద్య మెచటిది? ప్రమద్వర గమనమునందలిది. ఈ శైత్య మెచటిది? ప్రమద్వర కుచకలశముల యందలిది. ప్రమద్వర వాయు రూపముతో నీవనమున విహరించుచున్నది. ఈ వాయువే ప్రమద్వర. [అని వాయువు నాలింగనముచేసి కొనుచున్నాఁడు.] ఏదీ ప్రమద్వర? ఆ! తెలిసినది. వాయుహాతకుఁడు ప్రమద్వర యందలి శైత్యమాంద్య సౌరభ్యముల నపహరించుటకై నన్ను వంచించి ప్రేయసిని హరించినాఁడు. [కోపముతో] మారుతహాతకా!రురుని కోపాగ్నికింధనమ వయ్యెదవు సుమా! నీవు నిర్మూలమగునట్లు శపించెదను. [అని భాగీరథిని సమీపించి జలము నంజలిచే గ్రహించి] శపించిన లోకము నాశనమగునేమో? ప్రమద్వర లేనిలోకము నాశనమైన నేమి? [అని శాపోదకమును వదలఁబోవును. వాయువు బ్రాహ్మణ వేషముతోఁ బ్రవేశించి]

వాయుదేవుఁడు

భార్గవమునీంద్రా, నిష్కారణ మీజగత్ప్రాణునిపై నలుగనేల ?

రురుఁడు

ఈబ్రహ్మబంధుఁడు ప్రమద్వర నపహరించెను.

బ్రాహ్మణుఁడు

మునికుమారా, ప్రమద్వరను హరించినది వాయుభట్టారకుఁడా ? నీవే యోజింపుము.

రురుఁడు

[సిగ్గునఁ దలవంచుకొనును]

బ్రాహ్మణుఁడు

మునీంద్రా, ఊరడిల్లుము. ప్రాణులకు మృత్యు వనివార్యము.

రురుఁడు

బ్రాహ్మణోత్తమా ! ప్రమద్వరను బడయు నుపాయము చెప్పఁగలవా ? [వాయువదృశ్యుఁడగును]

రురుఁడు

ప్రమద్వరా, ప్రమద్వరా !

[హిమాచలకందరములు ప్రతిధ్వనించును]

అదిగో ప్రమద్వర ! పల్లవారుణకోమలము లగు నంగుళులచే నన్నుఁబిలుచుచున్నది. [అని వేగముగ నొక లతను సమీపించును]

[వాసంతిక ప్రవేశించి] కుమారా! శాంతిం పుము.

రురుఁడు

[స్వగతము] ప్రమద్వర సఖియగు వాసంతిక. [అని సిగ్గుతోఁ బ్రకాశముగా] వాసంతికా, ఈ యున్మత్తుని క్షమింపుము.

వాసంతిక

భార్గవా, చ్యవనమహర్షి పౌత్త్రుఁడ వగు నీ కిట్టి పామరత్వము తగదు. [తనలో] నే నీ కుమారుని దుఃఖమును జూడఁజాలను అని అదృశ్యమగును.

రురుఁడు

[ఆకసమునంకఁ జూచి] మధ్యాహ్నమయినది. సాంధ్యకృత్యముల నిర్వర్తింపవలయును [అని భాగీరథిని సమీపించును. తీరమునసున్న రాజ హంస మొకటి రురునిఁజూచి నీటిలోనికిఁ బరు గెత్తును.]

రురుఁడు

[సంభ్రమముతో] ప్రమద్వరా, నన్నుఁజూచి పరుగెత్తకుము. నేను నిన్నుఁ గనుఁగొంటినిలే. జలములోని కేఁగకుము. లోఁతు! లోఁతు! శతతాళదఘ్నము! [హంసమునుఁగుచున్న] హా! ప్రమద్వర మునిఁగినది! అవి బేడిస చేపలుగావు. ప్రమద్వర భయచంచలలోచన ములచే నన్నుఁజూచుచు సాహాయ్యము నపే క్షించుచున్నది. ప్రమద్వరా, భయము లేదు. పాతాళమున కేఁగినను రురుఁడు నిన్ను సంర క్షించును. వచ్చుచున్నాఁడు. ప్రమద్వరా! భాగీరథీ!

[అని పరుగెత్తి జలమధ్యమున దుముకును స్త్రీరూపముతో భాగీరథి రురునితోఁ గూడఁ ప్రవేశించును]

భాగీరథి

వత్సా, నీకిట్టిసాహసము తగదు!

రురుఁడు

జననీ, ప్రమద్వరను జూపుము.

భాగీరథి

వత్సా,మృతిఁజెందిన ప్రమద్వర నెట్లు చూపు దును? వనదేవతయగు వాసంతిక ప్రమద్వర దేహమును హిమాచలమునందలి జ్యోతిర్లతా కందరమున గుప్తముచేసినది. జ్యోతిర్లతా మరీచికలు ప్రసరించినంతకాలమును ప్రమ ద్వరశరీరము మరణోచితవికారములు లేక సర్వలక్షణలక్షితమై జీవమాత్రశూన్యమై యుండును. కోరినపుడెల్ల నీవు చూడవచ్చును.

రురుఁడు

జీవములేని ప్రియురాలి నీనిర్భాగ్యుఁడు చూడఁ జాలఁడు!

భాగీరథి

మఱొక్క దివ్యాంగనను బెండ్లియాడఁగోరుదు వేని, మహానటుని తాండవ సమయమునఁ గైలాసశిఖరమునకు రమ్ము. నీ యిచ్చవచ్చిన యచ్చరకన్నియ నేరికొనవచ్చును.

రురుఁడు

[చెవులు మూసికొని] శాంతం పాపమ్!

భాగీరథి

కుమారా! నీకు శుభమగుఁగాక! నేను బోయి వచ్చెదను. [నిష్క్రమించును]

రురుఁడు

[ఒక మావిగున్న నుజూచి] ఆచూతవృక్షము పై మన్మథుఁ డున్నట్లున్నది. అతఁడు చచ్చి బ్రతికినవాఁడు. ప్రమద్వర జీవనోపాయ ముప దేశించు నేమో [అని సమీపించి] కుసుమ సాయకా, ఆ! ఏమది! అతిథినగు నన్నర్ఘ్యపా ద్యాది విధులచేఁ బూజించుటకు మాఱు భ్రమరఝంకార మిషంబున ధనుష్టంకార మొన రించుచున్నావు? కామచండాల! నిర్ఘృణ! బ్రాహ్మణులపైనా నీశస్త్రము? మద్వంశీయుఁ డగు భార్గవరామునికుఠారధారానైశిత్యమును మఱచితివా యేమి? రురుని కోపాగ్నిజ్వాలల ముందర ఫాలాక్షుని నేత్రవహ్నులు నీ హార తుల్యముసుమా! శరణు చొచ్చుటకు మారు చూతసాయకము నెక్కుడుచున్నావుగా! ఇదిగో బ్రహ్మదండహతిచే నీచూతసాయకము భగ్నమైనది [అని దండముచే మావిగుత్తిని గొట్టును. అది విఱిగి పడును.]

రురుఁడు

[పూలగుత్తిని దీసికొని] ప్రమద్వరా! దీనిని నీశిఖపై నలంకరింతును గాని రమ్ము! [అని దానినొకలతపైనుంచి] కల్యాణీ, ఈ నూతనా లంకారముచే మిక్కిలి శోభించుచున్నావు. [అని లత నాలింగనము చేసికొనును. లతమ్లాన మగును] హా, ప్రమద్వర సర్పదష్ట యైనది! అదిగో కాలవ్యాళము. [దండముచే నొకతీగను గొట్టి చేత నందుకొని] దూరమున నొక వల్మీక మున్నట్లున్నది. [దానిని సమీపించి] ప్రమద్వరప్రాణముల నపహరించిన దుష్టభుజగ మిందున్నది. సర్పప్రళయము సేయవలయును. పూర్వము గురుండగు భార్గవుఁడు త్రేతాద్వా పరసంధి నేకవింశతివారములు భూప్రదక్షిణ మొనర్చి నిఖిలరాజలోకమస్తకంబులు కుఠార ధారల కెరసేయలేదా? పైలశిష్యుం డగు నుదంకుం డొక్కతక్షకుం డొనర్చిన యపరా ధంబున జనమేజయునిచే సర్పసత్రము సేయింప లేదా? నేనుమాత్ర మట్లేల సేయరాదు? నాగకులమును ధ్వంసము సేయుదనుక రురుని శోకాగ్ని శాంతింపదు. పాతాళమా, సంక్షో భింపుము! వాసుకీ, నీకు మరణము తప్పదు! తక్షకా, ఈమారు చింతామణిభద్రపీఠము నిన్నురక్షింపదు! కాద్రవేయులారా, మీకు జీవితాశలేదు! రురుఁడు దండహస్తుఁడై వచ్చు చున్నాఁడు. అదిగో సర్పము, కాలసర్పము! [అని యొకపామును వెంటనంటి పరుగెత్తి కొట్టుటకై దండము నెత్తును]

సర్పము

[మనుష్యభాషణములతో] కుమారా, నిష్కా రణము నాపైనలుగనేల? నే ననపరాధిని. విషోరగంబును గాను, నిర్వీర్యంబగు డుండుభం బను.

రురుఁడు

[ఆశ్చర్యముతో] సర్పము లిట్లు మనుష్యభాష ణంబు లుచ్చరించుట చిత్రము. నీవు సర్పంబ వని నమ్మనోప. క్రీడార్థ మిట్టిజుగుప్సారూపం బును దాల్చి సంచరించు మహాపురుషుఁడవుగాఁ దోఁచుచున్నావు.

[సర్పము తాపసరూపముతో రురునిముందర నిలువఁబడును.]

రురుఁడు

[వినయముతో] మునీంద్రా, భార్గవుం డగు రురుఁ డభివాదనము సేయుచున్నాఁడు. మీర లెవ్వరు? ఏమికారణంబున మీకిట్టి జుగుప్సాకరంబగు నురగత్వము సంప్రాప్తమయ్యెను? విన నగు నేని యనుగ్రహింపవేఁడెదను.

ఋషి

కుమారా! నేను సహస్రపాదుఁడను తాపసుఁడను. శాపవశమున నిట్లయితిని. నిన్నుఁ గనిన యప్పుడునాశాపవిముక్తి యైనది. కాని నీకొక్క హిత ముపదేశింతును. నీవు బ్రాహ్మణుఁడవు, భృగువంశ సముత్పన్నుఁడవు. వేద వేదాంగ విదుఁడవు. ఇట్టిదారుణక్రియారంభము క్షత్త్రియులకుఁ గాక బ్రాహ్మణులకుఁ దగదు. తొల్లి జనమేజయుఁడను జనపతియొనర్చు సర్పసత్రంబునందుఁ గద్రూశాపంబున నయ్యెడుసర్పకులప్రళయంబును భవత్పితృశిష్యుం డయిన యాస్తీకుండను బ్రాహ్మణుఁడు నివారించుట యెఱుఁగవా? ఇట్టి హింసాకరంబగు సంకల్పము‌ను దలపెట్టకుము. నాతోడ భాగీరథికి రమ్ము. నీకొక్క మంత్ర ముపదేశించెదను. కృతస్నానుఁడవై దాని సహస్రవారములు నిరుద్ధశ్వాసుఁడవై జపియింతువేని నీకు ధర్మరాజు ప్రత్యక్షమగును. నీయభీప్సిత మగును.

రురుఁడు

భగవత్పాదు లాజ్ఞాపించినట్లు వర్తించెదను.
[ఇరువురు నిష్క్రమింతురు]

౫

[భాగీరథీతీరమున రురుఁడు ధ్యానముద్రయం దుండును. నీలాంబరపరిధానుఁడును బాశహస్తుఁడునునై యముఁడు ప్రవేశించును]

యముఁడు

వత్సా, లెమ్ము.

రురుఁడు

[కన్నులు తెఱచి ససంభ్రమముగా] మహాపురుషా, నీ వెవ్వరు? ప్రణమిల్లి దుర్నిరీక్ష్యంబగు తేజోమూర్తిచే వెలుంగుచున్నావు!

విలయాదిత్యసమప్రతాపుఁడవు ప్రా
వృట్కాలధారాధరో
జ్జ్వలదివ్యాంగుఁడ, వానితంబవిచల
త్సౌవర్ణకేశుండ, వు
గ్రలలజ్జిహ్వాకరాళవక్త్రుఁడవు
రక్తశ్మశ్రుజాలుండ, వీ
వలకాలుండవొ? కాలరుద్రుఁడవొ
దేవా, యానతీయంగదే!

భవదీయాద్భుత దివ్యతేజమున
దేవా! దుర్నిరీక్ష్యుండవై
రవిపోల్కిన్ భువి దుస్సహప్రభలచే
రాజిల్లుచున్నావు, ని
న్నవలోకింప నశక్యమింకఁ దనువా
ద్యంతంబుఁ గంపించె నం
స్తవనీయాప్రతిమ ప్రభావ కరుణన్
శాంతింపవే వేఁడెదన్.

యముఁడు

కుమారా! నేను కృతాంతుఁడను. నీయభీప్సిత మెద్దియో వచింపుము.

రురుఁడు

దేవా! పరేతరాజా! ప్రమద్వర పునర్జీవిత యగునట్లు ప్రసాదింపుము.

యముఁడు

ఇట్టివైపరీత్య మెందైనఁగలదా! మృతు లుజ్జీవితులగు టెట్లు?

రురుఁడు

నీ దివ్యమూర్తి యిట్టి ప్రసన్న భావముతో మానవుల చర్మచక్షుస్సుల కెన్నఁడైన దర్శనమిచ్చెనా! నీకటాక్షమునకుఁ బాత్రుఁడైనయీ దీనుని యభీష్ట మేలనెరవేఱకుండును. దేవా! అనుగ్రహింపుము!

యముఁడు

అట్లయిన నొక్కయుపాయము చెప్పెద.

రురుఁడు

మహాభాగ్యము.

యముఁడు

నీయాయువునం దర్ధము ప్రమద్వర కొసఁగుదువేని యామె జీవించును.

రురుఁడు

[సంతోషముతో] దేవరయాజ్ఞానుసార మొసఁగుట కీరురుఁడు సంసిద్ధుఁడై యున్నాఁడు!

యముఁడు

వత్సా, ప్రాణులకు మానవజన్మము దుర్లభము. నీవును భార్గవుఁడవు. నీపితరులందఱును దపోనిష్ఠులై పరమస్థానమునకుఁ జనిరి. నీవు గూడ నట్లు శాశ్వతసౌఖ్యమునకై వినియోగింపవలసినకాలమునం దర్ధము గోలుపోవుచున్నావు. యోజింపుము.

రురుఁడు

ఈబాలిశునియజ్ఞానమును క్షమింప వేఁడెదను.

యముఁడు

కుమారా, నీప్రేమ మృత్యువును జయించినది. కావున మృత్యుంజయుఁడను నామాంతరముచే బహుకాల మీలోకమునఁ బ్రమద్వరనుగూడి సుఖింపుము. నీకు శుభమగుఁ గాక! పోయి వచ్చెదను.

రురుఁడు

[సాష్టాంగనమస్కారము చేయును.]

[యముఁ డదృశ్యుఁ డగును. భాగీరథీ వాసంతికలు ప్రమద్వరను పుష్పములతో నలంకరించి తీసికొనివత్తురు.]

భాగీరథీ వాసంతికలు

వత్సా! లెమ్ము. అమ్మా! ఈచంపకమాలచేఁ గుమారుని కంఠము నలంకరించి నీ యభీష్టము నెరవేర్చికొనుము.

ప్రమద్వర

ఆర్యపుత్రా! [అని చంపకమాలికను మెడలో నుంచును.]

రురుఁడు

ఎవరు! నా గృహలక్ష్మియా! [అని గాఢాలింగనము చేసికొని]

దారుణశోకాగ్ని తప్తాంగకములకుఁ
  జందనచర్చ యీచంద్రవదన
సాంద్రబాష్పనిరుద్ధ చక్షుర్యుగంబున
  కమృతంపువర్తి యీయంబుజాక్షి
జీర్ణకానన కల్పజీవలోకంబున
  ఫలపుష్పభరశాఖి పద్మనయన
భవమహార్ణవమధ్య పతితుండనగు నన్ను
  నుద్ధరింపఁగ నావ యుజ్జ్వలాంగి
నాతపఃఫలమూర్తి యీనలిననేత్ర
నామహాభాగ్యలక్ష్మి యీశ్యామలాంగి
అబల నెడబాయుటే రౌరవాదినరక
మతివసాయుజ్య మగును బ్రహ్మానుభవము!

[దంపతులపైఁ గుసుమవృష్టిగురియును. సురదుందుభినాదములు మ్రోయును.]

# చిన్నిముద్దిడుతల్లి నన్గన్న తల్లి!

అవసరాల శ్రీరామమూర్తి గారు

నిండుమోమున పండువెన్నెల హసింప
చిల్కపల్కులు ముద్దులు గుల్కుచుండ
నల్లనల్లన గజ్జియల్ ఘల్లుమనగ
చిరుతనడకల దరిజేరి చిట్టితల్లి
చిన్నిముద్దిడుతల్లి, నన్గన్నతల్లి!

నవ్యమోహనమురళిగానంబుకన్న
శ్రావ్యవాసంతకోకిలస్వరముకన్న
వచ్చియున్ రాని మధురోక్తు లచ్చుపడగ
కలతజెందిననామది కళవహింప
మించునానందవారి దేలించెదమ్మ
అమ్మ, నాయమ్మ, దాయె నాయనుగుతల్లి!
చిన్నిముద్దిడు తల్లి, నన్గన్నతల్లి!

కదళిఖర్జూరఫలముల న్గాని తీపి
తేనియల్ గ్రోలినను నందరానితీపి
మధుకరము లానగాలేని మంచితీపి
శర్కరాపూపములకన్న జాలతీపి
అఖిలమాధుర్యముల కిరవైనతీపి
పట్టిచిన్నారి పొన్నారి చిట్టిముద్దు
చిన్నిముద్దిడు తల్లి, నన్గన్నతల్లి!

కరము లొండొకటన్ జేర్చి గారవమున
మంజులావ్యక్తమృదులసంభాషణముల
భజనచేయుచు నదియేమొ పల్కుచుండి
యమితసంతోషజలధి నోలాడెదమ్మ
ఆడునది యేమి యానందమందెదేల?
తెలియగారానిభావంబు తెలిసెనమ్మ!
చిన్నిముద్దిడుతల్లి, నన్గన్నతల్లి!

భువనమోహన మధికసమ్మోదకరము
వేణునాదంబు మిగిలి యద్దానిదవులు
కూర్మి దరహాసచంద్రికల్ గుప్పుచుండు
పల్కులకు రాని నీయస్థిపంజరంబు
వెడలి చనుదెంచుస్వర మదేమొడది తల్లి!
సచ్చిదానందమయు గానసత్స్వనంబ
చిన్నిముద్దిడుతల్లి, నన్గన్నతల్లి!

ఉన్నదంచును నెద గర్వ మొందబోవు
కలదు లేదని మది చింత గలుగనీవు
గతవిచారంబునకు వశగతవు గావు
కాలఖేదంబు నీయందు కాననీవు
నిశ్చలానందమును మది నిల్పుతల్లి!
చిన్నముద్దిడు తల్లి, నన్గన్నతల్లి!

కాలచక్ర మొకేగతి గడవబోదు
నరుడు నిత్యము నొకరీతి నడువలేడు
చిత్త మెల్లపు డొకవృత్తి జెందబోదు
ఒండు నిశ్చితభావ మెట్లొందెదమ్మ?
చిన్నముద్దిడు తల్లి, నన్గన్నతల్లి!

ముసలిభానుండు సంద్రాన మునిగినాడు
పక్షు లల్లదె గూళ్లకై పరుగువారు
పశులతో గోపగణ మింటిపట్టు పట్టె
పెక్కుచుక్కలతో నింగి పిక్కటిల్లు
నిండుజాబిల్లివా డతిదుండగీడు
బువ్వ లేకుండ తినిపోయి నవ్వులాడు
బువ్వకై వేగపోవుద మవ్వకడకు
చిన్నముద్దిడు తల్లి, నన్గన్నతల్లి!



# పానుగంటి లక్ష్మీనరసింహారావుగారికి

# బహిరంగ లేఖ

సు. స. వ్రాసినది

అయ్యా!

మీకు రైలుబండిలో దొరకిన నాయుపన్యాసమునకు ఖండనముగా వ్రాసి ప్రచురించిన మీ బహిరంగలేఖను శ్రీ భారతిలోఁ జూచి యానందించితిని. ప్రత్యేకముగ నాఁడువారి కొఱకయాఁడుది వ్రాసిన యుపన్యాసముపై మీ రంతయాగ్రహించి యస్త్రశస్త్రములను సమకూర్చుకొని యాహవరంగమునకు దుమికి తెఱపిలేకుండఁ దీవ్ర బాణ పరంపరలను గ్రుమ్మరించితిరే! ఎందుల కీపిరా వేశము! ఈపట్టుదల! ఈవాద విజృంభణము! ఈ శివశక్తిగంతులు! ఆఁడుదానిమాట రవంతయైనఁ బైనుండఁగూడదు కాఁబోలు! అంతమాత్రమునకే మగవాని పుట్టియంతయు మునిఁగిపోవును గాఁబోలు! మగవాని గోడంతయు గోడగడ్డలగును గాఁబోలు! మగవాని "సృష్టిప్రభుత్వ" మంతయు మాసిపోవును గాఁబోలు! అనక యనక, యాఱుమాసములకో, సంవత్సరమునకో, కాక యర్ధోదయమునకో, యాఁడు దొక్కమాట యన్నయెడల దానిని వెంటనే ఖండించి తీఱవలయును గాఁబోలు! అంతవఱకు మీకు మతు లుండవు కాఁబోలు!

ఓస్! మీసతీగౌరవము చట్టుబండలు గాను! మీపాండిత్య ప్రభావము పడటఁ గలియను! ఆఁడుది యడఁగిమడఁగి యడఁకువతో నడ్డమైన బానిసతనము నొనర్చునంతసేపు నాఁడు దానిని మీరు చేయు స్తోత్రములకు హద్దున్నదా? ఆఁడుదియే సంసార సముద్రమునకు నావయనియు, నాఁడుదానివలననే మగవాఁడు గౌరవపాత్రుఁడై సత్యవంతుఁడై స్వార్థపరిత్యాగియై పుణ్యమూర్తియై ప్రకాశించుచున్నాఁడనియు, నాఁడుది యేదేశమున నేజాతివలన గౌరవింపఁబడి పూజింపఁబడునో యాదేశమే దేశమనియు నాజాతియే జాతియనియు, దేశసౌభాగ్యమేమి, జాతి పరిశుద్ధియేమి, యాఁడుదానివలననే నిలువఁబడునుగాని మగవానివలన నిలువఁబడ నేరదనియు, మగవానికి మోక్షలక్ష్మి నిచ్చుటకుఁగూడ నాఁడుదియే యర్హురాలనియు, నిట్టిమాటలు—మఱి యింక నిట్టిమాటలు, కాంతలకుఁ గర్ణరసాయనములుగఁ, జిత్తరంజకములుగ మీరు పలుకుచుందురే. ఆఁడుది రవంత ప్రతివాక్య మాడినయెడల నసూయావిష్టులై, యాగ్రహాతిరేకులై, యహంభావపూర్ణులై యాఁడుదానిని నిరసించి,

విమర్శించి, ఖండించి పరాభవించినదాఁక నెత్తి నేలఁ గొట్టుకొనుచుందురే! ఇదియేనా మీ సహనము! మీ శాంతి! మీ సమభావము! మీ సౌజన్యము! మీదొంగమొగము లెవతె నమ్మును? మీగుల్లమాట లెవతె విశ్వసించును? మీ లక్కప్రేమల కెవతె కరగును? మీ మొసలియేడ్పుల కెవతె మోసపడును?

ఇట్టిజాతిని దిట్టవలసినదా? రూపుమాపవలసినదా? నా యుపన్యాసములో మొదటి యాశ్వాసమునఁ దిట్లా? రెండవ యాశ్వాసమునఁ దిట్లా? ఊఁ? మూఁడవ యాశ్వాసమునఁ దిట్లా? అబ్బ! నాలుగవ యాశ్వాసమునఁ దిట్లా? ఓహోహో, ఏమి యుక్తిపరుఁడవు! ఏమి చతురవచన రచనాచణుఁడవు! ఈ మాత్రపు మీయుక్తికే మీవారు కులుకుచున్నారు కాఁబోలు! ఏమీ! ఏమీ! నాకు శాపాలాపశారదావతార మని బిరుదు కటాక్షించితివా? పండితుఁడవు కాఁబోలు! ఎంత మాట కల్పించితివయ్యా! హేహే! కవివికూడనఁటే! నేను శాపాలాపశారదావతార మనైతినా? మీరు! మీరు! వాదాలాప వాచస్పతులు కాఁబోలు! మీవ్యత్యస్తబుద్ధి యెంత స్పష్టముగ, నెంత బహిరంగముగ వెల్లడించితిరయ్యా! ఆఁడుదానినోటనుండి వెడలిన వెల్లఁ దిట్లా? మగవాఁడు పలికిన వెల్ల హేతుకల్పనలా? ఆఁడుది బుద్ధిహీనయా? మగవాఁడు బుద్ధిమంతుఁడా? ఆఁడుది దుష్టయా? మగవాఁడు శిష్టుఁడా? నావంటి యాఁడుది గ్రామగ్రామమున కొక్కతె యున్నయెడల నార్యావర్తదేశమంతయు మూఁడు సంవత్సరములలో నాఁడుమళయాళము చేయలేకుందుమా? అప్పు డాఁడుది బుద్ధిమంతురాలో మగవాఁడు బుద్ధిమంతుఁడో ప్రపంచమునకు వెల్లడియయి తీఱును. ఏదీ? మీ కింకమంచిదినములు రవంత మిగిలియున్నవి. కానిండు. కానిండు.

అయ్యా! నా యుపన్యాసముపై విమర్శనము జంఘాలశాస్త్రిపక్షమున మీరు వ్రాసినట్లు వ్రాసితిరే! ఆయన బదరీనారాయణము నుండి వచ్చి యీప్రాంతముల నేదోసంఘము స్థాపించి యుపన్యాసము లారంభించుదనుక వేఁచియుండక యింతలోఁ దొందరపడి మీరాతని పక్షమున నేల వ్రాయవలసి వచ్చినది. ఇంతలో లోకములు ముంచుకొనిపోవునని మీరు భయపడితిరా? నేను తొందరపడుట తప్పని మీ రెఱిఁగినప్పుడు మీ కేల తొందరపడవలయునయ్యా! కాక, జంఘాలశాస్త్రి సాంఘిక విమర్శనముకంటె మీవిమర్శన మెక్కువ సందర్భముగా సొగసుగా నుండునని వ్రాసితిరా? పాపము! నాయుపన్యాసమును బాగుగా ఖండించితినని యనుకొనుచున్నారు కాఁబోలు! ఆనందించుచున్నారు కాఁబోలు! అన్యోన్యమభినందించుకొనుచున్నారు కాఁబోలు! అల్పసంతుష్టులైన మిమ్ముఁగాంచ మాకు జాలి యగుచున్నదే! మీ విమర్శన మెంత నీరసముగ, నెంత పేలవముగ, నెంత యుక్తిశూన్యముగ, నెంత యశాస్త్రీయముగ నున్నదో మీరు గ్రహించుకొనలేకుండ నున్నారు. అవును! మాతప్పులు గ్రహించుటలో మీరు మహావిద్వాంసులుకాని మీతప్పులు గ్రహించుకొనుటలో మీరుమందబుద్ధులే కాదా? తప్పు

లు లేనిచోటులనైనను జిలువలకుఁ బలవలు,పల వలకుఁగొమ్మలు, కొమ్మలకుఁ గుత్తులు, కల్పించి వేయితప్పులు మాలోఁ జూపఁగలరు కాని లక్షలకొలఁది తప్పులున్న మీవారి వ్రాఁతలకు గనులుమూసికొని నోరుమూసికొని పడియుండు వారే కాదా? ఆఁడుదాని యణువంత తప్పు హిమవత్పర్వతమంతగా మీదయ్యాపుఁగంటికిఁ గనఁబడునే! అట్టి మీకన్ను మీ కెంతమాత్రము విని యోగింపకుండ నున్నదే! మీ పాండిత్యము మమ్మల్ల రిపెట్టుటకే కాని మిమ్ము బాగుపఱచుకొనుట కేమాత్రము తోడుపడకుండ నున్నదే! మీ విమర్శనజ్ఞానము మా వ్రాఁతలలోని కలుపుతీఁత కేకాని మీమనస్సులలోని గర్వోపశాంతికి వినియోగపడకుండ నున్నదే! ఇంతటినుండియైనఁ దెలివి తెచ్చుకొని మిమ్ము మీరు మొదటవిమర్శించుకొని పిమ్మట మమ్ము విమర్శింప మొదలిడుఁడు. మిమ్ముమీరు విమర్శించుకొన్న యెడల మాజోలి కెన్నఁడు మీరు వచ్చుటయే సిద్ధించియుండదు. కురూపుఁడు తన రూపజాడ్యము మెఱింగిన పిమ్మట సామాన్య స్వరూపను వెక్కిరించునా? మొగముమీఁద మొటిమలుగల మగువను గుష్ఠరోగి యధిక్షేపింపఁగలఁడా?

అయ్యో! ఎంతయో యుత్సాహపడి, యెంతయో తొందరఁజెంది, యెంతయో కష్టపడి మీరు వ్రాసిన విమర్శనము నిస్సారమై యున్నదన్న హేతువుచేత దానిని విమర్శింపక, నిరాదరణ మొనర్చి యూరకఁ బారవైచినచో, మీవాక్యములే సిద్ధాంతములని మీవారు రనుకొనిపోవుదురేమో యని, మిమ్ముమీరు గెల్చినారని బుజము లెగురవైచి గంతులు వేసెదరేమో యని మీ విమర్శనకుఁ బ్రతి విమర్శనము వ్రాయవలసివచ్చినది. మీవిమర్శనమున విమర్శింపవలసిన దొక్కయంశమే యున్నది. అందుఁగూడ నొక్క వాక్యముమాత్రమే విమర్శింపఁదగియున్నది. అదియేదన :—

"Heredity యనుదానివలనఁ దండ్రి సంబంధమైన ముక్కుపొడుగో, తల్లి సంబంధమైన కంటిసోగయో, మేనమామ సంబంధమైన మూఁతివంకరయో సంతానమందుఁ గాఢా చిత్కముగ సంక్రమింపవచ్చును గాని జగత్తు నేలుటకు సామర్థ్యముగలయట్టియు జగత్తునకు బానిసయగునంతటి తుచ్ఛత్వముగల యట్టియు మనస్సులోని శౌర్యము, గాంభీర్యము, త్యాగము, సాపత్నసహనము, భూతదయ, దైవభక్తి, బ్రహ్మజ్ఞానము మొదలగు సుగుణ పరంపరకాని, కాతరత, లాఘవము, లోభము, శాంతిరాహిత్యము, తామసము, నాస్తికత మొదలగు దుర్గుణపరంపరకాని Heredity వలనఁ గలుగుట కవకాశము లేదు."

ఇది మీ ప్రధానవాక్యము. ఈవాక్యము వలన మీ ప్రపంచజ్ఞానము మిక్కిలి యల్పమని స్పష్టపడుచున్నది. వాక్యము బారెఁడే కాని పసగలది కాదు. "తండ్రి సంబంధమైన ముక్కుపొడుగో" సంతానమందు సంక్రమింపవచ్చునని మీరు వ్రాసినారు. సంక్రమింపవచ్చునని యే కాని సంక్రమించునని మీరు స్పష్టముగ వ్రాయలేదు. అంతేకాక, దానికి వెనుకఁ "గాఢాచిత్కముగ" నని యొక్కబంధ మంటఁ గట్టినారు. ఇందువలన మీకు "Heredity"

యందు విశ్వాసము లేనట్లు స్పష్టమగుచున్నది. ఈవిషయమున మీకుఁ బూర్వజన్మమే శరణ్యముగ నున్నది. "పూర్వజన్మమునందు నాకుఁగల విశ్వాసమువలన నార్యమతమునకు బలముకాని యవిశ్వాసమువలన నీరసతకాని లేద"ని మీరు నన్నధిక్షేపించితిరికాదా? Heredityయందు మీకుఁగల విశ్వాసమువలన సృష్టిశాస్త్రమునకు బలముకాని యవిశ్వాసమువలన నీరసతకాని లేదని మిమ్ము నేను దిరుగ నధిక్షేపంపవచ్చునుగదా! మీయధిక్షేపణమునకుఁ బ్రత్యధిక్షేపణమును మీకప్పఁ జెప్పితినిగదా! ఇఁక మాటలాడ కూరకుండుఁడు. విడిచినవాదమును దిరుగ నందుకొని సాగింతము.

కాఁకరగింజ నాటిన మొదలఁ గాఁకరతీఁగయే పుట్టుచున్నదికాదా? 'కాణాచిత్క్రమున' గాఁకరతీఁగ పుట్టవచ్చునని మీరనరు కదా? తరులతాజాతియందు సహజమైన, సత్యమైన ధర్మము పరిణామనిశ్రేణికలో మొదటిమెట్టుపైనున్న మనుష్యసంతానమున కేల సత్యముకాదు? మనుజదంపతులకుఁ బుట్టిన సంతానము గూర్చి యింక ననేకవిచిత్రపరిస్థితులు చిరకాలసంప్రదాయములు ననేకవ్యక్తిలక్షణసముదాయములు, ననేకలక్షణముల యన్యోన్యసమ్మేళనమువలనఁ గలిగిన విలక్షణలక్షణము లెన్నో పరిశీలింపవలయునుగాని తరులతాదిజాతియందుఁ బరమార్థముగ జరుగుచున్న సామాన్యధర్మమే యిచ్చటఁగూడ జరుగుచున్నదికాదా? అంతకంటె భేదమేమియు లేదే? కాని యిక్కడ నల్లిక లెక్కువయున్నవి. చిక్కులు లెక్కువయున్నవి. క్రొత్త కూర్పు లున్నవి. దూర మాలోచింపవలసియున్నది.

బిడ్డనిలక్షణములు పరిశీలింపవలసివచ్చినప్పుడు తల్లిదండ్రులలక్షణములుమాత్రమే పరిశీలించి యూరకుండఁజనదు. ఆబిడ్డని పితామహలక్షణములు, పితామహీలక్షణములు వారి యితర సంతానలక్షణములుగూడఁ బరిశీలింపవలయును. అంతేకాదు. మాతామహలక్షణములు మాతామహీలక్షణములు వారి యితర సంతానలక్షణములుగూడఁ బరిశీలింపవలయును. ఇట్లింకఁ బైరెండుమూఁడుతరములవఱకైనఁ జూడఁదగినది. బిడ్డలోని యనేకలక్షణములు తల్లిదండ్రులలక్షణములనుబట్టియే నిర్ణయింపఁ దగును. తల్లిదండ్రులలోలేని లక్షణములేవైన బిడ్డయందుఁ గానఁబడినయెడల వానికొఱకు వంశవృక్షములోని పైకొమ్మలకెక్కి పరీక్షించినయెడల వానికిఁ గారణము లగపడితీఱును.

ఒకమూఁడుపిల్ల పుట్టిన నిముసము మొదలుకొని ముసలిది యగువఱకు నడుమ జరుగు ప్రధానచేష్టలను బరిశీలింతము. పిల్ల చేటలో బడగనే కేరుకేరున నేడువవలయును గదా? అటులీపిల్ల యేడువ లేదనుకొనుము. ఎందుచేత? ఆపిల్ల తల్లియో తండ్రియో భూపతనముగుట తోడనే యేడువకపోయి యుండవలయును. ఆ సంగతి వారి తల్లిదండ్రులవలన సులభముగఁ దెలిసికొనవచ్చును. జనులు నిదురించునపుడు కుడిప్రక్కనో యెడమప్రక్కనో పండుకొను నలవాటు కలవారై యుందురు కాని రెండు

ప్రక్కలను సమాన సౌలభ్యముతోఁ బండుకొననేరరు. ఒకవేళ నిద్రలో నలవాటులేని ప్రక్కకొత్తిగిల్లుట తటస్థించినను రెండుమూఁడు నిముసములలోనే మేల్కాంచి యలవాటైన ప్రక్కకుఁ దిరుగుదురు. మనముపరీక్షింపదలఁచిన పిల్లతండ్రికో,తల్లికో యెడమవైపునఁ బండుకొనునలవా టున్నదనుకొనుము. ఈ పిల్లగూడ నెడమప్రక్కనే పండుకొనును. తెలియక తల్లి యా పిల్లను కుడిప్రక్కను బండుకొనఁబెట్టిన యెడఁ బిల్ల యిల్లెగిరిపోవ నేడ్చును. ఎడమప్రక్కగాఁ బండుకొనఁబెట్టిన వెంటనే కిక్కురుమనకుండ నిద్రించును. బాల్యమునఁ దల్లికో తండ్రికో యెడమచేతి వ్రేళ్లో కుడిచేతివ్రేళ్లోనోటఁబెట్టుకొను నలవాటున్న యెడలఁ బిల్ల యాచేతి వ్రేళ్లే యావయస్సుననే నోటఁ బెట్టుకొనును. పిల్లతల్లికిఁ దండ్రికిఁగూడ నత్యంతమధురపదార్థ మిష్ట మనుకొనుము. ఈ పిల్లకేమోకాని తీపి యిష్టములేదు సరేకదా పులుసనగ మహాప్రీతి! ఈ వ్యత్యాసమునకుఁ గారణమేమో యని దూరాలోచన చేయకుండఁ బూర్వజన్మమే కారణమని తొందరపడి సిద్ధాంత మొనర్పకుము. అంత దూరాలోచనకూడ నేల? వంశవృక్షమున నీ పిల్ల తండ్రిప్రక్కనేయున్న యామె యెవతెయో యెఱుఁగుదువా? ఆమెయే యీ పిల్ల పెద్దమేనత్త. ఈమె దినమున కొక పదలము చింతపండుపులుసు ద్రాగునప్పుడు మేనగోడలికిఁ బులు సిష్టమనగ నాశ్చర్య మేమి? తల్లికాని, మేనత్తకాని యెన్నవయేట నెన్నవ మాసమునఁ బ్రథమరజస్వలయగునో యెన్నవయేటనే మాసమైన బీరుపోకుండఁ బిల్ల రజస్వలయగును. కాని తల్లి మేనత్తల సాంప్రదాయము ననుసరించి యాపిల్ల పండ్రెండవ యేఁట రజస్వలకాక, పదియవయేఁటనే రజస్వల యయ్యెనేమి చెప్పవమా? ఈమాత్రమునకై తొందరపడి వెనుకజన్మమువఱకుఁ బోక, ముందు వసారాలోఁ గూరుచుండి చిమ్మిలి దంపించుచున్న పిల్లపితామహియొద్దకేఁగి య డుగుము. ఆ విషయమున నా మనుమరాలికి నాపోలిక వచ్చినదయ్యా యని యామె పైకి విసుఁగుజెందిన ట్లగపడుచున్నను లోన మురియుచుఁ దన చరిత్రములోని విచిత్రాంశమును బహిరంగపఱచును. ప్రథమరజస్వలా దినములలో నీపిల్ల కావునేయి, పులగము, ప్రాతబెల్లముఁ దక్క మఱియేదియు నీయకుండ నెంత కఠిన పథ్యముఁ జేయించినను దల్లికిఁగాని మేనయత్తకుఁగాని బుతుశూల యున్నయెడల నీపిల్లకుఁ గూడ నేకొలఁదిగనో యది సంక్రమించును గాని విడువదు. ఇఁక గర్భవతిగా నుండునప్పుడు ప్రక్కశూలగాని, మక్కనొప్పి గాని వంశములోని పూర్వస్త్రీల యాచారము ననుసరించి కలుగును. సంతానక్రమముకూడ సంసార సంప్రదాయముననుసరించియేయుండును. రజోదోష నివృత్తికూడఁ దల్లిని బట్టియో, తల్లి తల్లినిబట్టియో, తండ్రిసోదరినిబట్టియో, యామెతల్లినిబట్టియో, యుండును. వేయేల? తల్లిదండ్రుల సామాన్యములైన యభ్యాసములు కూడఁ బిల్లలకు సంక్రమించునుగాని వదలవు. మాటలాడునప్పుడు తండ్రిచేతు లెట్లాడించునో తల యెట్లువిసరునో బిడ్డకూడ నటులే

చేయును. తల్లి కాని తండ్రి కాని గొంతుకూరు చుండి భుజించుటయే యలవాటు కలిగియుండు నెడలఁ బిల్లకూడ నటులే కూరుచుండి భుజించును. బలాత్కారమునఁ బద్మాసనమునఁ గూరుచుండఁ బెట్టి యాపిల్లను భుజింపఁ జేయు నెడల నోటనిడుకొన్న కబళము దిగకపోవుట చేఁ గెక్కు కెక్కు మనును. సాధారణముగా జనులు నాలుగైదునిముసములకంటె నెక్కువ కాలము నిలువఁబడవలసివచ్చినప్పుడు రెండు కాళులపై సరిగ నిలువఁబడరు. కుడికాలిపైనో యెడమ కాలిపైనో బరువెల్ల మోపి మిగిలిన కాలికిఁ బనియేమియు నీయరు. కుడికాలిపై నిలువ నలవాటుగల తల్లిదండ్రులకుఁ బుట్టిన పిల్ల ప్రధానముగఁ గుడికాలిపైనే నిలువఁ బడును. మన మప్పు డప్పుడు కుడిచేతి వ్రేళ్ల సందులలో నెడమచేతి వ్రేళ్లిముడ్చుకొని కొంతసేపట్లే యుంచుకొనుట తటస్థించు చున్నది. అట్టి హస్తపుటమునకు మొట్ట మొదటి వ్రేలు కుడిబొట్టన వ్రేలైనఁ గావచ్చును. ఎడమబొట్టన వ్రేలైనఁ గావచ్చును. దక్షిణాంగుష్ఠమే మొదటిది యగునట్లుగా హస్తములు ముడుచుకొను నలవాటు తల్లికో తండ్రికో యున్న యెడలఁ బిల్లకూడ నటులే హస్త యుగ్మమును ముడుచుకొనును. నడచునపుడు ముందువేయు కాలుగూడ ననూచానస్థితి ననుసరించి యుండుననుట యతిశయోక్తి కాదు.

అయ్యా! Heredity కల్లయని నిర్ధారణ మొనర్చుటకు మీరు కొన్ని యుదాహరణ ములనిచ్చినారు. అవి సమంజసముగ లేవు. పండితాగ్రగణ్యునకు శుంఠ జన్మించుచున్నాఁ డని చెప్పినారు. తండ్రి షట్ఛాస్త్రపాండిత్య మునే మీరు పరిశీలించినారు. కాని మేన మామశుంఠత్వ సామ్రాజ్యమును మీరు పరీక్షింపలేదు. ఈతప్పు మీదికాని Heredityది కాదు. మహావదాన్యుఁడైనవానికి లుబ్ధాధమా ధముఁడైన నిర్భాగ్యుఁ డుదయించుచున్నాఁ డని మీరు చెప్పినారు. ఈ లుబ్ధాధమాధము ని పితామహుఁడు శ్రాద్ధములుచేసి, శవముల మోసి, శల్యపరమాన్నమునుదిని, చౌర్యము లొనర్చి స్వామిద్రోహకృత్యము లొనర్చి తాను తినక యొకనికిఁ బెట్టక కూడఁబెట్టిన ధన మంతయుఁ దనకొడుకు తానుజచ్చినపిమ్మట దానధర్మములకై తగులఁబెట్టుచున్నాఁ డని కడుపుమంటచేఁగాలిపోవుచుఁ దనధనము నెటులైనఁ గాపాడుకొనవలయునను దయ్యపుఁ బట్టుదల గలిగి, ద్విగుణీకృతలుబ్ధత్వముతోఁ దానే తనకు మనుమఁడై పుట్టెనని మీరు గ్రహింపలేకపోవుటచేత మీకు వ్యత్యాసము గాఁ గనఁబడుచున్నది. కాంతాలంపటుఁడై, కాతరుఁడైన దశరథునకు శ్రీరామచంద్రుని వంటి యేకపత్నీవ్రతుఁడు, జగదేకవీరుఁడు జన్మించినప్పు డింక Heredityని నమ్మవలసిన పని యేమున్నదని మీరు పలికినారు. అట్లనుట తప్పు. అందుచేతనే మఱింత నమ్మవలసి యున్నది. దశరథుని కాంతాలోలత్వమే మీరు గణించితిరికాని హోమాగ్నిజ్వాలా తుల్యయగు కౌసల్యాదేవి, పరిశుద్ధిని మీరు గణించితిరికారే. దశరథుని భయస్వభావము నే మీరు గణించితిరికాని రఘుదిలీపాదిమహా

రాజులు పౌరుషసంభూతమంతయు శ్రీరామచంద్రప్రభుర బ్రహ్మములోని కాకర్షింపఁబడినదని మీరు గ్రహింపలేక పోయితిరే! మీ రిచ్చిన యుదాహరణము లన్నియు నిట్లే యసంబద్ధములై యవిచారపూర్వకములై యున్న వనుట నిశ్చయము.

ఇఁక వంశానుక్రమముగ వచ్చు రోగములఁగూర్చి రవంత చెప్పవలసి యున్నది. ఉబ్బసము మూలవ్యాధి క్షయము, కుష్ఠము నీతరగతిలోని ప్రధానవ్యాధులు (Intermittence of the Heart) (నాడి నాలుగైదుదెబ్బలుకొట్టినతరువాత నొక దెబ్బకాలము నిలిచిపోవుట) అనునదికూడ మూఁడుతరములనుండి యొక కుటుంబములోనున్నట్లు కనిపెట్టఁబడినది. (Hysteria) యనునదికూడ నట్టి వ్యాధియే యని కొందఱు చెప్పుచున్నారు. అంధత్వముకూడ నీతరగతిలోనిదే యని కొందఱి యభిప్రాయము. తాతగారి యంధత్వము మనుమనికి వచ్చుట కలదు. అది జనుషాంధత్వమైన సరే. చెప్పరానివ్యాధులలో నొకదానివిసము వంశములో నాల్గుతరములవఱకునిలిచియుండునని కొందఱు చెప్పుచున్నారు. పిల్ల నిచ్చుటకుఁగాని తెచ్చుకొనుటకుఁ గాని మనవారు కుటుంబసంప్రదాయమును విశేషముగాఁ బరిశీలించుచున్నారు. ఒక్క వంశములోని వ్యాధులు మఱియొక్క వంశములోనికి సంక్రమించుట కవకాశము కలుగకుండుటకే మనవారు పరిణయనిర్ణయము పూర్వమునం దింత పరిశోధన చేయుచున్నారు. ఇట్టి పరిశోధనము రోగవ్యాప్తి నివారణమునకే కాక, దుష్టప్రవర్తనవ్యాప్తి నివారణమునకుఁ గూడ నైయున్నది. అందుచే బిడ్డలప్రవర్తనము కూడ వంశానుక్రమసూత్రమున కధీనమై యున్నదనియే స్పష్టపడుచున్నది.

అయ్యా! దేహసంబంధములగు కొన్ని లక్షణములు బిడ్డలయందుఁ గానఁబడవచ్చును గాని జగత్తు నేలగలట్టియు, జగత్తునకు బానిసయగు నంతటి తుచ్ఛత్వము గలయట్టియు మనస్సులోని సుగుణపరంపర కాని దుర్గుణపరంపరకాని (Heredity)వలన రాదని మీరు స్పష్టముగఁ జెప్పినారు. మీకుఁ గోపమువచ్చిననుసరే కాని యిది యట్టితెలివితక్కువ మాటయని చెప్పుచున్నాను. ప్రవర్తనము (Character) దేహముతోఁ జేరినదా మనస్సుతోఁ జేరినదా? దేహముతో జేరినదని మీరనుటకు సాహసింపలేరుకదా! మనస్సుతోఁ జేరినదని యొప్పుకొనక తప్పదు కదా! Heredity వలననే మనస్సు సత్ప్రవర్తనము గలదికాని దుష్ప్రవర్తనము కలదికాని యగుచున్నదని యిప్పుడే నిర్ణయింపఁబడినదికాదా? ఆ నిర్ణయము నేను జేసినదగుటచే మీకు నచ్చలేదందురా? పోనిండు. Heredity మనస్సుపైఁ బనిచేయునని మహాశాస్త్రవేత్తలు చేసిచూపిన నిర్ణయమును విందురా? (Idiocy) జన్మమందత్వము, (Insanity) పిచ్చి, యివి మనస్సుతోఁ జేరినవా? దేహముతోఁ జేరినవా? దేహముతోఁ జేరినవని మీరనునెడల మి మ్మేమనవలయునో మాకుఁ దెలియదు. ఇదివఱకు కైదు తరములనుండి Idiocy తీఁగ సాగుచున్న వంశములు రెండు France లో నున్నట్లు శాస్త్రవేత్తలు

చెప్పినారు. తాతకుఁ బిచ్చి, తండ్రికిఁ బిచ్చి, యన్నకుఁబిచ్చి, చెల్లెలికిఁ బిచ్చి, తనకుఁబిచ్చి యైన కుటుంబములు తఱచుగ లేకున్నను విరళముగ నున్నట్లు వినుచున్నాము. తండ్రికిఁ బిచ్చిలేదుకాని తీవ్రమైన కోపము, పెద్దకొడుకునకు సామాన్యపుఁబిచ్చి, రెండవ కొడుకునకంతకంటె నెక్కువపిచ్చి, మూఁడవ కొడుకునకుఁ బూర్తిగాఁబిచ్చిగల యొక్కకుటుంబము గోదావరీ తీరమందుండుట నే నెఱుఁగుదును. ఇప్పు డేమందురయ్యా! ఇంకను మనస్సునకు Heredity కి సంబంధము లేదని యందురా? అట్టులైన నొక మనశ్శాస్త్ర పరిశోధకుఁ డగు మహావైద్యుఁడు చెప్పిన మాటలను విందురా? "The hereditary transmission of a liability to mental disease must be reckoned as the most important among all predisposing causes of insanity." చూచితిరా, Heredityయే యున్మాదకారణములలోఁ బ్రబలతమమైనదని తెలిసినదా? మఱి యింకను వినుఁడు. "It is probably well within the mark to say that at least 50 percent of the insane have a direct or collateral hereditary tendency towards insanity" ఇక్కడకుఁ బిచ్చివారిలో నధమము నూటి కేఁబదుగురవఱ కీ తరగతిలోనివారే యని స్పష్టపడినదా?

మూర్ఛ వంశానుక్రమమగు వ్యాధియగుటచేతను, మూర్ఛ ముదిరి పిచ్చికావచ్చును గావునను మూర్ఛయున్న కుటుంబములో నుండి పిల్లను దెచ్చుకొనఁగూడదు. ఆ కుటుంబములోనికిఁ బిల్లనీయఁగూడదు. చెడఁద్రాగెడువారి కుటుంబముతో నెన్నఁడును సంబంధము చేయఁదగదు. ఆసంబంధమువలన నున్మాదము మఱియొక్క కుటుంబములోనికి రాఁగలదు. ఏదో యొక్క విషయమునసే యత్యద్భుత ప్రజ్ఞకలవాఁడును హద్దుమీఱిన చుఱుకుఁదనమును గలవాఁడున్న కుటుంబములో సంబంధము చేయఁగూడదు. అట్టి ప్రజ్ఞావంతుని తరువాత రూపాయకుఁ బదణాలవఱకుఁ బిచ్చివారు కలుగవచ్చును. మేనమామ కూఁతునకు మేనత్తకొడుకునకు, మేనమామకు మేనకోడలికి, మేనయత్తకూఁతునకు మేనమామకొడుకునకు వివాహసంబంధము లొనర్చి లొడితెఁడైన యావరణములో గుడుగుడుగుంచము లాడుచు ముళ్లపైముళ్లు దగుల్చుకొనువారి కుటుంబములలోఁ దఱచుగాఁ బిచ్చివారు పుట్టుదురని చెప్పుదురు.

Heredity వలననే దేహలక్షణములన్నియుఁ గలుగుచున్నవి. మనోలక్షణములన్నియుఁ గలుగుచున్నవి. ఇట్టి లక్షణములు సంక్రమింపఁజేయుటలో తల్లిదండ్రుల తరమువారి కెంతశక్తి యున్నదో వారి పైతరమువారి కెంతశక్తి యున్నదో, వారి పైపై తరమువారి కెంతశక్తి యున్నదో యను సంశయములుకూడ శాస్త్రవేత్తలు సంతతపరిశోధనమువలనఁ గనిపట్టినారు. తల్లికాని తండ్రికాని $(0.5)^2$; పితామహుఁడు కాని మాతామహుఁడు కాని $(0.5)^4$; యేడవ తరములోని పురుషుఁడు $(0.5)^{14}$; x తరములోని పురుషుఁడు $(0.5)^{2x}$గా, దైహిక మానసిక లక్షణములు పిల్లలకు సంక్రమింపఁజేయుదురని వారు చెప్పి

నారు. కాని యీ సూత్రము మాత్రము ప్రత్యేకవ్యక్తిపరముగాఁగాక, సాంఘికసాముదాయికపరముగా సత్యమని వారు చెప్పినారు.

కావున, నేమి తేలిన దనఁగా: ఒక కుటుంబములోఁ గలిగిన బొమ్మ తల్లిదండ్రులు మాత్రమే చేసినదికాదు. వారు, వారిపైవారు, వారిపైవారు నేఁబదుగురో యిరువదిగురో చేసిన బొమ్మయని తెలియఁదగినది. దేహలక్షణములు సంతానమునందు 'గాఢాచిత్రముగఁ' గానఁబడుననియు, మనోలక్షణములు మొదలే కానఁబడవనియు మీరు చెప్పినమాట యాచారవిరుద్ధమైనదియు, నశాస్త్రీయమైనదియు, నసత్యమైనదియునై యున్నది. తల్లిదండ్రులలక్షణములే కాదు; వారి పూర్వులలక్షణములే కాదు; మనుష్యజాతికిఁ బూర్వులైన యన్నిప్రాణులలక్షణములు గూడ మనలోనున్నవి. ఇలకోడికూఁత యెఱుఁగుదువా? దాని కెదురుపడిన ప్రేయసిని సంతసింపఁజేయుట కది కూయుచున్నది. కప్పయు నందుకొఱకే కూయుచున్నది. మగవాఁడు తన కిష్టమైన కాంతనుజూచి యట్లెకూను రాగ మేప్పుచున్నాఁడు. మగనెమిలి యాఁడు నెమిలి సంతసముకొఱకుఁ బురివిప్పి తాండవించును. మగవాఁడు దన కిష్టమైన మగువ ప్రీతికై తలయెగురవైచుకొని యొడలు విరుచుకొని యొయ్యారమునఁ దిరుగులాడి మిడికిమిడికి మొత్తుకొనుచున్నాఁడు. క్రూరజంతువుల హింసాసాధనములు మన నోటఁ గోరలుగ నిల్చియున్నవి. కోఁతితోఁక మన వెన్నుపాముచివర (Coccyx) రూపమున నిల్చియున్నది కోఁతిః. కిచకిచలే మన నవ్వులైనవి. కోఁతివెక్కిరింపులే మన యధిక్షేపణములు. కోఁతి చాంచల్యమే మన మనస్సులో శాశ్వతముగ నిల్చియున్నది. అయ్యా! ఇఁకఁ జాలు. నామాటలు నచ్చినవానికి నిఁకఁ జెప్పనక్కఱలేదు. నచ్చనివానికి నిఁకఁ జెప్పనక్కఱలేదు. అందుచే విరమించుచున్నాను.

కాని మఱియొక్కమాట. మునుపటివలెనే యీసారికూడఁ దొందరపడిజంఘాలశాస్త్రి పక్షమున మీరు ప్రత్యుత్తర మీయవలదు. రాఁదలఁచిన జంఘాలశాస్త్రి వచ్చి, స్థాపింపఁదలఁచిన సంఘమేదో స్థాపించినతరువాత, నీయవలసిన యుపన్యాసములలోఁ బ్రథమ సాంఘికోపన్యాసమే నాకుఁ బ్రత్యుత్తరముగా జంఘాలశాస్త్రి యీయవలయును. అది నాకోరిక. ఆతని యుపన్యాసములు విని యెంతకాలమోయైనది. ఆతఁడు మమ్మెంత యధిక్షేపించినను మాకెవ్వరికి నాతనిపై నిసుమంతయైనఁ గోపము రాలేదు. ఆతనిని మా సోదరుని వలెఁ జూచుకొనుచున్నాము. ఆతఁడు బదరీనారాయణమునుండివచ్చి నూతనసంఘమునుస్థాపించి యాంధ్రదేశమునందు సమంజసమైన సంచలనము సంతోషము నెప్పుడు సమకూర్చునో యని సముత్కంఠచే నిరీక్షించుచున్నాము.





# చతుర్మణికటకము

కొత్తపల్లి సూర్యారావు గారు

[విళంబినాయనార్ కృత మగు నఱవపద్యములకుఁ దెనుఁగు]

చంద్రుఁబోలిన ముఖము భాస్కరునిఁబోలు, చక్రమును లోఁతునీటి యబ్జరుచి మించు
నేత్రయుగము శిరీషసన్నిభశరీర,మును ధరించిన శ్రీహరి మనుచు జగము.

చ. జగముల బొజ్జలో నిడినజాణ, పదత్రయి భూమియంతయుఁ
మిగులకయుండఁ గొల్చిన సమిద్ధమహత్త్వయుతుండు, నాఁడు గో
పగణము గోవుల న్మనుపఁ బర్వత మెత్తిన దిట్ట, శోణపు
ర్యగణితసౌష్ఠవం బెడపినట్టి మహాబలశాలి, వాలెడున్.

శా. నిందింపం దగ దల్పజాతియనియేరిన్ మేటివిత్తంబు నీ
కందంబోవ ననర్హుచేయి పయిగా నాసింప కేనాఁటికిన్
డెందం బెంతతపించినం గొనకుమీ నీచాత్ముపై గోపమీ
వెందుం జుల్కనఁ బల్కఁబోకు విరసోద్వృత్తంబుల న్మిత్రమా!

గీ. అసుణమనుపిట్ట యశ్రుతిమైనపాట, వినినఁ జచ్చును జ్ఞానియు మనసునొచ్చె
నేని బ్రదుకఁడు వెన్నుదయింప వెదుఱు, బ్రదుక దుత్తముఁ డపవాదుపడి బ్రదుకునె?

గీ. మణిఁగడిగి గ్రహింతురు గుణముఁ గాంత్రు, వేత్త లౌనన సభను గవిత్వగుణము
మసటువోఁగాల్చి బంగరుమహిమఁ జూతు, రల్పసంగతిఁ జెడి యెంతు రనుభవమును.

గీ. బొమ్మచెముడున నగురు మృగమ్ముకడుపు, నందు నరదళ ముదధి ననర్ఘమౌక్తి
కములు పుట్టుట యెఱుఁగుదు రమర నెవని,యింట నుత్తముఁ డొదవునో యెఱుఁగలేరు.

గీ. రాళ్లలో సూర్యకాంతమన్ రత్నమొదవు, భార్యనుడిలోన నద్భుతభావ మొదవుఁ
గరుణలో ధర్మగుణములు గలుగు ధనము, గలుగ నద్దానిలోన సకలముగలుగు.

మ. కులమర్యాదకు హాని రానిగతి యేకొండంతయైశ్వర్య మి
మ్ములనాచార్యవిరుద్ధకార్యసరణిం బోకుండుటే ధర్మ మా
ప్తులపైఁ దేలికచూపు చూచుటయె యొప్పున్ హింసకుం దుల్యమై
ఫల మాశించి యనిష్టునిం దనుపు ద్రవ్యం బౌమిషప్రాయమా.

గీ. దొంగ కెప్పుడు రాదు నిద్దుర ప్రియాంగ,నను దలంచెడు వాఁడును గనఁడు నిద్ర
నిద్ర రాదు ధనార్జన నిష్ఠునకును, ధనము గాపాడునతఁడు నిద్రఁ గనఁ డెప్డు.

ఉ. తోఁపదు మించినట్టి పనితో మన కేమని చింత వేత్తకుం
దోఁప దభీష్టవస్తుతతి దుర్లభమైన కతంబు పేదకుం
దోఁప దెఱింగియుం గడఁగు దుష్కృతికర్తకు ధర్మమింతయుం
దోఁపదు కోపమున్న నెది దుష్టము యేయది యిష్టమో కనన్.

చ. వరియును నిక్షువాటికయుఁ బైరిడ భూమికి భూషణంబు, తా
మరలు సరోవరంబునకు మంచివిభూషణ మందకత్తెకుం
బరమగు భూషణంబు వరమానము, భూషణ మేరికేనియుం
బరమున కేఁగఁ దోడుపడు భంగి నొనర్చిన పుణ్యకార్యముల్

గీ. మదగజము కట్టువడును గంబమున కొదిఁగి, కట్టువడు మంత్రములకు నాగంబు నొదిఁగి
వాతవెట్టినచోఁ గట్టువడు శరుండు, కట్టువడుఁ బండితుఁడు సువాక్యములు వలుక.

చ. ఇతరులు సంచలించు భయహేతుకృతు ల్వాడి వీడు టొప్పగుం
గృతము నొకప్పుడు న్మఱచు టెంతయుఁ బాపము, లోనికోపముం
గుఱిలపడంగఁ జేయుటది గొప్పగదా తలపోయ నెందు, స్వో
న్నతికి విఘాతముం జలుపు నాలిహనుల్ త్యజియింపఁగాఁ దగున్.

గీ. పాము కోఱలచే బాధపఱచునరుల, గజము బాధపఱుచు దంతఘట్టనముల
గఱత బాధపఱుచు మోహగర్భితేక్షు, ణముల బాధపఱుచు ముని దమమువలన.

మ. శ్రుతితాలాదివిహీన వీణధ్వని కెచ్చున్ డప్పుచప్పుళ్లు గొ
ప్పతనంబుం జెడినట్టి పూరుషునిఁ జెప్పన్ రాదు సత్ స్త్రీకడన్
వ్రతహీనంబగు కానికూళ్లుడిగి తాఁ బస్తుండఁగా మంచిదా
నతిబాంధవ్యము నుజ్జగించుటకు మేలగ్ని ప్రవేశంబగున్

గీ. దాన మైశ్వర్యమను పాదులోనఁ బుట్టు, నింపనెడు పాదులో బంధుబృంద మొదవు
గఠినవాఙ్మర్మములు విపక్షమను పాదు,లోన యాచ్ఞ లేమిడిపాదులోనఁ బుట్టు.

గీ. దూఱువడఁ గోరుదేని నెత్తుము బికిరముఁ, బేరుపడఁ గోరుదే నిల్పు కీరితి నటఁ
బరమునకుఁ దోడుగోరుదేఁ బఱపుమీవి, జయము గోరుదువే నమర్షమును విడుము

గీ. వార్ధిలోఁతును దాఁటును బడవవాఁడు, సేనలోఁతును దాఁటు హాస్తిపకుఁ డెందుఁ
దపము గంభీరతను ముని దాఁటిపోవు, సమితి గంభీరతను దాఁటుఁ జదివినతఁడు.

గీ. గాఢమైత్రి కసత్యవాక్యములు చివర, యౌవనమునకుఁ దుద వార్ధకాంధకారంబు
కలిమికగు నంత్యదశ యధికవ్యయంబు, బ్రదుకునకుఁ దుట్టతుద తనవాసులపొ[illegible]

చ. తనదగునింటికిం గుఱి యుదారగుణంబుల నొప్పుభార్య చే
సినపని కంగమచ్చు మదిచెల్వుగ నుండుటయే ప్రతాపవం
తునకు ధరాధినాథునకు స్తోత్రముచేసెడి లోక మానవా
లనఁదగుఁ జెడ్డవాని కెదియౌ గుఱు తొప్పుల వీడిపోవుటే.

గీ. స్వామిచెదర నతనిసతియును జెదరును, జెదరుఁ బండితుండు చెద రవిద్య
ప్రజలు గలఁగి లేని రాజదండము గలంగును శ్రుతి గలంగఁ బాటయుఁ జనును గలఁగి

గీ. గృహిణిలేకున్న మానవుగృహము పాడు, చెలులులేని యా దేశము చెలువుపాడు
పెద్దలుండని సత్సభ పెంపు పాడు, చదువురాదేని తనమేని సౌరు పాడు.

ఉ. ఒద్దిక లేమియే చెఱచు నొక్కనినొక్కని గౌరవంబుఁ బో
న్నద్దికి వచ్చు మేనిప్రభ యుష్ణనఁబోవు నసత్యమాడినన్
దుద్దగుఁ బాలతీపునకు దుత్త విశుద్ధము గాకయుండినం
బెద్దకులంబు గొప్ప పిరువీఁకుపడు న్నరిగానిచెల్మిచే.

గీ. సత్యవాక్యప్రతిజ్ఞ తేజాలుఁ గీర్తిఁ, దేఁగల దధమ్యభతుణాకృతి యరయమి
మైకమునఁ గన్నులున్నను జీకుదనమె, కల్గుఁ జదువున్న జ్ఞానప్రకాశ మొదవు.

మ. బలసైన్యంబది యెంతవచ్చినను నిల్వంజాలు నేనుంగురా
వలదం చావలనూకి కొట్టినను బైపై బిడ్డ యమ్మాయనున్
చెలి కోపించి యకార్యముం జలిపినం జేయర్ ప్రతీకారమా
ర్యులు కూడంబడి రానివారు హితులైయుండంగ సిద్ధించునే.

చ చెలిమిగుణంబు నెచ్చెలులచేతను శోభిలుచుండు నెందు శో
భిలు సభ మంచియొమ్మికను, విజ్ఞులదౌ నభిమానవృత్తిచేఁ
దెలియును వేశవంతమగు తేరుగుణం బది సూతునెంచినం
దెలియును గ్రామసౌష్ఠవము తీర్పరియౌ నతఁడున్న వైఖరిన్

చ. అవమతి నింద యన్న భయ మందని వానినిజూచి కొంకుమా
స్వవశములౌ సుమార్గములఁ జచ్చినదాఁకను బాయకుండుమా
వివరములేక కోటి యొదవించిన నేఁనియేసిఁ జేయఁబో
కు విహితుచేతఁ గొన్నఁపని కొంచెపడన్ గణియింపఁబోకుమా.



# నీ వే నా?

[ఒక నిరూపక కథ]

సోమరాజు రామానుజరావు గారు

౧

లక్ష్మణరావుగారింటిలో నా కెంతో చనువు. ఆయన కుమార్తె సుభద్రకు నే నప్పు డప్పుడు హార్మోనియము, పాఠములు చెప్పు చుందును. పంతులుగారు చాల పెద్దవారు. ఒకనాఁ డాయన యింటికి నేను వెళ్లునప్పటికి, ఆయన మేనల్లుళ్లు సూర్యరావు, వేంకటరావు లిద్దఱును వచ్చియుండిరి. వా రందఱు నన్నా హ్వాన మొనరించిరి. సుభద్ర నాదగ్గఱగా టీ కోపా నుంచుచు,.........

"ఈనడుమ కనఁబడుట లేదేమి?" అని యెను.

నేను కొంచెమెనుగా నవ్వి యూరకుంటిని.

ఇంతలో నొక చీనావాఁడు, ఉత్తరము నొకదానిని దెచ్చి పంతులుగారి కిచ్చెను. పం తులుగారు చదువుకొని, యా యుత్తరమును నాపైఁ బడవేసెను. నేనును చదివి,

"ఈ యుత్తరము వ్రాసిన దెవరు?" అని యడిగితిని.

పంతు—వీఁడు "చిన్‌చాంగ్" అను చీనా వాఁడు. నాకుఁ బ్రాణమిత్రుఁడు. వెనుక నొకానొక సందర్భమున చిన్‌చాంగ్ లేని చో నేను మరణించి యుందును.

నేను—ఐనను, చీనావాండ్రను నమ్మఁగూడ దండీ.

పంతు—(నవ్వి) నీ కెంత యనుమానము! ఏ చీనావాండ్రు దుష్టులైన నగుదురు; గాని చిన్‌చాంగ్ అంత యుత్తముఁడు లేఁడు. వాని యింటిలో విందఁట! నేను రాలేక పోయితినని చెప్పి, సుభద్రను వెంటఁబెట్టు కొని వెంకట్రావు, సూర్యా, నీవు, వెళ్లి రండి.

తరువాత మేమందఱమును, మోటారు బండి యెక్కి చిన్‌చాంగ్ మేడకు వెళ్లితిమి. ఆమేడ చూచుట కతిమనోహరముగనుండెను. ఒక చీనావాఁడువచ్చి, మమ్ములను సగౌరవ ముగ లోపలకుఁ దీసికొనిపోయెను.

చీనావాండ్ర గృహాలంకారవిధాన మతి విచిత్రముగ నుండును. ఎక్కడఁ జూచినను గాజుపని; ఆకుపచ్చ, నీలి, తెలుపు, రంగుగల పింగాణిముక్కలతో నతికిన చేతిపనులు. మను ష్యు లతివిచిత్రమైనటు లుందురు. పెద్ద పెద్ద తోక జడలు, మీసములులేని మూతులు, రం గుల తలలగుడ్డల కోట్లు, చిత్రమైన టోపీలు. ఈవిచిత్రము లన్నియుఁ జూచుచుఁ బోవు చుంటిమి.

............చూచుచుండఁగనే, మా యెదుటనున్న తలుపునకుఁ గల చిన్న రంధ్రము మూసికొనిపోయి తలుపు తెఱువఁబడెను. ఒకచీనావాఁడు మమ్మాహ్వానించెను. ఆచీనా వాఁడు తలుపు మూయఁబడియున్న కాలమున నాచిన్నరంధ్రమునుండి వచ్చువారెవరో యని మమ్ములను జూచి, పిదప తలుపుతెఱచె నని, మా కర్థమయ్యెను. ఈరహస్యమేమి?

మా వెనుక నడచివచ్చుచున్న, సూర్యారావు, వెంకటరావు నిలువునఁ గంపించుచుండిరి. సుభద్ర నాదగ్గఱగా వచ్చి చేరినది. నేను వారినందఱను, అల్లరిచేయక రండని సంజ్ఞచేసితిని. లోపలకుఁ బోవుచునే యుంటిమి. చీనావాఁడు మారాకను చీ-చాంగ్‌తోఁ జెప్పుటకుఁ బోయెను. ఆ సమయమున మే మటునిటుఁ జూచితిమి..............అచ్చట నొకమంచముపైఁ బరుండిన యువతి యొకత్తె పిశాచవదనముతో, హీనస్వరముతో సుభద్రను బిలిచెను. సుభద్ర దాని మొగముఁ జూచి భయపడెను. సుభద్రవఱ కెందులకు? నాకే గుండెలు జల్లుమనియెను.

ఆయువతి లేవలేక పడుచు——

“అమ్మా! మీ రీయింటికే వచ్చితిరా? నేనును, మీవలెఁ గొన్నాళ్ళక్రిందట సౌందర్యవతినే! నాకుఁ గొంచెము డబ్బుండెను. ఆ డబ్బు హరించి యీచీనావాఁడు, న న్నిందుఁ జేర్చెను. నాకు వీఁడు బాగుగ నల్లమందు నభ్యాసముచేసి నాతెలివిని జంపివేసెను. నా రూపము వికృతమయ్యెను. క్రమముగ నల్లమందు నిచ్చుట మానిరి. నాస్థితి మరణాసన్నమైనది. వీఁడు కొన్నినాళ్లు స్నేహము చేసి నస్లైచేసి, నమ్మించి తుదకు విందనిపిలిచి, యిందు బంధించి చంపి వారియాస్తిని హరించును. మీరును, దీనినుండి బయటఁబడక పోయితిరా నావలెనే యగుదురు... అదిగో! ఆపరున్నయువతి నిన్న నే యిందు చిక్కుపడినది.” అని పలికెను.

మాతనువులు వణఁకెను. గుండెలు కొట్టుకొనెను మహాభయంకరప్రదేశము——చుట్టును విపత్తులాక్రమించియున్నవి——తిరిగి మా యెదుట తలుపునకుఁ గంటిపరిమాణముగల రంధ్రము కనఁబడెను. ఏమైన సరేయని నేను జేబులోనున్న రివాల్వరును తీసి కంతలోనికిఁ గాల్చితిని. సుభద్ర,సూర్యారావు, వెంకట్రావు నాకు గజము దూరమున నుండిరి. తటాలున వారున్నబల్లపట్టు కదలి భూమిలోనికిఁ బడిపోయెను. వారందఱును బాతాళమునఁ బడిపోయిరి, తిరిగి బల్ల యథాస్థానమునకు వచ్చెను. ఇదియంతయు నొకక్షణములో జరిగిపోయెను. నేను చేతిలో రివాల్వరును వదలలేదు. కానున్నది కాకమానదని, ప్రతిఘటించి నిలిచితిని. పెద్దచీనావాఁడు లోపల నుండి వచ్చెను. తటాలున——నేను, వానిగుండెల కెదురుగా తుపాకినుంచి,

“చేతు లెత్తుము” అని పలికితిని.

వాఁడును, చేతులెత్తుకొని, భీతునివలె నటించుచు, వచ్చి నాపైఁబడెను. నాతుపాకి వానికి దొఱకలేదు. మే మిరువురమును పెనఁగులాడితిమి. సంకులసమర మయ్యెను. నేను రెండుమూఁడుబార్లు పేల్చితిని మొద్దువంటి

చీనావానిపట్టును వదల్చుకొనుట నాకుఁ గష్టసాధ్య మగుచుండెను.

ఇంతలో బయట, పోలీసువారియీలలు వినఁబడియెను. తలుపులను బ్రద్దలుచేసికొని, పోలీసువారు లోపలఁ బ్రవేశించిరి. చీనావాఁడు నావంకకుఁ గ్రోధముతోఁ జూచెను. ఇంతలో నాయింటిభూబిలపుమెట్లనుండి, ఒకపెద్దమనుష్యుఁడు సుభద్ర, వేంకటరావు సూర్యారావులను వెంటఁబెట్టుకొని వచ్చుచుండెను. నాయానందమునకు మేరలేకపోయెను. ఆ పెద్దమనుష్యుఁడు—మా హరిరావు—

హరిరావు సుప్రసిద్ధపత్తేదారుఁడు; మా మిత్త్రుఁడు. తరువాత చిన్‌చాంగ్‌నకు శిక్ష యయ్యెను.

౨

ఒకనాఁడు మేమందఱమును, పంతులుగారి ఇంటిలోఁ గూర్చుంటిమి. హరిరావుకూడ నచ్చట నుండెను.

సూర్యరావు, తాను చదువుచున్న ఆంగ్లపత్త్రికను పట్టుకొనివచ్చి—"చిన్‌చాంగ్ జెయిలునుండి పారిపోయెనాఁడు" అనియెను. మే మది విని, జెయిల్‌నుండి పారిపోయినవాని సాహసమున కాశ్చర్యపడఁజొచ్చితిమి. మాపై నేదైన ప్రతీకారము చేయునేమో యనిసైతము మేము భయపడక పోలేదు. మాహరిరావు—పత్తేదారు—చీనావానినిబట్టుకొని తీరెదనని ప్రగల్భములు కొట్టెను. సుభద్ర యచ్చట బల్లపైనున్న కోపాలను లోపలకుఁ దీసికొనిపోయెను. వేంకటరావు ముందరనున్న టీకోపా నెత్తుటతోడనే యొక చిన్నచీటీ కనఁబడెను. అందు,

"నీవు సుభద్రను పెండ్లాడఁదలంచితివఁట! జాగ్రత్త! ఈరాత్రి ఒంటిగంటకు నీవు చచ్చెదవు" అని యుండెను.

వేంకటరా వాచీటి నటులే క్రింద జారవిడిచి భయకంపితుఁడై పడిపోయెను.

నేను—ఈచీటి యిచ్చటి కెట్లు వచ్చినది?

సుభ—నాకుఁ దెలియదు.

హరి—మీ యింటి సేవకులలోఁ జీనావాఁ డెవ్వఁడైనఁ గలఁడా?

పంతు—కలఁడు.

హరి—నే నదేవలదని మొత్తుకొన్నది చీనావాండ్రను నమ్మవలదని నేను చెప్పుచుండుటలేదా? చిన్‌చాంగ్ జెయిలునుండి వచ్చినాఁడు. మన కేదో పెద్దకీడు చేయఁదలపెట్టినాఁడు ............ సరే! లెండి. నేను తద్విషయమై జాగ్రత్తయందుండెదను. నే నీ రాత్రి మాత్రము మీకుఁ గనుపడను. ఒంటిగంట మాట జాగ్రత. అంతవఱకు నిద్రింపవలదు.

రాత్రి పండ్రెండుగంట లైనది. అందఱును మేలుకొని, మేలుకొని యప్పుడే కొంచెము మేనులు వాల్చిరి. ఐనను నిద్ర యెవ్వఱికిని పట్టలేదు. చీమ చిటుకుమన్న నులికిపడుచుండిరి.

వేంకటరా వొక కుర్చిపైఁ గూర్చుండెను. నే నాతని ప్రక్కనే కూర్చుంటిని; మే మిద్దఱ

మును గడియారములను నిదానముతోఁజూచుచుంటిమి. వేంకటరావు గుండెలు దడ దడఁ గొట్టుకొనుచుండెను. నే నాయింటి నాలుగు వైపులను జూచుచుంటిని. వేంకట్రావుచేతులు వణఁకుచున్నవి. చీఁచాంగ్ ఏవైపునుండి వచ్చిపడునో తెలియదు. ఇరుపురమును మాటలాడుటలేదు.

పన్నెండున్నర దాటినది.........ఊపిరి విడుచుధ్వనిదక్క వేఱేదియు లేదు. ......... ఉన్నట్లుండి చప్పడయ్యెను. ఉలికిపడి మేమిద్దఱమును వెనుకకుఁ దిరిగిచూచితిమి. ఒకమూలనుండి యింకొకమూల కొక యెలుక జగజర పరువెత్తుచున్నది.

గడియారము చూచితిమి. ......12-40 అయినది. వేంకటరావుభీతివర్ణింపనలవిగాదు... గడియారము తిరిగిపోవుచున్నది....... ఒంటిగంటకునా—లు—గు—నిమిషములున్నది 3......2......1...... వెంకట్రావు గుండెల ధ్వని నాకు స్పష్టముగ వినఁబడుచున్నది.

ఒంటిగంట యయినది.

వేంకటరావు గడగడ వణఁకుచుండెను. నే నిల్లు నలువంకల రెప్ప వేయక చూచుచుంటిని. ఏమియులేదు. నిశ్శబ్దము. ఒంటిగంట దాటినది. పైన పది నిమిషములైనది. వేంకటరావును నేనును—పెద్దనిట్టూర్పులు పుచ్చి,

"ఒంటిగంట దాటినది. అపాయము లేదు" అని పలికితిమి. కలఁతనిద్రనుండి లేచి సూర్యరావు, పంతులుగారు, సుభద్ర వచ్చిరి. నేను—అపాయము దాటినది; ఊరకభయపడితిమి. ఇది వట్టి బెదరింపు.



తరువాత ౨ గంటలవఱకు మేమామాటయే చెప్పుకొనుచుంటిమి. పిదప నిర్భయముగ వెళ్లి పండుకొంటిమి.

* * * *

మేము పరున్న వెంటనే చల్లనిగాలి వీచి, జోరున వర్షమారంభమయ్యెను. చల్లగాలికి మాకు నిద్రపట్టెను. బయట గాఢాంధకారము. మాకు నిద్రపట్టినదో లేదో— "ఢా"మ్మని తుపాకి ప్రేలినధ్వని వినవయ్యెను. లేచి చూచితిమి. వేంకటరావు ప్రక్కమీద లేఁడు. రక్తచ్ఛన్నమగు నతనియుత్తరీయ మున్నది—తలుపు తెరువఁబడియున్నది. ఏదో మోటారుమాత్రము బయట సాగిపోవుచున్నది. నాకెదురుగ వీథిలోని గంటస్తంభపు గడియారము కనఁబడెను. దానిలో సరిగా ఒంటిగంట యైయున్నది.

అట్లయిన, నాగడియారము తప్పు!

## 3

ఇప్పటి కొకహత్య జరిగిపోయినది. మరునాఁడు తేనీటిగిన్నె క్రింద మరియొకచీటి కనఁబడినది. అది సూర్యరావుకు వ్రాయఁబడినది.

"ఈరాత్రి పండ్రెండున్నరకు నీప్రాణములు జాగ్రత్త!" అని యుండెను. అందఱమును విస్మితులమైపోయితిమి. ఈచీట్లెక్కడినుండి వచ్చుచున్నవి? హరిరావు చీనావానిపై నను మానించియుండెను. నే నాలోచించిచూడ, చీనావానిప్రసక్తి యిం దేమియును లేదు. పరిశుభ్రమైన బల్లమీఁద, సుభద్ర చేతులతోఁ దెచ్చిపెట్టిన తేనీటిగిన్నెలు—ఎవ్వరిపై నను

మానింపవలయు—సుభద్ర మనోరమవంటి హంతకురాలు కాదే!—

నేను—సుభద్రా! నీవు గిన్నెలను తేకపూర్వము, గిన్నెల క్రిందనెవ్వరైన నీచీట్ల నతికించియుండరుగదా!

సుభ—అట్టియవకాశమే లేదే!

లక్ష్మి—నాకిదేమో పెద్ద మహేంద్రజాలము వలె నున్నది.

సూర్య—నా ప్రాణములు విడువవలసిన దేనా?
సూర్యారావు మొగము పాలిపోయినది. అతఁడు వణకుచుండెను.

హరి—నీకేమియు భయములేదు. నేనీరాత్రి నిదగ్గఱ నుండెదను.

ఆరాత్రి నేనును, హరిరావును, సూర్యారావునకు సమీపమునఁ గూర్చుంటిమి. నేను "మనోరమ" యను నవలను జదువుచుంటిని. అందలి "జుమిాలియా" చర్యలను వినినప్పుడు సహజముగ భీతినందిన సూర్యారావు, గడగడ వణకఁజొచ్చెను. నేను నవ్వుచు నాతనివీఁపుపైఁ దట్టి యాపుస్తకమును మూడిచి "సీతావనవాసము"నందలి, వియోగకథాఘట్టముం దెఱచితిని.

హరిరావనుమానదృష్టులతో, నలువంకలఁ జూచుచుండెను. మా ముగ్గురి యొద్దను తుపాకు లున్నవి.

సూర్య—నామనస్సు తిన్నగలేదు. నీవుచదువునది నాబుర్ర కెక్కుటలేదు. ఎన్ని గంటలయినది?

నేను—పండ్రెం డయినది.

సూర్యారా వులికిపడి, "అట్లయిన సమిాపించినది" అని యొకవెఱ్ఱికేక వేసెను.

హరి—జాగ్రత్తగా నుండవలెను బాబూ!

పుస్తకమును కట్టిపెట్టితిమి. జాగ్రత్తకొఱకు తలకొకచుట్ట వెలిగించితిమి. అప్పటివఱ కేయలజడియును లేదు. పండ్రెండు పది నిముసము లైనది ఇఁకనిరువదినిముసములకు,

సూర్య—హరిరావూ! హరిరావూ !! ......
ఏమిది? నాతల.........గడియారము......గడి.........సమయమైనటు లున్నది. ......తలతల.........బరువు...... కన్నులు బరువు............

సూర్యారా వకస్మాత్తుగఁ బడిపోయెను. ఇద్దఱమును పరుగెత్తి చూచితిమి. ఇంకను మరణింపలేదు. హరిరావు కొంచెమాలోచించి యటునిటుఁ జూచి, సూర్యారావు కాల్చిపారవేసిన చుట్టను వాసన జూచెను.

హరి—విషపూరితమగుచుట్ట ! ఇది నీ కెట్లు వచ్చినది?......భయము లేదు. నాయొద్ద దీనికి విరుగుడు కలదు.

హరిరావు తనజేబునుండి యొకచిన్నపెట్టెను తెరచెను. అందొక యంగుళముపొడవుగల చిన్నసీసాలు పదియుండెను. వానినుండి యొకసీసాను తీసి వెండిగిన్నెలో రెండు చుక్కలు వేసి నీరు కలిపి సూర్యారావున కిచ్చెను. సూర్యారా వాయౌషధమును త్రావెను.

హరి—మందు లోపలకుఁ బోయినది. ఇఁక భయము లేదు. నేను గడియారమువంక

కును, సూర్యరావు మొగమువంకకును జూచుచుంటిని. హరిరావుమందు పని చేయలేదు. సరిగా పండ్రెండున్నరకు సూర్యరావు ప్రాణములు పోయినవి.

"హరిహరీ!" యని నేను గడియారమును నేలపై వదలితిని. హరిరావు తొందరపడుచు, గిన్నెను బరీక్షించెను. గిన్నెలోనిది కేవలము నీరు—అది మందు కాదు.

సీసా పరీక్షించెను. వట్టి మంచినీరు—

కడమసీసాలలో నిది మందే. ఆసీసాలోన మాత్రము నీరు నింపఁబడియుండెను. ఏమి చిత్రము?

మేమిద్దఱమును విస్మయమందితిమి! ఇద్దఱి నోటను మాట రాలేదు. ఇంతలో బయట, "ఢాం"మ్మని ధ్వనియయ్యెను. తుపాకులను పట్టుకొని మేము చూడఁబోయితిమి. ఎవ్వఱును లేరు. తిరిగి లోపలకు వచ్చితిమి. సూర్యరావు శవ మక్కడ లేదు.

౮

ఇప్పటికి రెండుహత్యలు నిరాటంకముగ జరిగిపోయినవి. మూఁడవహత్య బహుశః హరిరావువంతునకు రావలెను. లక్ష్మణరావుగారి యింట తేనీటిబల్ల తీసివేయఁబడినది. హరిరావు విషయమై నాకు మిగుల ససంతృప్తి కలిగెను. అతఁడు సుప్రసిద్ధపత్తేదారుఁడు. ఐనను, నీవిషయమున బుద్ధిజాడ్యగ్రస్తుఁడయ్యెను.

మేమందఱముఁ గూర్చుండఁగా పోస్టులో మా హరిరావున కొక యుత్తరము వచ్చెను.

"నీ వీ కేసులో పనిచేయుచున్నట్లు తెలియుచున్నది. నాకు వ్యతిరేకముగ చరించినచో నేఁటిరాత్రి రెండుగంటలు దాటకుండ చచ్చెదవు" అని యుండెను.

హరిరావును భయపడెను. కాని లేని ధైర్యముఁ దెచ్చుకొని "చూడు, ఏమి వీని శక్తి!!" అనియెను.

* * * *

అందఱమును మేలుకొని జాగ్రత్తగ నుంటిమి. కాలపురుషుఁడు నిశీథరథమును చల్లగా నడుపుకొనిపోవుచుండెను. నిశారమణి నల్లని ముసుఁగుఁ గప్పుకొని, దొంగవలె నిశ్శబ్దముగ నడుచుచున్నది.

హరిరావు పిస్తోలు చేతఁ బట్టుకొని, బయటిచావడిలోఁ దిరుగుచుండెను. సరిగా రెండుగంట లయ్యెను.

"ఢాం" అని తుపాకి ప్రేలెను.

చుట్టును పొగ గ్రమ్ముకొనియెను. మేము దగ్గఱ కరిగిచూడఁగా హరిరావు నిర్జీవుఁడై పడియుండెను. విస్మయ భయ శోకములతో మేము శత్రువులను వెదకుటకు బయటకుఁ బోయితిమి. ఎవ్వఱును లేరు. తిరిగి వెనుకకు వచ్చి చూడఁగా హరిరావుశవ మచ్చటలేదు. ఏమి యాశ్చర్యము?

* * * *

నేను గదిలోఁ గూర్చుంటిని. పూర్వాపర సందర్భ నిర్మాణముఁ గావింపలేక నామెదడు కల్లోలమగుచుండెను. అకస్మాత్తుగా లక్ష్మణరావుగారు నాగదిలోనికి వచ్చి విచార భయముతో నొక యుత్తరము నిచ్చెను.

"వెంటనే లక్షరూపాయలను పెద్ద మఱ్ఱి చెట్టుదగ్గఱకుఁ దెమ్ము. మఱియొకరు రాఁగూడదు. ఒకఁడే తేవలెను. ఆయుధము లుండఁగూడదు. దీనికి వ్యతిరేకముగ జరిగినచో ప్రాణము లుండవు." అనియున్నది.

లక్ష్మణరావుగారు దుఃఖముతో "బాబూ! లక్షరూపాయల కేమి భాగ్యము. ఈచీనావాం డ్రెంతైనఁ జేయ సమర్థులు. ఈ పిశాచశత్రువు వదలుటే మంచిది" అని పలికెను.

నేను—చిన్ చాంగ్ పై మీ రెంతవిశ్వాసముతో నుంటిరి !

పంతు—కుటిలులు నెట్లు తెలిసికొనవచ్చును?

నేను పంతులుగారి యాలోచనకుఁ జాల సేపు సమ్మతింపలేదు. ఆవల లక్షరూపాయలు, ఈవల భయంకరశత్రువు. కొంత సేపటికి నాలో నే నాలోచించుకొని, ప్రాణములకొఱకు సమ్మతించితిని. నన్ను సమ్మతింపఁజేసి, నే నేదో యాలోచించుచుండఁగా లక్ష్మణరావాగది విడిచెను.

* * * *

పెద్దమఱ్ఱిదగ్గఱకు వెళ్లి నేను కాచుకొని యుంటిని. నేను మోటారునుండి దిగలేదు. .........ఇంతలో మఱియొకమోటారు నాకెదురుగా వచ్చెను. అందు ముగ్గురుమనుష్యులుండిరి. తలమీఁదినుండి కాళ్లవఱకు, నల్లని ముసుఁగు లుండెను. ఆగూఢశత్రు లెవ్వరో?

శత్రువులలో నాయకుఁడు నన్నుఁజూచి "పిస్తోలు తీసివేయుము; ధనము నిమ్ము; చేతులెత్తుము" అనియెను. నేను నాయొద్దనున్న పిస్తోలు నచ్చటఁ బెట్టితిని. కోటులోనుండి నోట్లకట్టలను దీయుచుంటిని.

పరమేశ్వరుఁడు ధర్మమునుఁ బరిపాలించెను. అంతయు నాశ్చర్యము. నిముసములో, సర్వమును దలక్రిందులైపోయెను.

నా శత్రువులకు వెనుక నున్నచెట్లలో నుండి యిరువదిమంది, పోలీసుభటులు వచ్చి చుట్టుముట్టి

"పిస్తోళ్లు పేల్చితిరా చచ్చెదరు!"

అని యిరువదితుపాకులను, మువ్వురు గూఢశత్రువులగుండెల కెదురుగా నుంచిరి. శత్రువులు తుపాకులను క్రిందఁ బెట్టిరి.

నేను తుపాకిని, చేతఁబట్టుకొని, వారి తలలపై నున్నముసుఁగులం దీసితిని! ఏమి యాశ్చర్యము!

చిన్ చాంగ్ కాఁడుగదా! కాఁడే! ఎవరు మఱి?

"నీవేనా !"

అని నే నాశ్చర్యముతో పెద్ద గానంటిని.

అతఁడు మా హరిరావు; హరిరావు తల వంచుకొనియెను. ఐన, నీయిద్దఱును నెవ్వరని చూతునుగదా!.................

ఒకఁడు.........సూర్యరావు

ఒకఁడు.........వేంకటరావు

ముగ్గురు నింటిదొంగలే. రక్షకభటులు వారి ముగ్గురకు సంకెళ్లు తొడగిరి. .........

ఆశ్చర్యములో నాశ్చర్యము!

చిన్ చాంగ్ జైలునుండి పారిపోనే లేదు.




కెంపుకనుఁగవ దళుకొత్తి క్రేళ్లువాఱి
తురగముల నేనుఁగులను నెత్తుటను
తద్రుధిరవార్ధిఁ దృప్తిగాఁ దానమాడి [ముంచి
యుఱుకుచున్నాఁడ వెటకోయి? యోకుమార!

వీర! వెన్కఁ జూడ వదేమి?—పిఱికిపంద
లిప్పు డుసురుల నొసఁగితి వింతలోన
నే! యకట! నిన్నుఁ బ్రింగఁ దామెంచుచున్న
వారు!—"నే నెఱుంగనివారు కారు; ప్రాత
కాఁపులే" యని తలఁపూఁచి కదనభూమి
నుఱుకుచున్నాఁడ వెటకోయి? యోకుమార!

కన్నవారికిఁ గనుఁగొనఁ గన్నవారి
కేమి ముచ్చటల్ మునుపు చూపించినావు?
ఆఱునెలలయ్యెనా? పెండ్లియాడియైన?
ప్రాణములతీపి లేదె? రవ్వంతయైన?
అలసుదేహ్ణ, నీయత్త కన్నులకుఁ జల్లఁ
దనముఁ గూర్చవాయేమి?—"పెత్తండ్రిగారి
యానతిమెయి నిప్పుడొకపాత్రావలంబి
నైతిఁ దదుచితకార్యమ్ము లంతమొందు
వఱకు నాకత్తి వెనుకకుఁ దిరుగఁబోదు
వారిముప్పును దప్పించువాఁడ ననుచు
గంపెఁడాసతో నన్నిట గంపినార
లట్టివారితలంపుల నగ్గిఁ గాల్చి
వారలను దలవంపులపాలొనర్చి
చందురుఁడు మొదల్ నేఁటికి జారుచున్న
కీర్తిసుధ నేన దిగఁద్రావి, గెలిచెతు
నా? మదీయవంశక్రమోద్దామపౌరు
షంబు?—నీ విరోధిబలంబు సానబట్టి
పొడిపొడిగఁ జేసి భారతభూమినెల్ల
జల్లి, యెగుడుదిగుడు మాన్పి, సరిసమం బొ
నర్చి, నేఁ బరిపంథిబృందమ్ము గెలి
చెతునా?"—"మొన్నగదర! విల్ చేతఁ బట్టె
నింతలో నెంతవాఁడయ్యె"—"నితఁడురా! కి
రీటి మఱపించెఁ దన తెల్వితేటలందు"
"ఇతఁడురా! మానధనుఁడు ఇంకెవఁడు విడుచు
పడుచుఁదనపు సౌఖ్యమ్ము లీపుడమిలోన"
"వీఁడురా! కసిఁదీర్చెడువాఁడటంచు
వినుతి కుప్పలుపోయంగ వీరకోటి
విఱుచుకొని పడుచుండిరి పిఱికిబంట్లు
కాచుకొనుమోయి! యీదెబ్బఁ గాచుకొనుము.
జౌనవుఁ, నీవ వీరుఁడ—వంతలోన
నెట్లు శత్రువారమును నిర్జించితోయి?
యుఱుకఁబోకు! నేదనుదీర్చుకో రవంత!
నీనుదుటిరక్తతిలకమ్ము నీరుగారఁ
జొచ్చె; మత్తగజముఁ గూలె సోలి పడితి
వకట! యీస్థితిలోన నిన్నాదరింప
నెవ్వరును లేరు; నిన్ను వీక్షించు మేమె
గడగడవడంకుచున్నాము; కాలగతికి
నెవ్వరేమి సేయఁగలము?—రువ్వుచుంటి
విప్పుడుఁ గూడ రివ్వున నెగిరి వాఁడి
వాలుగముల— నయ్యయ్యో! నీకేలుదమ్మి

చిందుచున్నది నెత్తురుబిందువ్రలను.
వైరులును గంటిలో దుమ్ముపడువిధాన
గాలిలో వర్ష ధారలకరణిఁ బాఱి
నారు; చిందఱవంద లైనార లెందు
పోయిరో! కానఁబడరన్న!—— పొగరుబోతు
లరుగొ! యొక్కఁడై గుసగుసలాడుచున్న
వార లైనను నీచూపుమేర లేరు——
దాహమయ్యెనా? నేఁటియీమోహరమున!
నాల్క తడియారిపోయెనా, పల్కవేమి ?
కన్నతండ్రి దగ్గర లేఁడుగాని, నీకు
దివ్యపాతాళజలము నందింపకున్నె?
అంత నేటికి? నాతఁ డీప్రాంతమునన
యున్న నీ కిన్నిపాటు లుత్పన్నమగునె?
అరులు తారుచు నున్నార లచట నిచట
నేమికారణమో కాని—— ఏమి సేయఁ
గలము?—— నీ కడ్డమైన రాఁగలమె, కుఱ్ఱ?
అరరె? యెంతటిదురవస్థ! అంతలోన
పిఱికిపందలు వెనుకకు వెనుక కొదిగి——
కరము గడగడవణఁకు నీగతిఁ దలంచి——
లేఖినికి మాత్ర వెనుకంజ లే దదేమొ!
నీప్రతాపవర్ణనఁ దనివిసనకనో?——
ఒక్కఁడై యొనగాండ్రు దుర్యోధనుండు
కర్ణుఁడును, దుష్టశాసనాగ్రణియు, సైంధ
వుండు రణధర్మమును పీటఁబుచ్చి,—— తావ
కీయ, పాంచభౌతికమైన గ్రీవనాళ
ముల విభేదించి, రూపుమాపుటకుఁ గాని
పేరు నెవఁడు మాపఁగలాఁడు పృథివిలోన?
చదరఁ గనుఁగొను మదె! వియచ్చరులు పాల
వెన్నెలలబిందువులు చిమ్ముసన్నజాజి
పూలమాలలఁ గ్రుచ్చి రింపులు సెలంగ
నీకుఁ గైసేసి నిన్ను మన్నించుకొఱకు
విధివశమ్మునఁ జేజారి ప్రేలఁబడెడు
కత్తిఁ గనుగొని మీఁపై కి నెత్తె నన్న
భ్రమమెయిఁగ బాఱెద రదేల? రాచపిడుగు
పాఱుఁబోతులపైఁ బడువాఁడు కాఁడు
ఎవఁడు మాపఁగలాఁడు నీధవళకీర్తి
రక్తధారలలోన నవ్యక్తమగుచు
నంబరంబున మివుల సువ్యక్తమగుచు
భూనభోంతరములు నిండిపోయెనోయి!
"సంతసింతుమా! నీదు విక్రాంతి కొఱకు,
కనులు మూసి విప్పెడులోనఁ గదనభూమి
నెత్తుటేరులతోడ నిండించుకొఱకు,
పీనుపెంటలతోడఁ గప్పినగతికయి,
తోఁకల విదిల్చి నీపైకిదూకి, వీక
చెడి, భయంపడి, గగ్గోలువడుచుఁ బోవు
పాఱుఁబోతుల దాక్షిణ్యభావ మొలుక
విడిచిపుచ్చినందులకు, ——గట్టిఁడివిధాత
యెంతకష్టమ్ముఁ గూర్చిన, నింత యేని
మారణమ్మున; రణధర్మ మారకుండ
నసువు లున్నంతఁ బోరాడినందుకొఱకు
"కన్నుగవ నస్రుధారలు గార్చుమా? సు
భద్ర కడుపు అంపపుఁగోఁతవడగఁ జేసి
నందులకు —— తండ్రి తనచేతులార నీకు
దహనసంస్కారము లొనర్చి తల్లడిల్లి
నందులకు. ——అకట! ——నీబిడ్డనైన నీవు
చూచిపోవనందులకు! ——నిస్తులయశస్క!
కాని యెనలేని కీర్తిఁ గాంచినావు-
ఎవఁడురా, లోకమున వీరుఁ డెవ్వఁ? డనిన
నోర! మాయభిమన్యుఁడే యనుచు నెందు
ముందు నీపేరు చెప్ప నుప్పొంగుచుందు
మెవఁడురా? నిజరాజ్యవైభవము కొఱకుఁ
బ్రాణములఁ బాసె నన్న మాపీణపాట
లందు నీపేరు విప్ప ముందంజ వైతు
మింతకంటెను మాకు నింకేమి వలయు?
ఇదియె మామనశ్శాంతి సుమ్మీ కుమార!
ఇదియె మాకు నానంద మోయీ, కుమార




తెనాలిలో అన్నివిధాలా సౌఖ్యమేకాని దోమలబాధ విపరీతం. చుట్టూమాగాని భూములున్న డెల్టాగ్రామాలన్నింటిలో ఏలయిుదారు నెల్లో దోమల బాధతప్పదు కాని ఎండ మండిపోతూ వడగాలి వీచేరోజుల్లో కూడా దోమలబాధ ఉంటుంది తెనాలిలో. ఇక నే చెప్పబోయేది శీతాకాలంలో ఒకనాటి సంగతి.

నవంబరు నెలలో అయిదారు రోజులు ముసురుపట్టింది. చలిబాధకుతోడు దోమల బాధ. ఆరాత్రి అంతా దోమలతో కునుకు పట్టిందంటే వట్టు. ఏకాదశి అయినా బాగుండేది. జాగారం కలిసివచ్చేదని అనుకున్నా.

తెల్లగా తెల్లవారింది. గొల్లది పాలుపొయ్యడానికి వచ్చింది. "ఇవాళ గుంటూరు వెళ్లుతారా ఇక్కడే ఉంటారా? మధ్యాన్నం కాఫీకి పాలుపోయించుకో డానికి" అని మాఆవిడ అడిగింది. రగ్గుగట్టిగా ముసుకు పుట్టుకుంటూ "వెళతా" అన్నాను. పాలుపోయించుకొని మాఆవిడ ఇంట్లోకి వెళుతూ "కాఫీ తయారవుతున్నది. లేచి ముఖం కడుక్కోందురూ" అన్నది." సరేలే అన్నాను.

*　　*　　*　　*

"అబ్బాయి, కాఫీ చల్లారి పోతున్నది తాగరా; కాఫీతయారుచేసి ఇంకావస్తావు, ఇంకావస్తావని వంటఇంట్లో కనిపెట్టుకుని కూర్చుంటేఏవో పాడు ప్లానులు ముందరేసుకు కూర్చున్నావు. మహాఇల్లు కట్టించేవాడికన్నా తగదు. ఇప్పుడా ప్లానుకేం తొందరొచ్చింది" అని మా అక్క కాఫీకప్పు సాసరు తెచ్చి నాబల్లమీద పెట్టి అక్కడపడిఉన్న ప్లానుచూస్తూనిలబడ్డది. తెనాలిలో నేకొన్న చిన్న స్థలములో చాలా అందంగా అన్ని వసతులతోటి చిన్న ఇల్లు కట్టించాలని అప్పటికి ఎంతలేదన్నా ముప్పైనలభై ప్లానులు వేసినట్టు వేశా. ఏ ప్లానులో చూచినా వంటయింటిదగ్గరేవచ్చింది చిక్కు. పూర్వాచార ప్రకారం వంట యిల్లు కుడిప్రక్కగా ఉండాలట. దానిప్రక్కనే భోజనాలగది ఉండాలట. దక్షిణపువైపున వంట ఇల్లువేస్తే భోజనాలగదిలోకి దక్షిణపు గాలి రాదు; భోజనాలగదికి ఉత్తరవైపున వంట ఇల్లుఉండరాదు. భోజనాల గదిదక్షిణానికేకట్టబడ్డ వంటఇల్లు దానికి పడమరగాకట్టిదామాఅంటే ఇక అటు స్థలంలేదు. అదీ చిక్కు! ఏదోరకంగా ప్లాను సవరించి వంటయిల్లు కాకితం మీద ఏర్పరిచా. పొయిలు పడమరముఖంగా ఉండాలి; అదో చిక్కు! "పొయిలు ఇక్కడ ఉండొచ్చునా?" అని పెన్సిలుతో చూపించి, "నీ కలా తెలియదు. వ్రాసిచూపిస్తేనేకాని" అని మహా ఉత్సాహంతో టీస్క్వేర్ డ్రాయింగు బోర్డు

మీదికి లాగి సెట్ పై డ్రావర్ కోసం ప్రక్కకు వంగిన్నాను. పొడుగ్గాఉన్న టీస్ప్రేవర్ కాఫీ కప్పుకుతగిలి క్రిందపడి భళ్లున పగిలింది. నా కడుపులోకి పోవాలసిన కాఫీ క్రింద కాలువకట్టి అక్కడపడిఉన్న రెండుమూడు ప్లాన్లను తడిపి ధ్వంసంచేసింది. పనికిరానిప్లానే కదా పాడయిపోయినా మానేనని "కాఫీ పట్టుకురాగానే తాగినట్లయితే కాఫీ కడుపులోపడేది; ఎంతో సరదాగా కొనుక్కున్న చైనాకప్పు పగిలిపోకుండా ఉండేదికదా; అయినా మన మేమిచేస్తాము. చైనా అంతటి దూర దేశంలో తయారుఅయి బహుదూరం స్టీమరు రైలుప్రయాణాలుచేసి మాఇంట్లో ఈయేణ్ణర్ధమునుంచి ఉండి అనేకగాలన్ల కాఫీ నాగొంతులోపోసి చివరకిలా ఇవాళ టీస్ప్రేవర్ తగిలి ముక్కలు కావాలని దానికి రాసిపెట్టి ఉంది కామాల్సు" అనే వేదాంతపు ధోరణిలో ఉండేటప్పటికి కాఫీప్రవాహం కాకితాలక్రింది నుంచి మళ్లీ కాలువరూపందాల్చి, రాత్రి చదివి బల్లమీదపెట్టిన "If winter comes" ఏలాగో క్రిందపడిఉంటే, దానికి ఎదురుతాకి చిన్న చెరువాకారం తాల్చింది. బంగారమంటి నావెలు పాడైందికదా అని ఛప్పున లేచి పుస్తకం తియ్యబోయినా. డ్రాయింగుబోర్డు వగైరాలు బల్లమీదజరిగి టేబిలులాంపును క్రిందికితోసేసినవి. చిమ్మినీ గ్లోబు ముక్కలుముక్కలయినవి. అంతట నాకు ఎక్కడాలేని చికాకు వచ్చింది. చికాకుగా పెద్దగొంతుతో "కుర్ర వెధవకి ఇంగ్లీషునావెలుతో ఏంపని? చీకటితోనే ఏమిపుట్టి మునిగిపోయిందని బల్లమీది నుంచితీసి కిందపెట్టాడు. పిల్లవాడు కింద పారేశాడు. తీసి బల్లమీద పెట్టాలని తల్లికైనా ఆజ్ఞానం ఉండొద్దూ? నిక్షేపమంటి పుస్తకం కాఫీపడి తగలడిపోయిందా!" అని పుస్తకంతీసి ధోవతితోనే తుడుస్తున్నా.

టేబిలు లాంపు క్రింద పడ్డ చప్పుడు, నాపెద్ద కేకలు విని పిల్లవాణ్ణెత్తుకుని మాఆవిడ గదిగుమ్మంలోకి వచ్చి, "అయ్యో ఇదేమిటండీ" అన్నది. "ఏమిటా నీమొఖం నామొఖమునూ! లాంపు కప్పు బద్దలైనవి. కాఫీపడి ఈపుస్తకం తగలడిపోయింది. కుర్రాడుకిందపడేస్తే పుస్తకం బల్లమీద పెట్టాలని తెలియదూ" అన్నా. "వేడి కాఫీ వంటిమీదపడితే కాస్తవళ్లు కాలొచ్చుగాని పుస్తకం కాల్తుందండీ; మీదంతా మరీ సోద్యం; కాస్త కాఫీపడ్డందుకేనా ఇంత కోపం. తుడిస్తేఅదే పోతుంది" అని సహజ సౌమ్యంతో అన్నది. ఆవిడ కనుకొలుకుల్లో అప్పుడు ఒక్కపిసరు చిరునవ్వుకూడా ఉన్నట్టు నాక్కన పడ్డది.

నాకు వళ్లు మండింది. కుర్రాణ్ణి గూబ కదలేద్దామా అన్నంత కోపంవచ్చింది. వాడికేసి తీవ్రంగా చూచాను. చేతిలో ఉన్న పన్నీరు పువ్వులు నాకు చూపిస్తూ, "లాల్లా, పూలు, పువ్వులు" అన్నాడు నవ్వుతూ. నాకు కించిత్తయినా కోపంతగ్గలా. "పుస్తకాలు కిందపడేసి తగలెయ్యటానికి, దొడ్లోపన్నీరు పూ లేరటానికి కాకులు కుయ్యగానే లేస్తావు" అంటూ ఉండగా కుడిచేతులోవున్న పువ్వులలోనుంచి ఎడమచేతి వేళ్లతో ఒకపువ్వుతీసి "లాల్ల కోత్త-



సర్ కే. శేషాద్రిఅయ్యరుగారు మైసూరు
వీరు కొంతకాలము మైసూరు దివానుగా నుండిరి.



రాజసభాభూషణ దివాన్‌బహాదరు
సర్ కే. పి. పుట్టన్న శెట్టిగారు, Kt., సి. ఐ. ఇ.

లాల్లా ఇంద" అని నామీదికి విసిరి; "అమ్మ కోతి- అమ్మా ఇంద; బువ్వత్త కోతి- బువ్వత్త ఇంద" అని కిలారిస్తూ పువ్వులు పంచుతున్నాడు. అప్పటికి నాకు నవ్వువచ్చింది. ఆపువ్వులు పట్టుకున్నచెయ్యి ముద్దెట్టుకొని పువ్వులు వాసనచూచి "కాఫీ ఇంకా ఏమన్నా ఉందా" అన్నా.

"మధ్యాహ్నం కాఫీ అక్కరలేదన్నారని పాలుకూడా పోయించుకోకపోతిని. మీగిన్నెలో పోసి మిగతాది చల్లారి పోతున్నదని వదినా, నేను, అబ్బాయి, తాగేశాము. బజారుకు వెళ్తారుకదా అక్కడ తాగండి ఇవాళిటికి" అని పిల్లవాడిని మంచము మీద దించి పగిలి క్రిందపడిఉన్న గాజు ముక్కలు పింగాణి ముక్కలు పోగుచేస్తూ, "ఎందుకీపింగాణీగిన్నెలు! వెండిగిన్నె అయితే పగిలిపోయేదా! ఆరురూపాయలుపెట్టి ఈకప్పు సాసరు కొన్నా నన్నారు. ఈముక్కలిప్పుడు ఆరుదమ్మిడీలు చేస్తయ్యా" అని అన్నది మా ఆవిడ.

"జపాను క్యూరోస్" షాపులో ఎంతో మోజుపడి కొనుక్కొని, సామాన్యంగా అందరిళ్లల్లోవలె మ్యూజియంలో ఉంచినట్టు అద్దాల బీరువాల్లో పదిలపరచకుండా వాడుకలోఉంటే ఆర్టు లైఫూ తోడుగా వెళ్లుతున్నై అని ఉద్దేశపడి ఆకప్పు సాసరుతోనే తప్ప మరో ఇతర గిన్నెలతో కాఫీ తాగకుండా ఉంటే ఆరురూపాయల గిన్నా అర్ధాన్నమై పోగా ఈ క్రాసు ఎగ్జామినేషనేమిటనిఅసహ్యం వేసింది. పోనీ బజారుకయినా వెళ్లి కాఫీ తాగి వచ్చి తీరికగా స్నానము చెయ్యవచ్చు నని, వంకెమీదున్న పట్టుతొడుక్కొని, పట్టుకండువా పైనవేసుకొని ఎఱ్ఱముఖములువేసి కుట్టిన బర్మాజోడు కాళ్లకు తొడుక్కొని ఏదో పరధ్యానంగా బజారే నడచి వెళ్లుతున్నా.

కొంతదూరం వెళ్లేటప్పటికి కాలు బురద గుంటలోపడి జోడు బురదయింది. ముఖములు జోడు అందమంతా ఒక్కనిమిషంలో మాయమై కోతి అయింది. అది కాలికి వేసుకొని ఎలాగా వెళ్లటమని ప్రక్కనే ఉన్న ఎరిగున్న వారింటి అరుగుమీద విడిచి "ఆన కెవర్నన్నా పంపుతాను వాడి కివ్వండి" అనిచెప్పి "ఏమిటి చెప్మ ఇవాళ. అన్నీ ఇలా తటస్థించినై" అని అనుకుంటూ వెళ్లుతున్నా.

"లేచిన వేళ్ల మంచిదిగా లేనట్టున్నది. ఇలాంటి అవకతవకాలు ఇంకా ఎన్ని జరుగుతయ్యో, కాస్త వళ్లుదగ్గరపెట్టుకు నడిస్తే మంచి" దని "మోటుగాడుంటుందని ఎవరన్నా. అనుకున్నామానె"నని మల్లుపంచె కొంచముపైకిపట్టుకుని క్రిందచూచి అడుగులువేస్తూ వీథిమలుపు తిరుగుతున్నా. "బం""బం" అని హారను చప్పుడు, మోటారుమోత, పూటీగోతిలో నిలిచి ఉన్న బురదనీళ్లలోగుండా మోటారు చక్రం పోవటం, మల్లుపంచా పట్టు నేను బురద నీళ్లల్లో సగం స్నానంచెయ్యటం, ఒక్కనిమిషంలో జరిగింది. ఏం అనుకుంటే యేముంది! కావాలిసింది కాస్తా అయింది. "మనిషులు రోడ్లు లింత పాడుగా ఎందుకుంచాలి, మోటారునడిపే వాడు కొంచెము జాగ్రత్తగాచూసి తోలరాదా"అని గొణుగుకుంటూ పాడయిపో

యిన మల్లుపంచె ఇంకేం పాడవుతుందని దాంతోకాళ్లమీది బురద బిందులు తుడుచుకొని పైకెగదోపి, షర్టుకనబడకుండా సిల్కుబాగా పైనకప్పుకుని బండిఏదైనా చూసి ఎక్కి ఇంటికి వెళ్లిపోదామనుకున్నా. చూపుమేరలో బండి ఏదీ కనబడలేదు. కొంచెముసేపు నిలబడితేనేగాని బండివచ్చేటట్టులేదు. "పదిమంది చూచేటట్టు వీధిలో ఎందుకు నిలబడాలి, ఏకాఫీ హోటలులోకో వెళ్లితేఇంత కాఫీఅన్నా తాగొచ్చు. బండి కనబడగానే ఎక్కి ఇంటికి వెళ్లొచ్చు"నని కాఫీహోటలు లోకివెళ్లి ఒకమూలనున్న బల్లమీద కూచుని, ఇడ్లీ అట్టుయేమి అక్కరలేదని కాఫీమాత్రము తీసుకొని, వేడిగాఉంటే పెద్దగిన్నెలోది కొంచెముగా చిన్నగిన్నెలో పోసుకొని ఊదుకుంటూ తాగుచున్నా.

వెనకనుంచి రాయి మరికొందరు స్నేహితులు ఏదోగలభాగా మాట్లాడుతూ పకపక నవ్వుతూ కాఫీహోటల్లో ప్రవేశించారు. ఈఖంగారైన బట్టలతో వీళ్లకెందుకు కనపడాలి అని మాట్లాడకుండా తలవెనక్కు తిప్పకుండా అమూలనే నక్కి కాఫీకప్పుముఖం దగ్గరపెట్టుకుని కూర్చున్నా.

రాయి నన్ను చూడలేదనుకున్నా. కాని, కాలాంతకుడు హోటల్లోకి రాగానే నేనున్నట్టు గ్రహించి ఉండాలి. సరాసరి నేను కూర్చుచున్న చోటికివచ్చిబుజముమీద చెయ్యివేసి గబగబకుదిలించి"ఏం స్నానం గీనం లేకుండా ఇలావచ్చావేం" అన్నాడు. ఆ కుదిలించటంతో నాఎడమచేతిలో ఉన్న పెద్దగిన్నెలో కాఫీఅంతా నాసిల్కుమీద షర్టుమీద పడి చర్మానికంటి వళ్లు చుర్రుమన్నది. ఇంటిదగ్గర కాఫీ పనర్మానోన్న వళ్లు కాల్చలేదు కాని మరి ఇక్కడ తప్పిందికాదు. చుర్రుమనే టప్పటికి చివాలునలేచి కాలినచోట చేత్తో తముడుకుంటూఉండటంలో నాబట్టల అవతారం చూశాడు రాయి. ఫక్కుననవ్వి నూటయాభై ఎనిమిదోమారు నావిదేశవస్త్రధారణాన్ని నిందిస్తూ,"గ్లాసుగోమల్లు పంచెలు, ఇంగ్లీషు ట్వీల్లు షర్టులు, సిల్కుకండువాలు వేసుకునే వాళ్లకి బురదాపడక కాఫీపడక ఊరికేపోతుందా" అని ఉపన్యాసం ప్రారంభించాడు ఖద్దరు ప్రచారకుడి లాగ.

ఇలాంటి అవస్థలో ఉండగానే వీడికి ఖద్దరు ప్రచారానికి సావకాశం చిక్కించుకోవాలా అని మనస్సులో అనుకుని "మీఖద్దరు మీద మోటారు బురద చిందగొట్టదా, కాఫీపడదా, వళ్లుకాలదా" అని ఏమేమో అన్నా కసి తీరేలాగ.

"అదికాదు" ఏమో అనబోతున్నాడు.

"అది కాదు లేదు, ఇది కాదు లేదు. ఇది ముందుచెప్పు; ఖద్దరుమీద బురద చిందదా? అదేంవాటరు ప్రూఫు, మడ్ప్రూఫు, ఫైర్ప్రూఫా" అనివాదన లోనికిదిగా. ఖద్దరును వాటర్ప్రూఫ్ మడ్ప్రూఫ్ ఫైర్ప్రూఫా అనే టప్పటికిరాయి తోకతొక్కిన తాచువలె లేచి కళ్లెర్రజేసి నాపైనున్న సిల్కుకండువా బలవంతాన లాగుతున్నాడు. నేనోపక్కా వాడో పక్కా లాక్కోవటంలో చినుగుతుందని దాన్ని విడిచిపెట్టా. నేను విడిచిపెట్టగానే

అతను కండువాను గబగబ చుట్టగా చుట్టుతూ "వెధవవిదేశిబట్టలు వాటర్ ప్రూఫ్ కావని నీకిదివరకే తెలిసింది. ఫైర్ ప్రూఫ్‌కూడా కాదని ఇదుగో తెలుస్తుంది చూడు" అని మండుతున్న అట్లపెనంకింద పొయిలోకితోశాడు. అదివరకే జోరుగా మండుతున్న సరుకు కర్రల మంట నిమిషంలో సిల్కు నుకమ్మేసింది. నలభైఅయిదు రూపాయల కండువా ఇలా తగల వేస్తాడని నేను ఎన్నడూ అనుకోలేదు. హోటలులో వాళ్లంతా నిర్ఘాంతపోయి చూస్తున్నారు.

" రాయ్! నీకసి అంతటితో తీరిందా!" అని రుద్ధకంఠంతో అన్నా.

అతను పులివలె నామీదికి ఉరికి "కసి అంతటితో తీరుతుందనుకున్నా?" అని నాచొక్కా గుండీల దగ్గర పట్టుకుని కిందికిచింపి కోటులాగ చేసి విసిరి పొయిమీద పారేశాడు. ఏమన్నా మాట్లాడితే చంపేసేటంతటి రౌద్రంతో ఉన్నాడు.

" నాకసి ఎలా తీరుతుందనుకొన్నావు? ఈ వెధవ విదేశి బట్టలు వేసుకుంటున్నందుకు ప్రాయశ్చిత్తంగా ఆమల్లుపంచెకూడా తగలేసి ఖద్దరు గోచీతో నిన్నుబజారువెంట ఇంటికి నడిపించి నప్పుడుగాని !" అని నా మల్లుపంచె కూడా అగ్నిహోత్రము పాలుచెయ్యటానికి నామీది కురికాడు.

"రాయ్! నీకేమైనామతి పోయిందా ఏమిటి? కాఫీ హోటల్లో ట్రయాహాంగామా అంతా?"

" కాఫీ హోటల్లోగాదు నట్టనడి బజారులో నైనాసరే" అని కుచ్చెళ్లుపట్టుకున్నాడు. నేను వంగి గట్టిగా మోచేతులతో రెండు పక్కలా ధోవతి అదిమి పట్టుకొని కుచ్చెళ్లు రెండుచేతులతో గట్టిగాపట్టుకున్నా.

రాయిపళ్లు బిగించి బలంకొద్ది ఒకగుంజుగుంజాడు. బట్టబంధనం సడలినట్లయింది.

* * * *

తుళ్లిపడట్లు మెళకువ వచ్చింది. గట్టిగా కప్పుకున్నర గ్గోమూాల కెళ్లింది. కాళ్లముడుచుకొని బట్టగట్టిగా చేత్తోపట్టుకొని మంచము మీద ఉన్నట్టుమెళుకువ వచ్చినకొన్ని సెకండ్లకు తెలిసింది.

లేచి పక్కమీదనే కూచుని ధోవతి బిగించుకుంటూ కలలో సంగతులన్ని ఒక్కసారి స్మరణకు తెచ్చుకున్నా. నవ్వొచ్చింది.

"కాఫీతయారైంది స్నానానికి వేడినీళ్లు తోడి సిద్ధంగా ఉన్నై. రైలుకు వేళకూడా అవుతున్నట్టున్నది లేస్తారా?" అనివంట ఇంట్లోనుంచి పిలుపు వచ్చింది.

సిగరెట్టు కాల్చుకుని వాకిట్లోకి వెళ్లేటప్పటికి స్వామీ, రాయీ, వస్తున్నారు.

స్వామి—ఏంమహాత్మా! ఇప్పుడే నిద్రలేస్తున్నట్టున్నాగు.

రాయి—మళ్లీ మల్లుపంచెలు కొనుక్కున్నావు.

స్వామి— ఎనిమిదిగంటలైనా నిద్ర లేవకూడదు!

నేను— లేదండి, ఉదయమే మెళుకువ వచ్చి మళ్లీకునుకు పట్టింది. బీభత్సమైన కల కూడా కన్నాను.

నేనేదో ఆందోళనగా ఉన్నానని స్వామిగారు గ్రహించి "పగటి కలలకుపట్టింపులేదండి; వెంటనే కాలకృత్యాలు కానివ్వండి; రైలుకైతే ముకింకా..." అని గడియారం తీసిచూచి "నలభైతొమ్మిది నిమిషాలున్న"దన్నారు.



# నిత్యమల్లి

జనమంచి వేంకట రామయ్య గారు

౧

ఏమి నీదుభాగ్యమహిమ యేమిరామణీయకం
బేమి సౌమనస్యగరిమ యేమి కామనీయకం
బహహా నినుఁగనంగనంతరంగమందునద్భుతా
వహముగా మెఱుంగుమెఱసె వానమబ్బునంబ
[లెన్.
నీవె నీదుపూలతోడ నిత్యమల్లి! యొకట నా
భావమందుఁజొచ్చితో వివర్తరూపమొందుచున్?
బాలకుఁడనుగానునీదు భవ్యరూప విభవసం
శీలనమున మోదమంది చెలఁగియాడుటకున యో!

౨

మెఱుపుమెఱసె మొగిడెఁ గనులు మిర్మిటుల్
ఘటిల్లె న [గాదె యీ
ట్లరసి చూడ బాహ్యదృష్టి వ్యర్థమగును
వార్ధకమున సంజదివియపగిది లోనిచూపు తా
సార్థకతనుగనెడునార్యజనులమ్రొక్కులందుచున్
"పూలతావి గిట్టదేమొ ముక్కు మూసికొ
నియెదున్ [డ్చెదున్
పూలవెలుఁగు వేఁడిసేయఁబోలుఁ గనులు మో
బేలతనముగాకయిది వివేకమే" యటంచు నన్
గేలిసేసి బాలిసుండు కేరడంబు లాడ నీ
మేల మధుపపాళిజోలి యేల నాకు నింకఁ ద్వ
న్మూలమూ శ్రయించితత్త్వబుద్ధిఁ దపము సలిపెదన్

౩

ఏలనిన్నుఁ జూడఁగానె యింపు పుట్టవలయునా
కేలయోలతామతల్లి, యేటి బాంధవం బిదా?
ఏదొ యెన్నరానిలోనిహేతువే యిదయ్యెడున్,
గాదునీదురూపమైత్రి క్షణికమగుటనది; యిఁకనే
భావమైత్రి గావలయును, బట్టిచూడనదియిలన్
గేవలమునుసత్యమగుచునిత్యమగుచుస్తుత్యమా
ప్రకృతికన్నఁ బ్రకృతిచేత వ్యక్తమైన భావమే
యకలుషప్రమోదదాయి యగును సూరిజ
[నులకున్
కవికినీవు మంచితలఁపొకండుగలుగఁజేయుహే
తువునఁజేసి నిత్యమల్లి! తోఁచెదవు మనోజ్ఞమై;
అతనికనులగుండఁ జూచునట్టిశక్తియే త్వదా
కృతినిగూడఁ జూడఁబడెడు నేకరసనిధానమై
చెఱువునీరు కాల్వగుండఁ జేనుదడుపువడువునన్
వేఱువడిన సోదరుల యభిన్నమైత్రి చెలువునన్

౪

భిన్నసుందరాకృతులను బిగ్గ గ్రుచ్చుప్రేమమే
నిన్నునన్ను నొకటిచేసి నిలుపునొక్కచోటనే
ఒక్కసూర్యకిరణమందునొదిఁగియుండుతేజమే
పెక్కురంగు లిడును సంజవేళ మేఘపటలికిన్

ఎచట నైక్య మచటఁ బ్రేమ మెచటఁ బ్రేమ [మచ్చటం
బ్రచురమగునుసుందరత్వమచలితక్రమంబునన్

౫

రాగమనక ద్వేషమనక ప్రకృతియును వికృతియునున్ [నియతిమై;
యోగమునకె తోడుపడుచు నుండు నెపుడు
ఒకటికొకటి యెదురుకొనుచు నుండు, రెండు చేతుల [శక్తికిన్;
లోకనియంతృ ధర్మమూర్తి కొకయమేయ
గారడీని చెండ్ల చిత్రగతుల వీనిలోన దు
ర్వారలీల నాడుచుండుఁబ్రాణిభాగ్యపరిణతుల్;
అమృతజలధిమంథనగము నాసురాసురాళియ
ట్లమితశక్తిఁ బట్టి త్రిప్ప నఖిలభువనచక్రమున్

౬

క్రిందమీఁద బడుచుఁ బ్రాణిబృంద మిందు మెల్లగా [మముగాఁ;
సందుచేసికొనుచు ముందు సాఁగుచుండుఁ గ్ర
నీవుగూడ నిత్యమల్లి! నేఁటి నీదు పెంపుకై
యీవిధమున నేప్రయాస మెంత చెందియుం [దువో!
ఎన్నితోట్లఁ బండినావొ యెన్నిచోట్ల నిలిచితో
యెన్నిమెట్లనెక్కినావొ యెన్నిపాట్లఁబడితివో!
ఎండ వానచలుల కోర్చి యెట్టితపము సలిపితో
దండితనము మెఱయ నేయుదగ్రనిష్ఠ నిలిచితో
ఇట్టిపెంపు నందఁగంటి వికమీఁదఁ గడఁగి నీ
వెట్టిసొంపుఁ గాంచఁగలవొ యెవఁడు చెప్పఁగలిగెడున్ [యిలన్
వెలుఁగుఁ గనుటకంటె లేదు వేఱుభాగ్య మీ వెలుఁగు నీయఁగలుగుకంటె వేఱుజన్మఫలమునున్
అయిన నీవు తృప్తినొంద నట్లె కానవయ్యెడున్
బయి కేకన్ను లెత్తిచూతుపయి కెచాతు చేతులన్
కాలుగదలకుండుఁగాని కదలుఁ బొదలికోరికల్
తాలిమిన్ భజింపుమీకృతార్థవగుదు ప్రియసఖి

౭

పుడమికడుపు వెడలి వెలయుపుణ్యశీల సీతకై
వడిని నిత్యమల్లి! నీవు భక్తిగరిమ మెఱసి యా
త్మేశుపాదపూజ సలుప నెత్తుదువు ప్రవాళసం
కాశలలిత కుసుమవిసరకమ్ర భాహుశాఖలన్
నీదుపూజ వ్యర్థమగునె? నింగి ముట్టుకున్న నీ
పాదతలము! పారిజాతపాదపంబు పోలికన్
పాదుకొనెదు నందనోపవనమునందు సన్మణీ
వేదికావరణము పాదపీఠ మట్టులొప్పఁగా;
స్థావరత్వమొందు దేవతా విశేషమూర్తివై
సేవగొనెదు దేవతాళిచే మహోన్నతస్థితిన్

౮

వేల్పుతోటజలముపసిఁడిబిందెలందుఁదెచ్చుచుం
గల్పలతిక వనుచు నీదుకాళ్లు గడిగి యంతటన్
విపులభక్తి నీకుమ్రొక్కి వేఁడి నీదుపూవులన్
ఎపుడు వాడకుండువాని నెల్లఋతువులందునుం
గొల్లయగుచుఁదావులెల్లఁగ్రుమ్మరించువానినిన్
మెల్లమెల్లఁ దునిమి నేర్పుమెఱయఁ దుఱిమి [కొప్పులన్
వింతచెలువమమరవేల్పువెలఁదులెల్లవీణియల్
సంతసమునమీటినీప్రసాదమహిమఁబాడఁగన్
వినఁగలట్టివైభవంబు నీకుఁ గలుగఁబోయెడున్
వినుమి యంతదనుక నాదుప్రేమపూర్ణగీతమున్



# ప్రయాణం

శ్రీ వాసుదేవరావు గారు

## ౧

ఇంగ్లీషువాళ్లు డ్రెస్సుచేసుకొనే రీతిగా డ్రెస్సు చేసుకోవడం నాకు మాప్రీతి; అలవాటు కూడాను. ఇంట్లో వున్నప్పుడొక మోస్తరుడ్రెస్సు; బయటికి షికారువెళ్లేటప్పుడొక మోస్తరుడ్రెస్సు; కాలేజికి వెళ్లేటప్పుడింకొక మోస్తరు. ఆటలాడేటప్పుడొకటి; అన్నిటికీ అన్నివిధాల డ్రెస్సులూ.

నేను బళ్లారికి ప్రయాణం నిశ్చయించుకొన్నాను. సాయంత్రం మెయిల్‌కు బయలుదేరాలె. బయలుదేరడానికి కొంచెం ముందుగా డ్రెస్సు చేసుకోవడం మొదలుపెట్టాను. ఈడ్రెస్సు ప్రయాణం డ్రెస్సు.

ప్రయాణంలో 'ఖాకీ' మంచిది. సూట్ అలంకరించాను. మెడకు 'స్టిఫ్ కాలర్'; 'టై' ముచ్చటగ చిన్నముడి పెట్టాను. సూట్‌పైన 'ఓవర్ కోట్' తగిలించుకొన్నాను. చైత్రమాసం కాదా, ఓవర్‌కోట్ యెందుకంటారేమో! కాని, అది ట్రావెలింగప్పుడు ముఖ్యంగా వుండవలసిందే! 'కర్చీఫ్'కు 'లావెండర్ వాటర్' రాచుకున్నాను. క్రాపు చక్కగా దువ్వాను. సాక్సుబూట్సు తొడుక్కున్నాను. పెండ్లికొడుకనుగదా — తగిన రీతిగా అలంకారంచేసుకుని నారూపు చూచుకుందామని నిలువుటద్దమెదుట నిలిచాను. అంతలోనే తటాలున వెనక్కితిరిగి చూచాను. ఎవరూలేరు! మాకాలేజి గణితాచార్యుడు శాంప్సన్ దొర యిప్పుడువచ్చాడే యింటిలోనేమైనాడా అనుకున్నాను. మళ్లీ అద్దంలో చూచుకున్నాను. నాకు నవ్వువచ్చింది. మళ్లీ శాంప్సన్ దొర రూపం నాకద్దంలో కనబడ్డది.




"మళ్లీ శాంప్సన్ దొర రూపం నా కద్దంలో కనబడ్డది."

నాకు నవ్వు కడుపుబ్బుతూ వుంది? నాప్రతిబింబం అద్దంలో చూచుకొని దొర అని భ్రమిశాను. ఏమాత్రమూ భేదం కనబడలేదు. అచ్చంగా అతడే నేనయిపోయినాను. అప్పుడు నా కామొందురోజే జరిగినపొరబాటు జ్ఞాపకానికి వచ్చింది. నేను దొరగారివద్దర పనివుండి బంగళాకు వెళ్లాను. వెళ్లేదోవలోనే బంగళాఆవరణలో పూలతోట వుంది. అక్కడ ఆయనగారి చెల్లెలుంది. ఆవిడ నన్ను చూడడంతోటే నవ్వుతూ దగ్గరికి రమ్మని చేసైగ చేసింది. నేను దగ్గిరకు పోయినాను. అప్పుడామె 'క్షమించండి; మాఅన్నయ్య అనుకున్నాను' అన్నది. సాక్షాత్తు చెల్లెలే పొరబాటుపడ్డది. ఇంకొకటి. నన్ను కాలేజిలో అందరూకూడా 'ప్రొఫెసర్ శాంప్సన్ది సెకండ్' అనేవారు. అదీ యిప్పుడు జ్ఞాపకానికి వచ్చింది. నే

నీసంభ్రమములో పడి మాఆనందిస్తూవున్నాను. ఇంతలో వాకిట నిలిచిన బండివాడు "వేళ మీరుతూవుంది. తొందరపడండి" అని కేకపెట్టడం వినబడ్డది. ఉలిక్కిపడి వాణ్ణిపిలిచి ప్రయాణంతోలుపెట్టె, పరుపూ బండ్లో పెట్టమన్నాను. వాడవితీసుకొనిపోయి బండ్లో పెట్టాడు. ఆతర్వాత నేను టక్కుటక్కుమని బూట్సులు చప్పుడు చేస్తూ మేడమెట్లు దిగివచ్చాను. నాకోసం మా అమ్మ యెదురుచూస్తూవుంది. ఇంకశెలవు తీసుకుంటూ మాఅమ్మకు సాగిలిమొక్కాను. మా అమ్మ నాతల తడివి ప్రేమపూర్వకంగా "సుఖంగా ప్రయాణం చేసి త్వరగా కోడల్ని తీసికొని వత్తువుగాక!" అని దీవించింది అప్పుడామెకళ్లలోనుండి నాలుగైదు అశ్రుబిందువులు నాతల మీద పడినవి. నా అనుగుతల్లి-నామాతృదేవత-ఆనందాశ్రువులను గురిపించి నన్ను అభిషేకంచేసిం దనుకొన్నాను. నాలోనే ఈలాంటి అమ్మను నాకిచ్చినందుకు పరమేశ్వరుడికి కృతజ్ఞతాపూర్వకంగా నమస్కారములు చేసినాను.

వేళ అయింది. బండివాడు తొందర పెడ్తూన్నాడు. మాఅమ్మ కళ్లల్లో బాష్పాలు కుస్తున్నవి. నాకూ కష్టంగానేవుంది. మా అమ్మను వదిలి నేనెప్పుడూ దూర ప్రయాణం చేయలేదు. ఇప్పుడు చేయవలసివచ్చింది. ఏమిచేయను? ప్రయాణం మానుకుందునా? కాదు. అమ్మకు కోడలుకావాలె. ఆమె బలవంతాన్నే యిప్పుడు నాకు ప్రయాణం కలిగింది. ఇప్పుడు మానినా రేపైనా యెల్లుండైనా పోయి పిల్లని చూచిరావలసిందేకాదా. ప్రయాణం మానడానికి వీలులేదు. నేనుమానినా అమ్మ మాననివ్వదు. మనస్సు విచారంలో మునిగిపోయింది. అయినా తప్పదు. గుండె నిబ్బరించుకొన్నాను. కాని, నాకన్నీళ్లాపుకోలేకపోయినాను. కాని, లోపలిదుఃఖం పైకుబుకుతూవున్నా అణచుకొన్నాను.

"అమ్మా, బండివేళ అయింది. వెళ్లివస్తాను" అని అనలేక అనలేక మాటలు తడబడుతూ అన్నాను.

మాఅమ్మ కండ్లుతుడుచుకుంటూ, "బాబూ,జాగ్రత సుమా? పిల్లవేపువారని వాళ్లని ఆయాసపెట్టకు. వినయంతో ప్రవర్తించు. హైద్రాబాదీ బడాయి చూపకు. ఇక్కడ నాతో మాట్లాడేమాదిరిగా పిచ్చిపిచ్చిగా మాట్లాడకు. నీకివన్నీ నేచెప్పనవసరం లేదు. నీకు తెలీని దేముంది? అయినా, కన్న కడుపు; తల్లిప్రేమ. ఎన్నడూ నిన్నువిడిచి నేనుంతలేదు. సుఖంగా, పెళ్లి సంతోషంగా రా, నాన్నా!" అన్నది.

నేను మళ్లీ అమ్మకు నమస్కారంచేసి బయటికి వచ్చి బండ్లో యెక్కినాను. మాఅమ్మ బయటికివచ్చి నిలిచింది. బండి నడవసాగింది. అమ్మ నాకు కనబడినంత దూరమూ చూస్తూ వేవున్నాను. బండి మరుగుపడ్డది.అమ్మ ముఖం కనబడలేదు. అప్పుడు నాకు కడుపులో ఒకవిధమైన వికారం పుట్టుకొచ్చింది. అది యీలాటిదని చెప్పలేను. మహాసముద్రంలో అలలవలె దుఃఖం పొట్ట పొంగి పొర్లిపోతూ వున్నది. బండి ముందుకు సాగుతూంది. మనసు వెనక్కి లాగుతూన్నది. ఏమిచేయను? ప్రయాణం మాననా? బండి నింటికి తిప్పమందునా?కాదు.రేపైనా ప్రయాణం చేయాలిసిందేగా? మనస్సు పదిలపరచుకున్నాను.

ఎట్లాగైతేనేమి స్టేషన్ చేరినాను. మెయిల్ బయలుదేరడానికి సెకండ్ బెల్ ఇచ్చారు. ఆదావిడిగ పోయి టిక్కెట్టుకొని ప్లాట్ఫారంవచ్చి రైలులో సెకండ్క్లాస్ లో యెక్కి కూర్చున్నాను. కూలివాడు పోర్టుమాంటో బెడ్డింగ్ తెచ్చి బండ్లోపెట్టినాడు.

రైలుబండి నడవసాగింది. నాహృదయంలో అమ్మను విడిచివచ్చినవిచారం వకవేపున, పెండ్లికూతును చూడ పోతున్నానన్న సంభ్రమ మొకవేపున,ముట్టుముట్టుకున్నవి. ఏంచేయను? ఈరెండవస్తువూ మరుపుకలగాలెనని యెంతెంతో ప్రయత్నించాను. కాని, యెవరినిమరువను? అమ్మను మరవనా? అదిసాధ్యమా? ఆప్రేమామృతమొలుకుతూండే మాటలూ, ఆవాత్సల్యపూర్ణమైన చూపులూ, ఆ దయాపూరితమైన ఉపదేశాలు, ఆమమత, ఇదిఅది అననేల? నన్నింతవానిచేసిన ఆమాతృదేవతామూర్తిని మరవనా? అంతకృతఘ్నుడనా? వీలులేదు. కాని, పెండ్లికూతును మరవనా? అయితే యిప్పు డీప్రయాణ మెవరికోసం? మామయ్య అన్నివిధాలా వర్ణించింది యెవరిని? సంసారయాత్ర సుఖంగా జరగడానికి తోడునీడగా వుండవలసిన ఆవిడ నేరుకొనేటందుకు పోతూ ఆవిడనే మరవనా? ఇదీ అసంభవమే. ఇద్దరినీ మరువలేను. పోనీండి; బండ్లో మా

ట్లాడుతూ పోదామంటే ఆబండ్లో మరెవ్వరూ లేరు. నే నొక్కణ్ణే! అప్పుడు సెకండ్ క్లాసులో యెందు కెక్కినానా, అంత డబ్బెందుకు ఖర్చుపెట్టానా? అని నాకు విచారం కలిగింది. కాని, ఆవెంటనే నామనసు "పెండ్లికూతును మూడ అత్తగారింటికి వెళ్లే అల్లుడు సెకండ్ క్లాసులోనే ప్రయాణం చేయాలె. ఇందులో నీవు త ప్పేమీచేయలేదు" అని జవాబిచ్చింది. ఏదెట్లున్నా ముందుమాట—మా అమ్మకుకోడలు కావాలె. ఆమెకోర్కె నేను తీర్చక తప్పదు. అందుకని యెన్నికష్టాలైనా పడ డానికి మనసు నిబ్బరించుకున్నాను. అప్పుడు నాకు సంతోష మైంది; కాని, ఫస్ట్ క్లాసులో ప్రయాణం చేయక పోయినానా అనిపించింది. మనుష్యుని ఆశకు అంతం లేదు కదా! సరే; అయిందేమో అయిపోయింది. ఇప్పుడు విచారిం చి లాభంలేదు స్టేషన్ వెంబడి స్టేషన్ వెళ్లిపోతూన్నది. మనసులో విచారం-అమ్మ-యెట్లున్నదో, ఏంచేస్తూన్నదో ఇదే విచారం. బల్లారిలో టెలిగ్రాం చేరివుంటుంది. వా ళ్లేమి చేస్తున్నారో, ఏమనుకుంటారో, న న్నేమి ప్రశ్న లడుగుతారో, ఏయేవిధంగా నేను మాట్లాడాలెనో; మామ గారియెదుట-కాబోయే మామగారి యెదుట సుమండీ!— ఎట్లావుండాలెనో, బావమరిది లేయేప్రశ్నలడుగుతారో, ఈలాటివే అనేక విచారాలు నాలో నేను కల్పించుకొం టూన్నాను. అంతలో నాకు కాబోవుభార్యరూపం నా కళ్లయెదుట నిల్చింది. మా కొత్తసంసారం యేయే విధం గా జరగాలెనో, యేమేమి కావాలెనో, మేముభార్యా భర్తలం యేవిధంగా ప్రవర్తించాలెనో అన్నీ ఆలో చించుకుంటూ బండ్లోనే పడుకున్నాను. ఎప్పుడు నిద్ర పట్టిందో పట్టింది. తెల్లవారుగట్ల మెలకువయింది. కిటికీ లోనుండి బయటికి తొంగిచూచాను. బెజవాడసమీపిస్తు న్నట్టు తెలిసింది. తొందరతొందరగా డ్రెస్సు సవరించు కొని, స్టేషనులో దిగడానికి తయారైనాను. "బెజవాడ బెజవాడా" అని పోర్టరులు కేకలు పెట్టినారు. బండి ప్లాట్ఫారం సమీపించి ఆగింది.

౨

నేను బండిలోనుండి దిగి కూలీని పిలిచి సామాన్లు చూపి "గుంటకల్" అన్నాను.

కూలీ సామాను మోసికొనిపోయి గుంతకల్లు లైను లో ఉన్న బండిలో పెట్టినాడు. నేను దంతధావనం చేసి మాఅమ్మ నాప్రయాణంలో పనికిరావడానికని చేసి యిచ్చిన రొట్టెలు, పూరీలు, లడ్డులు, కొంచెంకొంచెం గా ఫలాహారంచేసి, కాఫీ పుచ్చుకున్నాను. ఫ్లాసుక్కులో కాఫీ నింపినాను. బండ్లో కూర్చున్నాను. నాకర్మం అక్కడకూడా సెకండ్ క్లాసుకంపార్ట్మెంట్లో యెవరూ లేరు; నేనొక్కణ్ణే. బండి బయలుదేరడానికి రెండునిమి షా లుండగా ఒకకుర్రవాడు 'డెయిలీహెరల్డు' 'టైంస్ ఆఫ్ ఇండియా' 'లండన్ మెయిల్' అని యేదే దో అరుస్తూన్నాడు. నేను డెయిలీఎక్స్ప్రెస్ కొన్నా ను. బండి కదిలింది.

బండి చిన్నలైనుకు తిరిగింది. కృష్ణాబ్రిడ్జి దాటా ము. ఆహా! ఎంతచక్కగా, ఎంతదిట్టంగా, కట్టారా బ్రి డ్జి! ఈ ఒడ్డునుండి ఆవొడ్డుననుండే కొండమీదికి టెలి గ్రాం తీగవేశారు, మధ్యన ఆధారం లేనిదే. కొండమీది నుండి కొండకు రెండుమైళ్లదూరం! ఆశ్చర్యం! నదీప్రవా హం సొంపుగా వుంది. మెల్లగా తాడేపల్లి చేరినాను. అక్కడ బండ్లో యెక్కేవారుగాని దిగేవారుగాని అట్టే యెక్కువజన ముండలేదు. కాని, బండిమాత్రం చాలాసే పాగింది. అయింది. మొదటిబెల్, రెండవబెల్ అయినవి. గార్డు ఊగి లూదాడు. పచ్చజెండా చూపాడు. బండి నడవసాగింది. కాని, ఆనడక యేమిటో చీమలబారైనా కొంచెంనయం; మెల్లగా నడచీ నడచీ మంగళగిరిస్టేషన్ చేరింది. స్టేషన్లో గుంపులుగుంపులుగా జనులు నిలబడి వున్నారు. బండ్లోనుండి వూరివేపున చూస్తే కొండమీద పానకాలరాయడు దేవాలయం, క్రిందవుండే శ్రీనరసింహ స్వామిదేవాలయగోపురం కనబడినవి. ఇక్కడికి దేవదర్శ నానికి యెక్కడెక్కడినుంచీకూడా భక్తులు వస్తూవుం టారు. పుణ్యక్షేత్రం.

నే నూరివైపున దేవాలయాలవైపున చూస్తూన్న కొద్దీ నాకీవూరిలో దిగి పానకాలరాయని సేవించి రావ లెనని బుద్ధిపుట్టింది. కాని, ఆవెంటనే 'యిప్పుడు కాదు. బల్లారినుంచి తిరిగివచ్చేటప్పుడు దిగుదా'మని నిశ్చయించు కొంటూన్నాను. ఇంతలో నేనెక్కిన బండివద్దర యెవ రిదో కంఠస్వరం నా చెవులపడ్డది.

"ఇందులో తెల్లదొరున్నాడే!" అని.

నేనావైపు చూచాను. ఇద్దరాడవాళ్లూ, ఒక కుఱ్ఱవాడు నిలబడివున్నారు. నేనెక్కిన బండ్లో యెక్కాలెనని వారివుద్దేశం. తెల్లదొరున్నాడని నన్ను తెల్లదొర



"ఇందులో తెల్లదొరున్నాడే!"

అనుకొన్నారు! అనుమానిస్తూన్నట్లు నాకు తోచింది. అంతలో "ఉంటేనేమి?" అని ఆ స్త్రీలలో చిన్నది అన్నది. వారు ముగ్గురూ బండ్లో యెక్కారు. కూలివాడందిచ్చిన సామాన్లు సర్దుతూ వున్నారు. నేను వారివంక చూస్తున్నాను.

వాళ్లలో పెద్దామెకు సుమారు ఇరవైయైదో, ఇరవైయారో యేండ్లుండును. గులాబీరంగు సన్నని అంచు జరీచీరకట్టుకున్నది. వెండ్రుకలు చక్కగాదువ్వి, ముక్కుకుసూటిగ పాపిటతీసి, బొంబాయిదేశం స్త్రీలవలె ముచ్చటముడి పెట్టింది. మొత్తంమీద చక్కనిమనిషే.

రెండవఆమెకు సుమారు పదారు పదేడేండ్లుంటుంది. ముఖం కొద్దిగకోల; పెద్దపెద్ద కన్నులు; ఆ నేత్రాల్లో ఒకవిధమైనకాంతి చాంచల్యం; పక్కపాపట; ముచ్చటముడి; తెల్లని, సన్నని జరీచీర; చీరకుచ్చిళ్లు పమిటకొంగూ నేలను జీరాడుతూన్నవి; సిల్కుజాకెట్టు, మెడలో డాలర్ గొలుసూ, గడియారంగొలుసూ, చేతులకు బంగారు సన్నని గాజులు, నడుముకు గజ్జెలవడ్డాణం, చెవులకు తెల్లరాళ్లకమ్మలు, (రవ్వలో పుష్యరాగాలో దేదీప్యమానంగా పలువన్నెలు వెలుగుతూన్నది!); ఇంకాయేమేమోవున్నవి. కాని, ఎందుచేతనోకాని నాచూపుఅకారణంగా ఈమెమీదవాలింది. మళ్లీతిప్పుకొందామన్నా తిరగదు. కారణం యేమైవుంటుందో? ఏమైతేనేమిగాని, మాఅమ్మకు ఈలాంటిచక్కనికోడలు దొరికితే ఆమె సంతోషిస్తుందనుకున్నాను. కాని, యిదేమి? మంగళసూత్రం లేదు. ఈ బాల వివాహితయా? అవివాహితయా? లేక బాల——ఛీఛీ! నుదుట చక్కని, గుండ్రని, చిన్న కనబడీ కనబడనట్లు నొసళ్లసందున కుంకుం బొట్టున్నది. చేత గాజు లున్నవి! కన్యయే అయితే ఇంతపెద్దయ్యేవరకూ పెండ్లిచేయకుండా వుంచిన తలిదండ్రుల (బ్రాహ్మణులైతే) ధైర్యమేధైర్యం! నాలో నేను ఆలోచిస్తూ మెచ్చుతూ వున్నాను.

"వదినా, ఫలాహారం పెట్టె యేదీ?" అని గాభరాతో ఆచిన్నది పెద్దామెను అడిగింది.

"బండ్లో మరచారేమో? చూడు మనూవదినా?" అని పెద్దామె వెనకి బాలునితో "మరదీ! పెట్టెలేదు. ఎద్దులబండ్లో వుండి పోయిందేమో?" అన్నది.

బాలుడు—ఇతనికి పందొమ్మిదిరవైయేండ్లుంటుంది— తటాలున రైలులోనుండి దిగి పరుగెత్తినాడు.

"అన్నయ్యా, 'టైం' అవుతుందేమో; వద్దు వద్దు, పోవద్దు" అని చిన్నది కేక పెట్టింది.

ఆ అన్నయ్య యీ చెల్లెలిమాట వినిపించుకొంటేనా? ఒక్కటే పరుగు. స్టేషనుకు బయటపడ్డాడు. రైలరిచింది. గార్డుపచ్చజెండా చూపాడు. బిగి లూదాడు.

చిన్నది అన్నయ్య రాలేదే వదినా? బండి కదిలిందే? ఎట్లా? "అన్నయ్యా, అన్నయ్యా" అని యేడుపు

ముగం పెట్టి కళ్లనిండా కడివెడు నీళ్లు గక్కుతూ, బండి కిటికీలోంచి తలమార్చి అరుస్తున్నది. పెద్దామె గుటకలు మింగుతూంది; కిటికీలో తలమార్చి చూస్తూంది. ఏం చేయాలె! నేనూ ఆవైపు చూచాను. వారిదుఃఖం నేను చూడలేక పోయాను. బండి ఆపుదామని 'చెయిన్' లాగాను కాని, యేమిలాభం. బండి ఆగలేదు, అంతలో ఒకకుర్రవాడుచేత ఫలాహారం డబ్బాపట్టుకుని పరుగెత్తుతూ ప్లాట్ఫారం చేరాడు. రైలు ప్లాట్ఫారం దాటింది. పోలీసువాడొకడా కుర్రవాణ్ణి పట్టి స్టేషనులో ఆపేశాడు. లేకపోతే ఆకుర్రవాడు యేలాగో ఒకబండ్లో యెక్కివుండేవాడే. కాని, యిప్పుడు మంగళగిరిలో దిగబడిపోయినాడు.

అప్పటి వారి దుఃఖానికి మేరలేకపోయింది. ఇద్దరి కళ్లలోనూ గంగా యమునానదులు ఒక్కసారిగా పొంగి పొర్లిపోతూన్నట్లున్నవి. ఇద్దరికీ నోటమాట రాలేదు. ఇద్దరూ కిటికీలగుండా చూస్తూనేవున్నారు. నాచూపు ఆచిన్నదానిమీదనుంచి కదలదు. అందులోను ఆప్రాతః కిరణాలతాకుడుచేత ఆపె ముక్కున, చెవులలో వున్న వస్తువులలోని తెల్లరాళ్లు మరింత ప్రకాశించి ఆవిడ కట్టుకొన్న తెల్లనిచీరమీద ప్రతిఫలించి నానావర్ణాలు కనబడడంచేత-వంగి కిటికీగుండా చూస్తూవున్నది - అది మనుష్యవిగ్రహమా లేక, ఇంద్రధనుస్సా, అని దూరంలో నుంచి చూచేవారికి అనుమానం కలగడంలో ఆశ్చర్యమేమీలేదు. అప్పటి ఆచక్కదనం వర్ణించడానికి నేను కవీశ్వరుణ్ణి కాకపోయినాను. చిత్తరువు వ్రాయడానికి చేతకాదు, ఏంచేయను? ఎంతచెప్పినా లేమాత్రమేమిలాభం? నామనస్సుకే తెలుసును! నాకండ్లకే తెలుసును! ఏదెట్లున్నా కన్నులున్నందుకు చూడదగినవస్తువునే చూచాను, కాని, యెంతచూచినా తనివితీరదు. ఎంతబలవంతంగా లాగికొన్నా నాచూపు కదలదు.

అప్పటివారిస్థితి యెట్లుండాలెనో తెలపడంకంటె వూహించుకోవడమే మంచిది. నాకు మహాజాలి కలిగింది. వారికి కావలసిన సహాయం చేయడానికి నేను సంకల్పించుకున్నాను. 'భయపడవద్దు. మీఅన్నయ్యకు వచ్చినభయం ఏమీలేదు. మీకు తోడు నేనున్నా'నని అని వాళ్లను ఓదారుస్తామని అనుకున్నాను. కాని, వాళ్లే మనుకుంటారో, ఏమో? అని అధైర్యం. ఛీఛీ! మనలో వున్న చిక్కు లివే! ఎంత దీనావస్థలో వున్నప్పటికిని, పరస్పరసహాయం ఆవశ్యకమైనప్పటికిన్నీ ఒక్కపురుషుడు ఒకస్త్రీతో మాట్లాడడం మన హిందూఆచారాలకు వ్యతిరేకం! ఎంతకాఠిన్యం? ఎంతనిర్దయ? నేనెంతయూరోపియన్ డ్రెస్సులో వున్నా నాది హిందూహృదయమే కదా! ఈలాంటిశంకలకు తావిచ్చి కొంచెంసేపాలోచించుకున్నాను. అప్పటికిని, పాపం! వాళ్లను మర్యాదకైనా, పైఉపచారానికైనా, "దిగులుపడవద్దు" అని నేను అనలేకపోయినాను. హిందూహృదయం లోపల, పైన ఇంగ్లీషు డ్రెస్సు! నాపాట్లు భగవంతుడికే తెలియాలె. అట్లాగే నంబూరు చేరాము. బండ్లో వాళ్లిద్దరిసంభాషణ యిలా విన్నాను. అంతవరకూ వారిమాటలు నాకు వినబడలేదు. రైలిప్పుడు రాగడంచేత వినబడ్డవి.

"వదినా, నాకొకఆలోచన తోస్తూన్నది." అని చిన్నది వాక్యం పూర్తిచేయకముందే, పెద్దామె ఆత్రంతో 'ఏమది? చెప్పు మనూవదినా!' అన్నది.

"ఈస్టేషనులోదిగి బెజవాడలో పెద్దన్నయ్యకొకటి, బస్తారిలో నాన్నకొకటి టెలిగ్రామిచ్చి, తిరిగి వచ్చేబండ్లో చిన్నన్నయ్యవస్తే అంతా కలిసిపోవచ్చునేమో" అని అన్నది చిన్నది.

"అవును; అది బాగానే వున్నది; కాని, యిన్ని సామాన్లు దింపుకోవాలె, మళ్లీ వచ్చేబండి పన్నెండుగంటలకుగాని రాదు. అంతవరకూ——"

"అవును. అదీ నిజమే. కాని, మంగళగిరిలో చిన్నన్నయ్యకు "పోతూంటాము; నీవు దిగులుపడవద్దు. వచ్చేబండ్లో రావలసిం"దని టెలిగ్రామిస్తే?"

"ఇచ్చేవారెవరు?" అన్నది వదిన.

"నేను" అని అందామని నా నాలుక చివరకూ మాట వచ్చింది కాని, యింతవరకూ పరామర్శించకుండా వుండి, యిప్పుడు వారు నన్ను పలకరించందే నేనై జోక్యం కలిగించుకుంటే వారేమిగాభావిస్తారో అని భయం వేసి ఆమాట అణచుకున్నాను. కాని, వారికి కావలసిన సహాయం చేయడానికి ఆదుర్దాగానే వున్నది నాకు. నాకుకావలసిందంతా ఒకటే; వాళ్లఆజ్ఞ! ఏమాజ్ఞాపిస్తే అది చేస్తానని నాలో నేను నిశ్చయించు కుంటున్నాను.

ఇంతలో చిన్నది—మనూవదిన పెద్దామెతో—"ఈ పెద్దమనిషి మనకంతేమాత్రం సహాయం చేయడా? మనం అడిగితే తప్పా, వదినా?" అని సంశయంతో అడిగింది. నాకు కొంచెం ధైర్యం వేసింది.

"తప్పేముంది? ఎక్కడికి పోతున్నాడో, ఎవరో, ఏమిటో, సహాయం చేస్తే సరిపోయింది; లేకపోతే—" అని పెద్దామె అన్నది.

"మనుష్యజన్మ యెత్తినవాడు ఈమాత్రం చేయకపోతే—" అని చిన్నది అంటూవుండగానే,

"ఇతనికి మనభాష వచ్చునో రాదో? నాకింగ్లీషు రాదు. మాట్లాడితే నీవే మాట్లాడాలె" అన్నది పెద్దామె.

బండి నడవసాగింది. నేను వీరిమాటలన్నీ వింటూ వున్నాను.

"పోనీ నేనే మాట్లాడుతాను" అని మనూవదిన నావంక తిరిగి నాకు జాలిపుట్టేటట్లుగా మాట్లాడింది ఇంగ్లీషులో.

## 3

"మాకిప్పుడు కలిగివుండే ఆపదలో మీసహాయం కొంచెం కావలసివుంది. మాయెడల దయయుంచి చేయగలరా?" అని అడిగింది. నేను ఇంగ్లీషువాణ్ణే అనుకున్నారు పాపం! నేనూ నందుకు తగినట్లే జబాబిచ్చాను.

"ఓ, యస్; విత్ ఆల్ మై హార్ట్!" అన్నాను. నాకిప్పుడు చాలా ధైర్యం కలిగింది. "మీ రింతవరకూ పడుతూవున్న పరితాపం చూచీకూడా పరామర్శించడానికి వెనకతగ్గాను. నేనైె మిమ్మల్ని పలకరిస్తే యేమిగా భావిస్తారో అనే వూరకున్నాను, గాని నాలో మానుషత్వం లేక కాదు. అందువలన నామౌనానికై క్షమించండి! మీ రేమాత్రము భయపడవద్దు. మీరు కోరినసహాయం చేయడానికి సిద్ధంగా వున్నాను"

ఈమాటలవల్ల వాళ్లకు సమాధానమైనట్లు కనబడ్డది. ఇద్దరూ ఒక్కవేడినిట్టూర్పు విడిచిరి.

"మీ రెక్కడికి పోతున్నారు?" అని ఆతరుణి నన్నడిగింది.

"బళ్లారికి" అన్నాను నేను.

వారిద్దరి మొహాలమీదను చిరునవ్వు తోచింది!

"మేమునూ బళ్లారికే వెళ్లుతూన్నాము. కాబట్టి మీరు మాతో ఆఖరువరకూ వుంటారన్నమాటే!" అన్నది బాలిక.

"ఔను నడుంగ మరెక్కడా దిగను" అన్నాను.

ఆబాలిక ఒకానొక చిన్నబిడ్డవలె వ్యాకులపడి వణకుతూన్న కంఠంతో యిట్లన్నది. "వద్దు. మరెక్కడా దిగవద్దు. మేము అసహాయులమై పోయినాము. గొప్ప సంకటములో చిక్కుకున్నాము. మమ్మల్ని వదలి యెక్కడా దిగవద్దు!"

"మీ రేమాత్రమూ భయపడ నక్కర లేదు. నేనున్నంతవరకూ మీకేలాటివిచారమూ వద్దు. మీరుచాలా భయపడివున్నారు. భయము విడిచిపెట్టవచ్చును. ఇప్పుడు మంగళగిరిలో నిలిచిపోయినతని పేరేమి?"

బాలిక చెప్పింది.

"నాప్రొ ట్టేషనులోనుండి మంగళగిరికి ఆయనపేర తంతియిస్తాను. ఆతడూ నిద్నును మనకు. మీ రెక్కడనుంచి వస్తున్నారు?"

"బెజవాడ నుంచి."

"'బెజవాడ'! మీ రెప్పుడూ బెజవాడలోనే వుంటారా?"

"లేదు. మేము బళ్లారిలో వుంటాము. మా పెద్దన్నయ్య బెజవాడలో 'సబ్ జడ్జి'. ఇక్కడికి మేమువచ్చి కొంతకాలమైంది, మంగళగిరిలో యిప్పుడు దిగబడిపోయిన ఆతడు నా చిన్నన్నయ్య. నాన్నకూడా వచ్చివుండి బళ్లారికి వెళ్లిపోయినారు!"

"అట్లయితే మీరు బళ్లారివారే."

"ఔను."

"మీరు బళ్లారికి వెళ్లుతున్నారని మీ నాన్నగారికి తెలుసునా?"

"ఆ, వారే వెంటనే బయలుదేరి రావలసిందని మాకు టెలిగ్రాం యిచ్చారు. వచ్చినవాళ్లం మంగళగిరి కూడా చూచిపోదామని నడిరాత్రిబండికి మంగళగిరివచ్చి తెల్లవారుజామే లేచిస్వామిని సేవించి బయలుదేరాము."

"కానీండి. మీ రీబండికే వస్తూన్నారని మీ నాన్నగారికి తెలుసునా" అని—

"ఏమో, మాకు తెలీదు. నాన్నగారికికూడా ఒక టెలిగ్రామిస్తే"

"అవశ్యంగా! అందుకే నేనిన్ని ప్రశ్నలు వేయడం."

"మీ యీవుపకారం జన్మజన్మాంతానికైనా—"

"ఆమాటేవద్దు. మీ నాన్నగారి పేరేమి ?" అన్నాను.

ఆబాలిక చెప్పినపేరు విని నాకు ఆశ్చర్యమైంది. ఆపేరు నాకు కాబోవు మామగారిపేరే! నా హృదయంలో యెల్లెట్లో కాసాగింది. బల్లారీ, బెజవాడా, మామగారిపేరువంటిపేరు! మరేమి? నానోట ఉన్నట్టుండి "ఓ" అనుఅక్షరం వెడలింది. కాని, అందలి భావారహస్యం బయటపడలేదు. అదీ నా అదృష్టమే!

ఆవెంటనే ఆతరుణి నావంకచూచి "నాన్నగారిని మీ రెరుగుదురుకాబోలు?" నని అడిగింది.

ఇంక నే నేమిచేయాలి? మోహం తేలవేశాను. తప్పించుకోవాలెకదా! ఇట్లన్నాను:

"లేదు, నాకు వారితో పరిచయంలేదు. కాని, పేరు వినివున్నాను. ఒకప్పుడు భద్రాచలంయాత్రకువచ్చి వున్నట్లు జ్ఞాపకం."

"భద్రాచలమా? ఔను మామేనత్తను యాత్ర చేయించడానికి తీసుకపోయివుండిరి. కాని మీకెట్లుతెలిసింది?"

అమ్మయ్యో! "చిక్కరా మిడతంభట్లు;" అనుకున్నాను. మీనాన్నను నే నెరుగను అనివుంటే ఈసంకటం కలిగివుండదుకదా! అయినా యిది నాకొకవిధంగా సంతోషదాయకమే అయింది. ఈతరుణే నాదికాబోవునని. ఇం కేలాటిసంశయమూ లేదు. ఇట్టి సుందరి, ఇట్టి అమాయిక, ఇట్టి సరళహృదయ; నాకు అర్ధాంగి కానున్నది అని నాకు తోచినంతనే నేను ధన్యుణ్ణి అనుకున్నాను. కాని, యేకారణంచేతనైనా యీరత్నం నాచేయి జారిపోతే నా కెంతో దుఃఖమూనేమో, లోకమేశూన్యమైపోతుందేమో, నాజీవితమే వ్యర్థమై పోతుందేమో అని భయంకూడా వేస్తున్నది. తిరిగీ ఈలాటివియోగం తటస్థించడానికేనా మంగళగిరి మహాస్వామి మమ్మిక్కలిపాడు? ఆ పానకాలరాయడికి అంత నిర్దయా? అట్లెన్నటికీకాదు అని నన్ను నేను సమాధాన పరచుకున్నాను.

నే నేమీ మాట్లాడకుండడం చూచి 'మనూవదిన' తిరిగీ ఆప్రశ్నే వేసింది.

తప్పించుకోవడానికి "అక్కడ మా స్నేహితుల యింట్లో దిగివుండిరట!" అన్నాను మైమరచి.

ఇంతవరకూ నోటికి తాళంవేసుకునివున్న 'వదిన' 'మనూవదిన'ను చూచి "యేమంటారు?" అన్నది.

బాలిక చెప్పింది. అప్పుడు 'వదిన' "నాఅనుమానం గట్టిపడుతూంది!" అన్నది.

"ఏమది?" అన్నది బాలిక.

"ఈయన 'యూరోపియన్' కాడు!"

"నీకెట్లా తెలుసును వదినా?"

"ఇదేనా మీ తెలివి? మామగారూ వీరిస్నేహితుల యింట్లో దిగారుకాదా; ఆస్నేహితులు 'యూరోపియన్'లా; మనవారా? ఆలోచించుకో."

"హిందూస్నేహితు లుండకూడదా?"

అప్పుడు నాదేహం నాకు తెలిసింది. నా పొరబాటు నాకు తెలిసింది. ఏమైనా యేమీ యెరగనట్టు, వారిభాష నాకు రానట్లు నటిస్తున్నాను. మొదటునుంచీ నటనేగా?

బాలిక చిరునవ్వుతో "అయితే మీరు మాకు పరమాప్తులు! అన్నది.

ఇంతలో రైలు గుంటూరు స్టేషనులో ఆగింది.

౪

"కూలీ, కూలీ" అంటూ కొందరుకూలీలు మాబండి తలుపుపట్టుకొని నిలబడిరి.

"టెలిగ్రాము లిచ్చివస్తారా?" అన్నది బాలిక.

నేను కూలీలతో 'నహీ, జరూర్ నహీ!' అంటూ బండిదిగి సిగ్నల్లింగ్ ఆఫీసుకు వెళ్లిపోయినాను.

మంగళగిరిస్టేషనులో వుండిపోయిన చిన్నన్నయ్యకు టెలిగ్రా మిచ్చాను.

"విచారపడవద్దు. ఇప్పుడువచ్చేబండ్లో బెజవాడ వెళ్లిపోయి రాత్రిబండికి బయలుదేరి రా. ఇక్కడ బండిలో మాకేలాటియిబ్బందీ కలగకుండా బల్లారివరకూ కనిపెట్టివుండి జాగ్రతగా యిల్లు చేర్చడానికి బండ్లోవున్న పెద్ద

మనిషి సిద్ధపడ్డాడు.—అతడు మనకు పర
మాప్తుడే అనవచ్చును —మనోహరి."

కాని బళ్లారికిమాత్రం టెలిగ్రా మీయలేదు.

ఈబండికి వస్తూన్నారని ఆవిడ నాన్నగారికి తెలిసేవుంది. స్టేషనుకు వచ్చివుంటాడు. నడుంగా జరిగిన యీఅనర్థం ఆయనకూ తెలిపి ఆయన్ని సంకటపెట్టడం వుచితంకాదని నాకుతోచింది.

ఇంతలో 'బెల్' మోగింది. ఒక్కపరుగుతో నేను వచ్చి బండియెక్కాను.

"మాకోసమని మీ కెంతశ్రమ కలుగుతూన్నది. ఈ ఉపకారం'' అని ఆబాలిక అంటూవుండగా,

నేను నవ్వుతూ "తీర్చుకోవచ్చును. ఇప్పుడా మాట లెందుకు?'' అన్నాను.

"మీ రిందాక'' అని 'మనూవదిన' యేమో అనబోయింది.

ఇంతలో 'వదిన' "మనూదివనా, ఈయనకూ హిందూస్తాని వస్తుందేమో, మాట్లాడరాదా; ఏదో కొన్ని ముక్కలైనా నాకూ మీమాటలు తెలిసేవిగా?''అన్నది.

బాలిక 'మీకూ హిందూస్తాని వస్తుందని తెలుస్తాను, తెలుగుకూడావచ్చునా?' అన్నది.




"ఎందుకు మీరే చదువుదురు"

"హిందూస్తాని వచ్చు'' నన్నాను: తెలుగు వస్తుందనిగాని రాదని గాని చెప్పలేదు.

ఇంక మాభాష మారిపోయింది. ఇంగ్లీషులోనుంచి హిందూస్తానిలోనికి మారింది.

"ఇందాక మీరు చెప్పినమాట నిజమైంది. చిన్నన్నయ్య టెలిగ్రామిచ్చాడు. మీరుస్టేషనులోనికి పోయినప్పుడు ఎవరో నాపేరున పిలుస్తుంటే 'యెవరా' అని తొంగిచూచాను. ఒకబంట్రోతు వచ్చాడు. మనోహరి నేనే నన్నాను. ఈటెలిగ్రాము నాచేతి కిచ్చాడు. ఇదుగో చూడండి" అంటూ మనోహరి నాచేతికి టెలిగ్రా మీయవచ్చింది.

"ఎందుకు మీరే చదువుదురూ!" అన్నాను నేను.

చిఱునవ్వు నవ్వి ఆ టెలిగ్రాములోని సంగతులు చదివింది. నాకు మహదానందమైంది. నాకు కాబోవు భార్యపట్ల బహుకౌతుకం పుట్టింది. గొప్పఅభిమానం అంకురించింది. స్త్రీలకు విద్యనేర్పడంవల్ల వారిలోని స్త్రీత్వం మాయమైపోతుంది. పురుషులవలె పురుషులౌతారని యిప్పటివరకు నాభావన. కాని, యిప్పుడు నాయెదుటి మనోమోహనకర సుందరదృశ్యం, ఉదాహరణం, చూచి నాభావన క్షణార్థంలో మటుమాయమైపోయింది.

మీరు కళాశాల (కాలేజి)లో చదువుతూన్నారా? అని నేను సంతోషంతో అడిగాను.

"లేదు. ఈసారే 'మెట్రిక్యులేషను'కు పోయివున్నాను."

"ముందు కాలేజిలో చదువుతారా?"

ఆబాలిక మొహమ్మీద అరుణకాంతి తోచింది. అస్పష్టంగా,

"ఏమో ఎట్లుంటుందో'' అంటూ సిగ్గుచేత తల వాల్చింది.

"అదేమి?" అన్నాను నేను.

జవాబు లేదు. కాని, కారణం నాలో నేనూహించుకున్నాను. ఆబుగ్గలమీద గులాబీరంగు "ఏమో

కొన్నాళ్ళలోనే పెండ్లి కానున్నదికదా. భర్తగారియిష్ట మెట్లుంటుందో'' అని అర్థమిచ్చినట్లు నాకు తోచింది.

"రాత్రిబండికి రమ్మని చిన్నన్నయ్యకు టెలిగ్రా మిచ్చినారుకాదా?' అన్నది 'నామనోహరి.'—'నామ నోహరి' అనడాని కింకా అభ్యంతర మేముంది?

"ఆ, ఇచ్చాను. రాత్రిబండికి బయలుదేరుమని యిచ్చాను. కాని, మీనాన్నగారికిమాత్రం టెలిగ్రా మీయలేదు'' అన్నాను నేను.

'మనూవదిన' కొంచెంగా తెల్లబోయి 'ఎందుకు?' అన్నది.

"మీ రీబండిలో బయలుదేరారని వారికి తెలిసే వుంది. ఏలాగూ స్టేషనుకు వచ్చివుంటారు. నడుంగా సంభవించిన యీసంకటం వారికి తెలపడం నా కంత యిష్టంగా వుండలేదు. వారికి వృథాసంకటం కలిగించడ మెందుకు?''

"కాని మన టెలిగ్రాం పోకపోవడంచేత మాత్రం వారికి మరింతసంకటం కలగడం నిశ్చయం'' అన్నది బాలిక.

ఇందులో భావమేమిటో నాకు తెలీలేదు. నేనూ రిచ్చవడి ఆనిడ మొహంకేసి తేరిపారచూచాను. ఆ కండ్ల లో ఆత్రంనిండివచ్చింది. ఎట్లాఅన్నాను నేను. "ఇక్కడ సంభవించినసంకటం వారికెట్లు తెలుస్తుంది?"

"చిన్నన్నయ్య టెలిగ్రా మిచ్చివుంటే!"

నిజం, నిజం; ఏంచేశా న్నేను? ఏమో చేయబోయి మరేమో చేశాను. మహాతెలివిగలవాణ్ణనుకొనిగర్విస్తున్న నేను ఈబాలిక చేతుల్లోచిక్కాను. చిన్నన్నయ్య మంగళగిరిలోనుంచి నాన్నకు టెలిగ్రా మిచ్చేవుంటాడు. "నాకు రైలుమించిపోయింది. ఆడవాండ్రుమాత్రం వస్తూ న్నారు. తప్పక రైలుకురావలసిం"దని యిచ్చేవుంటాడు. అక్కడివారు మాఆదుర్దా పడుతూంటారు. ఆపైన మా టెలిగ్రాం చేరితే కొంచెం నయంకాదా అని నాకు కూడా తోచిందిప్పుడు. నాకు సిగ్గయింది. ఇంకమీద యెన్నడూ నేనే తెలివిగలవాణ్ణని ఆడవాండ్లముందు గర్వించకూడదని నిశ్చయించుకున్నాను. కాని,నిజంవొప్పు కోవలె.

"ఔను, నిజమే. నా ఆలోచన అంతదూరం పోలేదు. అని నేనునవ్వుతూ యిట్లన్నాను."మాచారా, మీవారి తెలివి తేటలు; మావారి తెలివి తేటలు! నాదిపొర బాటే."

ఇంతలో వదిన వారిభాషలో "మగవా రెక్కడ చూచినా ఒక్కటేరీతి! ఏదేశంవారైతే మాత్ర మేమి; కాని, యీయన యేదేశస్థుడో? నాకేమో హైద్రా బాది హిందువు"అనే తోస్తుంది.

నన్ను గురించి ఆమె చేసిన వ్యాఖ్యానం విన్న నాకు నవ్వువస్తూన్నది కాని, యేమీ యెరగనట్టు నేను "నన్నేమైన అన్నారా?'' అని అడిగాను.

అందు కామె హిందూస్తానీలోనే "లేదు, లేదు; మామగారికి టెలిగ్రా మీయకపోతే మాత్రమేమి అన్నా ను'' అన్నది.

"దానికేమి, వచ్చేస్టేషనులోదిగి టెలిగ్రా మిస్తా రు'' అన్నాను.

మనోహరికి యేమితోచిందోగాని, మెడవంచి, కొంచెము దీనంగా యిట్లన్నది: "మాకోసం మీ కెంత ఆయాసం గలుగుతూన్నది''

అంతలోనే నే నామె నింకమాట్లాడనీక "ఛే! ఛే! ఆలాటిమాటలు వలదని నేను మొదటే చెప్పానుగానా; కాకపోతే మీరు నాయందు కొంచెంబు ఆగ్రహస్తులౌదురు. అంతేకదా! నేను మీకా ఋణ్ణి. మీరిప్పుడు నాసంరక్షణ లోఉన్నారు. మీసంరక్షణ భారమంతా మోయవల సినబాధ్యత నాయం దున్నది. కాబట్టి మీ ఆటకాం లేవీ నేను వినను. నాయెడల మీరేమాత్రము సంకోచ భావ ముంచవలదు'' అని అన్నాను.

బాలిక నవ్వింది. "క్షమించండి! ఇంక నే నీలాటి మాట లెత్తను."

అంతలో వదిన "మేము గొప్పచిక్కులో తగులుకొ న్నాము. ఈలాటి సమయంలో మీరు మాకు సహాయం చేయసమకట్టారు. మీ యీ దయాంతఃకరణము జన్మ జన్మాలకు మేము మరువము. మీరు మాకు పరమాప్తులు; కేవల మా ఫులేకారు అంతకంటే నెక్కువే"అనికృతజ్ఞతా పూర్వకంగా అన్నది.

నా మనూనేత్రాలు నిండివచ్చినట్లు కనబడ్డది. ఏమో నాతో మాట్లాడాలెనని వుద్దేశించినట్లు కనబడ్డది. కాని యేమి మాట్లాడాలె? ఆఖరుకు ప్రయత్నంమీద "నిజంగానే సుమండీ! పూర్వజన్మంలో మీకూ మాకూ

నేదో సంబంధముండాలె! కాకుంటే ఈలాటి భయంకర సంకటసమయంలో మిమ్మల్నే మాకు సహాయం చేయడానికి పరమేశ్వరు డెందుకంపివుంటాడు?" అన్నది.

నాకు పట్టరానినవ్వు వచ్చింది. ఏం చేయను? క్షణకాలం కండ్లు మూసుకుని నాలోనే నవ్వుకున్నాను పూర్వజన్మంమాట యేమో కాని ఈజన్మ సంబంధమే అంటే బాగెంటుంది అని అనుకున్నాను అనంతరం నే నా బాలికనుచూచి,

"నాకూ నల్లే తోస్తూన్నది'' అని అన్నాను.

"అట్లయితే మమ్మల్ని మరవ్వద్దు సుమండీ!'' అని అన్నది వదిన.

"ఔను, మమ్మ ల్నెప్పుడూ మరవకండీ!'' అన్నది బాలిక.

నేనూ "మీరు నన్నెప్పటికీ మరవగని తలుస్తాను'' అని అన్నాను.

మనోహరి చిరునవ్వు నవ్వి—ఆహా! ఆచిరునవ్వు!—

"మీరు మనదేశపువారని మా క్షేమాత్రమూ తోచడంలేదు. మీరు మనఆంధ్రులే అయివున్నట్టయితే—'' అంటూవుండగా.

"ఆ! ఆంధ్రుణ్ణైవుంటే?''అనిప్రశ్నా పూర్వకంగా అడిగాను. నాహృదయం బహుతీవ్రంగా, బహువేగంగా, కొట్టుకోసాగింది.

అంతలో 'వదిన' మొహం మావలకు తిప్పుకొని, 'మనూవదిన' తొడను మెల్లగ గిచ్చి, పరిహాసంగా నాకు వినబడకూడదని—ఎట్లాగూ నాకు వినబడ్డది—నాకు తెనుగు రాదుకదా అనుకొని—"ఆంధ్రులైవుంటే నన్ను సమర్పించుకుందునుగదా! అనేకాదూ, మనూవదినా, మీ వుద్దేశం?'' అని అన్నది.

అప్పుడు మాత్రం మనోహరి నిజంగా మా మనోహరంగాకనబడ్డది. బుగ్గలకు గులాబీరం గెక్కింది. క్షణంలో మొహమంతా యెర్రబడ్డది. సిగ్గ చేత! కాని, కోపం నటించి అరువుతెచ్చుకొని "వదినా, వదినా, యేమంటివి? ఈయనకు తెనుగువస్తే—" అన్నది.

"ప్రమాద మేమైంది? వస్తే" రానీ. ఏ మ్మనిగింది అన్నది వదిన నవ్వుతూ "ఈడు జోడూ—''

"చాలించువదినా, యింకనైనా! పాండిత్యం ముగురుతూన్నది. ఎవరైనా వింటే—''

"సంతోషమేకాని విచారపడరు"

"ఇంక చాలించువదినా!" అన్నది మనోహరి.

ఇంతవరకూ నేను గంభీరభావం వహించి కూర్చున్నాను.

"మనూ వదినా, నీవేమన్నా సరే, ఈతడు మనదేశంవాడే, మనవాడే, అని నా అంతరంగదేవత నాకు నొక్కి చెప్పుతూన్నది. అదుగో ఎంతదాచినా దాగని, ఆ హిందూకళ, అందుపై బ్రాహ్మణకళ, ఆకండ్లు! అయితే హైద్రాబాదీ కావచ్చును గాక!" అనిఅన్నది వదిన!

నాకా నవ్వువస్తున్నది. ఏంచేయను? దగ్గరున్న "స్ట్రాండ్ మాగజైన్" పుట తెరచి మొహానికడ్డంపెట్టుకొని చేతిరుమాలుతో మొహం తుడుచుకోసాగాను. నావుద్దేశమేమిటి? నవ్వు ఆపుకోవడానికే. కొంచెంగానైనా పైకు ఒకితే రుమాలామరుగున వుండిపోవడానికే!

కొంచెం కృత్రిమకోపంతో 'మనూవదిన' "వదినా, వదినా—" అని యేమో అనబోయేసరికి—

'వదిన' "మనూవదినా, మన కింతవరకూ తోచకపోయిందికదా! మనల్ని కనిపెట్టివుండి యింతసహాయం చేస్తూన్న యీపెద్దమనిషి వూరేదో పేరేదో కనుక్కోలేదుకదా!" అని యింకా నేమో అనబోయేసరికి.

'మనూవదిన', తలవంచి చిరునవ్వుతో "ఎందుకో నే వదినా, నే నడగలేకున్నాను! నీవే అడుగు" అన్నది.

"అమ్మయ్యో, ఇప్పుడు ఊడిపడ్డదే సిగ్గెక్కడనుంచో! ఈయనవిషయం మనం తెలిసికోకపోతే యేం బాగుంటుంది? పోనీ రేపు మామగారైనా యేమంటారు? 'అంతగా మీకు సహాయంచేసిన పెద్దమనిషి వూరూ పేరూ కూడా అడక్కపోయినారే' అని మనల్ని దూషించరా? అదీ పోనీ మరొక్కనిశేషం—''

"ఏమది?'' అన్నది 'మనూవదిన.'

ఇంతవరకూ వాళ్లకు నావూరూ పేరూ కులం తెలీలేదు. ఇప్పుడూ వీరు నన్ను అడగడం నిశ్చయం అనుకున్నాను. ఉన్నది వున్నట్టు నిజం చెప్పివేదా మనుకున్నాను. ఇంతలో నానిశ్చయం మారిపోయింది. యతి అని అనుకుని అన్నాళ్లూ నిష్కపటంగా సేవలుచేస్తూ, ప్రవర్తిస్తూ, సరళంగా, ధారాళంగా, బహిరంగంగా, అర్జునుడిమీద తన గాఢానురాగం, దృఢప్రేమా వెల్లడించి, యతే అర్జునుడని తెలిసినంతట సిగ్గ చుట్టుకోగా తత్తరున

పారిపోయిన సుభద్ర నాకు జ్ఞప్తికివచ్చింది. నేను నిజం చెప్పితే అదేమాదిరి అవుతుందేమో! ఎంత చదువుకొన్నా, ఎంతటిసంఘసంస్కర్తల పిల్లైనా, యెంత పదిమందిలో కలిసిమెలసివున్నా హిందూబాలికే కాదా! నిజంతెలిస్తే నాతో మాట్లాడదేమో! కలిసిమెలసి వుండదేమో! ఛీ! నిజం చెప్పకూడ దనుకున్నాను. ఈవిధంగా మనసులో నిశ్చయించుకుంటూ వున్నాను. యింతలో 'మనూవదిన' సాహసంచేసి ఒకజిత్తు పన్నింది. నాపక్కన ఆంగ్లనవల ఒకటి పడివున్నది. తటాలున దాన్నెత్తుకుని మొదటి పుట చూచింది. అందులో వున్న పేరు నాదికాదు; నా స్నేహితునిది. కాని, హిందూపేరు చదువుకున్నది. పుస్తకం అట్లే వుంచేసింది.

వదినతో నేమో గుసగుసలాడింది. నాకు బాగా వినబడలేదు.

"అట్లైతే, మనూవదినా! ఆయన ఈతనికి తెలుసు నేమో అడిగి——" అని వదిన యేమో అనబోయింది.

మనూవదిన కృత్రిమకోపంతో అదికోపమో సిగ్గో నాకుతెలీలేదు."నే నడగను నాకవసరంపట్టలేదు"అన్నది.

"ఎందుకమ్మా నూరొక్కరు దొరకబట్టేనా నీ కవసరంలేదు?" అని వదిన నవ్వింది.

"ఇదుగో వదినా! యిటుచూడు."

"ఆఁ, ఆఁ ఇప్పుడు చూచే దేమిటి ? మంగళగిరి కాదు, గుంటూరుస్టేషనులో నుంచీ చూస్తూన్నాను. ఈడూ జోడూ కుదిరింది. సంతోషిస్తూన్నాను" అన్నది 'వదిన.'

"అబ్బబ్బబ్బా! వదినా, సదా సర్వదా పరిహాసాలే!"అని 'మనూవదిన' అంటూవున్నది. రైలు దొనకొండ స్టేషన్లో ఆగింది. నేను దిగి టెలిగ్రాము యియ్య పోయినాను.

❦

"రేపుదయం తొమ్మిదిగంటలకు బల్లారి చేరుతున్నాము."మా కేలాటి ఆయాసంకూడా కలగలేదు. సుఖంగా ప్రయాణంచేస్తూన్నాము. దిగులుపడవలదు.——మనోహరి."

అని నేను నాకాబోవుమామగారికి టెలిగ్రామిచ్చి, వచ్చి బండియెక్కాను. వదినా ఆడబిడ్డలు యేమో మాట్లాడుకుంటూ నవ్వుతూ వున్నారు. నన్నుచూచి మాట లాపేశారు. వాళ్లకు అనుమానం తగిలిందేమో! నా మనసూ పరిపరివిధాలా ఆలోచనలో దిగింది. అది దాచడానికని దగ్గరున్న నవల తీసికుని చదువుతూన్నవానివలె నటించాను. రైలు కదిలింది.

'మనూవదిన' యేదోజ్ఞాపకం చేసుకున్నట్లు వున్నట్టుండి తటాలునలేచి బల్లకిందవున్న ఒక చిన్న బుట్టలో నుంచి కొన్ని అరటిపండ్లు, అయిదారుబత్తాయి నారింజ, సీమరేగుపండ్లు తీసి నన్నుచూచి చిరునవ్వుతో ఆదరంతో "మీ కాకలి వేస్తుండ లేదా?" అన్నది.

నిజంగానే నాకప్పుడు భలే అకలి వేస్తూంది. లేదంటే వాళ్లకు కోపం వస్తుందేమో. ఔనంటే యేమనుకుంటారో! ఎట్లాగైనా సరే అని ధైర్యంచేసుకుని నేనూ నవ్వుతూనే"ఆఁ; ఔను మరిచానుసుడీ!"అనిలేచి సరిగా కూర్చున్నాను.

మనోహరి పెట్టెలోనుంచి ఒక వెండిపళ్లెం తీసి నారింజకాయలు,బత్తాయీలు ఒలిచి బద్దలు అరటిపండ్లు తోలువొలిచి ఆపళ్లెంలోపెట్టి నాముందుపెట్టింది. వాటి నన్నిటిని నిమిషంలో ఫలహారం చేశాను. ఆకలితీరలేదు. మాఅమ్మ నాకోసమని యిచ్చినపూరీలు లడ్డూలు తీదామనుకున్నాను. కాని, అవివారికి పనికివస్తుందో రాదో అని అనుమానం కలిగింది. కాబట్టి ఆమాటె యెత్తలేదు నేను.

నాపళ్లెం ఖాళీకావడంచూచి మనోహరి "పంపనపనస ఒలిచి యివ్వనా? ఇంక రెండుఅరటిపండ్లివ్వనా?" అన్నది.

"సరేగాని,అన్నీ నేనే తినేస్తే మీకేమైనా కావలెనా లేదా?" అని నే నన్నాను.

"ఉన్నవి లెండి. చాలకపోతే వచ్చే స్టేషనులో మరేమైన కొనవచ్చును" అన్నది వదిన!

'వదిన' వాక్యం పూర్తి కాలేదు. అంతలోనే 'మనూవదిన' నాదగ్గర వున్నపళ్లెంలో బత్తాయిబద్దలూ రెండు రొట్టెముక్కలూ పడవేసింది. నేను 'ఆఁ—ఆఁ' అంటూనే వున్నాను. కాని, యేమిలాభం? నానిందా? పైగా చిరునవ్వు నవ్వుతూన్నది.



సారటు పూజ, దసరామహోత్సవము — మైసూరు



గజపూజ, దసరామహోత్సవము — మైసూరు

అప్పుడు 'వదిన' నవ్వుతూ అర్ధరహస్యంగా "మనూవదినా, అన్నీ ఆయనకే యిస్తే మన కేమీ అక్కరలేదా? నాకుమాత్రం ఫలదానం చేయవూ?" అన్నది.

"నీకు లేనిదేనా వదినా? ఇదుగో తీసుకో!" అని మనూ ఆమెకుకూడా యిచ్చింది.

ఈవిధంగా సరసాలతోటి, పరిహాసాలతోటి, సంతోషంతోటి, ముచ్చట్లతోటి, మహానందంతో ప్రయాణం చేస్తూన్నాము. స్టేషను వెంబడి స్టేషను వెళ్ళిపోతున్నది. సుమారు మూడు మూడున్నరకు కంభం స్టేషను చేరాము. అక్కడ స్టేషనులో 'టీ' మాత్రమే దొరుకుతుంది. 'రెఫ్రెష్‌మెంట్ రూంలో' ఆ టీ మావాళ్ళకు—కాదు—నాతోటి ప్రయాణం చేస్తూవున్న స్త్రీలకు—పనికివచ్చునో రాదో అనుకుని పట్టిపాలుమాత్రం తెప్పించినాను.

క్రమక్రమంగా స్టేషనులు వెళ్ళిపోయినవి. చెలమ దగ్గర బండి యెక్కువసేపు నిలబడ్డది. బయలుదేరి కనమ యెక్కసాగింది. ఆహా! ఆకనమ యెక్కుతూవున్నప్పుడు బండి నడవడం, వర్ణించడం దుస్సాధ్యం. అయినా మనకు వర్ణనలతో పనిలేదు. పామువలె మెలికలు మెలికలుగా బండిపోతూవుండడం; అప్పటియెండ తూర్పుదిక్కునుంచి పడమటివేపున—వెంబడేయెడమవేపున; అరక్షణంలో అసలే బండ్లో యెండలేకపోవడం; ఆపర్వతాలూ, ఆఅరణ్యాలూ, ఆకొండచరియలూ, ఆ అఖాతమూ, ఆచెట్లూ, ఆగుహలూ, ఆదోనలూ, ఆ వంతెనలూ, ఆసృష్టిసౌందర్యమూ, ఆ కృత్రిమసృష్టి సౌందర్యమూ, చూచి మనకు యెట్లాగో అయిపోయింది! ఇవి చూస్తే, నిజంగా నాస్తికుడికైనా దైవమహిమ తలపునకు రాకపోదు. అందులో నొక్క గమ్మత్తు. పర్వతం తొలిచి గుహగా చేశారు. అందులోనుంచే రైలుపోతుంది. పైనకొండ, క్రిందకొండ, కుడీయెడమలా కొండా, వెనకాకొండా; ముందూకొండా! ఆగుహలో రైలు ప్రవేశించేటప్పటికి బండ్లోవాండ్లందరూ 'గోవిందం' కొట్టసాగించారు, హరినామం సాగించారు.

ఎట్లాగైతేనేమి, మేము ఆనంద ప్రఫుల్ల హృదయంతో రాత్రి ఎనిమిదిన్నర తొమ్మిదికొట్టేసరికి నంద్యాల చేరాము. అప్పుడు మాకు ఆకలిఅన్నసంగతి తెలిసింది. అంతవరకూ దేవుని విచిత్రసృష్టిచిత్రాన్నే తలచుకుంటూ అందులోనే లీనమైపోయివుంటిని. నా కాకలి కాలేదు; కాని, నాతోడివారిగతియేమి? ఇప్పుడుచాలా గొప్పచిక్కులో తగులుకున్నాను.—భోజనం తెప్పిద్దామా? నేను ఆంగ్లేయుణ్ణి అని వీళ్ళనుకున్నారు. నన్నూ భోం చేయమంటారు. నాకీభోజనం సరిపడ దనుకుంటారు. నేను భోజనం చెయ్యందే వీళ్లుచెయ్యరు. నేనుతిన్నానా, నాగుట్టు బట్టబయ లవుతుందేమో! తినకపోయినానా, వీళ్లూ తినరు. ఒకవేళతిన్నా నాయెదుట తింటారో లేదో? ఏం చేయాలె? ఈచిక్కులోనుంచి తప్పించుకొనే మార్గమేదీ; ఆలోచించాను; ఆఖరుకు భోజనంమాటే తలపెట్టకూడదని నిశ్చయించాను. బండ్లోనుంచి దిగాను. కొన్ని మిఠాయిదినుసులూ, కొన్నిపండ్లూ, ఫలాలు కొనుక్కొని వచ్చి రైలెక్కాను. అన్నీ వాళ్లముందు పెట్టాను. అప్పుడు నాకొక ఆలోచనతోచి నవ్వు వచ్చింది. నవ్వుకున్నాను. ఈచిక్కులన్నీ, ఈబాధలన్నీ నాకెందుకా అనుకున్నాను. సంసారతాపత్రయం యిప్పుడే ప్రారంభమైనందుకే నాకు నవ్వువచ్చింది. అందుకే అంతతో రైలు నడవసాగింది. 'మనూవదిన,' నన్ను చూచి మీకు మామూలాన చాలాశ్రమ కలుగుతూవున్నది. మీరు బండి దిగివెళ్లితే ఎక్కడికో అనుకొన్నాను. ఇందుకని తెలిసివుంటే అక్కరలేదని చెప్పియుందును" అని అన్నది.

నేను "నాకు శ్రమాలేదు. మరేమీ లేదు. మీరు అక్కరలేదంటారనే మిమ్మల్ని నే నడగలేదు. అయినా ఇవన్నీ మీకోసమనే తేలేదు. నాకోసం తెచ్చుకొన్నాను. అయితే యింతఎందుకు అంటారేమో? నాకు చెడ్డ ఆకలి వేస్తున్నది. నేనుమాత్రమే అన్నీ తినడం నాకు న్యాయం కాదు. నీతీ కాదు. మీరు కొంచంగానైనా పుచ్చుకోవాలె అని తెచ్చాను. ఇందులో మూడువంతులు నాకే యిచ్చివేసి. వక్కవంతు మీరు పుచ్చుకుంటారని ఈ మధ్యాహ్నం అనుభవంవల్ల నాకు బాగా తెలుసును" అని నవ్వినాను.

అందరము నవ్వినాము.

ఫలహారానంతరము ముగ్గురం మూడుబల్లలమీద పడుకొని నిద్రించాము.

స్త్రీలిద్దఱు త్వరలోనే నిద్రించారు. నాకు నిద్ర పట్టలేదు. ఈబాలికనుగూర్చి మామయ్యగారు రాసిన వర్ణనలు,

ఈపిల్లే తనకు కోడలుకావలెనని మా అమ్మ పట్టునలా, ఈ బాలిక రూపలావణ్యాలు, వినయ విధేయతలు, విద్యాబుద్ధులు మొదలగువిషయములు నామనస్సులోపూర్తిగా నిండిపోయింది. నాభవిష్యత్ సంసారసుఖము నాకలలో కనిపించింది. ఈపిల్లనే మాఅమ్మకు కోడలుగా జేయడానికి నిశ్చయించాను.

ఎట్లాగో తెల్లవారేసరికి గుంతకల్లు చేరాము.

## ౬

గుంతకల్లుస్టేషనులో నేను దిగి వీళ్లకు ముఖమార్జనానికి నీళ్లు తెప్పించియిచ్చాను. తరువాత కాఫీ, రవఅట్లు, బంగాళాదుంపకూర, పేపర్‌లడ్లూ, రవలడ్లూ, మొదలైనవి తెప్పించి ఫలాహారం అయింది ఎనిమిది గంటలకే బండిసాగింది.

గుంతకల్లుకు బళ్లారికీ మధ్య నాలుగుస్టేషనులు దాటి బళ్లారి ప్లాట్‌ఫారం సమీపిస్తూ వున్నాము.

మనోహారి కిటికీలోనుంచే ప్లాట్‌ఫారంపైపున చూస్తూ, "అడుగో అన్నయ్య'' అన్నది.

నేనూ వదినా చూచాము. స్టేషన్లో జనం కిటకిటలాడుతూ వున్నది. అందులో ఆఅన్నయ్య ఎవరో నాకు తెలియలేదు. నేను హ్యాటూ బూటూ తగిలించుకొని బండి దిగడానికి తయారైనాను. అంతలో బండి ప్లాట్‌ఫారంలో ఆగింది.

ఇరవయిరెండుఏండ్లయువకుడు ఒకడు మాపెట్టె దగ్గర చిరునవ్వుతో నిలబడి కూలీని పిలిచి, బండ్లో సామాన్లు కిందికి దింపించాడు.

ఆయువకుడు మనోహారికి రెండవఅన్నయ్య. చెల్లెలేదో అతనికి చెప్పింది. ఆ య న ద గ్గ రి కి వచ్చి నాకేదో ఉపచారం చేయ ప్రారంభించాడు. నేను తగినట్టుగానే బదులు చెప్పినాను. అంత అందరము కలిసి స్టేషన్ బయటికి వచ్చాము. వాళ్లసామాన్లు ఒకగుఱ్ఱపు బండ్లో పెట్టారు. నేనూ వాళ్లకు కొంచం దూరంలో బండికుదుర్చుకుంటూ వున్నాను. అంతలో మనోహారి అన్నయ్య, తొందరతొందరగా నడిచివచ్చి నాచెయ్యి పట్టుకొని "మీరు బండి కుదుర్చుకుంటూ ఉన్నారు. ఎక్కడికి వెళుతున్నారు? మాతో కూడా మాయింటికి రారా?" అన్నాడు.

నేను వెనక్కి తిరిగి చూచాను. మనోహారి ఆమె వదిన, యిద్దరు ఒక్క మోటారు దగ్గర నిలబడి ఉన్నారు. మనోహారి దైన్యంతో నావైపు చూస్తూవున్నది. ఆచూపులో నానా భావాలు కనబడుతూవున్నవి. నేను చూడలేకపోయినాను. వాళ్లతోనే కలిసిపోదాం అనుకొన్నాను. కాని క్షణంలో మనస్సు మారింది. అప్పుడు నేను ఆ యువకునితో "నేనిప్పుడు రాను. నామిత్రుడు నాకోసం ఎదురుచూస్తూంటాడు. చాలా అవసరమైనపని వున్నది. రేపోమాపో తప్పకవస్తాను ఇప్పటికి క్షమించండి" అని అన్నాను.

"మానాన్నగారు మిమ్మల్ని తప్పకుండా తీసుకొని రమ్మని ఆజ్ఞాపించారు. ఆయనకు ఆశాభంగం చేస్తారా. ఆయనే వచ్చివున్నట్టయితే బాగావుండేది. కాని మాయీ అమ్మాయిని చూడడానికి ఒకరు యీ సాయంత్రం వస్తారు. అందుకని ఏదోయేర్పాట్లు చేయడానికి యింట్లోనే వుండవలసివచ్చి నన్ను స్టేషనుకు పంపారు. మావదినెను మాచెల్లెల్ని సురక్షితంగా తెచ్చినందుకు మానాన్నగారు తమ కృతజ్ఞతను తెలపడానికి మిమ్మల్ని తప్పకుండా వెంటబెట్టుకొని రావలసిందన్నారు." అని ఆయువకుడు బహుదీనంగా, ఆశాభంగమైనందుకు గుస్సా అన్నాడు.

"ఇప్పటికి నన్ను క్షమించండి. తప్పకుండా సాయంత్రం మీయింటికి వచ్చి మీనాన్నగారిదర్శనం చేస్తాను అని మీనాన్నగారితో చెప్పవలసినది. అవసరమైన పనివుండి యిప్పటికి యిప్పుడే నామిత్రుణ్ణి నేను కలుసుకోవాలె'' అని అంటూవున్నాను. ఇంతలో ఆబాలిక మాదగ్గరికి వచ్చింది.

"అన్నయ్యా! మీరు రావడంలేదంటున్నారా? రాకపోతే నాన్నగారికి నీమీదా, నామీదా కోపం రాదా? ఆయనకు ఆశాభంగంకాదా?'' అని అతిదైన్యంతో, కళ్లలో బాష్పాలు కురుస్తూ ఉండగా జాలిపుట్టేటట్టు పలికింది.

అందుకు నేను "మీరు బుద్ధిమంతులు, దీర్ఘాలోచన కలవారు. ఇంత పట్టుపట్టడం నాకు విచారంగా వున్నది. ఇప్పటికి నాకు సెలవిస్తే నాపని చూచుకొని తప్పకుండా సాయంత్రం అయిదుగంటలకు మీయింటికి వచ్చినట్టును,

విచారపడవద్దు; ఆలోచించవద్దు; అన్యథా భావించవద్దు. మిమ్మల్ని, మీసహవాసాన్ని యిప్పటికి వేరుచేసి పోవలసి వచ్చినందుకు నాకూ విచారంగానే వున్నది. అంతదూరం నుంచి కలిసివచ్చినందుకు మిమ్మల్ని మీవాళ్లకు అప్ప చెప్పవలసినది నాకు విధి. నేను మీయింటికే రావలసింది అని నాకు తెలుసును. కాని కార్యభారంవల్ల మిమ్మల్ని మీనాన్నగారికి వప్పచెప్పడానికిమారుగా మీ అన్నకు ఒప్పగించాను. కొంతవరకు నావిధి తీర్చుకొన్నాను. కాని మీనాన్నగారిని దర్శించేవరకు 'నిన్ను వారికి నాచేతిమీదుగా అప్పచెప్పేవరకు, నావిధి పూర్తిగా నెరవేరదు. కాబట్టి తప్పక వస్తాను" అని అన్నాను.

"మీ రింతపట్టుపట్టితే నేనేమిచేయగలను?" అంటూ మనోహరి కండ్లు తుడుచుకొన్నది. కాలి బొటనవ్రేలుతో నేలమీద నేమో వ్రాస్తూవున్నది. ఆవ్రాతయేమో కండ్లు చూస్తూవున్నవి. క్షణం గడిచింది; ఆమె మరల తల పైకెత్తి పెదవులపై చిరునవ్వు మొలకెత్తగా "తప్పకుండా వస్తారా సాయంత్రమే? ఎన్నిగంటలకు?" అన్నది.

తప్పక సాయంత్రమే అయిదుగంటలకుఅన్నాను.

"మీరిప్పుడు ఎవరియింటికి పోతూవున్నారు. మీరింటికి రాకపోతే సాయంత్రం నేను మీన్నే హోతుని యిం




"తప్పకుండావస్తారా సాయంత్రమే? ఎన్నిగంటలకు?"

టికివచ్చి మిమ్మల్ని తీసుకపోతాను." అని అన్నాడు అన్నయ్య.

ఈప్రశ్న అడుగుతారని నాకు ముందుగానే తెలుసును. దానికి జవాబుకూడా ఆలోచించేవున్నాను.

"సత్యనారాయణపేటకు కృష్ణరావుగారి యింటికి" అని చెప్పినాను. కాని యిది నిజం కాదు.

"మీ పేరూ?" అన్నాడు యువకుడు.

మారుపేరు చెప్పినాను. వ్రాసుకున్నాడు. మనోహరి మాటిమాటికి "తప్పకరావాలె—రావాలె" అని చెప్పుతూ, వెనక్కు తిరిగితిరిగి చూస్తూ, మెల్లగా పోయి మోటారెక్కింది; అప్పటి ఆమనోహరమూర్తిని చూసి కాళిదాసుని శకుంతల తోటలో దుష్యంతుణ్ణి విడిచి పోవడం జ్ఞప్తికి వచ్చింది. మోటారు వెళ్లిపోయింది. నా మనస్సు ఆమోటారులోనే వెళ్లిపోయింది నిమిషంలో నాకు కనబడకపోయింది.

ఒక్కనిట్టూర్పు విడిచి నేను బండియెక్కి 'బ్రూసీపేట'లోని ఒకహోటలుకు వెళ్లాను. అక్కడే బసచేశాను. స్నానంచేసి భోజనంచేశాను. నాలుగు ఎప్పుడుకొడతారా అని గంటలు లెక్కపెట్టుతూ వున్నాను. ఈలోపుగా నేను కాబోయే మామగారియింటికి వెళ్లితే అక్కడి వాళ్లు ఏమేమి అడుగుతారా? ఏమి జవాబు చెప్పవలెను. అక్కడివాళ్లందరు ఎట్లావుంటారా, నన్ను చూచి ఏమనుకుంటారా, అని—యింకా ఏవేవో అనుకొంటూ వున్నాను. అందరికంటె ముఖ్యంగా మనోహరి నన్ను చూచిగుర్తించి ఏమనుకొంటుందో, ఏమంటుందో, నాకు అర్ధాంగి కావడానికి వప్పుకొంటుందో లేదో, అని నా మనస్సు నానావిధాల తర్కవితర్కాల్లో మునిగింది. కాని నాకొక్కటే ధైర్యం. పిల్లనన్ను మెచ్చుకొంది; రోజున్నర తోడుగావుంది.

ఆచూపులు, ఆవగలు, ఆవయ్యారం, ఆసిగ్గు, ఆచిరునవ్వు, యివన్నీచూస్తే అంగీకార సూచనలే. మా

మామయ్య చేసిన వర్ణనలను మొదట వెక్కిరించాను. ఇప్పుడు ప్రత్యక్షంలో చూస్తే అన్నివర్ణనలు అక్షరాల సరిపోతున్నవి. ఇంకా చూడబోతే వర్ణించడం ఆయనకు చేతకాదన్నమాటే. ఇంకా ఎక్కువగా వుండవలసింది. కాబట్టి మాఅమ్మ తనకు యీపిల్లే కోడలుకావలెనని పట్టుపట్టడం న్యాయమే అని నే నాలోచిస్తూ ఉండగా నాలుగు కొట్టారు. అంతట నా ఆలోచనా సూత్రం తెగింది. నేను లేచి కాళ్లుచేతులు కడుక్కొని ఇంత అల్పాహారం పుచ్చుకొన్నాను.గదిలోకిపోయి పెట్టి తెరిచి బొంబాయిఅంచుధోవతి మడతదీసి విప్పి పంచకచ్చవేసి కట్టుకొన్నాను. ఫ్లానల్ షర్టు వేసుకొన్నాను. సన్నని జరీఅంచు వుత్తరీయం పైకి వేసుకొన్నాన కాళ్లకు చెప్పులు తొడిగాను. తలపక్కపాపిట తీసి దువ్వుకొన్నాను.నొష్ట కనబడీ కనబడకబొట్టు పెట్టాను. ఈ విధంగా అచ్చంగా బ్రాహ్మణ్ణై మాఅత్తగారింటికి బయలు దేరాను.

వాకిట మనోహరి అన్నయ్య, ఉన్నాడు. నాకోసమే ననుకున్నాను. మేడమీద మనోహరి ముస్తాబైతనవదినతో ముచ్చటలాడుతూ నిలబడిఉన్నది. నాకోసమే అనుకున్నాను.

నన్ను తగురీతిగా మర్యాద చేశారు.మనోహరినాన్నగారు నన్ను చూచి చాలా ఆనందించాడు. ఇంట్లోవాళ్లకు 'అల్లుడుగారు' వచ్చారని కబురంపాడు. అందరూవచ్చి నన్నుచూచారు. ఏమేమో ప్రశ్నలు వేశారు. మెచ్చుకున్నారు. కాని, మనోహరిమాత్రం రాలేదు.

ఆమె నాన్నగారు నాతో మాట్లాడి ఉన్నట్టుండి యేమో జ్ఞాపకంచేసుకుని "అమ్మా, మనోహరీ" అని పిలిచాడు. మనోహరి వచ్చి తలవాల్చి నిలిచింది. "అల్లుడుగారికి నీచేతిమీదుగా "టీ చేసి తెచ్చిపెట్టు" అన్నాడు. వెళ్లిపోయింది. నా వంకకు తిరిగియైనా చూడలేదు. ఏదోపనిమీద మామగారు బయటికి వెళ్లిపోయినారు.

పావుగంటలో ఫలాహారాలపళ్లెం, టీకప్పు తీసుకుని మనోహరి గదిలోకి వచ్చింది. నాన్నగారు లేరు. తలవంచే వున్నది. నాకు నవ్వు కడుపుబ్బుతూ వున్నది. అణచుకున్నాను. ఎట్లాగో 'మనూ—' అన్నాను.

ఆవిడ తలపైకెత్తి ఆశ్చర్యంతో నన్నుచూచింది. నిమిషం చూచింది! ఆచూపు యిప్పటికీ నామనసులోనే బింబితమైవున్నది. ఆశ్చర్యమూ, సంతోషమూ, సిగ్గూ, ఒక్కమారుగా ఆమెనుచుట్టు ముట్టుకుంది. "ఏమీ? ఎవరూ? రైలులో—"

"ఔను. ఆశ్చర్య మెందుకూ? సిగ్గెందుకూ? నిన్నటినుంచీ లేనిసిగ్గు యిప్పుడు—" అంటున్నాను.

"నిజమేనా? మీరేనా?" అని కిందపడబోయింది.



మూర్ఛపోయిందో యేమో అర్ధగంట నాకౌగిట్లోనే వుండిపోయింది.

"ఔను; నిజమే; నేనే!" అంటూ ఆమెను కిందపడకుండా పట్టుకున్నాను. మూర్ఛపోయిందో, యేమో అర్ధగంట నాకౌగిట్లోనే వుండిపోయింది.

ఈపిల్లే ఆఖరుకు మాఅమ్మకు కోడలయింది!

---



# రాధిక

గాఢావఝుల రామావధాని గారు (భారతీసమితి)

ఆలరుంపవల సూనమంజరులఁ బుష్పారామసీమంబులన్
నెలరాతిన్నెల సైకతస్థలులఁ బున్నెంబైన స్రోతంపు దీ
వులఁ బ్రేమామృతవారిపూరములప్రాపుం గూర్చి లాలించి యీ
వలనన్ మాయముగాఁగ నాయమొకో గోపా, వల్లవీపల్లవా !

ఆమధుమాసయామినుల నాసికతాతలదేశమందు నా
రామవిశాలవీథుల సురాపగక్రేవల మంద మందశీ
తామలవాయువీచికల నారమణీయసుధాప్రపూరగా
నామృతవంశికారవ మనారతము న్వీన నోఁచనైతిఁగా!

చిరతరమోహపాశవివశీకృతనై నిలు పోపలేక నీ
జలజరథాంగశంఖకులిశాంకములై తనరారు పాదపుం
గుఱుతుల జాడనేనిఁ గనఁగోరి వనం బిలు సేసితిన్ భుజాం
తరపరిరంభసౌఖ్య తుషితాంబుధిఁ దేల్పుము గోపబాలకా!

ఏయెఁది త్రోవ యీవిరహా మేగతి డిందు వియోగవహ్ని నే
చాయ గ్రసింతు మానసవిసారితభార మదెట్టు వీఁగు నిం
కేయెడఁ గాంతు నారసికు నెట్టుల సైతు విరాళి నేఁటి కిం
కాయదువీరుకోమలభుజాంతర మేయలివేణి నోఁచెనో !

ఇదె ప్రియకాంతుఁ గూడి విహరించినపుణ్యవనప్రదేశ మి
య్యదియె నికుంజపుంజసముదంచితకేళి విహారభూమి య
ల్లదె యదువీరు దివ్యసుషిరాగతమాధురిగీతికారవం
బదె శిఖిపింఛహాళి హృదయాంబుజపీఠి నలంకరించెడిన్ !






కో. నరసింహాచారి గారు

ప్రపంచములోని వింతలలో ఆస్ట్రియా (యూరోపుఖండములోనిది) పోలాండులోని 'వెలిజ్కా' ఉప్పుగనులు కొన్ని యున్నవి. గలీషియాలోని కొన్నిగనులలో నుప్పు 4600 అడుగులు అనగా $\frac{3}{4}$ మైలులోతునకుమించి త్రవ్వబడియున్నది. ఇంతలోతువఱకు ఉప్పు పేరియుండుటకు కారణము శతసహస్రశతాబ్దములకు ముందు ఇచ్చట యుప్పునీటి చెఱువులు సముద్రభాగములు ఉండి క్రమముగా నెండిపోయి యుప్పుమాత్రము పేరుకొని యుండవలెను.

'వెలిజ్కా'లోని యుప్పుగోడలు సుమారు 700 లేక 800సంవత్సరములకు పూర్వము నుండి త్రవ్వబడుచు వచ్చియున్నవి. ఇంత దీర్ఘకాలమునుండియు త్రవ్వబడుచువచ్చిన యీగనులలో పనివారు వారికి కావలసిన సౌకర్యములు కలుగజేసికొనుచు వచ్చినందున కాలక్రమమున నిచ్చట నొకభూగర్భస్థ నగర మేర్పడినది. ఈపట్టణముయొక్క నిడివి తూర్పుపడమరలుగా $2\frac{1}{2}$ మైళ్లును ఉత్తర దక్షిణములుగా $\frac{1}{2}$ మైలు కెక్కువగను కలదు. ఇందు బిలమార్గములు (Tunnels) 65మైళ్ళ పొడవువి కలవు. ఈమార్గములలో కొన్ని భూమట్టమునకు 1000 అడుగుల క్రిందివఱకు వ్యాపించియున్నవి. ఈనగరమునందు నానాముఖములఁబోవు వీథులును, నవరత్నఖచితములో యను శంక గలుగజేయునట్లు సోపానములును, కాఫీనివేశనములు (Restaurants) ను, అయోమార్గములును, ఆలయములును, విగ్రహములును, మొదలగు ననేక విషయములు ఉప్పులో మలచబడి విద్యుద్దీపములయొక్కయు మైనపువత్తులయొక్కయు, దివ్వెటీలయొక్కయు వెలుతురున ప్రకాశించుచుండును. విద్యుచ్ఛక్తి(Electric Lifts) వలన భారములను భూమ్యుపరిభాగములకు గొనిపోవు సాధనములును, సోపానములును, గుఱ్ఱపుబండ్లుపోవుటకు ఇనుపదారులును ఇందుగలవు. సాధారణముగా మనము చూచుచుండునట్లుగానే ఈ గనులలోగూడ భోజనశాలలు గలిగి గొప్ప ప్లాటుఫారము (Platform) గల యొక (Central Railway Station) కలదు. ఇచ్చటి క్రైస్తవాలయము (Church) లలో 17వ శతాబ్దమున మలచబడిన సెయింటు ఆంటోనియాలయము మిక్కిలి యందమైనది. ఇందు ఉప్పుతోనే చెక్కబడిన సెయింటు పాల్, సెయింటుపీటరుల విగ్రహములపైన మర్చబడిన యొకయరుగు కలదు. దానిపై చిత్రవిచిత్రముగా మెలికలు తిరిగియుండు స్తంభ

ములతో నలంకరించబడి యిరువైపుల సెయింటుస్టెయిక్ స్లాల్ సెయింటుక్లిమెంటుల లవణ విగ్రహములు గల నివేదనపీఠము (Altar) కలదు. మఱియొకచిత్రమగు విషయ మిందు గల నృత్యమందిరము (Dancing hall). ఇది 300అడుగుల పొడవును 190 అడుగులఎత్తును సింహాసనమును, నచ్చటచ్చట పలువిధములగు లవణవిగ్రహములును కలవు.

ఈగనులలో ఉప్పునీటి చెఱువులును, చిన్నకాలువలును కలవు. చెఱువులయందు అరిగెలను, (Ferries) యానపాత్రములగూడ నుపయోగింతురు. చెఱువులయందు పెద్దది 195 అడుగులు నిడివియు 110 అడుగుల వెడ





వెలిజ్కాలోని ఉప్పుగనియందలి పట్టణము. ఇందు 2000 పనివాండ్రు కలరు. వీరి సౌకర్యార్థము అహోమార్గములు, వీథులు, ఆలయములు, నృత్యశాలలు, భోజనశాలలు, తటాకములు ఇందు కలవు.

కలిగియున్నది. ఉప్పుస్ఫటికములచే చేయబడిన గొప్పదీపస్తంభములపై మైనపువత్తులను వెలిగించియుంతురు. మందిరమున నొకగొప్ప ల్పును కలిగియున్నది. ఇందు గ్రుడ్డిచేపలు కలవట. మొత్తముమీద నీగనిపట్టణమందు 2000 పనివాండ్రు వాసముచేయుచున్నారు.



# ప్రకృతివిలాసము

(హారీతకృతము)

కష్టజీవి



సీ. వేఁగుఁజుక్కనుజూచి
వేగిరపడిలేచి
మడి దున్నఁ గాఁడితో
వెడలుఁ గాపు;



తొలిమలి కోడికూఁతలవిని యమ్ముకో
నడవిపుల్లలకేఁగు బడుగుబేద;



తూరుపుగని త్రుళ్లి దొర కూఁక లిడునంచు
నాలితోఁ బర్వెత్తు కూలివాఁడు;



తెలవాఱెనంచు బెగ్గిలి మేఁప బీటికి
నురవడి గొర్లతో నురుకు గొల్ల;-

గీ! పణము ధాన్యము గడియించి బడలిబసకు, మఱలి పిల్లలతో నాలుమగలు నొక్క-
కంచమున గంజిద్రావి యే కలఁత లేక, మైమఱచి నిద్రవో వారిమోములందు
నఱలుఁ బ్రాకృతి కానంద వైభవంబు. [సశేషము]




నిడమర్తి సత్యనారాయణ మూర్తిగారు బి. ఏ. [సారస్వత సమాజము]

గడచిన డెబ్బది సంవత్సరములలో వంగదేశము చూపిన యభివృద్ధి ప్రశంసార్హము. ఈశ్వర చంద్రునిచే నారంభింపబడిన వంగసాహిత్యము రవీంద్రుని చేతులలో పుష్పించినది. రామ మోహనునితో మొదలిడిన మతవ్యాపకము వివేకానందునిచే ఖండాంతర వ్యాపనమును గాంచినది. రాజకీయములు దాసుకార్య దీక్షతో విస్తృతి గాంచినవి. శాస్త్ర పరిశోధనము దయాళుడగు ప్రఫుల్లచంద్రునియందును, ప్రతిభావంతుడగు జగదీశుని యందును ఉత్కృష్టస్థానము నాక్రమించినవి.

## బాల్యము

ఢక్కాకు సమీపముననున్న విక్రమపురము నందొక సత్కుటుంబమున జగదీశ చంద్రుడు 1858 వ సంవత్సరము నవంబరు 30 వ తేదీని జనన మొందెను. ఈతని తండ్రి భగవాన్ చంద్రబోసు డిప్యూటీ కలెక్టరు పని చేసెను. ఇతడు విద్యాలయములను స్థాపించి విద్యావ్యాపన మొనర్చెను. ఇతడు సద్వర్తనుడు; దయాళుడు. ఒకప్పు డీతడొక బందిపోటు దొంగను శిక్షించి యుండెను. అతను విముక్తుడైన వెంటనే భగవాన్ దాసును దగ్గరి తనకు జీవనోపాధిని జూపుమని వేడుకొనెను. తన చిన్నకుమారుని బడికి గొంపోవు పనినిచ్చి ఆతనిని భగవాను తనయొద్దనే యుండ నియమించెను. అతడును విశ్వాసముతో నతనిని గొల్చెను.

## విద్యాభ్యాసము

జగదీశుడు వీధి బడిలో చదువ మొదలిడెను. అచటనతడు మాతృభాషయందు ప్రజ్ఞచూపుటయేకాక భారతీయవిజ్ఞానము నందలి సదంశములను గూడ సేకరించెను. తరువాత నాతడు ఆంగ్లభాషాభ్యాసమును విదేశగమనమును చేసినను బాల్యమున గ్రహించిన యీ యంశములు మాత్ర మాతని మనోనేత్రమున దాండవ మాడుచు విజయకారణము లయ్యెను.

జగదీశుడు పట్టపరీక్షయందుత్తీర్ణుడైనవెంటనే తండ్రి యాతని నింగ్లాండునకు బంపెను. కుమారుడు సివిలు సర్వీసు పరీక్షకు నేగ నెంచెనుకాని తండ్రి యాతని వైద్యశాస్త్రము నభ్యసింపవలెనని శాసించెను. వైద్యమునం దాతని కభిరుచి లేకుండుటచేతను, తరుచు అనారోగ్యముగా నుండుటచేతను జగదీశుడా విద్యను మాని లండనునుంచి కేంబ్రిడ్జివచ్చి అచ్చటశాస్త్రము (Science) నభ్యసింప నారంభించెను. 1884 లో క్రైస్తవకళాశాలలో మరల పట్ట పరీక్షయందుత్తీర్ణుడగుటయేకాక బహుమానమునుగూడ బొందెను. మరుసటి వత్సరము లండను విశ్వవిద్యాలయమునందు 'శాస్త్రపండిత' (B Sc.) పరీక్షయందు జయముగాంచి మాతృదేశమునకు దిరిగి వచ్చెను. ఇంగ్లాండునందున్న సమయమున నితడు సుప్రసిద్ధ శాస్త్రవేత్తలగు బాల్ఫోరు, పండితహోప్క్య, పండితలివింగ్స్య, రాలే ప్రభువు మొదలగు వారిపరిచయమును గురుత్వమును సంపాదించి విజ్ఞానమును ఉత్సాహమును సేకరించియుండెను.

## ఉద్యోగము

అప్పటికి జగదీశునకు పాతికేండ్లు. ఆ సమయమున రిప్పన్ ప్రభువు ఇండియాకు వైస్రాయి. ఆత డీతని ప్రతిభావిశేషములనుగూర్చి వినియుండుటచే కలకత్తాయందున్న ప్రభుత్వమువారి రాజధాని కళాశాలయందు శాస్త్రోపాధ్యాయత్వము నిశ్చించెను. కాని జీతము విషయమున నీతని కన్యాయము జరిగినది. తెల్లవారి కిచ్చు జీతములో మూడింట రెండు పాల్లీయబడెను. కాని యీతని యుద్యోగము ఖాయము కానందున అందులో

సగము అనగా తెల్లవారి కీయబడు జీతములో మూడవ వంతు మాత్రమే యివ్వబడెను. బోసు దాని నేవగించుకొనెను. అందుచే తనకు న్యాయము ప్రసాదింపబడు వరకు నా జీతము నందొక పైస యైనను ముట్టుకొనలేదు. డబ్బుకొరకు అనేక కష్టములు పడెను. కాని జీతమును ముట్టలేదు. అట్లు మూడేండ్లు గడచెను. జగదీశుని తెలివియు విలువయు క్రమముగ వెల్లడియయ్యెను. ప్రభుత్వము వారంతట నాతని యుద్యోగమును ఖాయపరచి మూడు వత్సరముల నుండియు నతనికి న్యాయముగ రావలసిన మొత్తమునంతె నొక్కమారుగ నిచ్చిరి. జగదీశుడు మాత్రము వాని నంతగా లెక్కచేయక తన పరిశోధనమును సాగించెను. ప్రభుత్వమువారీ విషయమున నీతని కేమియు సాయము చేయరైరి.

## పరిశోధనలు

జగదీశుడు తన పరిశోధన ఫలితములను 1895 కుపూర్వమే ప్రచురింప మొదలిడెను. అందులో " Determination of the Indices of Electric Refraction" అను వ్యాసమును ఇంగ్లండునందలి రాయల్ సొసైటీ (Royal Society) వారు మెచ్చుకొని దానిని తమ పత్రికయందు ప్రకటించుటేకాక పరిశోధనలు సలుపుటకు కొంత ద్రవ్యసహాయము నతనికిచేసిరి. ఈ గౌరవమును పొందిన రెండు సంవత్సరములకు ప్రభుత్వమువారు కూడ బోసునకు గొంత సహాయము చేయబూనిరి. ఈ సమయమునందు తీగలేని తంతివార్తల నంపువిషయమున నితడు పరిశోధనలు చేయుచుండెను. అదేకాలమున అమెరికాయందును, బోలోనా విశ్వవిద్యాలయము నందును ఈ విషయముననే పరిశోధనలు జరుగుచుండెను. అందు ప్రథమమున విజయము గాంచినది జగదీశ చంద్రుడే.

1897 లో ఇతడు రాయల్ సొసైటీ వారి యెదుట తన పరిశోధనలను గూర్చి యుపన్యసించుటకు ఇంగ్లండున కాహ్వానింపబడెను. మొట్టమొదట నితని వ్యాసములును సిద్ధాంతములును అచ్చటి పండితుల యాదరణము నొందెను. కాని యీర్ష్యచే కొంద రీతనిని ప్రతిఘటింప మొదలిడిరి. సత్యాన్వేషణమే శాస్త్రజ్ఞుని విధియని యెరింగియుండియు నాపండితంమన్యులు భారతీయుని ప్రతిభావిశేషమును సహింపక నాతని కడ్డముగా నిలిచిరి. వారిలో ముఖ్యుడు వృద్ధుడగు 'సర్ జాన్ బర్డన్ సాండర్సన్.' ఇతని నిరోధమునకు ఫలితముగ జగదీశుని వ్యాసములను ప్రచురించుటకుగాని, తమ సంఘమునందు చదువుటకుగాని రాయల్ సొసైటీవారు నిరాకరించిరి. వానిని ప్రచురించి పైకి దెచ్చుటకు జగదీశుడు చేసిన ప్రయత్నములెల్ల విఫలమయ్యెను. కాని తన విలువ నెఱింగియుండుటచే నతడు మాత్రము హతాశుడు కాలేదు.

అంతలో కొందరు పాశ్చాత్య పండితులు బోసు సిద్ధాంతములను సంగ్రహించి తమచే స్థిరీకరింపబడెనని ప్రచురించిరి. పాశ్చాత్యలోక మది నిజమని భ్రమసియున్న సమయమున రాయల్ సొసైటీ కార్యదర్శియు బోసు హితుడునగు హారాసు పండితుడు దానియందలి నిజమును బ్రకటించి జగదీశు నాదరించెను. దీనికి ఫలితముగ మరల నాతడు ఇంగ్లాండునకు 1915 లో నాహ్వానింపబడెను. ఆతరుణమున నతడు ప్రపంచము నంతటను పర్యటనముచేసి తన సిద్ధాంతముల యందలి సత్యమును నిరూపించుచు అనూనగౌరవమును బొందుటయేకాక శాస్త్ర ప్రపంచమును తాగు మారుచేసెను.

మాతృదేశమునకు మరలి వచ్చిన యనంతరము జగదీశుడు మహాకార్యము నొండు తలపెట్టెను. శాస్త్ర పరిశోధకులకు హిందూదేశమునం దెచ్చటను సరియగు తావు లేదు. ఆ కొరత తీర్పవలెనని యతడు సంకల్పించుకొనెను. ప్రయత్నము ఘనమైనది వ్యయపూర్వకమైనది. తనకు గల ధనములో చాల భాగము దాని కొసగెను. 1917 నవంబరు 30 వ తేదీని అనగా తన యేబదితొమ్మిదవ జన్మదినమున ఆశాస్త్రాలయమును తెరచి, నాటినుండియు ప్రతిభావంతులగు శిష్యబృందమును ప్రోవుచేసి పరిశోధనములను జరుపుచుండెను.

## కీర్తి గౌరవములు

జగదీశుని కీర్తి చంద్రికలు విస్తరించిన కొలదిని ప్రభువుల యాదరణమును హెచ్చజొచ్చెను. మన ప్రభుత్వమునకును విద్యాసంస్థాపనలకును సూక్ష్మదృష్టి తక్కువ. రామానుజము రెవెన్యూ కచేరీలో పూడిపోయినాడు. రవీంద్రుడు శాంతినికేతనమునకు పోవలసివచ్చెను. వారి

నన్యదేశీయులు గుర్తించి యాదరించినవెనుక ప్రభుత్వ మును దేశము నాదరించును. జగదీశుని చరితముకూడ నట్టిదే. ఖండాంతరులాతని ప్రతిభను గుర్తించిన తరు వాత 1903 లో సి. ఐ. ఇ. బిరుదమును 1911 లో సి. యస్. ఐ.బిరుదమున్ను, 1917లో సర్ బిరుదమును జగదీ శునకు ప్రభుత్వమువారు ప్రసాదించిరి. చివరకు రాయల్ సొసైటీ వారితనికి తమ సంఘమునందు సభ్యత్వము, (F. R. A. S) నిచ్చి యున్నే భారతీయుడును పడని యసూనగౌరవము నాతనికి చేసిరి.

జగదీశచంద్రుడు తన ప్రతిభావిశేషము చేతను పాండిత్యము చేతను గాంధీ అరవింద రవీంద్రులవలె ప్రపంచపూరుషుడైనాడు. కాని యాతడు ప్రతివిషయము నందును నిజముగ భారతీయుడు. వంశపరంపరగా వచ్చు చున్న ఋషిజీవితమే యాతనియాదర్శము. తండ్రిచేసిన యమితమగు అప్పుల నొక పైసయైనను విడువక తీర్చెను. తీగలేని తంతివార్తల విషయమున సాధనసామగ్రిని పేటెంటు తీసుకొనిన యెడల లక్షలను సంపాదించియుం డును. కాని యట్లు చేయలేదు. పంజాబు విశ్వవిద్యా లయు తనకు రూ. 1200 ల నివ్వగా ఆవిశ్వవిద్యాలయ శాస్త్ర పరిశోధకులయుపయోగార్థము తిరిగి యిచ్చెను. కొన్ని లక్షల విలువగల తనయాస్తినంతను పరిశోధనాల యమునకిచ్చెను. వేషభాషలు నిరాడంబరమును పవిత్ర తను సూచించును. ప్రఫుల్లచంద్రరాయి నుడివినటులు. ఇతడు యుగప్రవర్తకుడు, యుగకర్త.

## కనిపెట్టినది, కనుగొనినది

తీగలేని తంతివార్తను మొట్టమొదట కనిపెట్టెను. కాని వృక్షశాస్త్రము నందుత్సాహము మెండగుటచే పైదానిని విరమించెను. తరువాత ఇటలీ శాస్త్రజ్ఞుడగు మార్కొనీ స్వంతముగ నిరూపణలుచేసి తీగలేని తంతి వార్తను వ్యాపింపజేసెను.

వృక్షశాస్త్రమునందు మాత్రము బోసు నిరుపమాన మగు నభివృద్ధిని గనుపరచెను. ఇతడాశాస్త్రమునందు ప్రవేశింపక మునుపు ప్రజ్ఞావంతులగు జర్మను శాస్త్రజ్ఞు లెల్లరును వృక్షములకును జంతువులకును నిర్మాణమునం దేమాత్రమును పోలిక లేదని స్థిరపరచిరి. వారి వాదమే యూరపునందు వ్యాప్తమయ్యెను; కాని జగదీశుని నిరూ పణవలన వారివాదము తారుమారయ్యెను. స్థావర జంగమములకు గలభేదము బాహ్యదృష్టికి మాత్రమేకాని, సూక్ష్మదృష్టికి లేదని చూపెను. చిన్న మొక్కను మెల్లగ గొట్టినచో పసిబిడ్డవలె గజగజ వడకునని చూపె ను. మొక్కలు మత్తుపదార్థము వలన ఎదుగక నిలిచి యుండుననియు, మంచి యాహారము నిచ్చుటవలన త్వర గా నెదుగుననియు, విషప్రయోగమువలన క్షీణించునని యు శాస్త్రాలియమున జూపెను.

కాని యీ కార్యమతనికి మిగుల కష్టముగా నుండె ను. స్వల్పకాలములో మొక్కలు చాల కొద్దిగ నెదు గును. అది మనకంటికి కగుపడదు. అందుచే దానిని చూచుట కత్యంత సూక్ష్మమగు దానిని అతిశయముగ జూపు యంత్రమును నిర్మింపవలసివచ్చెను. ప్రయత్నము చేసి 'రిసకెంటు రికార్డరు' అను యంత్రమును నిర్మిం చెను. దాని సాయమున మొక్క యొక్క యెదుగు 10,000 రెట్లు ఎక్కువగా చూపబడును. అనగా మొక్క ఒక అంగుళి మెదిగిన మనకు 10,000 అంగుళము లెదిగి నట్లు గోచరించును. కాని యిదికూడ ఆతని కార్యము నకు సరిపడలేదు. అందుచేత మరి యైదువత్సరములు కష్టించి 'మాగ్నెటిక్ క్రెస్కోగ్రాఫును' నిర్మించెను. దీని ఫలితముగ మొక్క యొక్క యెదుగు 100,000,000 రెట్లు హెచ్చుగా దృశ్యమగును. ఇంత సున్నితమగు యంత్రము మరొండు లేదనుటలో నత్యుక్తిలేదు. ఒక నత్త గంటకు 40,000 మైళ్ల చొప్పున పోవునటులు చూ పగల యంత్రమును మనము నిర్మించినచో నీయంత్రము యొక్క యతిశయ సామర్థ్యము (Magnifying power) పై నుదహరించిన మాగ్నెటిక్కు క్రెస్కోగ్రాఫుయొక్క శక్తికి సమానమగును. ఈ యంత్రముయొక్క సహాయ మున బోసు తన నిరూపణలను పాశ్చాత్య శాస్త్రజ్ఞ మండలి ముందు ఋజువుచేసెను. ఈ సూక్ష్మయంత్ర మును నిపుణులగు భారతీయులచేతనే బోసు చేయించెను.

బోసు కనిపెట్టిన యంత్రములలో 'కృత్రిమలోచ నము' (Artificial eye or Super Retina) ఒకే ము ఖ్యమైనది. దీని సాయమున మనభౌతిక నయనముల కగోచరములగు రెక్కరంగులను, ఆకారములను విషయ ములను అతడు గుర్తింప గలుగుచున్నాడు.

మొన్న మొన్న యూరపునకు బోసువెళ్లినపుడు చూపిన విషయ మొకటి ముఖ్యమైనది. చెట్లు భూమియందలి ద్రవమును ఆహారమును పైకి 'ఆస్మాటిక్కు ప్రెష్షరు' వలన పంప గలుగుచున్నవని పాశ్చాత్యుల నమ్మకము; కాని యత డది యపభ్రంశ యనియు, చెట్ల నాళములు మానవుల రక్తనాళముల బోలియున్నవనియు, అందుచే రక్తము మన దేహమునందు భూమియొక్క ఆకర్షణ శక్తికి వ్యతిరేకముగ బ్రవహించ గలిగినట్లే ప్రవహించు చున్నవనియు ఋజువు చేసెను.

జగదీశుని నిరూపణలు చాల ప్రాముఖ్యమైనవి. కాని వాని వలన మనకు అనుదినజీవనమునం దెట్టియుపకారములు గలుగునో యూహించుట కవకాశము చాలదు. కొలది కాల మింకను జరిగినగాని దానియొక్క ప్రాముఖ్యము సంపూర్ణముగ గోచరింపదు. కాని అద్వైతవాదులును, తపశ్శాలురునగు భారతీయులు మిరుమిట్లు గొలుపు దినకాంతులలో పనిచేసి సత్యాన్వేషణమును చేయజాలరని పాశ్చాత్యులు ప్రచురించుట యపవాదని ఋజువు చేసిన మహాపురుషులు ముగ్గురిలో (గాంధి, రవీంద్రుడు, బోసు) ఇత డొకడు.



# మధుర స్మృతి

(పూఁదోఁట)

నయిడిపాటి చలపతిరావు గారు

పరభృతావళి గొంతెత్తి పాడుచుండ
శుకములు పరాగముల సొంపుఁ జూపుచుండ
నెమలికన్నెలు నృత్యంబు నెఱపు నెచట?
నచట వసియింప నాకెపు డనువుపడునో!!

*   *   *   *

అరుణపల్లవకన్యక లాడుకడకు
నవసుమాంగన లటునిటు నడచుకడకుఁ
బవనయువకుఁడు మెలమెల్లఁ బర్వు నెచట
నచట వసియింప నాకెపు డనువుపడునో!!

*   *   *   *

వలపుఁ బలుకుల తేనెలఁ జిలికికొనుచు
నండజంబులు గుసగుస లాడఁ జూచి
యవనిజావళియును మాటలాడు నెచట?
నచట వసియింప నాకెపు డనువుపడునో!!

*   *   *   *

ఫలవితతిఁ బర్ణపేటులఁ బదిలపరచి
పూవుఁబల్లెరములఁ దేనెఁ బొసఁగఁ జూచి
భృంగసంతతి విందుకుఁ బిల్చు నెచట?
నచట వసియింప నాకెపు డనువుపడునో!!

*   *   *   *

నాదుప్రేయసిఁ గూడి నేనడువ, నేన
బ్రాలవితమున వికసితప్రసవవితతి
జల్లుజల్లున వనలక్ష్మి చల్లు నెచట?
నచట వసియింప నాకెపు డనువుపడునో!!






గూడా కృష్ణమూర్తిగారు

[విద్యార్థి, ఆంధ్రజాతీయ కళాశాల.]

## ఆఱవ శతాబ్దమున హిందూదేశ రాజకీయ పరిస్థితులు

గుప్త సామ్రాజ్యము ఆఱవ శతాబ్ద ప్రారంభమున క్షీణించిపోయెను. గుప్తచక్రవర్తులలో నించుమించుగా చివరవాడని చెప్పదగు నరసింహగుప్త బాలాదిత్యుని కాలమున శ్వేతహూణులు తోరమాణుడను గొప్ప సేనానియాధిపత్యముక్రింద గుప్తుల స్వాధీనమందుగల మాళవము వశపరచుకొని స్వతంత్రరాజ్యమును స్థాపించిరి. శ్వేతహూణులు మోటుజాతివారు. అల్లరిమూకలు. వీరు అయిదవశతాబ్దమున తుర్కీస్థానమును స్వాధీనపరచుకొని హీరటు ముఖ్యపట్టణముగా జేసుకొని పరిపాలించిరి. హిందూదేశమున ప్రవేశించి గుప్తరాజుల నోడించిరి. ఇంతటినుండియు గుప్తసామ్రాజ్య మంతరించినదని చెప్పవచ్చును. కాని క్రీ. శ. 750 సం. వరకు గుప్తవంశజులు చిన్నచిన్న రాజులుగ నుండి మగధను, ఆచుట్టుపట్ల ప్రదేశములను పాలించుచుండిరి. తోరమాణుని దండయాత్రతో గుప్తసామ్రాజ్యప్రతిభ యంతరించెను.

తోరమాణుడు క్రీ. శ. 510 సం. వరకు మాళవమందు రాజ్యమేలెను. ఇతడు చుట్టుపట్లనుండు రాజ్యముల నెల్ల స్వాధీనపఱచుకొని "రాజధిరాజా" అను బిరుదనామము వహించెను. ఇతనియనంతర మాతనికుమారుడు మిహిరకులుడు రాజయ్యెను. ఇతడు పాంచాలమందుగల "శాకల లేక శ్యాకల్యపురమును" (Sailkot) రాజధానిగ జేసికొని పరిపాలించెను. మాళవమునకు యశోధర్ముడు రాజుగ నుండెను. మిహిరకులుడు బహుక్రూరుడు. శ్వేతహూణులలోని క్రూరత్వమంతయు నీతనిలో మూర్తీభవించినదని చెప్పదగును. ఈతడు రాజ్యమేలి నంతకాలము నిరంకుశపాలన మొనర్చెను. ఏదో యొకచిన్న కారణమున బౌద్ధులనెల్లర సకలబాధల బెట్టెను. ఇతర రాజులెల్లరు నీతని నణచు టెట్లాయని యోచించుచుండిరి. అట్టితరి మాళవము నేలు యశోధర్ముడును, మగధ రాజ్యమును పాలించుచున్న బాలాదిత్యుడును యేకీభవించి యాతని నోడించి ఖైదీగా బట్టుకొనిరి. అనంతర మాతని క్షమించి ఖైదునుండి విడుదల చేయగా నాతడు కాశ్మీరమునకు బోయి, అచటనే క్రీ. శ. 54 సం. న కాలధర్మము నొందెను. ఇంతటితో శ్వేతహూణులు ప్రతిభ తగ్గి క్రమక్రమముగ నణగిపోయిరి.

గుప్తసామ్రాజ్య మంతరించి నదిమొదలు శ్రీహర్షుని కాలమువరకు కీర్తివంతులగు రాజు లెవరును పరిపాలింపలేదు. గొప్పగ చెన్నదగిన కార్యము లెవ్వియు జరుగలేదు. మిహిరకులుని జయించిన యశోధర్ముడు, తనరాజ్యము బాగుగ విస్తరింపజేసి పరిపాలించెనట. కాని రాజ్యవంశమున మాత్రము స్థాపించిన ట్లెచటను లేదు. ఆఱవశతాబ్దమధ్యభాగమున వింధ్యపర్వతములకు దక్షిణముగ పులికేశియను చాళుక్యరాజొకగొప్పరాజ్యమును నిర్మించెను. ఇంకను దక్షిణముగ పల్లవులు కంచి ముఖ్యపట్టణముగ జేసికొని రాజ్యమేలుచుండిరి. ఉత్తరహిందూస్థానమున మగధలో గుప్తరాజులును, వారిపరిసరప్రదేశములలో పరిపాలించుముఖారిరాజులును ఒకప్పుడు శత్రుత్వమును మరియొకప్పుడు మిత్రత్వమును కలిగి మెలగుచుండిరి. ఈశానవర్మయను ముఖారిరాజును కుమారగుప్తుడు సంపూర్ణముగ నోడించెనట. కుమారగుప్తుని కుమారుడగు దామోదరగుప్తుడు ఒకానొక ముఖారినాయకునిచే చంపబడెను. దామోదరగుప్తుని కుమారుడగు

మహాసేనగుప్తుడు కామరూపమున (Assam) పాలించుచున్న సుస్థిరవర్మతో యుద్ధముచేసెను. సుస్థిరవర్మకుమారుడు భాస్కరవర్మయు శ్రీహర్షునకును హుయాన్‌సాంగునకునుగూడ మిత్రుడైయుండి రాజ్యపరిపాలన మొనర్చెను.

మగధరాజ్యము తరువాత కర్ణసువర్ణరాజ్యము గలదు. ఈరాజ్యమును పాలించురాజులు బ్రాహ్మణమతావలంబులగుటచే బౌద్ధులను హింసించెడివారని హుయాన్‌సాంగ్ వ్రాసియుండెను. ఈరాజ్యమునకు తూర్పున కామరూపరాజ్యము కలదు. వీరుకూడ బ్రాహ్మణమతావలంబులే. ప్రథమమున ఈరాజ్యమును భగదత్తుడు పాలించెనట. ఇతడు శౌర్యనిధియై రాజ్యమెల్లెడల శాంతి స్థాపించెను.

ఈరాజ్యమునుగూడ యశోధర్ముడు స్వాధీనము చేసుకొనెనట. ఇది శ్రీహర్షుని మిత్రుడగు భాస్కరవర్మని కాలమున బాగుగ నభివృద్ధి చెందెను.

ఇక హిందూదేశపశ్చిమోత్తర భాగముననున్న రాజ్యములనుగూర్చి కొద్దిగ విచారించుదాము. మొదట కపిశ (కాబోలు) రాజ్యము కలదు. ఇందు పరిపాలించినరాజు బౌద్ధధర్మ మవలంబించిన క్షత్రియుడు. ఈరాజును గూర్చి మన కంతగా తెలియదుగాని ఈతడు లంపాక, నాగర, గాంధార మొదలగు రాజ్యములనుగూడ పరిపాలించినట్లు తెలియుచున్నది. తరువాత సువస్తు రాజ్యము కలదు. దీనినే ఇప్పుడు (Swat) అందురు. ఇచట బౌద్ధమతము ప్రబలియుండెను. అనంతరము కాశ్మీరరాజ్యము కలదు. దీనిని కర్కోటక వంశస్థాపకుడైన దుర్లభవర్ధనుడు పరిపాలించెను. తక్షశిల, సింహపుర, ఉరసా మొదలగురాజ్యములు ఈతనికి లోబడియుండెను. అనంతరము సింధురాజ్యము ముఖ్యమైనది. ఇచట పరిపాలించినరాజు బలవంతుడే కాని శ్రీహర్షునిసోదరుడగు ప్రభాకరవర్ధనునిచే ఓడింపబడెను, ఇతడు శూద్రుడు. ఇతడు శూద్రుడా క్షత్రియుడాయని వాదప్రతివాదములు ప్రబలియున్నవి. తరువాత హుయాన్‌సాంగ్ హిందూదేశమునకు వచ్చుసరికి ఇచట రెండవసాహి(Shahsi II)అను బౌద్ధరాజు పాలించుచుండెను. తరువాత ఘూర్జరరాజ్యము కలదు.

ఆర్యావర్తమునకు నైరృతిమూలగా సేనాపతి భట్టారకు డొకగొప్పరాజ్యమును నిర్మించెను. ఇతనిమనుమడు ద్రోణసింహుడు "మహారాజ" అనుబిరుదనామము వహించి తనచుట్టుప్రక్కల నున్నచిన్నచిన్న రాజ్యముల నెల్ల స్వాధీనపరచుకొనెను. ఇక మాళవరాజ్యము జూచిన యశోధర్ముని యనంతరము దీనిచరిత్ర మనకేమియు తెలియదు. యశోధర్ము డెవరో, అత డెంతకాలము పరిపాలించెనో కూడ తెలియదు. అత డెచటనుండియో యుద్భవిల్లి విజృంభించి గుప్తసామ్రాజ్యముకన్న నొక గొప్పసామ్రాజ్యమును నిర్మించి యంతరించి పోయెను. తరువాత శ్రీహర్షుని యల్లుడగు ధ్రువభటునిచే పరిపాలింపబడిన వల్లభిరాజ్యము కలదు.

ఇట్లు ఉత్తరహిందూస్థానమెల్ల భిన్నమై చిన్నచిన్న రాజ్యములుగా చీలిపోయి అనామకులగు రాజులచే నాక్రమింపబడెను. ఇందువలన దేశమంతయు అరాజకమైనదని చెప్పుటకు వీలులేదు. శ్వేతహూణుల దండయాత్రవలన యేరాజును మౌర్యులవలెగాని శౌర్యనిధులగు గుప్తరాజులవలెగాని యేకచ్ఛత్రాధిపత్యము వహించి పరిపాలించినరాజ్యనిర్మాతలు కాలేకపోయిరి. ఈశతాబ్దమున సంస్కృతవాఙ్మయము సంపూర్ణముగ నభివృద్ధిగాంచెను. వరాహమిహిరుడను గొప్పజ్యోతిశ్శాస్త్రజ్ఞుడును, ఆర్యభట్టుడను గొప్పగణితశాస్త్రజ్ఞుడును ఈశతాబ్దములో ప్రతిభగాంచినవారే. ఇంకను అనేకులు జ్ఞానాభివృద్ధికై పాటుపడి కీర్తిశేషులైరి. 5వ శతాబ్దమున వచ్చిన ఫాహియాన్‌వ్రాతలను, 7వ శతాబ్దమున వచ్చేసిన హుయాన్‌సాంగువ్రాతలనుబట్టి చూచినచో 6వ శతాబ్దమున మతములలో గొప్పమార్పు గలదని స్పష్టపడుచున్నది. ఈ శతాబ్దమున బ్రాహ్మణమత మభివృద్ధిగాంచెను. ఇందువలన బౌద్ధమతము సంపూర్ణముగ క్షీణించిపోయినదని చెప్పుటకు వీలులేదు. ఫాహియాన్ వచ్చుసరికే బౌద్ధమతము ప్రబలముగ నుండెను. కాని మెల్లమెల్లన బ్రాహ్మణమతమే యభివృద్ధినొందెను. శ్రీహర్షుడు బౌద్ధమతమును, ప్రేమించినప్పటికి బ్రాహ్మణమతావలంబుడే. హిందూదేశమున పాలించినచక్రవర్తుల లో అశోకునికాలముననే బౌద్ధమతము రాజమతమయ్యెను; గాని మరి యేచక్రవర్తికాలమునను గూడ బౌద్ధమత

ము రాజమతమై యుండలేదని చెప్పదగును. గుప్తరాజులుగూడ బ్రాహ్మణమతావలంబకు లగుటచే బ్రాహ్మణమతమే 6వ శతాబ్దమున నభివృద్ధి నొందెనని చెప్పవచ్చును.

ఆ 6వ శతాబ్దమున ఏకచ్ఛత్రాధిపత్యము వహించినరాజు లేకపోవుటయు, హిందూస్థానమంతయు చిన్న చిన్న రాజ్యములుగ చీలిపోవుటయు చూచినచో ఎవరో యొకరాజు మరల నేకచ్ఛత్రాధిపత్యము వహించి శాంతియుతముగ దేశము నేలుట కవకాశమున్నట్లు పొడగట్టుచున్నది.

## శ్రీహర్షుని జీవితసంగ్రహము

శ్రీహర్షునివంశావళినిగూర్చి మన కంతగా తెలియదు. హర్షచరిత్రకర్తయగు బాణుడుగూడ శ్రీహర్షుడు సూర్యవంశజుడనియు, చంద్రవంశజుడనియు నిశ్చయింపక, పుష్పభూపతియను నొకగొప్పశూరు డుద్భవిల్లెనని యు, ఆతనినుండియే ఈవంశము ప్రారంభించెననియు వ్రాసియున్నాడు. కాని అతనితరువాత శ్రీహర్షునితండ్రియగు ప్రతాపశీలప్రభాకరవర్ధనునివరకు నుండు యే రాజునామముగూడ జెప్పలేదు. అనంతరము పరిశోధకులు తమప్రజ్ఞావిశేషమువలన ప్రభాకరవర్ధనునితండ్రి ఆదిత్యవర్ధనుడనియు, తాత రాజ్యవర్ధనుడనియు తెలిసికొనగల్గిరి. ఆదిత్యవర్ధనునిభార్య మహాసేనగుప్తదేవి. వీరల కుద్భవిల్లినశూరుడే ప్రభాకరవర్ధనుడు. ఈతడు అల్లరిమూకలగు శ్వేతహూణుల నోడించి హిందూదేశము నేలిన గొప్పగొప్పచక్రవర్తులతో పరిపోల్ప దగినవాడై కడుఘనత జెందెను. ఈవంశజులు మొదట స్థానేశ్వరమును పాలించుచుండిరి. అనంతరము క్రమక్రమముగా రాజ్యము విస్తరించెను. వీరు సూర్య్య నారాధించెడువారు. గుప్తసామ్రాజ్యపతనకాలమునాటికిగూడ వీరు సామంతరాజులుగా నుండిరి. ప్రప్రథమమున ప్రభాకరవర్ధనుడే 'మహారాజాధిరాజ' యను బిరుదనామము వహించెను. ఇతడు మాళవమును ఘూర్జరమును జయించి తనరాజ్యమును విస్తరింపజేసి భావిభారతచక్రవర్తియగు శ్రీహర్షునిరాజ్యమునకు పునాది వేసెను. ప్రభాకరవర్ధనుని భార్య యశోవతి. ఈమెవలన ఇద్దరుకుమారులును ఒక కుమార్తెయును కల్గిరి. మొదటికుమారునిపేరు రాజ్యవర్ధనుడు. రెండవకుమారుడు ఆర్యావర్తమునెల్ల నేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన శ్రీహర్షచక్రవర్తి. కుమార్తెపేరు రాజ్యశ్రీ.

శ్రీహర్షుడు జ్యేష్ఠమాసమున కృష్ణపక్షములో ద్వాదశినాడు జనించెను. తండ్రి ప్రభాకరుడు. వెంటనే జ్యోతిష్కుని రావించి వానిచే జాతకమును వ్రాయించెను. ఆతడు, శ్రీహర్షుడు రాజులనెల్ల జయించి పట్టాభిషిక్తుడగుటకుగల గ్రహములన్నియు నున్నవనియు, దుష్టగ్రహములేవియు లేవనియు జెప్పెను. రాజ్యవర్ధను డీతనికన్న అయిదువత్సరములు పెద్దవాడు. వీరల మేనమామ కొడుకగు బంధి ఎల్లప్పుడును ఈరాజకుమారు లిద్దరితో నాడుకొనుచు పెరుగుచుండెను. ఈతడును రాజ్యవర్ధనుడును, సమానవయస్కులు. వీరికి తోడుగా మాళవరాజకుమారులగు కుమారగుప్తుడును, మాధవగుప్తుడును ఆడుకొనుచు, ప్రభాకరవర్ధనుని పోషణక్రిందనే యుండిరి. ఈ రాజకుమారులెల్ల దృఢకాయులై యుండిరి. వీరెట్టిదుర్గుణములకుగూడ అలవాటుపడియుండలేదు. ప్రభాకరవర్ధనుడు తనకుమార్తె రాజ్యశ్రీని పండ్రెండు, పదమూడు వత్సరములు వచ్చుసరికి కన్యాకుబ్జమును పరిపాలించుచున్న అనంతవర్మ ముఖారియను రాజకుమారుడగు గ్రహవర్మ కిచ్చి వివాహ మొనర్చెను. ఈవంశజులు కీర్తివంతులే కాని రాజ్యము నభివృద్ధిచేసినట్లు తెలియదు. ఆర్యావర్తమున నుండు గొప్పగొప్పరాజులతో సంబంధబాంధవ్యము లుండెను. ప్రభాకరవర్ధనుడు కుమార్తెపెండ్లిచేసి రాజకుమార లిద్దరును దినదినప్రవర్ధమానులై పెరుగుచుండ, హిందూధర్మానుసారముగా యువరాజపదవి నధిష్ఠింపజేసి రాజకీయవ్యవహారములలో వారల త్రిప్పుచుండెను. ఇట్లుకొంతకాలము గడచినపిదప రాజ్యవర్ధనుడు గొప్పశూరుడై, యుద్ధములుచేయుటకు సమర్థుడయ్యెను. అంతట ప్రభాకరవర్ధనుడు ఆతని నొకగొప్పసైన్యాధ్యక్షుని జేసి శ్వేతహూణుల మీదికి యుద్ధమున కంపెను. ఈత డిప్పటికి సుమారు 19,20 సంవత్సరములు వయస్సు కలవాడు. రాజ్యవర్ధనునితో నాతనితమ్ముడు శ్రీహర్షుడుగూడ బోయెనుగాని హిమాలయ పర్వతప్రాంతము లందుగల యడవులలో వేటాడుచుండెను. రాజకుమారు లిద్దరును ఇంటియొద్ద లేనిసమయమున ప్రభాకరవర్ధనుని కవసానకాలము వచ్చెను. ఈసంగతి తెలిసి శ్రీహర్షుడు

మాత్రమే వెనుకకు తిరిగి నిజరాజధానిని జేరెను. యువరాజగు రాజ్యవర్ధనుడు యుద్ధము నుండి వెనుకకు రాక పూర్వమే ప్రభాకరుడు స్వర్గస్థు డాయెను. అతనితో గూడ నతని భార్య సహగమనము జేసెను. అంత రాజ్య భారమంతయు బాలుడగు శ్రీహర్షునిమీద బడెను. అన్నగారు వచ్చువర కతడే రాజకార్యములన్నెల్ల నక్క బెట్టుచుండెను. రాజ్యవర్ధనుడు శ్వేతహూణుల నోడించి నిజరాజధాని కరిగి జననీజనకులమరణమున కెంతయు చింతాక్రాంతుడై యుండ; అతని బావమఱదియగు గ్రహవర్మను మాళవరాజు గంపి యాతనిభార్యయగు రాజ్యశ్రీని చెఱయందుంచెనను దుర్వార్తకూడ తెలిసెను. పాపము! మాళవరాజు ప్రభాకరవర్ధనుడు చనిపోయెనని యు, రాజ్యవర్ధనుడు యుద్ధమునకు బోయెననియు ఎఱిగి మాఱల తనస్వాతంత్ర్యమును నెలకొల్పుట కిదే మంచి సమయమని తలంచెను.

గ్రహవర్మ పసివాడైయుండి కన్యాకుబ్జమును పరిపాలించుచుండెను. మాళవరాజితనిమీద ఆకస్మికముగా బడి ఖైదీగా బట్టుకొనెను. కన్యాకుబ్జమును జయించిన యనంతరము స్థానేశ్వరముకూడ జయింప నెంచి సేనల నడుపుచుండెను. ఈతని స్నేహితుడును సహాయుడును అగు కర్ణసువర్ణరాజయిన శశాంకుడు స్థానేశ్వరమును జయించుటలో మాళవరాజునకు సహాయము చేయ నుద్దేశించి తనసైన్యములతో బయల్వెడలెను. ఈరాజు లిద్దరును కన్యాకుబ్జరాజునకు సామంతులుగా నుండిరి. మతవిషయమై ఇరుకక్షులకు వైరము కల్గెను. మాళవ కర్ణసువర్ణరాజులు బ్రాహ్మణమతావలంబులు; కన్యాకుబ్జరాజు బౌద్ధమతస్థుడు. ఆకాలమున మతవిషయములలో కక్షలు లేకపోయినప్పటికి ప్రస్తుతము రాజకీయవ్యవహారములందుండు శత్రుత్వమువలన మతమునుగూడ పురస్కరించుకొనిరి. ఈకారణమువలననే యీరాజులిద్దరు దండు వెడలిరి. రాజ్యవర్ధను డిదివిని ఎంతమాత్రము వెనుదీయక తనవిచారమునెల్ల నొకమూల త్రోసిపుచ్చి ధైర్యము వహించి శ్రీహర్షునిమీద రాజ్యభారమంతయు వైచి తన ముఖ్యమంత్రియగు బంధి యాధిపత్యముక్రింద పదివేలు అశ్వదళమును తీసికొని శత్రురాజుల మద మడంచుటకై బయల్వెడలెను. అనంతర మకస్మాత్తుగా మాళవమున ప్రవేశించి దేవగుప్తుని సంపూర్ణముగ నోడించి చంపెను. దేవగుప్తునిత్రుంచి శశాంకు నోడించుటకు పోవుచుండ త్రోవలోనే యాతని కలుసుకొనెను. శశాంకుడు రాజ్యవర్ధనుని బహిరంగయుద్ధమున గెల్చుట కష్టమని తలచి, ఆతని యాధిపత్యమున కొప్పుకొనుటయేకాక తనకుమార్తెను రాజ్యవర్ధనున కిచ్చి పెండ్లిచేసెదనని చెప్పెనట. అనంతరము రాజ్యవర్ధనుడు ఆయుధములు లేకయే కొద్ది పరిజనముతో శశాంకుని గుడారమునకు విందునకు బోవ ఆదుష్టుం డతనిని అచట నూయోపాయముచే చంపెను. అంత సేనాధిపతియగుబంధి ధైర్యమువహించి సైన్యముల నన్నిటిని చేరదీసి శశాంకుని వెనుకకు తఱిమివేసెను. ఈ సంగతి కన్యాకుబ్జమును పాలించు గుప్తరాజు విని, బంధి తనరాజ్యమునుకూడ స్వాధీనపఱచుకొనునేమోయని భయపడి రాజ్యశ్రీని బందిఖానానుండి విడుదలచేసెను.

ఇట్టిసమయమున శ్రీహర్షుడు కుఱ్ఱవాడైనప్పటికి ధైర్యమును వీడక, ఎట్లు పదునాల్గువత్సరములప్రాయము ననే అక్బరు తనశౌర్యధైర్యములను జూపెనో అట్లే వర్తించెను. ఇప్పటికి హర్షుడు పదునారు వత్సరములవయస్సుగల్గి రాచకార్యములలో నెక్కువగా నేర్పరి కాకపోయినప్పటికి 606 వ సం. ననే మేనెలలో రాజ్యభారమంతయు వహించి వ్యవహరించెను. చుట్టుపట్లనుండు సామంతరాజ్యములు స్వతంత్రము స్థాపించుకొనుట కవకాశము దొరకెనని సంతసించుచుండ వారి యాశల నన్నిటిని నిరాశలుగ జేసెను. సింహనాదుడను సైన్యాధ్యక్షుడు శ్రీహర్షుని రాజుగా నియమించెను. V. A. Smith గారు బంధియే హర్షుని రాజుగా నియమించె ననుచున్నారుగాని అతడు రాజ్యవర్ధనునితో బోయెనని ఈవరకే చెప్పియుండుటచే Smith గారిందు పొరబడియుండవచ్చునని మానమ్మకము.

శ్రీహర్షుడు మొదట పట్టాభిషిక్తుడగుట కిచ్చగింపలేదు. స్థానేశ్వరసింహాసన మెక్కుట కేమియు సంశయింపలేదు. ఏలనన రాజ్యవర్ధనునికి కుమారులే లేరు. పెండ్లికూడ యైనదోలేదో నిశ్చయముగ చెప్పలేము. అందుచే శ్రీహర్షుడు తానే రాజ్యభారము వహించవలెనని యు ఆసింహాసనమునకు సరియైనవారసు డాతడేయనియు దలచి స్థానేశ్వరసింహాసన మెక్కుట కేమియు సంశయిం



పల్లకీపూజ, దసరామహోత్సవము—మైసూరు



అలంకరింపబడిన ఆవులు, దసరామహోత్సవము—మైసూరు

ఫా ర ౧



విద్యుద్దీపములచే నలంకరింపబడిన రాజప్రాసాదము - దసరామహోత్సవము
మైసూరు

పలేదు. కన్యాకుబ్జమందు పట్టాభిషిక్తుడగుటకు శంకించెను. రాజ్యశ్రీని శ్రీహర్షుడు రక్షించి తీసికొనివచ్చినప్పుడా రాజ్య మెవరికి పట్టముగట్టవలెనా యను ప్రశ్న వచ్చెను. హర్షునికి అవంతివర్మ వంశజులలో నెవరో యొకకుమారుని రాజుగా జేసి రాజ్యశ్రీకి రాజ్యముతో సంబంధము లేకుండజేయుట కిష్టములేదు. లేదా తాను రాజగుట కంతకన్నను ఇచ్ఛగింపడు. అదియునుగాక గ్రహవర్మయు, రాజ్యశ్రీయును బౌద్ధులు. శ్రీహర్షుడు శైవమతస్థుడైనప్పటికి బౌద్ధమతమందు బాగుగ నమ్మకమున్నవాడు. ఒకబౌద్ధభిక్షువు శ్రీహర్షునితో తాను సింహాసనాధిష్ఠుడు గాక రాజ్యశ్రీనే పరిపాలింప నిచ్చి రాజ్యభారము మాత్రము వహించవలసినదని చెప్పినట్లు హుయాన్‌సాంగు వ్రాసియున్నాడు. ఇందువల్ల శ్రీహర్షుడట్లే చేయ నెంచెను. తదనంతరము తనరాజధాని స్థానేశ్వరమునుండి కన్యాకుబ్జమునకు మార్చి జీవితకాలమంతయు అన్నివ్యవహారములలోను రాజ్యశ్రీసలహాతోనే పరిపాలన మొనర్చెను. ఏది యెట్లున్నను భారతచక్రవర్తియగు నదృష్టమాతని కుండుటచే నతడు సింహాసన మధిష్ఠించుట కొప్పుకొని సక్రమముగ రాజ్యపరిపాలనము జేసెను.

ఈతడు రాజ్యలక్ష్మిని జేపట్టిన తత్‌క్షణమే కర్ణసువర్ణరాజగు శశాంకుని ద్రుంచి కన్యాకుబ్జమందుగల తన సోదరిని బంధవిముక్తురాలిని జేయ దలంచికొని తనచతురంగబలముల నభివృద్ధిపరచి హిందూదేశమెల్ల జయించుటకు సంకల్పించుకొనెను. ప్రతిరాజునకును “యుద్ధమైన చేయుటకు సిద్ధముగా నుండుడు, లేదా లొంగిపోవుడు” అని జాబులు వ్రాయించెను. బాణుడు హర్షచరిత్రయం దిట్లువ్రాసెను.

"He, therefore, asked his foreign secretary to write to all the kings to proffer either battle or submission."

ఇట్లు హిందూదేశమెల్ల జయింపనెంచి, తనదిగ్విజయయాత్రకై వెడలి, స్థానేశ్వరమునకు సమీపమందుగల సరస్వతీనదీప్రాంతమున మొట్టమొదట విడిసెను. అచట దగ్గరగానుండు గ్రామాధికారి (పటేలు) హర్షునకు, అప్పుడే ముద్రించిన బంగారునాణెమును కానుకగానీయ నెంచి తనయరచేతియం దుంచెను. శ్రీహర్షుడు దానిని తీసుకొనునప్పు డది క్రింద పడిపోయెను. దగ్గర నుండి సైన్యాధికారులెల్లరు విజయయాత్రకు పోవునపుడు మొదటే ఈయపశకున మేమాయని నివ్వెరపోయిరి. కాని హర్షుని ధైర్య మెంతమాత్రము చలింపలేదు. ఇట్లే భావి భారతచక్రవర్తియగు హర్షునినాణెములు భూమియెల్లడల ముద్రింపబడునని చెప్పెను. అందుచే నిది శుభసూచకమే యని నిర్ణయించెను. ఏది ఎట్లయినను సామీప్యమున నుండు యుద్యోగులు అతిజాగరూకతగ నుండవలెనని నుడివిరి. అచటనుండి హర్షుడు కన్యాకుబ్జమును జేరుటకై బయల్వెడలెను.

ఇతడు పోవునప్పుడు త్రోవలో కామరూపరాజైన భాస్కరవర్మను శ్రీహర్షునిస్నేహముకోరి యాతనితో కలిసియుండెను. ఈతనితండ్రి సుస్థిరవర్మయని ఈవరకే చెప్పియుంటిమి. ఈతడు రాజుగా నున్నప్పుడు భాస్కరవర్మని ‘కుమారరాజ’ యని పిలుచుచుండిరని హుయాన్‌సాంగ్ వ్రాసియుండెను. కుమారరాజగు భాస్కరవర్మయు తనసోదరుని సింహాసన మాక్రమించు కోరిక గల్గియో లేక కర్ణసువర్ణరాజు శత్రువైయుండుటచే నాతని సాధించుటకో హర్షునిమైత్రి సంపాదించెను. శ్రీహర్షుడుగూడ కర్ణసువర్ణమును జయింప నుద్దేశ్యము కలవాడు గనుక భాస్కరవర్మని ఈసహాయముతో కడు సులభముగ శత్రునిగ్రహము చేయవచ్చునని తలచెను. ఇద్దరు రాజకుమారులుకూడ అన్యోన్యమైత్రి కల్గియుండి యంత్యకాలమువరకు నొకేరీతిని మెలఁగిరి.

మాళవమును జయించుటకై రాజ్యవర్ధనునితో గూడ బోయినబంధి, కొందఱు ఖయిదీలతోను, కొంత ధనముతోను ఎదురయ్యెను. నరేంద్రగుప్తుడు రాజ్యశ్రీని చెఱసాలనుండి విముక్తురాలిని జేసెననియు, ఆమె యడవులలోనికి పోయెనఁనియు, శ్రీహర్షునకు తెలిసెను. అంత హర్షుడు బంధికి సైన్యాధిపత్య మిచ్చి సైన్యముల గంగానదియొడ్డున నిల్పి, తాను కొద్దిపరిజనముతో బయల్వెడలి కొండజాతివారినాయకుడగు నిర్ఘుటుసహాయము గైకొని, వింధ్యపర్వతప్రాంతములకు తనసోదరిని వెదకుటకై చనెను. త్రోవలో నదృష్టవశమున హర్షునిబావమఱదియైన గ్రహవర్మమిత్రుడు, దివాకరమిత్రు డను బౌద్ధసన్యాసియొక్క ఆశ్రమమునకు చేరిరి. ఆతనిశిష్యుల వలన యామెప్రాణత్యాగముచేయుటకు సిద్ధముగా నున్న

దనువార్త నెఱింగి, వెదకుటకై పోవుచుండగా, రాజ్యశ్రీ చితిపేర్చుకొని అగ్నియందు దుముకుటకు సిద్ధముగా నుండు సమయమున యామెను గాంచి రక్షించెను. అనంతరము రాజ్యశ్రీయును, శ్రీహర్షుడును దివాకరుని యాశ్రమమునకు జని యాతనికడ సెలవుగైకొని, గంగానదియొడ్డున నున్న తమశిబిరములను చేరిరి. అచటనుండి శ్రీహర్షుడు తన ప్రచండసైన్యమును వెంటదీసికొని ఆర్యావర్తమంతయు జయించెను. ఆతడు వివిధరాజుల జయించి వారివారిరాజ్యములను వారే పాలించుకొనుట కధికారమొసంగెను.

బంధి శశాంకుని సంపూర్ణముగ నోడించి హర్షునికి సామంతునిగా జేసెను. కాని కొంతకాలమునకు మరల నాతడు తిరుగబడి "మహారాజాధిరాజా" యను బిరుదనామము వహించి పరిపాలించెనని తెలియుచున్నది. శ్రీహర్షు డాతని త్వరలోనే యోడించి, క్షమించి, అతని రాజ్యములో కొంతభాగము భాస్కరవర్మకు స్వాధీనము చేసి, కొంత తాను స్వాధీనపరచుకొనెను. ఈయుద్ధములో శ్రీహర్షునకు భాస్కరవర్మ డెక్కువగా సహాయమొనర్చెనని నిధానపురతామ్రశాసనమువలన తెలియుచున్నది. శశాంకు నోడించినతోడనే ఉత్తరహిందూస్థానమంతయు శ్రీహర్షునికి స్వాధీనమయ్యెను. మాళవము నీవఱకే రాజ్యవర్ధనుడును, హూణులను ప్రభాకరవర్ధనుడును ఓడించిరి. ప్రభాకరవర్ధనునిచే పునాదివేయబడిన రాజ్యభవనము నీతడు సంపూర్ణముగా నిర్మించెను. ఈతడు రాజ్యమునకువచ్చిన ఆరుసంవత్సరములలో, కాశ్మీరము, పాంచాలము, సింధు దేశములు తప్ప మిగిలిన ఆర్యావర్తమంతయు స్వాధీనపరచుకొనెను. ఈపైనుడివిన రాజ్యములుకూడ ఈతని యధికారమున కొప్పుకొని కొంతకప్పముమాత్రము కట్టుచుండెను. ఇప్పటినుండియే (అనగా 612 వ సం॥ నుండి) ఒకనూతనశకము ప్రారంభమాయెను. ఇక శ్రీహర్షుడు నేపాల్ రాజ్యమును జయించెనా లేదా యనువిషయమునుగూర్చి గొప్పగొప్పచరిత్రకారుల కింకను వాదప్రతివాదములు ప్రబలియుండెను. ఏదియు నిప్పటికి నిశ్చయింపలేదు. కాని హుయాన్ సాంగ్ చెప్పినరీతినిబట్టి చూడ నాత డిచ్చటకు వచ్చుసరికే నేపాల్ రాజ్యమును అంశువర్ముడు పరిపాలించుచుండెననియు, నీతడు హుయాన్‌సాంగ్ హిందూదేశము నుండి వెడలిపోకముందే చనిపోయెననియు తెలియుచున్నది. హుయాన్‌సాంగ్ 637 మొ-642 వ సం. వఱకు హిందూదేశమం దుండెను. అందుచే అంశువర్ముడు 640 సం. ప్రాంతమున చనిపోయియుండవచ్చును. కాని యీ బాటసారిమాత్రము నేపాళదేశమునకు పోయినట్లు లేదు. శ్రీహర్షుడు 606 వ సం. న సింహాసన మెక్కెను. అనంతరము 34 సం. లకు నీతడు నేపాళరాజ్యమును స్వాధీనపరచుకొనినట్లు కట్మాండులోని శాసనమువలన తెలియుచున్నది. అందుచే అంశువర్ముడు 640 సం.న చనిపోయియుండవచ్చును. కాన అంశువర్ముడు ఏడవశతాబ్దప్రారంభమున నేపాళమును పాలించెననియు, హిందూశకమే కూడ వాడుచుండెననియు తెలియుచున్నది. ఆర్యావర్తమంతయు నేకచ్ఛత్రాధిపత్యముగ నేలనరాజే యీశకకర్త యగునుగాని ఇతరులు కానేరరు. ఏడవశతాబ్దప్రారంభమున శ్రీహర్షుడే ఆర్యావర్తమెల్ల నేకచ్ఛత్రాధిపత్యముగ నేలెను. ఇందుచే శ్రీహర్షుడు నేపాళమును కూడ స్వాధీనపరచుకొనినట్లు తెలియుచున్నది.

శ్రీహర్షుడు ఆర్యావర్తమెల్ల జయించి, తనరాజధానిని స్థానేశ్వరమునుండి కన్యాకుబ్జమునకు మార్చెను. ఇప్పుడు దీనిని కనోజ్ అందురు. అప్పుడు కన్యాకుబ్జము ఇరువది 'లీలు' పొడవును, అయిదారు 'లీలు' వెడల్పును కల్గియున్నదని హుయాన్‌సాంగ్ వ్రాసియున్నాడు. ఈనగరమునకు పశ్చిమమున గంగానదియు, మిగిలిన వైపుల బలిష్ఠములగు కోటలును గలవు. మౌర్యులకాలమున పాటలీపుత్రమును, గుప్తరాజులకాలమున ఉజ్జయినియు, ఎంతవైభవ మనుభవించి ఘనత చెందెనో, శ్రీహర్షునికాలమున కన్యాకుబ్జ మంతవైభవమును, ఘనతయు జెందియుండెను. హుయాన్‌సాంగ్ హిందూదేశమునకు వచ్చినప్పు డిచట కొన్నివందల బౌద్ధాశ్రమములును, రెండు వందల హిందూదేవాలయములును గలవు. మహమద్ గోరీ హిందూదేశమున ప్రవేశించువఱకు (అనగా 12 వ శతాబ్దమువరకుగూడ) నిది ఘనతజెందియుండెను. శ్రీహర్షు డనవసరముగా ఏదియో యొకబుద్ధిపుట్టి రాజధానిని మార్చియుండలేదు. స్థానేశ్వరము చిన్నరాజ్యమునకు రాజధానిగా నుండి, పశ్చిమోత్తరభాగమునుండి

దాడివెడలవచ్చిన శత్రురాజులకు సులభసాధ్యముగుట కవకాశముండెను. అదియునుగాక శ్రీహర్షునిరాజ్యము విస్తరించి యుండుటచే, రాజ్యపరిపాలన సక్రమముగా నుండుటకు వీలుగా రాజధాని రాజ్యమధ్యమున నుండుట కిచ్ఛగించి కన్యాకుబ్జమునకు మార్చెను.

శ్రీహర్షుని దండయాత్ర ఆర్యావర్తమును జయించినంతమాత్రమున ముగియలేదు. ఎటులు సముద్రగుప్తుడు హిందూదేశమంతయు జయించవలెనని తలంచెనో, అటులనే శ్రీహర్షుడుకూడ నుద్దేశించి తనవిజయయాత్రకై బయల్వెడలి, తనప్రచండసైన్యమును దక్షిణముగా మరల్చెను. ఇతడు సముద్రగుప్తునివలెనే మహానదిమీదుగా పోలేదు. నర్మదానదిని దాటి దక్షిణదేశము ప్రవేశించెను. దక్షిణమున మొట్టమొదటనే తనమహారాజ్యమును నిర్మించుకొని పరిపాలించుచున్న చాళుక్యరాజగు రెండవపులికేశి తనస్వాతంత్ర్యమున కేమియు భంగము కల్గకుండ శ్రీహర్షుని వెనుకకు సాగనంపెను

ఆరవశతాబ్దముపూర్వభాగమున మొదటిపులికేశిచాళుక్య మహారాజ్యమునకు కర్తయై అచటిదేశీయులలో నైక్యత నెలకొల్పి గొప్పసామ్రాజ్యమును నిర్మించి అశ్వమేధయాగ మొనర్చెనట. అనంతర మాతనికుమారుడు కీర్తివర్మ రాజ్యమును విస్తరింపజేసి, అంగ, వంగ, మగధ మొదలగు రాజ్యముల జయించెనని మహాకూట శాసనము వలన తెలియుచున్నది. కాని యీతడు తనకుమారుడు రాజ్యారోహణార్హుడు కాకపూర్వమే చనిపోవుటచే నీతనిసోదరుడగు మంగళేశుడాసింహాసన మాక్రమించుకొనెను. కీర్తివర్మకుమారుడగు పులికేశి అడవులవెంట సంచరింప నిశ్చయించుకొనెను. కాని 608 వ సం. న మంగళేశుడు చనిపోయినసంగతి తెలిసి తిరిగివచ్చి తన రాజ్యమును స్వాధీనపరచుకొనెను. రెండవపులికేశి రాజ్యమునకు వచ్చుసరికి చాళుక్యరాజ్యము వింధ్యపర్వతముల నుండి దక్షిణమున పల్లవరాజ్యమువఱకు విస్తరించియుండెను. దీనికి ముఖ్యపట్టణము బాదామి లేక వాతాపి. రెండవపులికేశి 608 వ సంవత్సరమున సింహాసనారూఢుడయ్యెను. ఈతనికాలమున జనులను గూర్చి హుయాన్ సాంగిట్లువర్ణించెను.

"The inhabitants of this country were proud, spirited and warlike; grateful for favours and revengeful for wrongs; self sacrificing towards supplicants in distress and sanguinary to death with those who treated them insultingly Their martial heroes went to the conflict intoxicated. Those in drunken condition rushed against the enemy and without fail put enemy to death."

ఈరెండవపులికేశి ఇంకను నితనిరాజ్యమును విస్తరింపజేసినటులు తెలియుచున్నది. మాళవ, ఘూర్జర కళింగదేశములనుకూడ జయించినటులు క్రీ. శ. 634 సం.న వ్రాయించిన ఐహోల్ శాసనమువలన తెలియుచున్నది. అట్టి ఈమహాబలిష్ఠుడగు చక్రవర్తియే శ్రీహర్షునిరాజ్యప్రవాహమున కొకయానకట్టు కట్టెను. V. A. Smith గారు మాత్రము తన Early History of India లో శ్రీహర్షుని పులికేశి 620 సం.న ఓడించినట్లు వ్రాసియుండెను. ఇది అసమంజసము. ఏలనన తన విజయములలోనెల్ల గొప్పవిజయమని భావించి ఐహోల్ శాసనములో వ్రాయకుండుట అసంభవము. 620 సం. ఓడించిన తప్పక వ్రాసియుండెడివాడు; కాన 636 సం.ననే హర్షునివెనుకకు పారదోలెననియు, అప్పటినుండియే 'హర్షవిచ్ఛేదహేతువు' అని పిలువబడుచుండెడివాడనియు తెలియుచున్నది. శ్రీహర్షుడు 636 వ సం. న దక్షిణదిగ్విజయయాత్రకు పోవుసమయముననే బౌద్ధుడైన ధృవసేనుడను వల్లభిరాజు నోడించెను. ధృవసేనుడు పారిపోయెను. కాని శ్రీహర్షుడు ముందు చాళుక్యుల జయింప నుద్యుక్తుడై యుండుటచేత వల్లభిరాజును మరల రావించి తగురీతిని మర్యాదచేసి, యాతని సింహాసనమందాతని గూర్చుండబెట్టి తన కుమార్తె నిచ్చి పెండ్లిచేసెను. యీజయించిన యనంతరమే పులికేశిమీదకు దండువెడలెను. కాని యాతడు వెనుకకు మరలిపోవలసినవాడగుటచే తనరాజ్యములో దక్షిణభాగమాతని యల్లునియాధిపత్యముక్రింద నుంచి నిజరాజధానికి మరలెను. శ్రీహర్షుడు వెనుకకు మరలిన కొలదిదినములకే పులికేశి చనిపోయెను. ఈతనికిని పారసీకరాజునకును కూడ సంబంధ మున్నట్లు తెలియుచున్నది. పారసీకమునుండి చాళుక్యసభకు విచ్చేసిన పారసీకరాయబారిరాక అజంతాలో చెక్కబడియున్నది. అనంతరము చాళుక్యరాజ్య

ము నరసింహవర్మ మహామల్లయను పల్లవునిచే నాక్రమింపబడెను. ఇతడు రాజ్యమున ప్రవేశించి చాళుక్యులముఖ్య పట్టణమగు బాదామిని క్రీ. శ. 640 సం.లో సంపూర్ణముగా నాశనమొనర్చినట్లు తెలియుచున్నది. శ్రీహర్షుడు తన రాజధానికి విచ్చేసి శాంతియుతముగా రాజ్యమేలి ప్రజలను సౌఖ్యపెట్టెను. ఈతడు చైనాదేశపురాజుతో సంబంధము కలుగజేసుకొని క్రీ. శ. 641 సం.న చైనాదేశమున కొకరాయబారి నంపెను.

హుయాన్‌సాంగు నీతనియనుగ్రహమును బాగుగ సంపాదించెను. శ్రీహర్షు డొకగొప్పయుత్సవముజేసి, తన ప్రాణమిత్రు డగు కామరూపకుమారరాజును, అల్లుడగు వల్లభిరాజును, యితరసామంతరాజులను రావించెను. అందు బుద్ధునిప్రతిమకే యగ్రస్థాన మొసంగెను. శ్రీహర్షుడు సామంతులతోను, ఎనిమిదివందల గజములతోను బయల్వెడలి ఆవిగ్రహము నుచితస్థానమునందుంచి యూరేగించిరట. ఇచటనే బ్రాహ్మణమతావలంబులైన కొందరు బౌద్ధమతమునెడ శ్రీహర్షునకుగల ప్రేమనుజూచి ఓర్వలేక యాతని పదభ్రష్టుని జేయజూచిరిగాని నిష్ఫలులైరి.

శ్రీహర్షుని రాజ్యము కామరూపమునుండి కాశ్మీరమువఱకును, హిమాలయములనుండి వింధ్యపర్వతప్రాంతములవఱకును విస్తరించెను. చాళుక్యరాజు చనిపోయి, చాళుక్యరాజ్యము జయించుట కవకాశము దొరకినను, తన రాజ్యమున అశాంతి ప్రబలునేమోయనితలపోసి, ఆరాజ్యముమీదకు మరల దండువెడలలేదు. శ్రీహర్షుడు ప్రజాక్షేమమేతనక్షేమమని యెంచి 40 సం. రములు శాంతియుతముగా రాజ్యమేలి 647 సం. న స్వర్గస్థుడాయెను.

అనంతరము హిందూస్థానమెల్ల విచ్ఛిన్నమై వివిధ రాజులచే నాక్రమింపబడి ఒకరితోనొకరు ఎడతెగనిపోరు సల్పుచు, ఒకప్పుడును రాజ్యమున శాంతి స్థాపింపలేకపోటయేకాక వారివారిరాజ్యములలోగూడ స్వాతంత్ర్యమును నెలకొల్పుకొనలేకపోయిరి. తుట్టతుదకు భారతరాజ్య సింహాసనమును మహమ్మదీయు లాక్రమించుకొనుచుండ నూరకుండుటచే భారతీయులు నేటికి పారతంత్ర్యమునే యనుభవించుచుండిరి.

(సశేషము)



# 'కాలకూటవిషమ! ఏల గర్వపడెదు?

గర్భాం అప్పారావు గారు, బి. ఏ.

కలిమి జవరాలితో శీతకరునితోడ
పాలకడలిని జన్మంబు బడసితంచు
ఈశ్వరునిగూడ మూర్ఛ నొందించితంచు
గడియలో లోకమును గాల్పగలనటంచు
కాలకూటవిషమ, యేల గర్వపడెదు?

కలరు నిన్నుమించెడువారు కలరు కలరు
విసముబూసిన కత్తులవిధము దోచు
నాలుకలతోడ స్నేహబంధంబు గోయు
ఖలులు కొండియకాండ్రు పందలును గలరు
కాలకూటవిషమ, ఏల గర్వపడెదు?

జనని యీమె సోదరి యీమె తనయ యీమె
యనక యన్యకాంతల శీలమడగద్రొక్కి
సతికి బతికిని సఖ్యంబు సడలజేయ
గలుగు చెనటులు వేనవేల్ కలరుకాన
కాలకూటవిషమ, ఏల గర్వపడెదు?

ఇలకృతఘ్నులు శిశుహంతకులును మాతృ
భూమికెనిచెట్ట కలిగించు పుణ్యాజనులు
కలరు నిన్ను నోడింపగా గలరు కాన
కాలకూటవిషమ, ఏల గర్వపడెదు?

ఎపుడు వీరిపొంకంబు తూలింప గలవో
ఎపుడువీరి భస్మంబు గావింపగలవో
యపుడె నీకు నాధిక్యము అంతదనుక
కాలకూటవిషమ, ఏల గర్వపడెదు?




గిడుగు వెంకటసీతాపతి గారు, బి. ఏ., యల్. టి.

## రెండవ శాసనము—శక-1034

ఈ శాసనము కూడా అయిదు రేకులు గలదే; కాని, దీనిరేకులు చాలపెద్దవి. ప్రతిరేకున్ను సుమారు $10\frac{1}{2}$ అం. పొడువుగాను, 6 అం. వెడల్పు గాను ఉన్నది. ఈరేకుల కమర్చిన కడియము సుమారు 17 అం. చుట్టుకొలతగలది; కడియము కడ్డీ $1\frac{1}{4}$ అం. దళముగలిగి గుండ్రముగా ఉన్నది. కడియముపై నున్న రాజముద్రిక $1\frac{3}{4}$ అం. ఎత్తైనది. వలయాకారమున ఉన్న దానిఅడుగుభాగము $7\frac{1}{2}$ అం. పరిధిగలది. దీని రాజముద్రిక మొదటిశాసనము తాలూకు రాజముద్రికను పోలియున్నది.

ఈశాసనమందలి లిపి ప్రాచీనకన్నడ—తెలుగులిపి; ఇండియన్ ఆంటిక్వరీ సం. 18 లో ప్రకటితమైనఅనంత వర్మచోడ గంగదేవుని శాసనములలో శక. 1040 నాటి శాసనమందలి లిపినిపోలిఉన్నది. ఈశాసనమందు లిపికి సంబంధించిన విషయములలో ముఖ్యమైనవి కొన్ని వివరిస్తున్నాను:—

1. ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఐ, ఔ—ఈవర్ణములు రాలేదు.

2 ఛ, ఝ—ఇవి సంయుక్తాక్షరములలోనేకాని విడిగా రాలేదు.

3. ఇ, గ, డ, ఠ, య, ర, ల, ం, ః—ఇవి పూర్తిగా నేటి తెలుగులిపిలోని వర్ణముల ఆకృతిని పొందియున్నవి. తలకట్టుమాత్రము నెలవంకను బోలియున్నది.

4. అ, ఆ, ఈ, ఉ, ఎ, ఒ, ఖ, ఘ, ఙ, చ, జ, ఞ, ణ, త, న, ప, బ, భ, మ, ఱ, వ, ష, స — ఇవి చాలా మట్టుకు నేటి తెలుగులిపిలోని వర్ణములవలెనే ఉన్నవి.

వీటిలో 'అ'కారమునకు దీర్ఘము గురుతుపెట్టుట చేత 'ఆ' ఎట్లు ఏర్పడినదో పం. 119,89,84ల లోని 'ఆ' చూచినయెడల స్పష్టమగును. ఎ, ఒ,—ఇవి హ్రస్వములవలె శాసనమందలి లిపిలో కనబడుతున్నవి. సంస్కృతములో హ్రస్వోచ్చారణము లేదుగనుక ఇవి దీర్ఘములనవలెను. అయితే, 'ఓంబరవేల్లి' (పం. 119), 'తోనేంగి', 'ఖోల్లిర'(పం. 121)—ఈ తెలుగుగ్రామముల పేళ్ల లోని 'ఏ' 'ఓ'లు దీర్ఘముగా ఉచ్చరించవలెనో హ్రస్వముగా ఉచ్చరించవలెనో స్పష్టముగా తెలియదు. ఈ గ్రామనామములను ఆకాలమున తెలుగువారు ఎట్లు ఉచ్చరించేవారో తెలియదు. నేటి ఉచ్చారణము * బట్టి 'తోనేంగి' లో 'తో', మాత్రమే దీర్ఘముగా ఉచ్చరించవలెననిన్ని, తక్కినచోట్ల హ్రస్వములుగానే ఉచ్చరించవలెననిన్ని చెప్పవచ్చును. "ముండపలు" అనే తెలుగు గ్రామముపేరు చెప్పవలసివచ్చుటచేత, సంస్కృతమందు లేని శకటరేఫము శాసనములో కనబడినది.

—(చూ. పం. 110, 115).

5. క, త, శ—ఇవి కన్నడవర్ణముల ఆకృతి కలిగి ఉన్నవి.

6. ట, థ, ద, ధ, శ—ఇవి నేటి తెలుగులిపిలోని వర్ణములకు కొద్దిగా భిన్నరూపము కలిగి ఉన్నవి.

7. గుణింతము:—తలకట్టు నెలవంకవలె నున్నది. (ఆ) దీర్ఘము, తలకట్టు కుడివైపు కొద్దిగా పొడిగించి క్రిందికి వంచగా, ఏర్పడుతున్నది. గుడి నేటిలిపిలో ఉన్నట్లే ఉన్నది. గుడిలో దీర్ఘము సార్థకముగానే ఉన్నది. కొమ్ము రెండువిధములుగా కనబడుతున్నది.

* "వమరవె (వ)ల్లి, తోణంగి, కొర్లాం" అనిఈగ్రామములకు ఇప్పటి వ్యవహారములో ఉన్న పేళ్లు.

పం. 1 లోని ముకారమందలి కొమ్ము అక్షరము అడుగుభాగమున ఉన్నది. ఇట్లే దు, టు మొదలయిన కొన్ని అక్షరములలోని కొమ్ములు కనబడుతున్నవి. పం. 102 లోని ముకారమందలి కొమ్ము నేటి తెలుగు లిపిలో ఉన్నట్లే ఉన్నది. చాలాఅక్షరములకు కొమ్ము లీవిధముగనే ఉన్నవి. 'స్సు' (పం. 24), 'త్సు, (పం. 25, 78) వీటిలోని కొమ్ము తెలుగు ౧అంకెవలె నున్నది. అయితే, పం. 2, 33 లందున్న 'త్సు, లోని కొమ్ము మామూలుగానే ఉన్నది. కొమ్ము కొద్దిగా పొడిగించి క్రిందికి వంచివేయగా కొమ్ముదీర్ఘ మేర్పడుతున్నది. వట్రసుడి చాలామట్టుకు నేటిలిపిలో ఉన్నట్లే ఉన్నది. ఏత్వము నేటిలిపికి భిన్నముగాఉన్నది. దాని ననుసరించి ఐత్వము కూడా భిన్నముగాఉన్నది. ఓత్వము మాత్రము సాధారణముగా నేటిలిపిలో ఉన్నట్లే ఉన్నది. అయితే 'స్యో', 'ద్యో', మొదలయిన సంయుక్తాక్షరము లందు ఏత్వము, కొమ్ముదీర్ఘము పెట్టుటవల్ల ఓత్వ మేర్పడినది. 'సో, 'దో, మొదలయిన ఏకాక్షరములందు మాత్రము ఓత్వము నేటిలిపిలో ఉన్నట్లేఉన్నది. ఓత్వమునకున్ను, ఔత్వమునకున్ను భేదము అత్యల్పము; (చూ. 'సో'–పం. 66; "సౌ"–పం. 49). 'ంక', 'ంచ'–మొదలయిన సంయుక్తవర్ణములలో అనుస్వారమే సాధారణముగా కనబడుతున్నది. 'ణ్డ' మాత్రము తరుచుగా అనునాసికాక్షరముతో కనబడుతున్నది; (చూ. పం. 59,76). ఒక్కచోట మాత్రము బిందువుతో ఉన్నది; (చూ. పం. 49); అయితే, ఇక్కడ 'కంఠికా' అనుటకు 'కండికా' అని ఉండుటచేత ఇది లేఖకప్రమాదమైతే కావచ్చును. తకార మొక్కచోట మాత్రమే నకారముతో కలిసి ఉన్నది; (చూ. 'న్త', పం. 55); తక్కినచోట్ల, (చూ. 'ంత', పం. 2,36) బిందువుతో ఉన్నది. వెలపల గిలకతో ఉన్న హల్వర్ణములకు, షకార హకారముతప్ప తక్కినవాటికి, ద్విత్వము కనబడుతున్నది.

భాష మొదటినుండి చివరవరకున్ను సంస్కృతమే. శాసనమంతా 138 పంక్తుల గ్రంథము; రెండు వంతులు శ్లోకములున్ను, ఒకవంతు వచనమున్ను గలది. శ్లోకములు 40—12 శార్దూలవిక్రీడితములు, 11 అనుష్టుభ్ (శ్లోకములు), 5 స్రగ్ధరలు, 3 ఉపజాతులు, 2 వసంతతిలకలు 2 వంశస్థలు, 1 మందాక్రాంత, 1 శిఖరిణి, 1 మంజుభాషిణి, 1 వియోగిని, 1 స్వాగత కలవు. "జిత్వా బాహుబలే నోర్వీం" అనే శ్లోకమందలి (పం. 37, 38)సత్క్రియాసమభిహారైః" అనే మూడవపాదమున్ను, ■ అనురాగేణ గుణినో" అనే శ్లోకములో (పం. 84 85) ఈమొదటిపాదమున్ను, "శ్లోకేషష్ఠం గురుజ్ఞేయం సర్వత్ర లఘు పంచమం ద్విచతుః పాదయోః హ్రస్వం సప్తమం దీర్ఘమన్యయోః"; అనే సూత్రము ననుసరించి రచితములు కాలేదు. సంధిసూత్రములను శ్లోకములలోపాటించినారు గాని వచనములందు కొన్నిచోట్ల పాటించలేదు. ఇందుకు దృష్టాంతముగా చూపించవలసినఉదాహరణములు మొదటి శాసనము వ్యాసములో చూపించినవే కనుక ఇక్కడ మరల ఉదాహరించలేదు. "నిహత్య" అనుటకు మారుగా "నియత్య" (పం. 47) అనిన్ని, "అభ్రంలిహం" అనుటకుమారుగా "అభ్రంలియం" (పం. 61) అనిన్ని ప్రాకృతభాషారూపములు కనబడుతున్నవి. ఆకాలమున కవి, లేఖకుడు మొదలయినవారికి ప్రాకృతము మాతృభాషగా ఉండి యుండవలెను; లేదా వచ్చియుండవలెను. లేనియెడల ఇటువంటిరూపములువచ్చుటకు కారణముకనబడదు.

ఆకాలమున కలింగదేశమందలి ప్రజల భాషమాత్రము తెలుగే అయియుండుననుటకు ఆధారము లనేకముగా ఉన్నవి. ఇందుకు లోగడ ఎపిగ్రాఫియా ఇండికా సం. 4 లో మాతండ్రిగారు ప్రకటించిన దీర్ఘాసిశాసనములోని తెలుగుసీసపద్యమే చాలును; అది మన అనంతవర్మ తండ్రియైన రాజరాజుకాలమునాటిది. ఈ శాసనములో ఎల్లల గురించి చెప్పిన భాగములో "ఈషద్వక్ర(ం)గత్వా మరిచవృక్షపఙ్క్తిః" (పం. 120); "తతో గత్వా ముల్లంఘస్థాపితశిలా" (పం. 122-123); "కించిద్వక్రం గత్వా తాం గత్వా ముల్లంఘ్యోత్తరతో గత్వా ...గత్వా" (పం. 127-128)–ఈవాక్యములరచన తెలుగుసంప్రదాయమును అనుసరించినట్లు కనబడుతున్నది.

"రాష్ట్రకూట ప్రముఖాన్" (పం. 107) అంటే "రట్టడముల పెద్దలను" అని తర్జుమాలో చూపించినాను. (South Indian Inscriptions Vol IV )లో చాలాచోట్ల సంస్కృతభాగమందు "రాష్ట్రకూట" మనిన్ని తెలుగుభాగములందు "రట్టడ" మనిన్ని ఉన్నది. సందర్భమునుబట్టి ఈపేళ్లు మండలమందలి భాగములకు పెట్టినట్లున్నది. ఈకాలములో ప్రతిజిల్లాయున్ను తాలూకా

లుగా విభక్తమయినట్లే; ఆకాలములో వారాహావర్తని మొదలయిన విషయములలో ప్రతివిషయమున్ను రాష్ట్రి కూటములుగా(కట్టడిములుగా) విభక్తమయి ఉండును.

## దానము

109–118 పంక్తులందు దానమును గూర్చిన వివరణ మున్నది. శక 1034 కాగా ఉత్తరాయణ నిమిత్తమున అనగా, క్రీ. శ. 1113 జనవరి నెల 1వ తేదీని * ఖోన్నగ్రామసమీపమున గారగ్రామములో జేరిన ముండపఱుగ్రామమునకు ఉపాంతముగా తూలుఫు గ్రామము నుండి అష్టోత్తరాశీతి (81) పరిమితమయిన క్షేత్రమును ఖోన్నగ్రామ నివాసులయిన బ్రాహ్మణులకు అనంతవర్మ చోడగంగదేవు దానము చేసినాడు. ఇక్కడ చెప్పిన ఖోన్నగ్రామము ఇదివరకు 300 బ్రాహ్మణులకు దానము చేసినట్లు మొదటిశాసనములో ఉన్నది. § ఆ దానవిషయము ఈశాసనములోఎత్తుకొన్నారు. అయితే, మొదటి శాసనములో ఆ దానముచేసినవారు అనంతవర్మ చోడగంగదేవే అని స్పష్టంగా ఉన్నది. ఈశాసనములో మాత్రము, "మత్పి ‡ తామహేన వజ్రహస్తదేవేన దత్తం" (పం. 114–115) అని ఉండుటచేత దానము చేసినవారు అనంతవర్మని తాత అయిన వజ్రహస్తుడని తేలినది. దానముచేసిన తేదీ శక 1008 మీనమాసకృష్ణపక్షపంచమీ ఆదివారమనిన్ని అనంతవర్మ రాజ్యాభిషిక్తుడయిన తేదీ శక 999 కుంభమాస శుక్లపక్ష తృతీయాశనివార మనిన్ని రెండుశాసనములందున్ను ఒక్కరీతిగానే ఉండుటచేత ఆ దానము చేసినవారు అనంతవర్మచోడగంగదేవే కాని వజ్రహస్తుడు కాడని స్పష్టమగుతున్నది. అయితే, మత్పితామహేన వజ్రహస్తదేవేన దత్తం" అని ఈ శాసనమందున్నదిగదా; దీనికేమి సమాధానము చెప్పవలెను? ఈ దానమును వజ్రహస్తుడు వాగ్రూపముగా చేసియుండెనేమో? దానిని అనంతవర్మశాసన రూపముగా అమలు జరిపించియుండెనేమో?

ఇండియన్ ఆంటిక్వెరి సం. 18 లో ప్రకటితమైన శక. 1040 నాటి శాసనమునకున్ను శక 1034 లో పుట్టిన ఈశాసనమునకున్ను గంగవంశపురాజుల చరిత్ర–వంశోత్పత్తి, వంశానుక్రమము, ప్రశస్తి మొదలయిన విషయములుగల భాగము–సమానముగా నున్నది. ఆశాసనమందలి శ్లోకములేకాక మరికొన్ని శ్లోకములు ఈశాసనమందు అధికముగా ఉన్నవి—(1)చోలాం శ్చాలయత:-పం. 35; (2) జిత్వాబాహుబలేనోర్వీం– పం. 37; (3) కామార్ణవ:-పం. 39; (4) చతుర్భిరనుజై:–పం.40; (5) పం. 41; (6) నైచిత్ర్యం–పం. 65; (7) అర్థిభ్య: కరిణాం–పం. 75; (8) భీమం వాహ–పం.97. వీటిలో మొదటిశ్లోకములందున్న కల్పనాచమత్కృతి బాగున్నది. ఇంత చక్కనిశ్లోకములు శక 1040 లో పుట్టిన శాసనమందు ఎందుకు విడిచినారో తెలియదు.

ఈశాసనములో మొదటి కామార్ణవుడు శబరాదిత్యుని చంపి(పం. 47)నట్లున్ను, అతనికి దంతాపురము రాజధానియైనట్లును ఉన్నది. ఇండియన్ ఆంటిక్వెరీలో ప్రకటితమైన శక 1040 నాటి శాసనపాఠమందు కామార్ణవుడు బాలాదిత్యుని చంపినట్లున్ను, అతనికి జంతావురము రాజధానియైనట్లున్ను ఉన్నది; శాసనముయొక్క ఛాయాపటము ఇవ్వలేదు. సరియైనపాఠమేదో తెలుసుకొనుటకై, నేను క్రిందటిసారి మార్చినెలలో చెన్నపట్టణమునకు వెళ్లినప్పుడు, ఆశాసనముతాలూకు రాగిరేకులు స్వయంగా చూచినాను. అందులో ఈశాసనమందున్నట్లే ఉన్నది; గాని, ఇండియన్ ఆంటిక్వెరీలో కనబరచినట్లు లేదు. "సమరశిరసి శబలాదిత్యన్నిర్జిత్య...దన్తాపురన్నామ" అని స్పష్టముగానే ఉన్నా ఫ్లీట్‌దొరగారు ఏదోపొరపాటున "సమరనీరసికం బాలాదిత్యన్నిర్జిత్య ...జంతావురన్నామ" అని చదివి తప్పుపాఠము ప్రకటించినారు. దాని ననుసరించి చరిత్రకారులు కొందరు నేటివరకున్ను ఆతప్పుదారినే వెళ్లవలసివచ్చినది. బాలాదిత్యునిపేరు అదివరకు సుప్రసిద్ధమైన దగుటచేత ఫ్లీట్‌దొరగారికి ఈపొరపాటు వచ్చియుండును. ఐతే, 'శబల్లాదిత్యం' అని ఆశాసనములోను, 'శబరాదిత్యం'అని ఈశాసనములోను ఉన్నది. ఈరెండింటిలోను ఏది సరియైనపేరో తెలుసుకొనుటకు ఆధారము లేదు. రలలకు అభేదముచెప్పి ఏపేరైనా ఒకటే అనవచ్చును. ఐతే, ఇతనికిని శబరులకును ఏమైనా సంబంధ మున్నదేమో పరిశీలించవలసి ఉన్నది. ఈవిషయమున్ను చరిత్రకు సంబంధించిన మరికొన్ని విషయములున్ను మరియొక వ్యాసమందు విమర్శించదలచినాను; గనుక, ఇప్పటికి వ్యాసము చాలించినాను.

* శ్రీయుత నీలమణి పాణిగ్రాహిగారు గణితంచేసి చెప్పినారు. § చూ. భారతి సంపుటము 2. సం. 8.

‡ "మత్పితా" అని ఉండవలెను.

# మూ ల ము[1]

మొదటి రేకు; రెండవపెడ



1 ఓం[2]లక్ష్మీనివే(వ్య)ముడురాజకలంకకాంతిబాహాచతుష్టయచణం వపు రాదధానః ప్రాదు

2 ర్బభూవ భువనత్రితయం విధిత్సు ర్విశ్వప్రసూతిజఠరో[3] భగవా ననంతః[౧]తన్నాభినలి

3 నా ద్బభూవ భువనప్రారంభదీక్షాగురో బ్రహ్మ వేదపరంపరా[4]పరిదధద్వక్త్రై శ్చతుర్భి
స్తతః ప్రా

4 జాపత్యధురాధిరూఢమహసా మత్రి ర్మునీనాం ప్రభు ర్జాతస్సర్వజనీన[5]నిత్యతపసాం
వ్రాతోవ

5 పుష్మానివ[౨] అత్రేః పుత్రో బభూవ త్రిపురహరజట[6]జూటనేపథ్యరత్నం నేత్రవ్యాపారదేశ
స్మరచరిత

6 మహానాటికాసూత్రధారః దృష్టాంతో దా(క్షిణా)త్యాముఖముకురరుచాం శర్వరీజీవితే
శ త్రైలోక్యానం

7 దకందో గగనతలమహాంభోధిశం(ఖ)శ్శశాంకః[3] [7] తత్తో జగత్త్రాభిషజ్యాతత్వాప[8]శ్శుభ్రగ్ర
హాభూ

---

(1) నాకుదొరికిన రేకులననుసరించి; (2) ఓం అనుటకు; ని గురుతున్నది. (3) శక 1040 నాటిశాసనమందున్న ఇశ్లోక ఉన్నదిగాని, ఫ్లీట్ దొరగారు 'జఠర' అని చదివినారు; (4) 'పరంపరాం' అని ఉండవలెను, (5) 'జనీన' అని; (6) 'జటా' అని; (7) 'శశాంకః' అని; (8) 'భిషజ్జితత్వాప' అని ఉండవలెను.

(౧) వసంతతిలక; (౨) శార్దూలవిక్రీడితము; (3) స్రగ్ధర.

8 ద్విబుధాగ్రణీర్బ్బుధః పురూరవ[1] స్తత్తనయో౽య ముదల్లసద్భుజభుజిష్యార్ణ్ణవమేఖలాబభౌ
9 ।తస్మా దాయుశ్శుభంయుస్త్రిభువనవినుతో జన్మ లేభే తదీయః పుత్రో భూజైత్ర బాహు ర్న్నహు
10 ష నరపతి ర్బ్భూభృతా మగ్రగణ్యః యః పృథ్వ్యామేకపత్న్యా మనుభవవిముఖో భూరి జాత ప్రజాయా
11 మ్స్వర్వ్వేశ్యాం ఖణ్డితేంద్రాం ప్రణయపరవశః పౌరుషేణాన్వభుఙ్క్త[2] ॥ తతో౽యయాతి ర్వ్విజితాభియా
12 తి ర్జ్జజ్ఞే తతస్తుర్వ్వసురుర్వ్వరేశః సపూర్వ్వగీర్వ్వాణగురో ర్గ్గరిమ్ణా మాతామహస్యోరసి హి ప్రవృద్ధః।
13 అపుత్రత్వం ప్రాప్త స్సుచిర మతిఖిన్నో నృపవృష స్స గంగా మారాధ్యా న్నియతగతి రా
14 రాధ్య వరదాం అజేయం గాంగేయం సుత మలభ తారభ్యచ తదాక్రమ స్తద్వంశ్యానా
15 ంభువి జయతి గంగాన్వయ ఇ॥ అస్యాన్వే త్తనయో విరోచనవిభు ర్వ్వైరిగ్రహా
16 స్తాచలః క్షోణీనాథకిరీటపత్రమకరీలగ్నాంఘ్రి రేణూత్కరః లక్ష్మీవా

రెండవ రేకు; మొదటి పెడ



(1) 'పురూరవా' అని; (2) 'భుఙ్క్తే' అని; (3) 'తతస్తుర్వ్వసు' అని.

(౪) వంశస్థ; (౫) స్రగ్ధర; (౬) ఉపజాతి; (౭) శిఖరిణి.

17 గ్వనితా మహాకులనదీ సంవేద్య ముద్యోగినం సంవేద్యం సమజీజన త్స నృపతిర్గ్గంగ[1]స్వ
యోత్త

18 ంసకన్।[2] ౯సంవేద్యతో మణిరివాజని నామభాస్వాన్ భూపాలమాలిమకుటై రుపపాల నీయః

19 త్రాసాదిదోషరహితస్సబభూవ పుత్రీ యత్సం పదాన్నిధి రజ[3]యతదత్తసేనః౯। తస్యోర్వ్వీ

20 శ్వరమాలిమణ్డనమణేరాసీదసాధారణాం బిభ్రాణో నృపతిశ్రియం ప్రియసుతస్సోమ్యోఽతిర

21 మ్యాకృతిః తస్మాదప్యుదపాది మోదిత జగచ్చక్రోంశుదత్త స్తతఃసారాంగోభవద న్యరా
డ్గజఘటాపాత

22 క్రియాపాకలః౧౦।తస్మా చ్చిత్రాగదో[4] భూ క్షితితలవలయే రాజశబ్దైకవాచ్య స్సూనుస్సా
రధ్వజోస్య[5]భవద

23 ఖిలభువా మాధిపత్యప్రసూతిః ధర్మ్మసీత త్తనుజో[6]నృపనయపదవీ పాంథముఖ్యో విరేజే

24 బభ్రాజాపత్య మస్య క్షితిజయపరవానేకధన్వాపరిక్షిత్ ౧౧। సమహీంపతిస్సుత

25 మవపమానేన[7] జయసేనమన్యనృపదర్ప్పశాతనం అభవత్సుతో స్యజయ

26 సేనసంజ్ఞితః ప్రథయన్ దిశా సితదుకూలితంయశః ౧౨। జితవీర్య్యమ

27 పావజీజన త్సచ భూపాలవృషం వృషధ్వజం సహశక్తిమలంఘ్య శాసన

28 ంవిజిగీషుం సువిరోధిభీషణం ౧౩। తస్యప్రగల్భ స్తనయో బభూవ క్షితీశమార్గ్గాచర

29 ణప్రగల్భః యఃఖడ్గధారాజలధౌతవైరి నారీకపోలస్థలపత్రభంగః ౧౪

30 ।ఆసీ దేకసితాతపత్రతిలకక్షోణీభృదస్యాత్మజో వీరశ్రీ వనితా స్వయం

31 వృతపతి ర్ద్దేవ స్సకోలాహలం[8] నిర్మ్మాయోజ్జితగంగవాడివిషయే కోలా

32 హాలాఖ్యంపురం యశ్చక్రే సురసద్మవీక్షణరస ప్రత్యూహమఘ్నాం[9] హారే

33 ౧౫।తత్సుతో ధృతశరాసన యష్టి ర్గ్గామరక్షు దపవర్జ్జితశౌర్య్యాం[10]

---

(1) "గ్గంగా" అని ఉండవలెను; (2) ంసకమ్" అని; (3) "రజాయత" అని; (4) "చిత్రాంగదో" అని; (5) "ధ్వజోస్యా" అని; (6) "ధర్మ్మాఖ్యస్తత్తనూజో" అని కాబోలు; (7) "మవాపమానినం" అని; (8) "కోలాహలః" అని; (9) "అభ్రం" అని; (10) "శౌర్య్యాం" అని.

(౯) శార్దూలవిక్రీడితము; (౯) వసంతతిలక, (౧౦) శార్దూల విక్రీడితము; (౧౧) స్రగ్ధర; (౧౨) మంజుభాషిణి; (౧౩) వియోగిని; (౧౪) ఉపజాతి; (౧౫) శార్దూలవిక్రీడితము.

రెండవ రేకు; రెండవ పక్క



34 శాస(న ప్ర)థిత పాశవిధేయా మేకఏవ సవిరోచన సంజ్ఞః ౧౬ । గతే తత్ర నరేంద్రాణాం కోలా
హలపురీభుజాం

35 (ప్రకాసీ)త్యాం చ తద్వంశ్యో వీరసింహో భవన్నృపః ౧౭ । చోలాం శ్చాలయత శ్చమూ
చలనతః పాణ్డ్యాన్ భ్రువా భగ్నయా

36 హుంకరేణ[1] చ సప్తకోంకణపతీ న్న్యక్కారతః కేరలాన్ అంతకో[2]పవిఘూర్ణమానశిర
సాకర్ణాటగౌళేశ్వరా నస్యే

37 (న్మత్త?)కృపాణవీక్షణధృతి[3] కేవాయయు ర్బాహ్వభృతః ౧౮ । జిత్వాబాహుబలేనోర్వీం వీర
సింహస్సభూపతి స్సత్క్రియాస

38 మభిహోత్రై ర్విజిగ్యే సద్మనాకినాం ౧౯ । తస్య కామార్ణవస్సూనుర్ద్వా నార్ణవగుణా
ర్ణవౌ మారసి

39 ంహ ఇతి ఖ్యాతౌ వజ్రహస్తాఖ్య పంచమాః ౨౦ । కామార్ణవః పితృభ్రాతురసహిష్ణో[4]కులో

40 ద్వహః శక్తోపి రాజ్యహరణే జహౌ దేశ న్నతుక్రమం ౨౧ । చతుర్భిరనుజై ర్భిర్ణుదన్న రే

41 ంద్రా నాహవోత్సుకాన్ దంతైర్ద్వైత్యాని వేంద్రేభ స్సప్రా[5]యాద్వాసవీం దిశం ౨౨ । అ[ధ]వ

(1) హుంకారేణ" అని ఉండవలెను; (2) "అంతఃకోప" అని; (3) "ధృతిం" అని; (4) "హిష్ణోః" అని; (5) "ప్రాయా" అని.

(౧౬) స్వాగత; (౧౭) శ్లోకము; (౧౮) శార్దూల విక్రీడితము; (౧౯–౨౨) శ్లోకములు.

42 న్యైభదా[నే]ఘన్వీగుణీకృతని[ర్ఝ]రం [1]విలిఖంతన్న భశ్శృంగై ర్మ్మహేంద్రం ప్రరు
రోహాసః[3]|తత్ర చ

43 సకలసురాసురసిద్ధసాధ్యపరార్ధ్య కిరీటకోటినిఘృష్టమసృణలచరణపీఠ మారాధ్య గో

44 కర్ణ్ణస్వామిన మస్య ప్రసాదాసాదితధవలచ్ఛత్ర చామరసామజధ్వజ వృషభలాంఛా
న[2]పించ్ఛాంచి

45 తకుంతనికరమకరతోరణహుడుక్కాకాహళైకశంఖాదిరాజ్యోచితైరుపశోభమానస్సాక్షాన్మ

46 హేంద్ర ఇవ మహేంద్రాచలశిఖరా దవతీర్య్య యుధిష్ఠిర ఇవ చతుర్బ్భి రనుజై రనుగ

47 మ్యమన[3]స్సమరశిరసి శబరాదిత్య న్నియత్య[4]కామార్ణ్ణవః కలింగాన గ్రహీత్|తస్య

48 చ విజిత సకలనృపతిపుర మపహాసితసురేంద్ర పురం దంతాపురన్నామ న

49 గరీ రాజధా న్యాసీత్|అసౌ దానార్ణ్ణవ మనుజం కండికాబంధురకంఠం వి

మూడవ రేకు; మొదటి పెడ



50 ధాయగుణార్ణ్ణవాయాంబవాడివిషయంమాగసింహాయసో(దా)మ(ణ్డ)లంవజ్రహస్తాను

51 క (ంట) కవర్త్తనీమదాత్|ఏవంచ క్రమేణ ష ట్త్రింశద్వర్షాన్ కలింగా నపాలయత్|
తస్యచ(శ్రీ)

52 (మ) తా మశేషభువనసంస్తూయమాన విమలయశసా మతుల భుజకృపాణాకృష్టవి

---

(1) ర్ఝ స్పష్టముగాలేదు; (2) "లాంఛన" అని; (3) "మాన" అని; (4) "నిహత్య" అని; (5) "కంఠికా" అని;
(6) "షట్త్రింశ" అని ఉండవలెను.

53 జయలక్ష్మీసమాలింగితోత్తుంగవక్షస్స్థలానాం చరణతలకాంతి సంధ్యావదస్తహీకృతసమ
54 స్తనరపతికదంబకానా మనవరతరాజ్యవినోదాపహసితమహేంద్రాణామ్మహేంద్రాచలశిఖర
55 ప్రతిష్ఠితస్య సకలభువన నిర్మ్మాణైకసూత్రధారస్య చరాచరగురో ర్భగవతో గోక
ర్ణ్ణస్వామినః సమా
56 రాధన[1]లబ్ధనిఖిలమనోరథానా మాత్రేయగోత్రాణాం గంగానాం కులమలంకరిష్ణో ర్విష్ణోరివ
57 విక్రమాక్రాంతసకలమహీమణ్డలస్య కామార్ణ్ణవస్యానుజో దానార్ణ్ణవ శ్చత్వారింశ
తమబ్దకాన్
58 రాజ్యమకారీత్ । తత్సూతో ద్వితీయకామార్ణ్ణవః పంచా[2]శద్వర్షాన్ మహీ(మణ్డల)
59 మమణ్డయత్ । తస్య తిరస్కృతత్రివిష్టపం నగర న్నామ పురమాసీత్ తస్మిన్సో
60 పి మధూకవృక్షజననా దీశస్య లింగాకృతేః కృత్వాఖ్యాం మధుకేశ ఇత్యరచయ త్ప్రా
61 సాద మభ్రంలియం[3]యద్వారోర్ద్ధ్వవిచిత్రపత్రలతికా శ్చిత్రాణివాపశ్యతాం సౌధా
62 న్యంబరవర్త్తినాం హ్యాదిభవేన్యూనం విమానారుచిః ౨౪ । తత్తనయోరణార్ణ్ణవః పంచవ
63 ర్షా న్మహీ మపాలయత్ । తత్సూను ర్ద్వితీయోవజ్రహస్తః పంచదశసమాః క్ష
మామర
64 క్షత్ తస్యానుజస్తృతీయః కామార్ణ్ణవోర్ణ్ణవమేఖలా మేకోనవింశతి సం
65 వత్సరాన్ (స) మవర్ద్ధయత్ । తస్యార్ణ్ణనేశ్లోకః వైచిత్ర్యందృఢతాచ సౌష్ఠ
66 వమితి(త్రే) ధా ధనుఃకర్మ్మణాం సోమార్కాన్వయయోర్ద్ధ ధౌసమధురంకామా
67 ర్ణ్ణవో (రా)ఘవః విద్యాధైకశరేణ సప్తసుభటాన్కశ్చిజ్జిఘాంసూన్వనే[4] త
68 త్సాఖ్యానపరస్తయా నితి పృథక్కీర్త్తి ర్వ్వరీ వృత్యతే ౨౫। తత్సుతో గుణార్ణ్ణ-

(1) "సమారాధన" అని; (2) "పంచా" అని; (3) "లిహం" అని; (4) "నే" స్పష్టంగా లేదు.

(౨౩) శ్లోకము. (౨౪-౨౫) శార్దూల విక్రీడితములు.

మూడవ రేకు; రెండవ వైపు



69 వ స్సప్తవింశతి మబ్దా నబ్ధిరశనాంవశమనైషీత్ । తదాత్మజః పోతాంకుశః పంచదశవ
70 త్సరాన్ మహీన్నిస్సపత్నా మకార్షీత్ । తత స్తద్భ్రాతుస్సుతః కలింగలాంకుశో ద్వాదశవత్స
71 కలింగా నలంచకార । తత స్తస్య పితృభ్రాతా సప్తవర్షాన్ గుణ్డమరాజో మహీమ[రాన్
72 ణ్డలమణ్డనో బభూవ । తస్యానుజ శ్చతుర్థః కామార్ణవః పంచవింశతిం వర్షాన్ వసుం
ధరా
73 మనుబభూవ । తయోః కనీయా న్వినయాదిత్యో వర్షత్రయం ధరిత్రీ మత్రాయత । త
త స్తజ్యేష్ఠస్య[1]
74 కామార్ణవస్య సుత శ్చతుర్థో వజ్రహస్తః । పంచత్రింశత మబ్దకాన్ మహీమిభపాద
జలధా
75 రాభి రభ్యషించత్ తస్యవర్ణనే శ్లోకః । అర్థిభ్యః కరిణాంసహస్ర మతులం కాలి [ం] గ
(కాంతార)
76 జం యద్దత్తం సురభీచకార కరటప్రస్యందిదానైర్దిశః తద్దంతైరివ పాణ్డురామ
77 లరుచా దానైరివామోదినా వ్యాప్తాని త్రిజగంతి దివ్యయశసా శ్రీవజ్రహస్త(ప్రభోః)[౨౬] ।
78 తత స్తత్సుతః పంచమకామార్ణవో ర్ధసమా మిలాం పాలయమాస । తత స్తదనుజో

---

(1) "జ్యేష్ఠ" అని ఉండవలెను; (2) ఈ అక్షరములు స్పష్టముగా లేవు.
(౨౬) శార్దూలవిక్రీడితము.

79 ద్వితీయో గుణ్డమరాజ స్త్రీణివర్షాణి ధరాధురంధరో౽బభూవ। తస్య ద్వైమాతరో౽భ్రాతా మధు

80 మధుకామార్ణ్ణవ ఏకోనవింశతివర్షాణి విశాంపతి రభూత్। తత స్తదీయనందనో వజ్ర

81 హస్త స్త్రయస్త్రింశత మబ్దకా న్మహీముదవహత్ తస్యవర్ణనే శ్లోకాః। వ్యాప్తే గంగకు లోత్తమస్య

82 యశసా దిక్చక్రవాలే శశిప్రద్యోతామలినేన యస్యభువనప్రహ్లాదసంపాదినా సిందూరై

83 రతిసాంద్రపంకపటలైః కుంభస్థలీపట్టకే ష్వాలింపంతి పునః పునశ్చ హరితా మా

84 ధోరణా వారణాన్ ౨౭। అనురాగేణ గుణినో యస్యవక్త్రముఖాబ్జయోః ఆసీనేశ్రీ

85 సరస్వత్యా వనుకూలే విరాజతః ౨౮। ననామతః కేవలమర్థతో౽పి సవజ్రహస్త

నాలుగవ రేకు; మొదటి పెడ



86 శ్రీ(కలింగనా)థః కోవజ్రహస్తాదపరం పృథివ్యాం[1]వజ్రం పతద్వారయితుం సమర్థః ౨౯। తత్సు

87 తో (రాజరాజః) క్షమా మరక్ష దష్టసంవత్సరాన్। తస్యవర్ణ్ణనే శ్లోకా॥ సరాజరాజః ప్రథమ

88 ంజయశ్రియఃపతి ర్బభూవ ద్రవిలావివాహోత్సవే విరాజమానా మధ రాజసుందరీముదూ

(1) "పరఃపృథివ్యాం" అని ఉండవలెను;

(౨౭) శార్దూల విక్రీడితము. (౨౮) శ్లోకము; (౨౯) ఉపజాతి.

89 ధవా(న్)శ్చో(డ) మహీభుజాత్మజాం[౩౦]। త్యక్త్వా వేంగిం సపది పరిణామోద యేద్యామివా
న్యాం చోడవ్యా

90 జే మహతి విజయాదిత్య మధ్యా మిమంక్షు[1] ఆపన్నానాం పరమశరణం రాజరాజో విచి
త్రం ల

91 క్ష్మీభాజం సుచిర మకరోత్పశ్చిమాయాం దిశాయాం[౩౧]। తస్యాసీదగ్రసూనుః పృథుల
నిజభు

92 జా విక్రమార్జితశ్రీ సార స్సత్యత్యాగైకసీమా విమలతర యశశ్చంద్రికాధౌతలోకః వా
గుల్లంఘ్య

93 ప్రతాప శ్శుభచరితనిధి ర్భాగ్య[2] సౌభాగ్యరాశిః క్షోణీప్రాణాధినాథస్సకల రిపుమ

94 నోభంగదశ్చోడగంగః[౩౨]। శాకాబ్దేనందరంధ్రగ్రహగణగణితే కుంభసంస్థేది

95 నేశే శుక్లేపక్షే తృతీయాయుజి రవిజదినే రేవతీభే నృయుగ్మే లగ్నే గంగాన్వవాయా

96 ంబుజవనదినకృద్విశ్వ విశ్వంభరాయా శ్చక్రం సంరక్షితుం సద్గుణనిధి రధిప శ్చోడగంగోభి

97 షిక్తః[౩౩]। భీమంవాహా మహోర్మిభిర్బహుబృహన్నాగేంద్రచక్రా[3]కులం నానాశస్త్రఫ
ణీంద్రబృందగహ

98 నం క్రోధస్ఫురద్బాడబం సేనాబ్ధిం ద్విషతాం ప్రమథ్య మహతా దోర్మందరేణాగ్రహీల్ల
క్ష్మీం కీర్తిః

99 సుధాంచ విశ్వవిబుధానందాయ శార్ఙ్గీవయః[౩౪]। పీఠ(శ్రీ)ర్భుజదణ్డయుగ్మ కలితా యస్యా

100 రిదర్పచ్ఛిద స్తంభద్వంద్వనియంత్రితైకకరిణీసాదృశ్యమాశ్లిష్యతేయత్పాదద్వితయాంతి

101 కప్రణయినః క్షోణీభృతామ్మాలయత్పాయ[4]త్పద్మయుగానుసారిమధుపశ్రేణిశ్రియ

102 ంబిభ్రతి[౩౫]। పూర్వస్యాం దిశి పూర్వ ముత్కలపతిం రాజ్యేనిధాయోద్ధృతం పశ్చా
త్పశ్చిమ

---

(1) "మిమంక్షుం" అని; (2) "ర్భాగ్య" అని; (3) "నక్రా" అనికాబోలు; (4) "స్సాన్ఛయ" అని; (5) "నిధాయమ్యుతం" అని.

(౩౦) వంశస్థ; (౩౧) మందాక్రాంత; (౩౨-౩౩) స్రగ్ధరలు; (౩౪-౩౫) శార్దూలవిక్రీడితములు.



బ్ర. శ్రీ. చెదలువాడ సుందరరామ శాస్త్రిగారు

సంస్కృతాంధ్రపండితులు, చెన్నపురి.



బ్ర॥ శే. పురాణ పండా మల్లయ్యశాస్త్రి గారు

పిఠికాపురాస్థానపండితులు

నాలుగవ రేకు; రెండవ పైడ



103 దిక్తటే విఘటితం వేంగీశ మన్యైతయోః లక్ష్మీ[1]ఖండనమాలికామివజయ శ్రీ
104 తోరణస్తంభయో బ్బర్ధ్నాతిస్మ సమిద్ధకీర్త్తివిభవ, శ్రీగంగచూడామణిః.[3౬]॥స
105 శ్రీమదనంతవర్మ్మా మహారాజో రాజాధిరాజో రాజపరమేశ్వరపరమభట్టారకః
106 పరమమాహేశ్వరః పరమవైష్ణవః పరమబ్రహ్మణ్యో మాతాపితృపాదానుధ్యాత శ్రీచో
107 డగంగదేవః వరహ[2]వర్త్తనివిషయే వాశిసో[3] రాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబిన స్స
108 స్స[4]మాహూయపురోహితామాత్యయువరాజసంధివిగ్రహిదౌవారికప్రముఖప [ర్వ్వాన్
109 రిజనసమక్షం మిత్థ మాజ్ఞాపయతి విదితమస్తు వో యథా। భవద్విషయే ఖోన్నగ్రా
110 మః ముణ్డపటునామగ్రామం గ్రాసీకృత్వా చతుస్సీమావచ్ఛిన్నస్సజలస్థలస్సర్వ్వ
111 పీడావివర్జిత మాచంద్రార్క్కక్షితిసమకాలం యస్మాత్పిత్రో రాత్మనశ్చ పుణ్యాయ
112 శోభివృద్ధయే హరనయనవిధుద్గగనచంద్రగణితేషు శకవత్సరేషు మీనమా [యా
113 స కృష్ణపంచమ్యా మాదిత్యవారే సామాన్యతో నానాగోత్రేభ్యో[4]ధ్యయనాధ్యాపనయజన
114 జనదానప్రతిగ్రహషట్కర్మ్మనిరతేభ్య స్త్రిశతద్బ్రాహ్మణేభ్యో ధారాపూర్వ్వకంమత్ప్రి
తామహేన[5]వ
115 బ్రహ్మస్తదేవేన దత్తం। తత్రగారగ్రామగృహీతముణ్డపటుగ్రామస్య ప్రతిక్షేత్రత్వేన తూ
116 లువుగ్రామా దాహృత్యాష్టోత్తరాశీతిపరిమితం క్షేత్రం తేభ్యః ఖోన్నగ్రామనివాసిబ్రా
1·7 హ్మణేభ్యః వేదగుణవియచ్చంద్రగణితేషుశకవత్సరే షూత్తరాయణనిమి

(1) "లక్ష్మీం" అనికాబోలు; (2) "వరాహ" అని; (3) "వాసినో" అని; (4) "స" అని; (5) "పత్పితామహేన" అని.
(3౬) శార్దూలవిక్రీడితము.

అయిదవరేకు, మొదటిపెడ



118 త్తే ధారాపూర్వక మస్మాభిర్దత్తమితి। అస్యక్షేత్రస్య ప్రతిక్షేత్రేణ సార్ధం సీమాలింగాని

119 పూర్వతః ఖోన్న ఓంబరపల్లి తోనేంగి గ్రామాణాం త్రికూటే తోనేంగిగ్రామ వక్రగత్వా। ఆగ్నే

120 యతః వాల్మీక[1]సహితమరిచవృక్షః। తత్పశ్చిమతః ఈషద్వక్ర[2]గత్వా మరిచవృక్షపఙ్త్తిః[3]

121 తతః ఖోన్నతోనేంగిఖోల్లిరగ్రామాణాం త్రికూటే వాల్మీక[4]సహితమరిచవృక్షః। ద

122 క్షిణస్యాం దిశి బృహద్వల్మీకః। తత్పశ్చిమతః వనరాజికాః। తతో గత్వా ముల్లంఘ్య

123 స్థాపితశిలా। తతః క్రమేణ స్థాపితం శిలాత్రయం। నైరృత్యాం దిశి స్థాపితశిలా

124 తదుత్తరతః స్థాపితశిలా। తతఈణిదలనేతోరథ స్తింత్రిణీవృక్షసమీపే

125 స్థాపితశిలా। తతస్తటాకప్రవిష్టగత్వాముఖం। తతోగత్వాతీరేస్థాపితశిలా

126 తతోగత్వైవ। వాయవ్యదిశాయాంగత్వా ద్వయసంధౌ తింత్రిణీవృక్ష

127 సమీపే స్థాపితశిలా। తతోగత్వానుసారేణ ప్రాచీం దిశం కించిద్వక్రంగత్వా

128 తాం గత్వా ముల్లంఘ్యోత్తరతో గత్వా ఖోన్న తూలువుగార గ్రామాణాం త్రికూటే గత్వాద్వ

(1) "వల్మీక" అని వుండవలెను; (2) "వక్రం" అని; (3) "పఙ్క్తి"అని; (4)"వల్మీక"అని; (5)ఈఅక్షరము "ఈ" యో "ర"యో స్పష్టముగా తెలియదు.

129 యమధ్యస్థాపితశిలా। ఉత్తరస్యాం దిశి తటాకద్వయసేతుసంధిః। ఈశానదిశా
130 యాం ఖోన్నగారఒంబరవెల్లిగ్రామాణాం తోనేంగిగర్త్తాతీరత్రికూటః। అ
131 స్యోపరిన కేనచిద్బాధః కర్త్తవ్యః తథాహి వ్యాసేనభగవతోక్తం। బహుభిర్వ్వసు
132 ధాదత్తారాజభిస్సగరాదిభి ర్యస్యయస్య యదాభూమి స్తస్యతస్య తదా

అయిదవరేకు; రెండవపెపు



133 ఫలం[37]।స్వదత్తాం పరదత్తాంవా యత్నాద్రక్ష యుధిష్ఠిర మహీం మ్మహిమతాంశ్రేష్ఠ దా
134 నాచ్ఛ్రేయోనుపాలనం[38]।గామేంకా[1] స్వర్న్న[2]మేకంవా భూమేరప్యేకమంగులం హ
135 రన్నరక మాప్నోతి యావదాభూతసంప్లవం([39])।స్వదత్తాం పరదత్తాంవా యో హరేతవ
136 సుంధరాం షష్ఠిం వర్షసహస్రాణి విష్టాయాంజాయతే క్రిమిః। రితికర్త్తా కావ్యస్య శా
137 సనాధికారిజాతవేదిభట్టః। లేఖకోవల్లనాచార్య్యసుతో బట్టనాచా
138 ర్య్యః।

తెలుగు తర్జుమా

(పం. 1-2) ఓం. లక్ష్మిచే సేవించబడినవాడున్ను, చంద్రకళంకమువంటి కాంతిగలవాడున్ను, నాలుగు బాహువులతో కూడియున్న శరీరమును ధరించినవాడున్ను, ముల్లోకములను సృజింపగోరినవాడున్ను, విశ్వమునకు జన్మస్థానమైన గర్భముగలవాడున్ను, భగవంతుడున్ను అయిన అనంతుడు (విష్ణువు) ఉద్భవించెను. (2-3) అతని నాభికమలమునుండి భువనముల ఆరంభదీక్షయందు భక్తిగలవాడున్ను, నాలుగుముఖములందున్ను వేదసముదాయమును ధరించినవాడున్ను అయిన బ్రహ్మ పుట్టెను. (4-5) అతనికి, సృష్టికి సంబంధించిన భారముచే అధిరూఢమైన తేజస్సుగల మునులలో సమర్థుడయినటువంటిన్ని, సర్వజనహితములున్ను, నిత్యములున్ను అయిన తపస్సుల యొక్క సముదాయమువలెనే ఉన్నటువంటిన్ని అత్రి పుట్టెను. (5-7) ఆ అత్రికి, ఈశ్వరుని జటాజూటమున కలంకారరత్నమై నేత్రవ్యాపారదేశమందైన మన్మథచరిత్రమనే మహానాటికకు సూత్రధారుడయినటువంటిన్ని, దక్షిణదేశస్త్రీల ముఖముకురకాంతులకు దృష్టాంత

(1) "గామేకాం" అని వుండవలెను; (2) "స్వర్ణం" అని.
(3౭–౪౦) శ్లోకములు.

మైనటువంటిన్ని, రాత్రికి నాయకుడయినటువంటిన్ని, ముల్లోకములందలి ఆనందమునకును మూలమైనటువంటిన్ని గగనతలమనే సముద్రమునకు శంఖము అయినటువంటిన్ని చంద్రుడు పుత్రుడయ్యెను. (7-8) అతనికి, జగత్తాపములకు దివ్యౌషధమయినటువంటిన్ని, దేవతలలో శ్రేష్ఠుడైనటువంటిన్ని బుధుడు అనే శుభగ్రహము పుట్టెను. (8) అతనికి, ఎవని ప్రకాశమానమైన భుజమందు భూమి భోగిని అయి ప్రకాశించెనో అట్టి పురూరవుడు పుత్రుడయ్యెను. (9) అతనికి, శుభంకరుడున్ను, త్రిభువన వినతుడున్ను అయిన ఆయువు పుట్టెను. (9-11) అతని పుత్రుడు నహుషుడు; జయశీలమైన బాహువులుగలవాడు; రాజులలో అగ్రగణ్యుడు; అధిక ప్రజాసంపత్తిగలిగి తనకు ఏకపత్నియై ఉన్న భూదేవియందు అనుభవవిముఖుడై, ఇంద్రుని వలననున్న స్వర్గమనే వేశ్యను ప్రేమపరవశుడై పౌరుషముచే అనుభవించినవాడు. (అనగా ఇంద్రలోకమేలెను). (11-12) అతనికి యయాతి పుట్టెను; (ఆ యయాతి) శత్రువులను జయించినవాడు. (12) అతనికి, తుర్వసు అనే రాజు పుట్టెను; అతడు రాక్షసులకు గురువున్ను తనకు మాతామహుడున్ను అయిన శుక్రునియొక్క కీర్తిచేత (ఆ శుక్రుని) వక్షస్స్థలమందు వృద్ధిపొందెను. (13-14) అతడు చిరకాలము సంతానములేకపోవుటచేత అతి ఖిన్నుడై నియతి ప్రాణి, ఆరాధ్యయు వరదయు అయిన గంగాదేవిని ఆరాధించి, అజేయుడయిన గాంగేయుడను పుత్రుని కనెను. (14-15) అదిమొదలు, ఆ వంశీయులకు గంగాన్వయమనే పేరు భూమియందు ప్రకాశించినది. (15-16) అతనికి శత్రువులనే గ్రహములకు అస్తాద్రి అయినవాడున్ను, రాజుల కిరీటములందలి మకరికాపత్రములకు తగులుకొన్న పాదధూళి సముదాయము కలవాడున్ను అయిన విరోచనుడు పుత్రుడయ్యెను. (16-18) అతనికి, గంగాన్వయశ్రేష్ఠుడున్ను లక్ష్మీసరస్వతీగంగాదేవులచేత సంసేవ్యుడున్ను, ఉదారుడున్ను అయిన సంవేద్యుడనే కుమారుడు పుట్టెను. (18) ఆ సంవేద్యునకు, రత్నమువంటివాడున్ను భూపాలమౌళి మకుటములనే లాలనచేయదగినవాడున్ను అయిన భాస్వంతుడు పుట్టెను. (19) భవభూదివోపరహితుడైన ఆ భాస్వంతుడు, సంపదలకు నిధియైన దత్తసేనుడు తనకు పుట్టుటచేత, పుత్రవంతుడయ్యెను. (19-21) రాజులయొక్క కిరీటములకు మాణిక్యమయిన ఆ దత్తసేనునకు అసాధారణమైన రాజ్యలక్ష్మిని భరించువాడున్ను, అతిరమ్యమయిన ఆకృతిగలవాడున్ను అయిన సౌమ్యుడు ప్రియసుతుడయ్యెను. (21) అతనికి, జగచ్చక్రమును సంతోషపెట్టిన అంశుదత్తుడు పుట్టెను. (21-22) అతనికి, శత్రురాజులనే ఏనుగుల సముదాయమును పడకొట్టుటలో పాకలము (అనే రోగము) వంటివాడయిన సౌరాంగుడు పుట్టెను. (22) అతనికి, భూమండలమందు రాజశబ్దమునకు ముఖ్యవాచ్యుడయిన చిత్రాంగదుడు కుమారుడయ్యెను. (22-23) అతనికి, సమస్తభూములయొక్క ఆధిపత్యమునకు కారణమైన సారధ్వజుడు అనే కుమారుడు పుట్టెను. (23) అతని పుత్రుడయిన శర్మసి * రాజనీతిమార్గమున పోరే బాటసారులలో ముఖ్యుడయి ప్రకాశించెను. (24) అతని కుమారుడయిన పరీక్షిత్తు భూమిని జయించుటయందు ఆసక్తిగలవాడున్ను ఏకధనుర్ధరుడున్ను అయి ప్రకాశించెను. (24-25) ఆ మహీపతి, మానవంతుడున్ను ఇతర రాజుల దర్పమును నశింపజేయువాడున్ను అయిన జయసేనుని కనెను. (25-26) అతనికి దిక్కులకు తెల్లనిబట్టగా ఉన్న తన కీర్తిని విస్తరింపజేసుకొన్న (రెండవ) జయసేను డనే పేరుగల పుత్రుడు పుట్టెను. (26-28) అతడు, పరాక్రమశాలియున్ను రాజశ్రేష్ఠుడున్ను, శక్తివంతుడున్ను, అలంఘ్యశాసనుడున్ను, జయశీలుడున్ను, తనవిరోధులకు భయంకరుడున్ను అయిన వృషధ్వజుని కనెను. (28-29) అతనికి, ప్రగల్భుడనే కుమారుడు పుట్టెను; (ఆ ప్రగల్భుడు) రాజసర్మమును ఆచరించుటయందు ప్రగల్భుడున్ను, కత్తియొక్క అంచు అనే నీటితో శత్రుభార్యల గండస్థలములందలి మకరికాపత్రరచనలు కడిగివేసినవాడున్ను అయ్యెను. (30-32) అతనికి, ఏకచ్ఛత్రాధిపత్యముగల రాజతిలకమున్ను స్వయముగా వలచివచ్చిన వీరలక్ష్మి అనే వనితకు భర్తయున్ను అయిన కోలాహలుడు కుమారుడై జన్మించెను; అతడు (ఆ కోలాహలుడు) గంగవాడి విషయమందు కోలాహలమనే పేరుగల పురమును నిర్మించి,

* శర్మదు కాబోలు.

దేవేంద్రుని నేత్రములకు సురసద్మవీక్షణరసమును అనుభవించుటలో విఘ్నము కలిగించెను. (33-34) అతని కుమారుడు, విరోచనుడు అనే పేరుగలవాడు ధనుర్దండమును ధరించి, చోరత్వముతొలగి శాసనమనే ప్రసిద్ధమయిన పాశమునకు విధేయులైన భూమిని పాలించెను.

(34-38) కోలాహలపురము నేలిన రాజులు 81 తరమువారు గతించగా ఆ వంశమందు వీరసింహుడనే రాజు పుట్టెను. సేనలచలనముచేత చోళదేశస్థులను, కనుబొమ్మ ముడిచేత పాండ్యులను, హుంకారముచేత సప్తకొంకణపతులను, న్యక్కారముచేత కేరళదేశస్థులను, అంతర్గతమైన కోపముతో విఘూర్ణమానమైన శిరస్సుచేత కర్ణాటలాటేశ్వరులను, అడలగొట్టుచుండిన ఇతని (ఈ వీరసింహుని) ఉచ్ఛ్రితకృపాణమును వీక్షించుటయందు రాజులలో ఎవరయినా ధైర్యమును పొందియుండిరా? ఈవీరసింహభూపతి తన భుజబలముచే భూమిని జయించి సత్కర్మలనే ఆయుధములనుతొడిగి స్వర్గమును జయించెను. (38-39) అతనికి కామార్ణవుడు, దానార్ణవుడు, గుణార్ణవుడు, మారసింహుడు, వజ్రహస్తుడు అనే పేళ్లుగల పుత్రులు అయిదుగురు పుట్టినారు. (39-40) కులోద్వహుడయిన కామార్ణవుడు అసూయగల తన పినతండ్రి (ఆక్రమించుకొన్న) రాజ్యమును తీసుకోగల శక్తిగలవాడే అయినా దేశమును విడిచిపెట్టెనేకాని ధర్మమును విడిచిపెట్టలేదు. (40-41) అతడు తన నలుగురు తమ్ములతోను కలిసి, ఐరావతము ఎట్లు తనదంతములతో దైత్యులను చీల్చివేయునో అట్లే యుద్ధమందుత్సాహము గల రాజులను చీల్చివేస్తూ తూర్పుదిశకు పోయెను. (41-42) అక్కడను అతడు వన్యేభముల మదజలముల సమూహముచేత ఇనుమడించిన నిర్ఝరులుగలిగి ఆకాశమును రాస్తూ ఉన్న శృంగములుగల మహేంద్రగిరినెక్కెను: (42-47) అక్కడ, సకలసురాసురసిద్ధ సాధ్యశ్రేష్ఠులయొక్క కిరీటకోట్ల రాపిడివల్ల విరాజిల్లు చరణపీఠమును గల గోకర్ణస్వామిని ఆరాధించి, అతని అనుగ్రహమువల్ల ప్రాప్తమైన తెల్లనిఛత్రము, చామరము, సామజధ్వజము, వృషభలాంఛనము, పింఛాంచితమైన బల్లెముల సముదాయము, మకరతోరణము, హుడుక్కము, కాహళము, శంఖము మొదలయిన రాజోచిత చిహ్నములతో సాక్షాత్తు మహేంద్రునివలెనే శోభిల్లి మహేంద్రగిరి శిఖరమునుండి దిగి, యుధిష్ఠిరునివలెనే తనతమ్ములను నలుగురినీ వెంటబెట్టుకొని సమరముఖమున శబరాదిత్యునిచంపి, (ఆ) కామార్ణవుడు కళింగ(రాజ్య)మును తీసుకొనెను. (47-49) రాజులందరి పురములనుమించి, దేవేంద్రునిపురమును అపహసించిన దంతపురము అనే నగరము అతనికి రాజధానియై ఉండెను. (49-51) అతడు దానార్ణవు డనే తన తమ్మునికంఠమున హారమువేసి(యువరాజుగాచేసి) గుణార్ణవునకు అంబవాడివిషయమున్ను, మారసింహునకు సోదామండలమున్ను వజ్రహస్తునకు కంటకవర్తనిన్ని ఇచ్చెను. (51) ఈవిధమున, క్రమముగా (అతడు) 36 సంవత్సరములు కళింగ (దేశ) మును పాలించెను. (51-58) శ్రీమంతులున్ను, అశేషముగా ప్రపంచమందు నుతికెక్కిన విమలయశోవంతులున్ను, అతులమైన భుజకృపాణముచేత ఆకృష్టయైన విజయలక్ష్మి కౌగిలించుకొన్న ఉన్నతవక్షస్స్థలము గలవారున్ను, చరణతలకాంతిచే సంధ్యారాగమువలె సమస్తనరపతికదంబకములును అంతర్హితులగునట్లు చేసినవారున్ను, అనవరతము రాజ్యవినోదముచేత మహేంద్రుని అపహసించినవారున్ను, మహేంద్రగిరిశిఖరమందు ప్రతిష్ఠితుడై సమస్తభువననిర్మాణమునకున్ను ముఖ్యమైన సూత్రధారుడుగాను, చరాచరప్రపంచమునకు గురువుగాను ఉన్న భగవంతుడగు గోకర్ణస్వామియొక్క ఆరాధనవల్ల లబ్ధమైన సమస్తమైన మనోరథములు గలవారున్ను, ఆత్రేయగోత్రమువారున్ను అయిన గంగులయొక్క వంశమును అలంకరించి, విక్రమముచేత విష్ణువువలెనే సకలమహీమండలమున్ను ఆక్రమించిన ఆ కామార్ణవునితమ్ముడు, దానార్ణవుడు 40 సంవత్సరములు రాజ్యమేలెను. (58-59) అతని కుమారుడయిన రెండవకామార్ణవుడు 50 సంవత్సరములు మహీమండలమును పరిపాలించెను. అతనికి స్వర్గమును తిరస్కరించిన పురముండెను; దానిపేరు నగరము. (59-62) అందు లింగాకృతినున్న ఈశ్వరునకు (ఆ ఈశ్వరుడు) మధూకవృక్షమునుండి పుట్టియుండుటచేత మధుకేశుడనే పేరుపెట్టి మేఘములనంటు (వంతెఎత్తుగల) దేవాలయమును కట్టించెను. అందు ద్వారములపైనున్న విచిత్రపత్రలతికలనుగాని, చిత్రములయిన సౌధములనుగాని చూస్తూ అంబరవీధిని సంచరించేవారికి తమ విమానములయెడల అరుచి

పుట్టకతప్పదు. (62–63) అతనికొడుకు రణార్ణవుడు 5 సంవత్సరములు భూమిని సంతోషపెట్టెను. (63–64) ఆతనికొడుకు రెండవవజ్రహస్తుడు 15 సంవత్సరములు భూమిని రక్షించెను. (64-65) అతని తమ్ముడు మూడవ కామార్ణవుడు 19 సంవత్సరములు పృథివిని పోషించెను. (65-68) అతనినివర్ణిస్తూ శ్లోకము:—— సోమాన్వయుడైన కామార్ణవుడున్ను, సూర్యాన్వయుడైన రాఘవుడున్ను వైచిత్ర్యము, దృఢత, సౌష్ఠవము అనే మూడు విధము లయిన ధనుఃకర్మలందున్ను సమానమయిన ధురమును పొందియుండిరి; (అయితే వారిద్దరిలోను)ఒకడు (కామార్ణవుడు) ఒక్కబాణముతో జిఘాంసువులయి (వచ్చి) న సప్తసుభటులనుకొట్టెను; మరియొకడు రాఘవుడువనమందు ఆసంఖ్యగల (ఏడు) చెట్లను కొట్టెను, అని (కామార్ణవుని) విశిష్టమైనకీర్తి ఎక్కువగా వ్యాపించినది. (68-69) అతనికొడుకు, గుణార్ణవుడు 27 సంవత్సరములు భూమిని తనవశము చేసుకొనెను. (69–70) అతనికొడుకు పోతాంకుశుడు 15 సంవత్సరములు భూదేవిని నిస్సపత్నగా జేసి ఏలెను. (70-71) తర్వాత, అతని సోదరుని కుమారుడు, కలింగలాంఛనుడు 12 సంవత్సరములు కళింగరాజ్యము నలంకరించెను. (71-72) పిమ్మట అతనిపినతండ్రి,గుండమ రాజు 7 సంవత్సరములు మహీమండలమునకు మండన మయ్యెను. (72-73) అతనితమ్ముడు నాలుగవ కామార్ణవుడు 25 సంవత్సరములు వసుంధరను అనుభవించెను. (73) వారిద్దరికన్నను చిన్నవాడు (తమ్ముడు) వినయాదిత్యుడు 3 సంవత్సరములు ధరిత్రినిపోషించెను. (73-75) తర్వాత, అతనిజ్యేష్ఠసోదరుడైన కామార్ణవునికుమారుడు, నాలుగవ వజ్రహస్తుడు 35 సంవత్సరములు ఏనుగుల మదజలధారలతో భూమిని తడిపెను. (75-77) అతనిని వర్ణిస్తూ శ్లోకము:——కాళింగకాంతారములందుపుట్టి అతులమై అతిశులమ (వజ్రహస్తునిచేత) దత్తమైన ఏగజసహస్రము గండస్థలములనుండి స్రవిస్తూఉన్న మదముచేత దిక్కులను పరిమళింపజేసెనో, వాటి దంతములవలెనే తెల్లనయినటువంటిన్ని నిర్మలమైనకాంతి కలిగినటువంటిన్ని, (వాటి) మదమువలెనే పరిమళిస్తూ ఉన్నటువంటిన్ని వజ్రహస్తప్రభుకీర్తి ముల్లోకములమను వ్యాపించినది. (78) పిమ్మట, అతనికొడుకు, అయిదవకామార్ణవుడు ఆరుమాసములు అవని పాలించెను. (78-79)తర్వాత, అతనితమ్ముడు రెండవగుండమరాజు 3 సంవత్సరములు ధరాధురంధరు డయ్యెను. (79–80) అతని సవతి తమ్ముడు, ఆరవ మధుకామార్ణవుడు 19 సంవత్సరములు ప్రజలకు నాథు డయ్యెను. (80–81) పిమ్మట, అతని కుమారుడు,వజ్రహస్తుడు 38సంవత్సరములు పుడమినేలెను. 81–86 అతనిని వర్ణిస్తూ శ్లోకములు:—ఏగంగకులోత్తముని కీర్తి చంద్రకాంతివలెనే నిర్మలమయి, లోకాహ్లాదము సంపాదిస్తూ దిక్చక్రవాళము వ్యాపించగా దిగ్గజములకు మావటివాండ్లు మాటిమాటికి కుంభస్థలములనే పట్టకములయందు మిక్కిలిదట్టమయిన పంకపటలముగల సింధూరమును అలుముతూఉంటారో, గుణవంతుడయిన ఎవనియొక్క వక్షస్థలమందున్ను ముఖపద్మమందున్ను అనురాగముచేత లక్ష్మీసరస్వతులు అనుకూలముగా నివసించి ప్రకాశిస్తూ ఉన్నారో, త్రికలింగనాథుడయిన ఆవజ్రహస్తుడు కాక మరియెవడు భూమిపై పడుతూఉండే వజ్రమును నివారించుటకు సమర్థుడు? (86.87) అతనికొడుకు రాజరాజు 8 సంవత్సరములు భూమిని పాలించెను. 87–89 అతనిని వర్ణిస్తూ శ్లోకములు:—ఆరాజరాజు మొట్టమొదట ద్రవిళాహవోత్సవమందు జయలక్ష్మికి భర్తయై, పిమ్మట చోడరాజు కూతురై విరాజిల్లిన రాజసుందరిని పెండ్లియాడెను. (89–91) పరిణామకాలమురాగానే అపరదిక్కువలెనున్న వేంగిని వెంటనే విడిచిపెట్టి చోడవ్యాజమనే మహాసముద్రమందు మునిగిపోవుటకు సిద్ధముగాఉండిన విజయాదిత్యుని ఆపన్నులకు పరమశరణమయిన రాజరాజు పశ్చిమదిశయందు చిరకాలము శ్రీమంతునిగా చేసెను; (ఎంత) విచిత్రము! (91–94) అతని పెద్దకొడుకు, చోడగంగదేవు; తన భుజపరాక్రమముయొక్క ఔర్జిత్యసారము గలవాడు; సత్యత్యాగములకు ముఖ్యమైన సరిహద్దు గలవాడు; విమలమయిన యశశ్చంద్రికలచే లోకమును తెల్లగా చేసినవాడు; వాక్కులకు అందని ప్రతాపము గలవాడు; శుభచరిత్రముల నిధి; భాగ్యసౌభాగ్యములరాశి; భూమికి అధిపతి; సమస్త శత్రువులకును మనోభంగమును కలిగించువాడు. (94-97) శక 999లో సూర్యుడు కుంభమం దుండగా, శుక్లపక్ష

మందు, తదియనాడు, శనివారమున, రేవతీనక్షత్రము రాగా, మిథునలగ్నమందు గంగవంశపద్మమునకు సూర్యుడున్నూ, సద్గుణములకు నిధిన్ని అయిన చోడగంగు భూచక్రమును సంరక్షించుటకై రాజ్యాభిషిక్తుడయ్యెను. (97-99) గుఱ్ఱములనే మహాతరంగములచేత భయంకరమైనటువంటిదిన్ని, ఎక్కువగాను గొప్పవిగాను ఉన్న నాగేంద్రములనే మొసళ్లచేత ఆకులమయినటువంటిదిన్ని, నానావిధములయిన శస్త్రములనే సర్పరాజ సముదాయములచేత దట్టమయినటువంటిదిన్ని క్రోధమనే ప్రకాశమానమైన బడబాగ్నిగలిగినటువంటిదిన్ని అయిన శత్రుసేన అనే సముద్రమును బాహువులనే మహామందరముతో మథించి, లక్ష్మిని, కీర్తి అనే సుధను సమస్తమయిన విబుధులయొక్క ఆనందముకొరకు శార్ఙ్గివలెనే ఎవడు గ్రహించెనో; (99-102) శత్రువుల దర్పమును ఖండించినటువంటి ఎవరి వీరలక్ష్మి తన భుజదండయుగ్మముచే కలితయై రెండు స్తంభముల నడుమను కట్టబడ్డ ఆడయేనుగు సాదృశ్యమును పొందెనో, ఎవనిపాదద్వయమును సమీపించి నమస్కరించిన రాజులతలలు వికసిస్తూ ఉన్న పద్మయుగమును అనుసరించే మధుపశ్రేణియొక్క సంపదను ధరించెనో; (102-104) మొట్టమొదట తూర్పుదిశయందు రాజ్యభ్రష్టుడైన ఉత్కలపతిని రాజ్యమందు మరల నిలబెట్టి, పిమ్మట పశ్చిమదిశయందు విఘటితుడైన వేంగిరాజునుకూడా అట్లే నిలబెట్టి వర్ధిల్లుతూ ఉన్న కీర్తివైభవము గల ఏ శ్రీగంగచూడామణి జయలక్ష్మియొక్క తోరణస్తంభములవలెనున్న ఆ ఇద్దరి (రాజుల) యొక్క లక్ష్మినిన్ని బంధనమాలికను (మంగళతోరణము) కట్టేటట్టు కట్టెనో;

(104-109) అతడు శ్రీమదనంతవర్మ మహారాజు, రాజాధిరాజున్నూ, రాజపరమేశ్వరుడున్నూ, పరమభట్టారకుడున్నూ, పరమమాహేశ్వరుడున్నూ, పరమవైష్ణవుడున్నూ, పరమబ్రహ్మణ్యుడున్నూ, మాతాపితృపాదానుధ్యాతయున్నూ అయిన ఆ శ్రీచోడగంగదేవుడు వరాహవర్తని విషయమందు నివాసులయి ఉన్న రాష్ట్రకూటప్రముఖులను (రట్టడముల పెద్దలను) సమస్తకుటుంబులను పిలిపించి, పురోహితామాత్యయువరాజసంధివిగ్రహిదౌవారికప్రముఖ పరిజనసమక్షమందు శాసనముగా ఆజ్ఞాపించెను:

“మీ అందరికీ తెలియవలసిన దేమంటే:—

“(109-115) మీ (వరాహవర్తని) విషయమందున్న ఖోన్నగ్రామమును, దానికి ముండపలుగ్రామము గ్రాసంగాచేసి, నాలుగువైపులను ఏర్పడ్డ ఎల్లలనడుమను అవిచ్ఛిన్నమయిన దానిని సమస్తజలసహితంగా, పన్నులు మొదలయినబాధలు ఏవీ లేకుండాచేసి, ఆ చంద్రార్కంగా తన తల్లిదండ్రుల పుణ్యయశోభివృద్ధికొరకున్నూ తన యశోభివృద్ధికొరకున్నూ శక 1003 వర్షములుకాగా మీన మాసమందు బహుళపంచమీ ఆదివారమున యజనయాజనాధ్యయనాధ్యాపన దానప్రతిగ్రహ షట్కర్మ నిరతులయిన నానాగోత్రముల బ్రాహ్మణులకు 300 మందికి ధారాపూర్వకముగా నాపితామహుడైన వజ్రహస్తదేవుడు దానముచేసియుండెను. (115-118) అక్కడగారగ్రామమందు చేరి ఉన్న ముండపలు గ్రామమునకు ఉపాంతముగా తూలువుగ్రామమునుండి కొంత విడదీసి, అష్టోత్తరాశీతి-88 పరిమితమయిన క్షేత్రమును ఖోన్న గ్రామనివాసులయినబ్రాహ్మణులకు శక 1034 వర్షములు కాగా ఉత్తరాయణనిమిత్తమున ధారా పూర్వకముగా మేము దానముచేసినాము; అని” (118-130) ఉపాంతముతో కలిసిన ఈ క్షేత్రమునకు ఎల్లలు:— తూర్పున, ఖోన్న—ఓంబరవేల్లి—తోనేంగిగ్రామముల మూడింటికిని నడుమనున్న తోనేంగిగ్రామపు పుంత. ఆగ్నేయమందు పుట్టతోకలిసి ఉన్న మరిచి వృక్షము; దానికి పడమటివైపున కొంచెము వంకరగాపోతే, మరిచవృక్షపంక్తి; దాని ప్రక్కను ఖోన్న—తోనేంగి—ఖోల్లిర గ్రామముల మూడింటికిని నడుమనుపుట్టతో కలిసిఉన్న మరిచ వృక్షము. దక్షిణమందు పెద్దపుట్ట; దానితర్వాత అడవుల పంక్తులు, దానిప్రక్కనున్న పుంత దాటితే, స్థాపితమైఉన్న రాయి; దానితర్వాత వరుసగా స్థాపించినరాళ్లుమూడు. నైరృతిని, స్థాపితమైఉన్న రాయి; దానికి ఉత్తరమున స్థాపితమయిన రాయి; దానితర్వాత ఈ (ర?)ణిపలనేతువుక్రిందను చింత చెట్టు సమీపమునస్థాపితమయిన రాయి; దానిప్రక్కను తటాకమునుచేరిన పుంతముఖము; దాని ప్రక్కను పుంత ఒడ్డున స్థాపితమైనరాయి; అక్కడనుండి పుంతేసరిహద్దు. వాయవ్యమందు రెండుపుంతల నడుమను చింతచెట్టుసమీపమున స్థాపితమైనరాయి; అక్కడనుండి పుంతనుఅనుసరించి తూర్పువైపు కొంచెము వంకరగాపోయి, ఆ పుంతదాటి

ఉత్తరముఖై పురోతే, ఖోన్న-తూలువు-గార గ్రామముల సంధియందు రెండుపుంతల నడుమను స్థాపితమైనరాయి. ఉత్తరదిక్కున రెండుతోటకములకు నడుమనున్నగట్టు. ఈశాన్యమందు ఖోన్న - గార - ఓంబరవేల్లి గ్రామముల మూడింటికిని తోనేంగి పుంతలఒడ్డున మర్రెయ్యలసంధి.

(120-136) దీనికి (ఈదానమునకు) ఎవరివల్లనూ బాధకలుగకూడదు. వ్యాసభగవానులు ఈవిధముగా చెప్పినారు:—"సగరాదిరాజులు అనేకులు భూదానము చేసినారు. భూమి ఏయేకాలములందు ఎవరెవరి వశమయి ఉంటుందో ఆయాకాలములందు వారివారికి తత్ఫలము లభ్యమవుతూ ఉంటుంది. యుధిష్ఠిరా! స్వదత్తమైనా పరదత్తమైనా భూమిని జాగ్రత్తగా రక్షించుము. మహానుభావులలో శ్రేష్ఠుండా! దానము చేయుటకన్నను పాలించడము (దానముచేసినది రక్షించడము) ఎక్కువ శ్రేయ మయినది. ఒక ఆవునుగాని, ఒక బంగారునాణెమునుగాని భూమిలో ఒక అంగుళముగాని హరించినవాడు ప్రపంచ మున్నంతకాలము నరకములోపడి ఉండును. స్వదత్తమైనా పరదత్తమైనా భూమిని ఎవడు హరించునో వాడు అరవై వేల సంవత్సరములు క్రిమిజన్మ మెత్తియుండును;" అని(136-138) కావ్యకర్త, శాసనాధికారి, జాతవేదిభట్టు. లేఖకుడు వల్లేనాచార్యుని కుమారుడు, బట్టేనాచార్యుడు.



# నేనేను

దిట్టకవి సత్యనారాయణ గారు, బి. ఏ.

పెద్దపులి నోటిలో నేనేను
పెనుబొబ్బ లెడతాను నేనేను
గొఱ్ఱెల్లె మేకల్లె నేనేను
ఘొల్లిల్లిపోతాను నేనేను
చెట్లుచేమల్లోను నేనేను
చిగురించుచుంటాను నేనేను
దావాగ్నిమల్లేను నేనేను
తగులబడుచుంటాను నేనేను

భార్యనీ ఒకచెంప నేనేను
భర్తనీ ఒకచెంప నేనేను
భార్యభర్తలమధ్య నేనేను
బంధించుప్రేమనూ నేనేను
చీమలో ప్రాకేది నేనేను
చేపలో యీదేది నేనేను
పక్షిలో పాడేది నేనేను
బ్రహ్మాండమంతయూ నేనేను





శ్రీ పద్మశాలీయ మహాజన చతుర్థ సభ

**1925 సం. ఏప్రిల్ నెల 2౫–26 వ తేదీలు, పెడన, కృష్ణాజిల్లా.**



శ్రీయుత సక్లత్‌వాలాగారు, వారి సతీమణి

క్లత్వాలాగారు పార్సీజాతివారు. నార్తుబాటర్ సీ కమ్యూనిస్టు మెంబరు. (తీవ్రసాంఘికవాది). అమెరికాదేశమున
వాషింగ్‌టనులో జరుగనున్న ఇంటర్‌పార్లమెంటరీ యూనియను సమావేశమునకు ప్రతినిధిగా ఎన్నుకొనబడిరి.
రు ప్రతినిధిగావచ్చినయెడల తాము రాబోవుటలేదని ముగ్గురు కన్సర్వేటివు మెంబరులు నిరాకరించిరి. వీరి సతీమణి
ఆంగ్లయువతి పార్సీయువతివలె వస్త్రములను ధరించియున్నది.
వీరి లండనుబసకు చేరిన యుద్యానమున తీసిన ఫొటోపటమిది.



# వేదాంతవిమర్శా నిరాసము

వేమూరి నృసింహశాస్త్రి గారు

క్రోధననామ సం. చైత్ర, వైశాఖ మాసములందు ప్రకటింపబడిన భారతీ పత్రికలలో బ్ర॥ సుసర్ల కావ్యశాస్త్రిగారు వ్రాసి ప్రకటించిన వేదాంతవిమర్శ యను శీర్షిక క్రింది యుపన్యాసముల చదివితిని. అందు శ్రీ శాస్త్రిగారు సాంఖ్య, వైశేషిక, న్యాయ, యోగ, మీమాంసా, వేదాంతదర్శనములందు దోషములు నిరూపించి ముఖ్యముగా వేదాంతదర్శన మగు శ్రీ వ్యాసమహర్షి ప్రణీత బ్రహ్మసూత్రములకు వ్యాసతాత్పర్యమును శ్రీ శంకర భగవత్పాదులు, శ్రీ రామానుజాచార్యులు, మధ్వాచార్యులు నిర్ణయించలేకపోయిరనియు తద్భాష్యత్రయ ప్రతిపాదితార్థముకంటె వ్యాసతాత్పర్యము భిన్నముగ నుండవచ్చు ననియు లిఖించిరి. దీనిం జూడ వీరికి వ్యాసాభిప్రాయము నూతనముగ పొడకట్టినదని తోచెడిని. తత్రాపి అద్వైతమందు దోషములే విశేషముగా పొడగట్టినవి. ఉపాస్యోపాసకభావముకుదురదని యద్వైతులు నాస్తికులతో సమానులని వచించుట సాహసము. "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" అను శ్రుతి ప్రమాణము వలన నేనే బ్రహ్మయని బ్రహ్మమైన విదేహముక్తునకు నుపాస్యోపాసకభావ మక్కర లేకున్నను సాధకులకు నుపాసనల నంగీకరించియే యున్నారు. సత్కార్యవాదమునంగీకరించినట్టి యద్వైతులు నాస్తికసమానులనుట సాహసము కాదా? మఱియు నద్వైతులు ప్రచ్ఛన్నబౌద్ధులని లోకప్రవాదమును స్థాపించిరి. ఇందున గుఱించి పెద్దలు చెప్పినదే మన:

"శ్లో. ఐక్య శ్రుతీనాం సర్వాసా మప్రామాణ్య ప్రకల్ప [నాత్;
బౌద్ధానాం ద్వైతినాం చైవ భేదం నోపలభామహే."

అనగా జీవబ్రహ్మల కైకత్వమును బోధించునట్టి "సదేవ సోమ్యేదమగ్ర ఆసీ దేకమేవా ద్వితీయం" "ఆత్మావా ఇద మేక ఏవాగ్ర ఆసీ న్నాన్యత్కించ మిషత్" ఇత్యాదిశ్రుతుల కప్రామాణ్యమును, కల్పించుట వలన బౌద్ధులకును ద్వైతులకును భేదము కానము అని. వ్యాసులు బ్రహ్మసూత్రములు రచించుటకు శ్రీ శాస్త్రిగారు వ్రాసినకారణ ముండవచ్చునుగాని, జీవుడే బ్రహ్మయని సాధించుటకు రచించలేదని వ్యాసతాత్పర్యనిర్ణయములో తమ పక్షము స్థాపింపబడక ముందే వ్రాయుట తప్పు. ఏలయన: "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" అను శ్రుతులలో జీవబ్రహ్మైక్యము కన్పట్టుచుండ తద్భిన్నముగా బ్రహ్మసూత్రార్థము ఉండదుగదా. శ్రీ వ్యాసప్రణీతబ్రహ్మసూత్రముల కర్థము, శ్రుతిప్రతికలు గల వ్యాసప్రణీత పురాణవచనముల వలననే నిర్ధారణ చేయవలయు ననిన,

సమస్త పురాణకర్తయగు వేదవ్యాసులు స్కాంద పురాణాంతర్గత సూతసంహితలో యజ్ఞవైభవఖండ పూర్వభాగములో 37వ అధ్యాయములో,

"శ్లో. అథాత స్సంప్రవక్ష్యామి సమాసేన సవిస్తరాత్;
అవిరోధంతు వేదానా మశేషాణాం మునీశ్వరాః!
త్రివిధో వేదరాశిస్తు మునయ స్సంశితవ్రతాః;
సత్యాద్వైతపరః కశ్చి ద్వేదభాగ స్సమాసతః.
కల్పితద్వైతనిష్ఠస్తు వేదభాగోఽ పరోద్విజాః!
సత్యమేవ సదాఽద్వైతమసత్యం ద్వైత మాస్తికాః
ద్వైతస్యాపిహి సత్యత్వం వర్ణయంతీహ కేచన;
తదసంగత మధ్యస్తం ద్వైతజాలంచిదాత్మని. [వత్;
అధ్యస్తంహి సదాద్వైతం దృశ్యత్వా చ్ఛుక్తిరూప్య
దృశ్యత్వం ద్వైతజాలస్య సమ్మతం సర్వదేహినామ్.

తస్య ద్వైతపరో భాగః కల్పితద్వైతగోచరః;
అద్వైతం సర్వదా సత్యం భేదాభావాత్కథంచన."

ఇది మొదలైన గ్రంథముచే ద్వైతమునకు మిథ్యాత్వమును అద్వైతమునకు సత్యత్వమును చెప్పి,

"శ్లో. కల్పితద్వైతసూత్రే తు నైవ మానమియం శ్రుతిః;
తత్ర ప్రయోజనాభావాత్ ద్వైతం న ప్రతిపాద్యతే.

అభూతద్వైత మద్వైతం ప్రతిపాదయతి శ్రుతిః;
స్మృతీనాంచ పురాణానాం భారతాదేస్తథైవచ.
తథా శివాగమాదీనాం తర్కాణాంచ ద్విజోత్తమాః!
అద్వైతనిష్ఠతైవోక్తా నద్వైతపరతా సదా."

ఇత్యాదిగ్రంథముచే శ్రుతిస్మృతిబ్రహ్మసూత్రాదులకును అద్వైతవిధాయకత్వమును, ద్వైతానువాదకత్వమును ఉపపాదించెను.

బ్రహ్మగీతలలో—

"త్వంశబ్దార్థో య ఆభాతి సోఽహం శబ్దార్థ ఏవహి;
యోఽహం శబ్దార్థ ఆభాతి సత్వం శబ్దార్థ ఏవహి.

త్వమహం శబ్దలక్ష్యార్థ స్సాక్షీ ప్రత్యక్చితి స్స్వరాట్;
తచ్ఛబ్దస్యైవ లక్ష్యార్థ స్సైవ నాత్ర విచారణా.

త్వమహం శబ్దవాచ్యార్థ స్సైవ దేహాదివస్తునః;
న తచ్ఛబ్దార్థతాం వక్తి శ్రుతిస్తత్వమసీతి సా.

తస్యైక్యవిరుద్ధార్థం త్యక్త్వా వాచ్యగతం శ్రుతిః;
అవిరుద్ధం చిదాకారం లక్షయిత్వా బ్రవీతిహి.

తదర్థేన త్వమర్థైక్య విరుద్ధాంశం విహైవతు;
కారణత్వాదివాచ్యస్తం లక్షయిత్వాతు కేవలమ్.

చిదాకారం పునస్తస్య త్వమర్థైక్యం బ్రవీతిచ;
తత్త్వం శబ్దార్థభూతస్య చిన్మాత్రస్యపరాత్మనః.

ఏకత్వం య స్వతస్సిద్ధం సహి వాక్యార్థ ఆస్తికాః!
ఇతోఽన్యథా యో వాక్యార్థ స్సోఽవాక్యార్థో నసంశయః."

ఈవిధముగ తత్త్వమసి యను మహావాక్యమునకు జీవబ్రహ్మైక్యపరముగ నర్థము స్పష్టపరమటయే కాక, శ్రీ శాస్త్రిగారు వ్రాసినప్రకారము సాదృశ్యార్థము చెప్పుట, వాక్యార్థము కాదనియును నిస్సంశయముగా చెప్పియున్నారు. మఱియు వాసిష్ఠలైంగపురాణైకాదశాధ్యాయమునందు ఋభునిదాఘసంవాదములో;

"యజ్జ్ఞానేన నిదాఘ! దృశ్యమఖిలం విజ్ఞాతమేవాఖిలమ్
మృత్పిండేన ఘటాదివద్భవతి తత్సర్వం తతోఽన్యన్నహి;
తత్త్వం విద్ధి మహాబలేన సతతం భక్త్యా చ తత్సేవయా
సత్యం సంసరసి శ్రుతిశ్చ తదసీ త్యైక్యం సదా వక్తిహి."

అనువచనముచే,

"యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్" అను శ్రుత్యుక్తదృష్టాంతముచే "యేనాశ్రుతం శ్రుతం భవతి" అను ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానప్రతిజ్ఞయు, తత్త్వమసి మహావాక్యమునకు జీవబ్రహ్మైక్యము చెప్పబడియున్నది.

మహాభారత మోక్షధర్మపర్వాంతమున "బహవః పురుషా బ్రహ్మన్నుతాహో ఏక ఏవ వా" అని జనమేజయుడు వైశంపాయనునిగూర్చి ప్రశ్నించగా,

"బహూనాం పురుషాణాం హి యథైకో యోనిరుచ్యతే;
తథా తం పురుషం విశ్వ మాఖ్యాస్యామి గుణాతిగమ్.

బహవః పురుషా రాజన్! సాంఖ్యయోగవిచారిణామ్
నైత దిచ్ఛంతి పురుష మేకం కురుకులోద్వహ!"

అని సాంఖ్యులు పురుషబహుత్వము నిశ్చయింతురు. పురుషైకత్వము నిశ్చయించరని ఉపన్యసించి,

"ఉత్సర్గేణాపవాదేన ఋషిభిః కపిలాదిభిః;
అధ్యాత్మచింతా మాశ్రిత్య శాస్త్రాణ్యుక్తాని భారత!"

అనువాక్యముచేత కపిలాది మునివచనమునకు నుత్సర్గత్వమును జూపి

"సమాసతస్తు యద్వ్యాసః పురుషైకాత్మ్యముక్తవాన్;
తత్తేఽహం సంప్రవక్ష్యామి ప్రసాదా దమితౌజసః"

అని ఏకాత్మ్యత్వ వాదియగు వ్యాసునివచనమును కపిలాదివచనమున కపవాదముగా చూపించి,

"అత్రాప్యుదాహరంతీమమితిహాసం పురాతనమ్;
బ్రహ్మణా సహ సంవాదం త్ర్యంబకస్య విశాంపతే"

యని బ్రహ్మలలాటోద్భూతుడగు రుద్రునికిని బ్రహ్మకును సంవాదము నుపక్రమించి,

"శ్రుణు పుత్ర! యథా ప్యేకః పురుషః శ్శాశ్వతో ఽవ్యయః;
అక్షయ్య శ్చాప్రమేయశ్చ సర్వగశ్చ నిరుచ్యతే.
నసశక్య స్త్వయా ద్రష్టుం మయాన్యై ర్వాపి సత్తమ!
సగుణో నిర్గుణో విశ్వో జ్ఞానదృశ్యోహ్యసౌ స్మృతః.
అశరీర శ్శరీరేషు సర్వేషు నివసత్యసౌ;
వసన్నపి శరీరేషు నసలిప్యేత కర్మభిః.
మమాంతరాత్మా తవచయేచాన్యే దేహి సంజ్ఞితాః;
సర్వేషాంసాక్షిభూతో ఽసౌ నగ్రాహ్యః కేనచిత్క్వచిత్.
విశ్వమూర్ధా విశ్వభుజో విశ్వపాదాక్షినాసికః;
ఏకశ్చరతి భూతేషు స్వైరచారీ యథాసుఖమ్.''

అనువచనములచేత నేకాత్మత్వమే బ్రహ్మచే జూపింపబడినదని నైశంపాయనుండు నుడివెను.

ఈప్రకారముగా వ్యాససూత్ర తాత్పర్యమును వ్యాసులవారే శ్రీమహాభారతములోను వాసిష్ఠ లైంగ పురాణములలోను స్కాందపురాణాంతర్గత సూతసంహిత యందును ఇంక ననేక స్థలములలోను స్పష్టముగ శ్రుతి వాక్య ప్రతీకను గ్రహించి జీవబ్రహ్మల కభేదపరముగా వెల్లడిచేసియుండగా యీశాస్త్రిల్లుగారికి బృహన్నార దీయములో "తత్త్వమస్యాది వాక్యోత్థం" అనుశ్లోక మొకటియు బ్రహ్మాండపురాణములో "ప్రసిద్ధస్థూలసూక్ష్మాది" అను శ్లోక మొకటియు దొరకినది. ఈశ్లోకము లాయా పురాణములలో నుండియుండినయెడల

"కణాదకపిలాద్యైస్తు మునీంద్రైరపి కీర్తితమ్;
మందబుద్ధ్యను సారేణ కేవలం పరికీర్తితమ్.
అతఏవ మునీనాంతు విరోధో నాస్తికశ్చన;
అన్యథా తే విరుద్ధార్థం కథమాహు ర్మనీషిణః."

అని చెప్పినరీతిగా మందాధికారులు మొదట భేదముగాకన్పట్టుచుండు జీవబ్రహ్మల కైకత్వమును బోధించినచో దెలుసుకొనజాలరని సాదృశ్యలక్షణయనియు ప్రాకృతస్థౌల్యాదిరహితమనియునుబోధించి చివర కభేదము నుత్తమాధికారులకు వాస్తవముగా బోధించిరని చెప్పినసర్వమునకు ప్రామాణ్యము సుస్థిరముగ నుండును. లేనిచో నిర్గుణప్రతిపాదకశ్రుతులకేమి సూత్రములకేమి స్మృతీతిహాస పురాణవచనజాతముల కేమి వైయర్థ్యముం జెప్పవలసి వచ్చును.

ఇదియునుంగాక బ్రహ్మసూత్రముల రచించిన శ్రీ వేదవ్యాసులవారి తాత్పర్యము జీవేశ్వరుల కభేదమునందా లేక భేదమునందా యని సంశయము కలిగినప్పుడు శాస్త్రిగారు వ్రాసినరీతిగా వ్యాసపురాణ వచనములచేతనే నిర్ణయించుటకాక మఱియొకవిధముగకూడ నిర్ణయించ వచ్చునని తోచుచున్నది. ఆవిధ మెద్దియన: వ్యాసులవారికి సమానకాలికులును సమానప్రతిపత్తిగల కపిల, కణాద, గౌతమ, పతంజలి, జైమిని మహర్షులు రచియించిన తంత్రములలో "యావన్న పరమతం న నిరాక్రియతే తావ త్స్వమతం నప్రతిష్ఠితం భవతి" అనగా పరమతమును నిరాకరించనంతవరకు తమమతము సుస్థిరముగాదనున్యాయము చొప్పున స్వస్వమతస్థాపనకొరకు పరమతమును నిరాకరించుతరి వ్యాసులవారు తమసూత్రములందు "రచనానుపపత్తేశ్చ నానుమానమ్" అని మొదలుకొని కపిలముని ప్రణీతసాంఖ్యమతమును, "ఏతేన యోగః ప్రత్యుక్తః" అని పతంజలిప్రణీతయోగమతసిద్ధాంతమును, ఇటువలెనే అనేకసూత్రములచేత ననేకమతసిద్ధాంతముల నిరాకరించినటులనే వ్యాసమతమును కపిలాదులు నిరాకరించు సమయములో జీవబ్రహ్మల కభేదము వ్యాసమతమని తలచి నిరాకరించియున్నారు. అది ఎటులనగా కపిలాచార్యులు "నావిద్యాతో ప్యవస్తునా బంధాయోగాత్" అవిద్యచే నాయాత్మకు బంధము వచ్చుననిన అవిద్యయనగా విద్యయొక్క ప్రాగభావముగాని ప్రధ్వంసాభావముగాని కావలయును. ఎట్లుచెప్పినను వస్తువు కాదుగదా? అవస్తువుచే నాత్మకు బంధము సంభవించదు. కాబట్టి అవిద్యచే బంధము అనునది చెప్పుటయేకాని వాస్తవముకాదని ఇదిమొదలగు 36 సూత్రములలో నిరాకరించిరి. అవిద్య నంగీకరించినది యద్వైతులేకదా, శ్రుతులలో నుండునట్టి యవిద్య నంగీకరించవలసినమతము వ్యాసులవారిదే. దానిని నిరాకరించుటవలన వ్యాస తాత్పర్యము జీవబ్రహ్మైక్యబోధకమగు నద్వైతమనియే కపిలాచార్య లభిప్రాయము పడినట్లు స్పష్టపడుచున్నది. ఈరీతిగనే "మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమండలాభ్యాం" అని వ్యాసులవారు కణాదమతమును నిరాకరించినటులనే వైశేషికతంత్రతృతీయాధ్యాయ ద్వితీయాహ్నికమునందు "తస్మాదాగమికః" అను సూత్రముచే నాగమైకసమధిగమ్యమగు నాత్మ ననువదించి "సుఖదుఃఖజ్ఞాన

నిష్ప్రత్త్యవిశేషా ద్దికాత్మ్యం సర్వశరీరాణాం” అను సూత్రముచే స్వాభిమత మగు నేకత్వము జూపి “నానాత్మనో వ్యవస్థాతః”, “శాస్త్రసామర్థ్యాచ్చ” అను రెండు సూత్రములచే నాత్మైకత్వనిరాకరణపూర్వకముగా ఆత్మ నానాత్వము స్థాపించెను. అటులనే “తర్కాప్రతిష్ఠానా ద ప్యన్యథానుమేయ మితిచే దేవమ ప్యవిమోక్ష ప్రసంగః” అని వ్యాసులవారు గౌతమమతనిరాసనము చేసిన రీతిగనే గౌతములును కేవలాద్వైతము ననువదించి నిరాకరించిరి. “ఏతేనయోగః ప్రత్యుక్తః” అని వ్యాసులవారు నిరాకరించినటులనే యోగశాస్త్రమందును “స్వరూప ప్రతిష్ఠావాచ్యేతిశక్తిః” అనగా వేదాంతవాదు లాత్మకు చిదానందమయత్వమును మోక్షముగా తలచుచున్నారు. గాని యానంద మనగా సుఖము; సుఖము సంవేద్య మగునది. గాన సంవేదన సంవేద్యముల నంగీకరించుటవలన నద్వైతహాని యగునని యనువదించి నిరాకరించిరి.

“ఫల మత ఉపపత్తేః” అని వ్యాసులవారు జైమినీ మతనిరాకరణముం జేసినటులనే మీమాంసాశాస్త్రమందును కేవలాద్వైతమతము నే వేదాంతశాస్త్రాభిమతమని యెంచి నిరాకరించిరి. తర్కపాద వార్తికమునందు భట్టపాదులు:

“స్వయంచ శుద్ధరూపత్వా దభావా చ్చాన్యవస్తునః;
స్వప్నాదివ దవిద్యాయాః ప్రవృత్తి స్తస్యకింకృతా.
అన్యేనోపప్లవేఽభీష్టే ద్వైతవాదః ప్రసజ్యతే;
స్వాభావిక మవిద్యాంతు నోచ్ఛేతుం కించిదర్హతి.
విలక్షణోపపాతేహి నశ్యేత్స్వాభావికీ క్వచిత్
నత్వేకాత్మాభ్యుపాయానాం హేతురస్తివిలక్షణః”

అని యున్నది.

ఇంకను యాజ్ఞవల్క్య, మనుస్మృతి మొదలగు స్మృతులలోను, విష్ణుపురాణము, శ్రీమద్భాగవతము, గారుడపద్మ పురాణములయందును అద్వైతమే ప్రకటింపబడియున్నది.

ఈరీతిగ నిన్ని మహాగ్రంథము లుద్ఘోషించుచుండ వ్యాసులవారి యభిప్రాయ మద్వైతముకాదని శాస్త్రిగారికి ఏల సంశయము కలిగినదో?



# షెల్లీకవి

సెట్టి లక్ష్మీనరసింహము గారు

కాలమా, లోతెఱుంగ శక్యంబుకాని
సాగరమ్మ, మానవ బాష్పజలకణభరి-
తంబవై, దుఃఖవీచీయుతంబ వగుచు
తీరమనునది లేక, యపారమనుజ-
లోకమును జుట్టుముట్టి క్రాలుదువు నీవు
పొట్టలో నెందఱనొ నీవు పెట్టుకొనియు,
క్షుత్తుతీఱక హాహోరుని ఘోష పెట్టు
చుందు; వఖిలముం గబళించుచుందువు గద!
నిర్మలముగ నున్నప్పుడుగా నిన్ను నమ్మ
లేము: చెలరేగినప్పుడు నీ ముఖంబు
తేఱిచూచుటే కష్టము: ఘోరకాల-
సాగరమ! నిన్నుఁ గడవ నెవ్వారితరము?





# తేజోలేఖనము

పింజమూరి కృష్ణమాచార్యులుగారు

[2 వ సంపుటము 6 వ సంచిక తరువాయి]

## ఏడవ ప్రకరణము

## ప్లేట్లను డెవలప్‌మెంటు చేయుట

## [Development of Plates]

ఎక్స్‌పోజు చేయబడినట్టి ప్లేట్లను చీకటి గదియందు ఎఱ్ఱదీపపు వెలుతురులో పరిశీలించితిమేని, ఎక్స్‌పోజు చేయకముం దెటులుండునో, ఎక్స్‌పోజు చేసిన పిమ్మటకూడ నట్లేయుండి, మార్పేమియు మన కగపడ నేరదు. కాని, మనకంట్లె కగుపడకుండినను, వస్తురూపము మాత్రమం దిమిడియుండును. ఈ కనబడకుండ దాగియుండు రూపమును ప్లేటుపై కనపడునట్లు చేయుపనికే "డెవలప్‌మెంటు" అని పేరు. డెవలప్‌మెంటు చేయు ప్రధాన రాసాయనిక పదార్థములను స్వతంత్రముగా డెవలప్‌చేయు శక్తిగలవనియు, యితర క్షారములతో మిశ్రమముచేసిననేకాని డెవలప్ చేయజాలనట్టివనియు, రెండు రకములుగా విభజింపవచ్చును. ఫెర్రస్ ఆక్సలేట్ (Ferrous oxalate) మొదటిరకమునకును, మెటోల్-పైరో (Metol Pyro) మొదలగుపదార్థములు రెండవ రకమునకును జెందగలవు. ప్లేట్లను డెవలప్‌చేయుటకు ముఖ్యముగా రెండవరకమునకు జెందిన పైరో, మెటోల్ మొదలగునవి వాడుక చేయబడును. ఈక్రింద డెవలప్‌మెంటు చేయుటకు వలయు కొన్ని ముఖ్యమగు రాసాయనికపదార్థములకు జెందినవివరములు దెలుపబడియున్నవి.

పైరో (Pyro)— ఇది మిక్కిలి తేలికగానుండు చూర్ణముగను, పలుకులుగను కూడ లభ్యము కాగలదు. చూర్ణముకంటె పలుకులుగా నుండునట్టిదే వాడుట మంచిది. ఇది ప్రమాదకరమగు విషపదార్థము. 10 గ్రయినులు ప్రాణమును తీయుటకు చాలును. దీని నుపయోగించునప్పుడు నోటికి తగులకుండ మిక్కిలి జాగరూకతతో మెలగవలయును. నీటిలో కరగించిన పైరో ద్రావకమందు ఆమ్లము (Acid) చేర్చినచో, చెడిపోకుండ కొంతకాలము నిల్వయుండును.

హైడ్రోక్వినన్ (Hydroquinone)— తెల్లని సూదులవంటి పలుకులుగా నుండును. గాలి సోకకుండునటుల బుడ్డియొక్క మూతి గట్టిగా బిగించి యుంచుకొనవలయును. ఇది పైరో అంత ప్రమాదకర మగు విషము కాకపోయినను విషముల లోనిదే.

మెటోల్ (Metol)—ఇదియును హైడ్రోక్వినన్ వలెనే తెల్లని సూదులవంటి పలుకులుగానుండును. గాలి తగులుటవలన యిది అంతవేగముగా చెడిపోనేరదు గాని బుడ్డి గట్టిగా మూసియుంచుకొనుటమాత్రము మంచిది.

ఎజాల్ (Azol):—ఇది ద్రవరూపమున నుండు డెవలప్‌మెంటు చేయుద్రావకము. దీనితో డెవలప్‌మెంటు చేయుటకు, యితరపదార్థము లేవియు యిందుచేర్చనవసరముండదు. 1 ఔన్సునీటిలో 20 మొదలు 30 చుక్కల వరకు దీనిని కలిపిన చాలును. గాలిసోకకుండ బుడ్డియొక్క మూత గట్టిగా బిగించియుంచినచో నెంతకాలమైనను చెడిపోనేరదు.

రోడినల్ (Rodinal):—ఇదియును పైవిధమగు ద్రవరూపమున నుండునదియే. డెవలపర్. ఎజాల్ గుణములే దీనికిని గలవు.

రైటోల్ (Ryto.):—ఇది తెల్లనిబిళ్లలుగా నుండును. డెవలపర్ పదార్థ మొకబుడ్డియందును, క్షారపదార్థము వేరొకబుడ్డియందును ఉంచబడును. ఈ రెండు బుడ్లనుండియు యొక్కొక్కబిళ్ల తీసుకొని నీటియందు కరగించుటవలన డెవలప్ మెంటు చేయు ద్రావకము తయారు కాగలదు.

సోడియం కార్బొనేట్ (Sodium Carbonate):—ఇది యొకవిధమగు క్షారపదార్థము. పలుకులుగను మెత్తనిచూర్ణముగను గూడ లభ్యము కాగలదు. చూర్ణమునుండి తడి పూర్తిగా తీసివేయబడుటచే, పలుకులకంటె చూర్ణమునకు హెచ్చుతీవ్రత యుండును. 1 భాగము చూర్ణము 2½ భాగముల పలుకులకు సమానముగా నెంచుకొనవలయును. పలుకులకు గాలి తగిలినచో, ద్రవరూపముగా మారిపోవు స్వభావము కలదు. పైరో, మెటోల్ మొదలగు స్వతంత్రముగా డెవలప్ మెంటు చేయుశక్తిలేనట్టి డెవలపరులతో దీనిని జేర్చిననే కాని, వాటికి డెవలప్ మెంటుచేయుశక్తి రాజాలదు.

సోడియం సల్ఫైట్ (Sodium Sulphite):—ఇదియును పైరో, మెటోల్ మొదలగు డెవలపరులతో జేర్చబడునట్టి క్షారపదార్థమే. పలుకులుగను చూర్ణముగను గూడ లభ్యము కాగలదు. సోడియం కార్బొనేట్‌నకు గల గుణములే దీనికినిగలవు. 1 భాగము చూర్ణము, రెండు భాగముల పలుకులకు సమానముగా నెంచుకొనవలయును.

పొటాసియం బ్రొమైడ్ (Potassium Bromide):—ఇదియును క్షారపదార్థమే. డెవలప్ మెంటును మేరలో నుంచుటకుగాను దీనిని డెవలపర్ ద్రావకమునందు తగుమాత్రము చేర్చుదురు.

పొటాసియం మెటా బైసల్ఫైట్ (Potassium Metabisulphite):—ఇది తెల్లనిపలుకులుగా నుండునట్టి క్షారపదార్థము. పైరో మొదలగు డెవలపర్ ద్రావకములను చెడిపోకుండ నిల్వయుంచుటకును, ఆసిడ్ ఫిక్సింగు మొదలగు ద్రావకములు చేయుటకును ఉపయోగింపబడును.

## పైరోతో డెవలప్ మెంటు చేయుట ద్రావకములు

ప్లేట్లను డెవలప్ చేయుటకు హెచ్చుమంది చేపైరో వాడుక చేయబడుచుండుటవలన ప్రథమమున యీపైరోతో డెవలప్ మెంటుచేయు క్రమము దెలుపబడినది. ప్లేట్లను డెవలప్ చేయుటకుముందు యీక్రింది ద్రావకములను తయారుచేసి యుంచుకొనవలయును.

### పైరోనిలవ ద్రావకము (Pyro Stock Solution)

| | |
|---|---|
| పైరోగాలిక్ ఆసిడ్ (పలుకులు) | 1 అవున్సు |
| పొటాసియమ్ మెటా బైసల్ఫైట్ | 100 గ్రయినులు |
| మంచినీరు | 10 అవున్సులు |

నీటియందు ప్రథమమున పొటాసియమ్ మెటా బైసల్ఫైట్ కరగించి, పిమ్మట పైరో చేర్చవలెను. ఈ ద్రావకమును బుడ్డిలోపోసి గాలితగులకుండ గట్టిగామూతపెట్టి యుంచినచో నాలుగైదు మాసములవరకు నిల్వయుండగలదు.

### డెవలప్ మెంటు ద్రావకము నెం. 1.

| | |
|---|---|
| పైన దెలుపబడినట్టి నిల్వ పైరోద్రావకము | ½ అవున్సు |
| మంచినీరు | 5 అవున్సులు |

ఈద్రావకము కొన్నిరోజులకంటె హెచ్చుకాలము చెడిపోకుండ నిల్వయుండదు.

### డెవలప్ మెంటు ద్రావకము నెం. 2.

| | |
|---|---|
| సోడాకార్బొనేట్ (పలుకులు) | 2 ఔన్సులు |
| సోడా సల్ఫైట్ ,, | 2 ఔన్సులు |
| పొటాసియం బ్రొమైడ్ ,, | 12 గ్రయినులు |
| మంచినీరు | 20 అవున్సులు |

10 అవున్సుల నీరుకాచి అందు వరుసవెంబడి పై పదార్థములను కరగించి, పిమ్మట మిగిలిన 10 అవున్సుల నీరును జేర్చవలెను. ఈ 5 అవున్సులనీళ్లును వేడిగా నుండక చల్లగానుండవలయును. సోడా సల్ఫైట్ పరిశుభ్రమైనదైనచో యీద్రావకము చాలకాలము నిల్వయుండును. కాని, 2, 3 మాసముల కొకపర్యాయము క్రొత్త ద్రావకము చేసుకొనుచుండుట మంచిది.

## డెవలప్మెంటు చేయు క్రమము

1½ అవున్సులు నెం. 1 ద్రావకము నొక గ్లాసులో పోసి, అందు 1½ అవున్సులు నెం. 2 ద్రావకము చేర్చి, చీకటిగదిలో ఎర్ర దీపమునకు సమీపముగా అందుబాటులో నుంచుకొని, పిమ్మట డార్కు స్లైడులోనుండి ఎక్స్పోజు చేయబడినట్టి ప్లేటును పైకిదీసి, అది సరిగాపట్టునట్టి కొలతగల తొట్టిలో, మందు పూతగల వైపు పై కుండులాగున ఉంచవలయును. (ప్లేటును డార్కుస్లైడులో నుంచి పైకిదీయునపుడు చీకటిగది యందు ఎర్రదీపపువెలుతురు తప్ప మరి ఏవిధమగు వెలుతురును ఉండరాదు). పిమ్మట దానిపై కొంచెము మంచినీళ్లు పోసి, ప్లేటంతయు బాగుగా తడిసినపిమ్మట నీటిని పారబోసి, ముందుగా కలిపి యుంచుకొనినట్టి డెవలపర్ ద్రావకము పోయవలయును. పోయునపుడు గాలిబుడగ లగుపడినచో, వాటిని వ్రేలితో కలిపివేయవలయును. అంతట తొట్టెనాడించుచు(తొట్టెలోని ద్రావకము ప్లేటుపై నంతటను పారునటుల) ప్లేటునుపరీక్షించుచుంటిమేని, ఎక్స్పోజరు సరిగానుండినచో, సుమారు అరనిమిషములో హెచ్చువెలుతురుగలఆకాశము, తెల్లని దుస్తులు మొదలగుభాగములు కనబడుటకు ప్రారంభించును పిమ్మట క్రమముగా వస్తురూపమంతయు పూర్తిగా కనబడును. ఈవస్తురూపము కనబడుటలోని తేడాలను బట్టి ఎక్స్పోజరు సరియైనదియు లేనిదియు తెలుసుకొనుటకు వీలుగలదు. పైన దెలిపినటులు ప్రథమమున హెచ్చువెలుతురుగలభాగములును పిమ్మట క్రమముగా నీడగల భాగములును కనబడుచు వచ్చినచో, ఎక్స్పోజరు సరియైనదిగా నెంచుకొని, ప్రథమమున కనబడినట్టి హెచ్చు వెలుతురుగల భాగములు కొంతదట్టమగువరకు ప్లేటును ద్రావకమునందే యుంచి, తొట్టెనాడించుచు రావలెను. వస్తురూపమంతయు పూర్తిగా కనబడుటతోడనే, తరుచు ప్లేటును ద్రావకమునుండి పైకిదీసి ఎర్రదీపమున కెదురుగా పట్టుకొని పరీక్షించుచుండవలయును.

ఇట్లు పరీక్షించునపుడు హెచ్చువెలుతురు గల ఆకాశము, తెల్లనిబట్టలు మొదలగు భాగములకుండా దీపము కనబడక, నీడనిచ్చు భాగములనుండిమాత్రము అస్పష్టముగా కనబడుటతోడనే, డెవలప్మెంటు పూర్తి కాగలదు. అంత, తొట్టెలోని డెవలపర్ ద్రావకమును పారబోసి మంచినీళ్లు పోయవలయును. రెండుమూడు సారులు నీటితో ప్లేటును కడిగి, పిమ్మట మరియొక తొట్టెయందుంచి అందు ఫిక్సింగుద్రావకముపోసి ఫిక్స్ చేయవలయును. ప్లేటుపై, సమశీతోష్ణముగా నున్నట్టి డెవలపర్ ద్రావకము పోసినపిమ్మట, దానిపై వస్తురూపమగుపడుట ప్రారంభించుటకు 1 నిమిషముకంటె హెచ్చుకాలము పట్టి, అప్పుడైనను హెచ్చువెలుతురుగల భాగములుమాత్రము అస్పష్టముగా నగుపడి, నీడగల భాగములు మిగుల ఆలస్యముగా కనపడుటగాని, అసలు కనపడకుండుటగాని జరిగినచో, ప్లేటునకు ఎక్స్పోజరు చాలియుండలేదని తెలుసుకొనవలయును. ఎక్స్పోజరు చాలనట్టి ప్లేట్లను డెవలప్మెంటునందు సరిచేసుకొనుట కంతయవకాశ ముండనేరదు. ప్లేటునకు ఎక్స్పోజరు చాలనటులు తోచినవెంటనే, తొట్టెలోని డెవలపర్ ద్రావకము నొక గ్లాసులో పోసి దానికి మారుగా మంచి నీళ్లు తొట్టెలో పోయవలయును. పిమ్మట, గ్లాసులో పోసినట్టి డెవలపర్ ద్రావకమునందు, ఆ ద్రావక మెంత గలదో అంతమంచినీళ్లు చేర్చి, తొట్టెలో పోసిననీళ్లు తీసివైచి, యీనీళ్లు కలిపిన డెవలపర్ ద్రావకము తిరిగి పోసి, ప్లేటుపై నీడగలభాగము లగుపడువరకు డెవలప్మెంటు చేయవలయును. నీళ్లు కలుపుటవలన డెవలపర్ ద్రావకముయొక్క శక్తి తగ్గునుగాన, డెవలప్మెంటు పూర్తియగుటకు హెచ్చుకాలము పట్టును.

ప్లేటుపై డెవలపర్ ద్రావకము పోసిన ఒకనిమిషములోపలనే రూపమగుపడుటకు ప్రారంభించి, అతి వేగముగా ప్లేటంతయు నల్లబడిపోయినచో, ఎక్స్పోజరు హెచ్చైనటులు తెలుసుకొనవలయును. ఆవెంటనే తొట్టెలోని డెవలపర్ ద్రావకమును గ్లాసులో పోసి, దానికి బదులుగా ప్లేటుపై 1-వ నెం. ద్రావకముమాత్రము పోసి కొంతవరకు డెవలప్ చేసి, పిమ్మట ప్లేటును తొట్టెలో నుండి పైకిదీసి, ఎర్రదీపమున కెదురుగా పట్టుకొని పరీక్షించుచు, హెచ్చువెలుతురుగల భాగములగుండా దీపమగుపడనంతవరకు ఉంచి, పిమ్మట గ్లాసులో పోసి యుంచినట్టి డెవలపర్ ద్రావకమును తిరిగి తొట్టెలో

పోసి, మరికొంతకాలము డెవలప్ చేసి, పిమ్మట ప్లేటును కడిగి ఫిక్సుచేయవలయును.

ఎక్స్‌పోజరు కాలపరిమితియందు హెచ్చుతగ్గు లుండినను, ప్లేట్లు సరిగా డెవలప్ కానేరవు. ఎక్స్‌పోజరు తేడాలవలన చెడిపోయినట్టి ప్లేట్లను తృప్తికరముగా సరిచేయుట యసంభవము. ఎక్స్‌పోజు చేయబడిన ప్లేట్లను డెవలపర్ ద్రావకమునం దెంతకాలమునుంచి పిమ్మట వెలుపలకు దీసి కడిగి ఫిక్సుచేయవలయునో, నిర్ధారణగా చెప్పుట యసంభవము. సాధారణముగా తక్కువ వేగముగల ప్లేట్లకంటె, హెచ్చువేగముగల ప్లేట్లు, డెవలప్‌మెంటు పూర్తియగుటకు హెచ్చుకాలము పట్టును.

ఈ క్రిందిపట్టికయందు, సరియగు ఎక్స్‌పోజరు యివ్వబడినట్టి ప్లేట్లను పైరో డెవలపరుతో పూర్తిగా డెవలపుచేయుటకు పట్టుకాలము తెలుపబడినది.

| ప్లేటుయొక్క పేరు | వేగము HJD | డెవలపర్ యొక్క శీతోష్ణస్థితి (Temperature) 50F డిగ్రీలు | 60F డిగ్రీలు | 70F డిగ్రీలు | రిమార్కు |
|---|---|---|---|---|---|
| | | ఎక్స్‌పోజు చేయబడినట్టి ప్లేటును డెవలప్‌మెంటు చేయవలసిన కాలము (నిమిషములు) | | | సాధారణముగా సీసాలలో నిల్వయుండు డెవలపర్ ద్రావకముయొక్క శీతోష్ణస్థితి వేసవికాలమునందు 70 డిగ్రీలును శీతకాలమునందు 60 డిగ్రీలును ఉండును |
| ఇల్‌ఫర్డు ఆర్డినరీ | 70 | $4\frac{1}{4}$ | $2\frac{3}{4}$ | 2 | |
| ఇల్‌ఫర్డు ఎమ్‌ప్రస్ | 100 | $4\frac{3}{4}$ | 3 | $2\frac{1}{2}$ | |
| ఇల్‌ఫర్డు స్పెషల్ ర్యాపిడ్ | 270 | $5\frac{3}{4}$ | $3\frac{3}{4}$ | $2\frac{3}{4}$ | |
| ఇల్‌ఫర్డు ఇసోజెనెత్ | 700 | $6\frac{1}{2}$ | $4\frac{1}{4}$ | 3 | |

## ప్లేటుయొక్క ఫిలిమును గట్టిపరచుట

డెవలప్‌మెంటు పూర్తి యగుటతోడనే తొట్టెలోని డెవలపర్ ద్రావకమును పారబోసి, ప్లేటును మంచి నీటితో 2, 3 సార్లు కడిగి పిమ్మట వేరొక తొట్టెయందుంచి దానిపై $3\frac{1}{2}$ అవున్సుల మంచినీటిలో $\frac{1}{2}$ అవున్సు పటికపొడిని కరగించిన ద్రావకమును పోసి సుమారు 5,6 నిమిషములవరకు అందుంచవలయును. పిమ్మట ఆపటిక ద్రావకమును పారబోసి, తిరిగి మంచినీటితో 2,3 సార్లు కడిగి ఫిక్సుచేయవలయును. డెవలప్‌మెంటు కాగానే ప్లేటును పటిక ద్రావకమునం దుంచుటవలన దానిపై పూతపెట్టబడినట్టి ఫిలిమ్ గట్టిపడి నీటిలో కరగిపోకుండ నుండగలదు. వేసవి కాలమునందు ముఖ్యముగా ప్లేట్లయొక్క ఫిలిములను గట్టిపరచినపిమ్మటగాని ఫిక్సు చేయరాదు.

## ఫిక్సుచేయుట

ప్లేట్లను రూపము నాకర్షించుశక్తిని కలుగజేయుటకు వాటికిపైగు పూతపెట్టబడు ననియు వెలుతురు తగులనంతవరకు వాటికిరూపము నాకర్షించుశక్తియుండు ననియు, ఎక్స్‌పోజు చేయబడినపిమ్మట ప్లేటుపైరూపు కనుపడ నేరదనియు లోగడ చెప్పియుంటిమి. ప్లేటుపై అది ఆకర్షించినట్టి రూపము మన కగుపడునట్లు చేయుటకు డెవలప్‌మెంటు చేయవలయుననియు గూడ తెలుపబడినది. కాని, డెవలప్‌మెంటుతో మాత్రము పని పూర్తి కానేరదు. డెవలప్‌మెంటు చేసినపిమ్మట మన కగపడునట్టి రూపము అదృశ్యము కాకుండ ప్లేటుపై నిలకడగా ఉండునటులు చేయుటకుగాను డెవలప్‌మెంటు పూర్తి కాగానే ప్లేటును హైపో ద్రావకమునందు ఫిక్సుచేయవలసి యుండును. డెవలప్‌మెంటు పూర్తి యగుటతోడనే ప్లేటును కడిగి దాని ఫిలిమును పటిక ద్రావకమునందు గట్టిపరచి పిమ్మట యీక్రింది ఫిక్సింగు ద్రావకమునందు 5 మొదలు 10 నిమిషములవరకు ఉంచి పిమ్మట 10, 12 సార్లు ధారగాపడు నీటితో బాగుగా కడిగి నీడలో ఆరబెట్టవలయును. డెవలప్‌మెంటు చేయబడిన ప్లేటును ఫిక్సుచేసినపిమ్మటగాని వెలుతురులోనికి తీసుకొని రాకూడదు.

## ఫిక్సింగు ద్రావకము

| | |
|---|---|
| హైపో (Hypo) | 8 అవున్సులు |
| మంచినీరు | 20 అవున్సులు |

ఈఫిక్సింగు ద్రావకమును పోయుటకు ప్రత్యేకపు తొట్టె యుంచుకొనవలయును. ఫిక్సుచేయుతొట్టెయందు డెవలప్ మెంటువగైరా పనులేవియు చేయరాదు. హైపో ఎంతమాత్రమును డెవలపర్ ద్రావకమునకు గాని ప్లేటునకు గాని ఫిక్సింగుచేయుటకుపూర్వము తగులకుండు లాగున జాగ్రత్తగా చూచుకొనవలయును. లేనిచో ప్లేటు తప్పక చెడిపోవును. హైపో ముట్టుకొనిన ప్రతి పర్యాయము చేతులు కడుగుకొనుచుండవలెను. హైపోద్రావక మెంత కాలమైనను చెడిపోక నిల్వయుండ గలదు. ఒకమారు తొట్టెలో పోసిన ద్రావకమునందు 7, 8 ప్లేటులవరకు ఫిక్సుచేయవచ్చును.

ఫిక్సుచేయబడిన ప్లేటు తడిలేకుండ పూర్తిగా ఆరినపిమ్మట వెలుతురులో దానిని పరీక్షించితిమేని యిగా క్రిందిపటమునందువలె తెల్లనిభాగములు నల్లగను, నల్లని భాగములు తెల్లగను యుండును. అందుచే దానికి నెగటివ్ (Negative) అని పేరు పెట్టబడినది. ఈనెగటివ్ నుండి ప్రత్యేకపుకాగితములపై సహజరూపముగల చిత్రపునకలుల నెన్నిటినైనను దీయవచ్చును. నెగటివులనుండి కాగితములపై చిత్రములను దీయుక్రమము ముందు దెలుపబడును.

సరియగనట్టియు, హెచ్చుతక్కువైనట్టియు, డెవలప్ మెంటు చేయబడిన నెగిటివుల రూపములను దెలుపు చిత్రము.



A B C

A. హెచ్చు డెవలప్ మెంటు చేయబడిన నెగిటివ్.

B సరియగు డెవలప్ మెంటు చేయబడిన నెగిటివ్.

C. తక్కువ డెవలప్ మెంటు చేయబడిన నెగిటివ్.

## ఇతర డెవలపరులు

డెవలప్ మెంటుచేయువిధము కొంచె మెచ్చు తగ్గుగా సమానముగ నుండినను డెవలపరులందుమాత్ర మనేక రకములు గలవు. ఈక్రింద కొన్ని ముఖ్యములగు డెవలపరులను తయారుచేయువిధములును, వాటినుపయోగించుమార్గములును దెలుపబడినవి.

## మెటోల్ హైడ్రోక్వినన్ డెవలపర్

| | |
|---|---|
| మెటోల్ - Metol | 20 గ్రయినులు |
| హైడ్రోక్వినన్ - Hydroquinone | 60 గ్రయినులు |
| సోడా సల్ఫైట్ - Soda Sulphite (పలుకులు) | 700 గ్రయినులు |
| సోడా కార్బొనేట్ - Soda Carbonate (పలుకులు) | 700 గ్రయినులు |
| పోటాసియంబ్రొమైడ్ Potassium Bromide | 6 గ్రయినులు |
| మంచినీరు - Cold Water | 20 అవున్సులు |

నీటియందు పై పదార్థముల నన్నిటిని వరుసవెంబడికరగించి, (ఒకటి పూర్తిగా కరగినపిమ్మట మరియొకటి చొప్పున) గాలి చొరకుండునట్టులు సీసాలలో పోసి కార్కు బిగించి యుంచుకొనినచో నెంతకాలమైనను చెడిపోక నిల్వయుండును. ప్లేట్లను డెవలప్ చేయుటకు 1 భాగము పైద్రావకమునందు 1 భాగము మంచినీళ్లుకలిపి వాడుకొనవలయును. ఈడెవలపర్ తో ఎక్స్పోజరు తేడాలను డెవలప్ మెంటునందు సరిచేసుకొనుట

కంతె అవకాశ ముండనేరదు. పైరోకంబె దీనితో డెవలప్ చేయుటకు కొంచెము హెచ్చుకాలము పట్టును.

## ఎజాల్ (Azol)

ఇది ద్రవరూపమున నుండు పేటెంటు డెవలపర్. ఇందితరపదార్థము లేవియు జేర్చ నవసర ముండదు. నూతనముగా తేజోలేఖనము నభ్యసించువారల కీ డెవలపర్ మిక్కిలి తృప్తికరముగా పనిచేయును. దీనితో ప్లేట్లను డెవలప్ చేయుటకు 1 ఔన్సు నీటిలో 20 చుక్కలుచొప్పున కలిపిన చాలును.

ప్లేటుపై యీ ఎజాల్ ద్రావకము పోయుటతోడనే రూపు మగపడుటకు ప్రారంభించి క్రమముగా 3,4 నిమిషములకు డెవలప్మెంటు పూర్తికాగలదు. ప్లేటుయొక్క వెనుకభాగమును (మందుపూత లేనట్టివైపు) ఎఱ్ఱదీపపువెలుతురులో పరీక్షించినపుడు వస్తురూపము పూర్తిగా గోచరించునరకు, ప్లేటును డెవలపరం దుంచవలసియుండును.

ప్లేటునకు ఎక్స్పోజరు చాలదని తోచినపుడు 1 ఔన్సు నీటిలో 15 చుక్కలు చొప్పున మాత్రమే ఎజాల్ చేర్చి డెవలప్ చేయవలెను. ఇట్లు చేయుటవలన డెవలప్మెంటు పూర్తియగుటకు కొంచెము హెచ్చుకాలము పట్టును.

ఎక్స్పోజరు హెచ్చైనచో 1 అవున్సు నీటికి 30 చుక్కలుచొప్పున కలుపవలయును. నీటితో కలిపిన ప్రతి ఔన్సు డెవలపర్ ద్రావకమునకు 10 చుక్కలుచొప్పున 10°/° పొటాసియం బ్రొమైడ్ ద్రావకము డెవలప్మెంటు చేయబోవునపుడు జేర్చవలసియుండును. 10°/° పొటాసియం బ్రొమైడ్ ద్రావకము నీ క్రిందివిధముగా తయారుచేసియుంచుకొనవలెను.

| | |
|---|---|
| పొటాసియం బ్రొమైడ్ (Potassium romid:) | ½ అవున్సు |
| మంచినీరు | 5 అవున్సులు |

ఈ క్రింది పట్టికయందు 1 అవున్సునీటికి 20 చుక్కలుచొప్పున కలిపినట్టి ఎజాల్ డెవలపర్ ద్రావకముతో డెవలప్మెంటుచేయుటకుపట్టు సరియగు కాలము దెలుపబడియున్నది. దీని ననుసరించి డెవలప్మెంటు చేసినచో వ్యత్యాసములురాక తృప్తికరమగు నెగెటివు లెల్లప్పుడు లభ్యము కాగలవు.

| ప్లేటుయొక్క పేరు | వేగము H J D | డెవలపర్ యొక్క శీతోష్ణస్థితి (Temperature) 50 డిగ్రీలు | 60 డిగ్రీలు | 70 డిగ్రీలు | రిమార్కు |
|---|---|---|---|---|---|
| | | డెవలప్ మెంటు చేయవలసిన కాలము (నిమిషములు) | | | డెవలపర్ యొక్క సరియగు శీతోష్ణస్థితి థర్మామిటర్తో కొలిచి చూచుకొనుట మంచిది. |
| ఇల్ఫర్డు ఆర్డినరీ | 70 | 6 | 4½ | 3 | |
| ఇల్ఫర్డు ఎక్స్ప్రెస్ | 100 | 9 | 6½ | 4½ | |
| ఇల్ఫర్డు స్పెషల్ ర్యాపిడ్ | 270 | '4 | 8 | 6½ | |
| ఇల్ఫర్డు ఇసోజెనెల్ | 700 | 16 | 10 | 8½ | |

## రైటోల్ (Rytol)

ఇది బరోస్ వెల్కం కంపెనీవారిచే చేయబడినట్టి బిళ్లలుగానుండుపేటెంటు డెవలపర్. ప్రయాణములందు వాడుకచేయుటకు మిక్కిలి అనుకూలముగా నుండును. ప్రపంచమునందంతటను ప్రఖ్యాతినహించిన గొప్ప తేజోలేఖకులచేగూడ వాడుకచేయబడుచున్నది.

ఈ డెవలపర్ రెండు వేరువేరుబుడ్లలో నింపబడినట్టి బిళ్లలుగానుండును. 4 అవున్సులనీటియందు రెండు బుడ్లనుండియు ఒక్కొక్కబిళ్లచొప్పున కరగించినచో డెవలపర్ ద్రావకము తయారుకాగలదు. ఈ డెవలపర్తో సామాన్యవేగముగల ప్లేట్లను డెవలప్చేయుటకు 4, 5 నిమిషములు పట్టును. హెచ్చువేగముగల ప్లేట్లకుమాత్రము 8 నిమిషములు పట్టును.

ఎజాల్, రైటోల్, రోడినల్, మొదలగుపేటెంటు డెవలపర్ బుడ్లపై వాటినుపయోగించు విధము వివరముగ తెలుపబడియుండును. (సశేషము)

# *బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయశాస్త్రులవారి నిర్యాణము

అల్లమరాజు రామకృష్ణయ్య గారు

ఆదికావ్యం బాది యాభాష్యపర్యంత, మర్థులన్ దీర్ప సమర్థుఁ డెవ్వఁ
డాంగ్లేయపారశా లాంధ్రోపదేష్టయై, యధికారగౌరవం బందె నెవ్వఁ
డాంధ్రగీర్వాణంబులం దద్వితీయుఁడం, చని పండితులమెప్పు గొనియె నెవ్వఁ
డరయ శ్రీమత్పీఠపురమహారాజాజ్ఞ, భాష్యంబునకుఁ డీక వ్రాసె నెవ్వఁ
డట్టి శ్రీమత్పురాణపండాన్వయాంబు, జాకరాదిత్యుఁ డగు మల్లయాఖ్యశాస్త్రి
తనదుకీర్తిని ఇట నింపి తనివిఁ గొనక, నాకమున నింప నట కేగినాఁడు నేఁడు.

సీ. ఏపండితుఁడు పీఠకాపురాధీశ్వరు, నాస్థానపండితుం డగుచు మించె
నేసూరి యాజ్ఞేనియిచ్చచే భద్రాపరిణయంబునకును టిప్పణి రచించె
నేశాస్త్రి సంస్కృతంబౌ శుక్రనీతిని, దేటతెల్లముగ నాంధ్రీకరించె
నేదేష్ట నిర్మత్సరాదిసత్త్వగుణప్రధానుఁడై సజ్జనాదరణఁ గాంచె
నట్టి శ్రీమత్పురాణపండాన్వయాంబు, జాకరాదిత్యుఁ డగుమల్లయాఖ్యశాస్త్రి
తనదుకీర్తిని ఇట నింపి తనివిఁగొనక, నాకమున నింప నట కేగినాఁడు నేఁడు.

మ. ధరలోఁ గ్రోధనవత్సరాశ్వీజ సితాంతర్భోధనైకాదశీ
వరపుణ్యాహమునన్, సువిద్యయను దివ్యజ్యోతినిం గొంచు, శ్రీ
హరినింజేరఁ బురాణపండకులజుం డామల్లయార్యుండు సు
స్థిరచిత్తంబున నాహరిన్ నిలిపి వాసె న్మని నీలోకమున్.

గీ. స్వర్గమున కొన్నినాళ్లు మాశాస్త్రినిలిచి, స్వస్థత సుఖించి శాశ్వతస్థాయి యైన
బ్రహ్మపదమంది తన్మయత్వంబునొంద, నిగ్రహించుత మీశ్వరానుగ్రహమున.



* శ్రీశాస్త్రుగారి ఛాయాచిత్రము ఈసంచికయందు వేఱొకచో ముద్రితమైనది.

చెన్నరాజధానియందు 1924సం. అక్టోబరు మొదలుడిసెంబరువఱకుముద్రితములై ప్రచురింపబడిన

# ఆంధ్రగ్రంథముల పట్టిక

## పద్యకావ్యము—పురాణములు

ఆంధ్రసంగ్రహ రామాయణము
కుచేలోపాఖ్యానము
గజేంద్రమోక్షణము
ప్రహ్లాదచరిత్రము
రుక్మిణీకల్యాణము

## పద్యకావ్యము—శతకములు

అష్టోత్తరజానకీపతిశతకము—శృంగారం అయ్యవార్యులు
ఎల్లమంచకోటేశ్వరశతకము—ఎ. పిచ్చయ్యశర్మ
కృష్ణశతకము—నరసింహకవి
జంటనారాయణశతకము—ఎ. క్రిష్ణస్వామి
జగదీశశతకము—త్యాడి సన్నాసినారాయణ
జీడికంటిరామశతకము—కె. నరసయ్య
దాశరథీశతకము
నారాయణశతకము
నృసింహశతకము—శేషప్ప
ప్రొద్దుటూరు శ్రీహనుమచ్ఛతకము
రామచంద్రప్రభుశతకము—కె. రామచంద్రరాజు
బాలశతకము—యం. వెంకటరత్నకవి
భక్తసంరక్షకశతకము—జి. హనుమంతరాయశాస్త్రి
భర్తృహరిసుభాషిత నీతిశతకము
భీమలింగేశ్వరశతకము—వరదకవి
మాధవశతకము—ఇనగంటి పున్నయ్యచౌదరి
రామరామశతకము—తోట వెంకటనరసింహదాసు
శ్రీకాళహస్తీశ్వరశతకము—ధూర్జటికవి
శ్రీరామచంద్రశతకము
సీతాలోలశతకము—పి. రాఘవరాయశర్మ
సుమతిశతకము
హనుమచ్ఛతకము—డి. వెంకటనరసింహాచార్య
హరిశతకము—త్యాడి వెంకటశాస్త్రి

## పద్యకావ్యము—స్తోత్రము

కాంత—కె. కోదండరామయ్య
బాలాత్రిపురసుందరీతారావళి—శ్రీపతి త్రియంబకరావు
భద్రాద్రిసీతారామతారావళి—కె. యల్లమందరాజు
మహామారీస్తోత్రము
ముకుందమాల—తెలుగు
ముకుందమాల-టీక
శివభజన గురుభజన కందార్థ సీసార్థములు—పండితస్వామి పండితారాధ్యులు
శ్రీకన్యకాపరమేశ్వరీ స్తోత్రము — కోనికేపూడి ఉమామహేశ్వరమ్మ
శ్రీదుర్గా సప్తశతీ స్తవరత్నమ్
శ్రీబాలా త్రిపురసుందరీ స్తోత్రము—యస్. సత్యనారాయణశాస్త్రి
శ్రీరామస్తోత్రము—జి. రామమూర్తిశర్మ

## పద్యకావ్యము — ఛందస్సు

లక్ష్మీపతిసోమయాజీయము—శ్రీపాద శివరామసిద్ధాంతి

## పద్యకావ్యము - ఇతరములు

ఆంజనేయదండకము—టి. వెంకటాచలదాసు
ఆంజనేయదండకము
ఆంజనేయదండకము, సూర్యనారాయణదండకము, అమ్మవారి దండకము
ఉన్మాదిసహస్రము—కొత్తపల్లి సూర్యారావు
కమ్మకులాభ్యుదయము—యన్. వెంకటప్పయ్య
కలికాలమహిమ
కావ్యకుసుమావళి—వేంకటపార్వతీశ్వరకవులు
కృష్ణలీలామృతము—యం. కామాక్షయ్య
కోయిలపాటలు—మంగిపూడి పురుషోత్తమశర్మ
చాటుపద్య శ్రవణానందము
చీట్లపేక చిద్విలాసం—వి. యస్. యస్. ఎ. ఆచారి
జనకస్మృతి—పూరెలపట్టు శ్రీరాములురెడ్డి
తత్త్వరత్నపంచకము—బి. లక్ష్మయ్య

పౌండరీకము—ఎ. ప్రభాకరకవి
భగవన్మానసపూజావిధానము—కేతరాజు సీతాబాయమ్మ
భారతసావిత్రి [కృష్ణశాస్త్రి
రత్నపంచకము—ఎ. సుబ్రహ్మణ్యశాస్త్రి, జి. రామ
లుబ్ధగనావస్థ అను వేశ్యాసహవాస ఫలితము
వెండిగిన్నె—పేరాల లింగరాజు
శౌరిచతుఃపంచాశత్ స్తోత్రమాలిక—జి. సీతారామచార్యులు
హనుమద్దండకము, రాగతాళమాలాతరంగిణి—జి. హనుమంత
రాయశాస్త్రి

## వచనకావ్యము—కథలు

అద్భుతకథాలతిక, కామమంజరి—ప్రథమభాగము—టి. వెం
కటశాస్త్రి
ఈసప్కథలు అను నీతికథానిధి—పండిత పురాణం సూర్య
నారాయణ తీర్థులు
ఋణబాధ—కోటమర్తి చినరఘుపతిరావు
గుంటూరురవ్వ—బద్దిరెడ్డి వెంకటరావు
పువ్వులగంప
ప్రేమలత—కేతవరపు వెంకటశాస్త్రి
భక్తవిజయ మను పతివ్రతాచరిత్రలు
మహాకవి కాళిదాసచరిత్రము
వల్లీమల్లి—యం. సుబ్బారాయశాస్త్రి
వట్టివెంగళప్ప—అయ్యగారి వీరభద్రరావు
సరసం మరిగిన సంగీతం—గాడేపల్లి సూర్యనారాయణశర్మ

## వచనకావ్యము—నవల

పద్మమాలి—నేమాని వెంకటనరసింహశాస్త్రి
పరిణయరహస్యము—కేతవరపు వెంకటశాస్త్రి
రమాబాయి—పండిత పురాణం సూర్యనారాయణతీర్థులు

## వచనకావ్యము—చరిత్ర

దేవరకోటసంస్థానచరిత్ర—దేవులపల్లి వెంకట శోభనాచల
పోతనవేమనలయుగము—దిగవల్లి వెంకటశివరావు [పతి
హిందూదేశచరిత్రము—కొల్లూరు జగన్నాథము
హిందూదేశచరిత్రము—టి. వి. వల్లప్పశాస్త్రి

## వచనకావ్యము—జీవితము

సాధుసుందరసింగు—ఆర్. యస్. రత్నం

## వచనకావ్యము—రాజకీయము

మహాత్మునిమహోపవాసదీక్ష, ఢిల్లీలో జరిగిన నాయకుల
సభ

## వచనకావ్యము—ఇతరములు

అంతాగమ్మత్తువెట్టి—అయ్యగారి వీరభద్రరావు
అనుబంధగళబంధము [సము
ఆంధ్రమహాశాసభ—ఆహ్వానసంఘాధ్యక్షురాలి యుపన్యా
ఆచమనవిధానము
ఆరోగ్యసూత్రములు, ఋతువులు—గరిమెళ్ల సోమన్న
ఆర్యవైశ్యమహాసభ, గుంటూరు—ఆహ్వానసంఘాధ్యక్షుని
ఉపన్యాసము
కోడంద్రడ కుతూహలము, అత్తలఅంగలార్పు—జె. స్వామి
గుంటూరుమండల ప్రథమవైశ్యమహాసభ [నాధయ్య
గుప్త పురాణబోధిని—పి. సాంబశివరావు
గురులీల
చోరసంవాదమ్
జంతుహింసపాపముకబీయగోరక్షణ—గుండాలవీరాస్వామి
జానకీదేవి
తెలుగు పెట్టెబుక్కు— [అరవం)
నాలుగుభాషలనిఘంటు (తెలుగు, హిందీ, ఇంగ్లీషు,
నైష్ఠికోపకుర్వాణేతర బ్రహ్మచర్యాశౌచనిషయము
పాండవకాలనిర్ణయము
పాఠశాలాపపాఠబోధిని—రివరెండ్ జి. నాథనీల్
పూజారామాయణము—టి. శ్రీనివాసభట్టాచార్యులు
ఫార్వర్డుపంచాయతీసభయందు జరిగిన విషయములు
బాలబోధ
మరణము—భువర్లోకము—మంత్రిప్రెగడనరసింహంపంతులు
మూడవతరగతిపుస్తకము
యవనునకు సుబుద్ధియను నవరత్నమాల—యం. వెంకటప్ప
రామకోటి
రామాయణసారము—డి. సీతారామరావు
విద్యామాలిక 1, 6 పుస్తకము
విశ్వబ్రాహ్మణశబ్దార్థఖండనముండనము [రావు
శాస్త్రవాచకపాఠములు, నాల్గవ తరగతి—యం. సాంబశివ
శ్రీకృష్ణమతసిద్ధాంతము

శ్రీరామచంద్రమూర్తి—జనమంచి సీతారామస్వామి
శ్రీహరిపాదవైభవము
సరస్వతీవాచకము (ఐదవతరగతి) గద్యపద్యములటిప్పణం
సహకారబాలశిక్ష
సావిత్రి—నేమాని వెంకటనరసింహశాస్త్రి
సోమనాధశాస్త్రి నిర్యాణము—వి. రామసుబ్బారాయుడు
హిందూస్థాన్ అస్యూరెన్సు అండు మ్యూచ్యుయల్ బెనిఫిట్ సొసయిటీ లిమిటెడ్

## నాటకములు

అభినవ హరిశ్చంద్రీయము—యం. హనుమయ్య
అహల్యాశాపవిమోచనము—పప్పు మల్లికార్జునరావు
ఆరోగ్యము—కె. హెచ్. వి. యస్. నారాయణ
కృష్ణలీల—చక్రావధానుల మాణిక్యశర్మ
చింతామణి— ,,
చిత్రశాకుంతలము—యన్. రామకవి
జయంతజయపాలము—ఆకెళ్ల సత్యనారాయణ
తులసీనాటకము—యం. కోటేశ్వరకవి
పద్మవ్యూహము—చక్రావధానుల మాణిక్యశర్మ
పాంచాలీస్వయంవరము—డి. కృష్ణమాచార్లు
పాండవజననము—రామనారాయణ కవులు
పాండవప్రవాసము— ,,
పాండవోద్యోగము— ,,
ప్రహ్లాదనాటకము—డి. కృష్ణమాచార్లు
భీష్మప్రతిజ్ఞ—అవసరాల శేషగిరిరావు
మహాభారతనాటకము—సంపన్మూడుంబ సింగరాచార్యులు
ముద్రిక—పానుగంటి లక్ష్మీనరసింహారావు
రాణాప్రతాపసింగు—సత్యనారాయణశాస్త్రి
రామచంద్రదేవపట్టాభిషేకము—సెట్టి లక్ష్మీనరసింహము
రామాయణసార నాటకము—యం. నారాయణ రాజు, కె. సీతారామరాజు
రుక్మిణీపరిణయము—గంధం సీతాపతిశర్మ
విచిత్రచిత్రమాల—అయినాపురపు సోమేశ్వరరావు
శారదావిజయము—కొండాలి సత్యనారాయణరావు
శిశుపాలవిజయము—దూర్వాసుల వరాహనరసింహము
సంగీత అదృష్టవిజయము—పి. బుచ్చిరాజు [య్య
సంగీత జయంతజయపాలము—ద్రోణంరాజు సీతారామ
సంగీత రావణనాటకము—చక్రావధానుల మాణిక్యశర్మ
సంపూర్ణరామాయణము—కొండాలి సత్యనారాయణరావు
సంపూర్ణరామాయణము—జి. కోటీశ్వరరావు
సంపూర్ణరామాయణము—చక్రావధానుల మాణిక్యశర్మ
సతీఅనసూయ—అయినాపురపు సోమేశ్వరరావు
సారంగధరనాటకము—విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యేశ్వరశాస్త్రి
సీతాపహరణము—కోకా వెంకటసుబ్బారావు
స్త్రీసాహసము—డి. సీతారామరావు
హరిశ్చంద్రనాటకము—యన్. వెంకటప్పయ్య

## ప్రహసనములు

కనకాంగి
తినియింట్లోయేడు—మల్లాది నాగభూషణము
త్రాగుడుతమాషా
పార్శిలలితాంగి నాటకడ్రామా—వి. కన్నయ్యదాసు
బలేతమాషా—ఎ. కామేశ్వరరావు
మెరకవీథి మేఘావతి—కె. వెంకటనారాయణాచార్యులు
హాస్యకలియుగసరస—ఎ. ఎన్. రావు

## జ్యోతిషము

అర్ఘప్రదర్శిని
ఏకాదశీనిర్ణయము
పూర్వకాలామృతము
ఫలప్రదర్శిని
భవిష్యత్—సి. లక్ష్మీనరసింహము

## గణితము

అతిస్పష్టమైన అంకగణితము—యం. యస్. హెచ్. థాంప్సన్
అనుభవపద్ధతి బాలబోధగణితము 3-వ పుస్తకము—యం. శ్యామయ్యర్
ఆంధ్రసంగ్రహరామాయణము—కె. లక్ష్మీనారాయణయ్య
భారతరత్నము—చిన్నకోట వెంకటరత్నశర్మ

## వైద్యము

నాడీజ్ఞానం—జి. నాగభూషణరావు
నాడీనిదానము
ముఖ్యమైన ఖరీవిద్య—డి. వెంకటాచలపతిశర్మ
రక్తప్రక్షాళనచికిత్స—యం. యస్. మల్లికార్జునరావు

రోగులపరిచర్యాధర్మము
సర్వౌషధిపదార్థదర్పణము ఓషధిరత్నాకరము
సుఖరోగచికిత్సాసంగ్రహము—బి. గురులింగదేవర

## క్రైస్తవమతము

అర్చ్యప్రేమగారి చరిత్రము
ఉపాధ్యాయుల పాఠపుస్తకము—యం. అర్నెట్
జేసుదివ్యహృదయమందలి భక్తి—సర్ జాన్ మేరి
యోహాను వ్రాసిన సువార్తప్రసంగపాఠపుస్తకము—మిస్. యేయి. సాన్ఫర్డు

## వేదాంతము

బ్రహ్మవిద్య—యం. వెంకటకృష్ణశర్మ
భగవద్గీతపరమార్థచంద్రికా సహితము
మానసకల్పనవనీతము
సాంఖ్యపంచీకరణము—బి. రామసింహము

## నీతి

బాలనీతిరత్నావళి—చాగంటి వీరభద్రకవి

## కల్పము

వినాయకవ్రతకల్పము

## మాహాత్మ్యము

గయామాహాత్మ్యసంగ్రహము—ఆర్. పూర్ణేశ్వరశర్మ
చిత్రాజులు అనుకొండదేవునిమాహాత్మ్యము—టి. రాజన్న
తిరుపతి తిరుమల దివ్యక్షేత్ర మాహాత్మ్యము
పద్మావతీ శ్రీవెంకటేశ్వర క్షేత్ర మాహాత్మ్యము
మల్లికార్జున మాహాత్మ్యము—సి. హెచ్. పి. మృత్యుంజయరావు
వెంకటాచల మాహాత్మ్యము—తరిగొండ వెంకమాంబ

## ఇతిహాసము

వాల్మీకిరామాయణము, చతుర్థసంపుటము

## ప్రకృతిశాస్త్రము

ప్రాథమిక ప్రకృతిశాస్త్రము—జె. విశ్వనాథయ్య
ప్రాథమిక ప్రకృతిశాస్త్రము—రెండవ భాగము
ప్రాథమిక ప్రకృతిశాస్త్రము—మూడవ భాగము

## లా

ఇండియన్ పీనల్ కోడ్
తెలుగు సివిల్ రూల్సు ఆఫ్ ప్రాక్టీసు
సివిల్ క్రిమినల్ రివిన్యూ వ్యవహార మతలబు

## సంగీతము - హరికథ

కబీరుదాసు చరిత్రము—బాబు పి. యస్. నాసర్ వంజి
తిరుమంగయాళ్వారుల చరిత్రము—బి. రాఘవాచార్యులు
శ్రీరామజననము—బాలు పి. యస్. నాసర్ వంజి

## సంగీతము - గేయము

అధ్యాత్మరామాయణకీర్తనలు—సుబ్రహ్మణ్యకవి
ఊర్మిళాదేవినిద్ర
కుశలవుల యుద్ధము
గోమా త్రైను అత్తవారింటికి పంపెడుపాట
క్రైస్తవగానామృతభజనతరంగములు—మంగం ఈశయ్య
ఘూలిసుబ్బారావుపాటలు—ఘూలి సుబ్బారావు
తిరుపతిమాహాత్మ్యవిన్నపములు—కె. సుదర్శనదాసు
దసరా పద్యములు
పండరీపుర పాండురంగ భజనకీర్తనలు—కె. సుదర్శనదాసు
పరమాత్మబోధిని—వి. భుజంగరావు
పాండురంగ నక్షత్రమాలిక—కె. సుదర్శనదాసు
పారిజాతపల్లవి　　[శివరావు
ప్రమీలార్జునీయనాటకముయొక్క కీర్తనలు—వి. సదా
భజనకీర్తనలు
భజనగీతమంజరి—జి. హనుమంతరాయశాస్త్రి
భీమలింగాష్టోత్తర శతపదస్తోత్రములు—యు. లక్ష్మీనారా
మంగళహారతులు—బి. రాఘవాచార్యులు　　[యణకవి
లంకాయాగము
వెంకటేశ్వరకల్యాణము—పి. యస్. శర్మ
శ్రీరామనంశములు
సీతాకల్యాణము—కె. వెంకటనారాయణాచార్యులు
హరిభజనకీర్తనలు—జి. హనుమంతరాయదాసు

## ఇతరములు

ప్రారంభభూగోళము
చెంగల్పట్టుజిల్లా—కె. దొరస్వామిఅయ్యంగార్
ప్రారంభభూగోళము
భూగోళవాచకము—గోదావరిజిల్లా—యి. మార్సడెన్

## ఇతరములు—వ్యాఖ్యలు

ఆనందసంహిత
మరీచి
ఆయుర్వేదౌషధరత్నాకరమ్—శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి
కామకలావిలాసము
తెలుగు టెక్స్టుబుక్కు (టిప్పణము)
మంత్రపుష్పము—ఆత్మూరు లక్ష్మీనరసింహ సోమయాజి
వీరమహిమ (లఘుటీక)
స్కూలు ఫైనలుపరీక్షా టిప్పణి

# ముద్దు

భమిడి వెంకటేశ్వర్లు గారు

సురగణాధీశ దుర్లభసుఖ మొసంగు, నగణితాత్మవ్యధాభార మణచివేయు
భీష్మసదయప్రతాపంబు ప్రిదులసేయు, కోటివరహాల వెల కద్దు బోటిముద్దు.

సీ. కార్యార్థియై యధికారిబిడ్డలచేరి, బుడిబుడి నద్దించు ముద్దు వేరు,
వెలయిచ్చికూడెడు వెలయాలి చెక్కిళ్ల, మురువుమై పొరలించు ముద్దువేరు
చిన్నారిపొన్నారి చిరుతపాపల పాల,బుగ్గల గీలించు ముద్దువేరు
నవసమాగమమందు నవగూడు ప్రియురాలి, ముద్దు చెక్కిలిబెట్టు ముద్దువేరు
గీ. స్వప్నమున దానువలచిన సారసాక్షి, నిద్దపుం జెక్కిలిని బెట్టు ముద్దువేరు
కలవు ముద్దులయం దసంఖ్యాకములుగ, తరగతులు వాని వివరింపదరమె మాకు.

సీ. ప్రణయకోపము పంచబంగాళమైపోవు, నీసడింపులవెల్ల బాసిపోవు
మనసుబింకంబెల్ల మటుమాయమైపోవు, నాత్మగౌరవమెల్ల నడగిపోవు
కోటిరూకలు గవ్వకును సాటిరాకుండు, త్యాజ్యంబుగా దోచు రాజ్యమైన
అవధిచెప్పగరాని యానంద మెసలారు, స్వాంతంబు తన్మయత్వంబు జెందు
గీ. తల్లి దండ్రియు దక్కు బాంధవులు జ్ఞప్తి, దొలగిపోదురు వలచిన పొలతిమిన్న
నిద్దపుంజెక్కిలిని ముద్దు దిద్దువేళ, తత్ప్రభావంబు వివరింప దరమె మాకు.

గీ. కన్నుల కపూర్వమైన చీకటులుగవియు, గాఢముగ మేన వింత మైకంబు గ్రమ్ము
చిత్తమున కేదో యున్మాద మత్తమిల్లు, నతివచెక్కిళ్లు ముద్దిడు నవసరమున.

సీ. కండచక్కెరయందు కలకండమునయందు, గలుగ దీ ముద్దులో గలుగుతీపి
కదళీఫలములందు ఖర్జూరమునయందు, గలుగ దీ ముద్దులో గలుగుతీపి
గోక్షీరములయందు ద్రాక్షాఫలములందు, గలుగ దీ ముద్దులో గలుగుతీపి
అమృతసారమునందు నలరుదేనెలయందు, గలుగ దీ ముద్దులో గలుగుతీపి
గీ. సారమైనట్టి చెరకురసంబునందు, చవులుదేరెడు దివ్యరసాలమందు
కలుగ దీ ముద్దులోపల గలుగుతీపి, ముద్దునకు సాటి లేదెందు భూమియందు.

సీ. గంభీరవారాశికల్లోలమండలం, బంభోజవైరి ముద్దాడుచుండె
అత్యున్నతంబైన యవనీధరానీక, మంభోదపటలి ముద్దాడుచుండె
ఘనమణిస్థగితమా కర్ణావతంస మ, బ్జాక్షిచెక్కిలిని ముద్దాడుచుండె
స్వచ్ఛకాంతిచ్ఛటా సంపత్తి ముంగర యంగనమోవి ముద్దాడుచుండె
గీ. ముద్దులొలికెడు ముంగురుల్ ముద్దుగుమ్మ, యాననాంభోజమల్ల ముద్దాడుచుండె
ముద్దున కచేతనంబులే మురియ నిల్లు, చెప్పనేటికి మనుజునిచిత్తవృత్తి.



శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ గారు

ఆంధ్రమహిళాసభాధ్యక్షురాలు



శ్రీయుత

నోరి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

సంస్కృతసాహిత్యసభాధ్యక్షులు



శ్రీయుత గద్దె రంగయ్యనాయుడు గారు

ఆంధ్రగ్రంథాలయ మహాసభాధ్యక్షులు



శ్రీయుత కావ్యకంఠ గణపతిశాస్త్రులు గారు

అస్పృశ్యతానివారణ మహాసభాధ్యక్షులు



శ్రీయుత సామి వెంకటాచలం శెట్టిగారు

ఆంధ్రమహాసభాధ్యక్షులు

# *బందరు సభల తీర్మానములు

## ౧౨-వ ఆంధ్రమహాజనసభ

[24-10-25]

### ౧

### స్థాయిసంఘము

ఆంధ్రమహాజనసభకు 10 మంది సభ్యులుగ స్థాయి సంఘము నొకదానిని ఏర్పరుచుటకు తీర్మానించడమైనది.

(క) ఆ సంఘమునకు అధ్యక్షుడు, కార్యదర్శి, కోశాధిపతిని ఎన్నుకొనుటకు నిర్ణయించడమైనది.

1. అధ్యక్షులు— శ్రీస్వామి వెంకటాచలం శెట్టి గారు, 2 కార్యదర్శి— దేశభక్త వెంకటప్పయ్య పంతులు, 3. కోశాధిపతి,— దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు, 4. గాడిచర్ల హరిసర్వోత్తమరావు, 5. బులుసు సాంబమూర్తి, 6. శీలం జగన్నాథరావు నాయుడు, 7. కట్టమంచి రామలింగారెడ్డి. 8, నరాల శెట్టి దేవేంద్రుడు, 9. ధన్వాడ రామచంద్రరావు, 10. ఉమ్రా అలీషా సాహేబుగార్లు.

(చ) తెనాలి కోఆపరేటివు బ్యాంకులోనున్న ఆంధ్రమహాజనసభ తాలూకు సొమ్మును మూలధనముగ నుంచి దానిమీదవచ్చెడు వడ్డీని మాత్రమే ఆంధ్రోద్యమాభివృద్ధికి సాధన భూతములగు కార్యములకు వ్యయపరుచుటకై స్థాయిసంఘమున కధికార మిచ్చుటకు తీర్మానించుచున్నారు.

### ౨

ఈ సంఘము రాబోవు ఆంధ్రమహాజనసభ వరకు నధికారములో నుంచుటకు తీర్మానించడమైనది. ఈసంఘములో ఖాళీలు వచ్చేయెడల తదితరులా ఖాళీలను భర్తీ చేసికొనుటకు అధికారమీయడమైనది.

### ౩

### ఆంధ్ర విశ్వవిద్యాలయము

ఆంధ్ర విశ్వవిద్యాలయపు చట్టములో బందరుగాని బెజవాడగాని, గుంటూరుగాని మధ్య ఆంధ్రజిల్లాల యుపయోగార్థము నాలుగవ కేంద్రస్థానముగ చేర్చబడవలయునని ఈసభవారు తీర్మానించుచున్నారు.

### ౪

### కళావంతుల సంఘసంస్కరణము

పవిత్రకర్మభూమి అని పేరుగాంచిన భారతదేశమందు, వ్యభిచారవృత్తికొరకు ప్రత్యేకసంఘము ముండుట దేశమునకు కళంకప్రాయమనియు, అవమానకరమనియు, నీసభవారు నమ్ముచు కళావంతులు తమ సంఘాభివృద్ధి చేయుచున్న కృషికి దేశీయులెల్లరును సహాయపడుచు, వివాహాది శుభకార్యములయందును, ఉత్సవాదులయందును, వేశ్యలను రావింపకుండుటకై యీసభవారు తీర్మానించుచున్నారు.

### ౫

### శుభకార్యములందు ఖద్దరు

ఖద్దరు సర్వజనాదరణీయము గాన దేశీయులను, తాము సర్వదా ధరించుటయేకాక, దేవాలయములందును, గృహములలో జరుగు కార్యములందును గూడ ఖద్దరునే ఉపయోగించవలెనని ఈసభవారు హెచ్చరించుచున్నారు.

### ౬

### కీర్తిశేషుల ప్రస్తావన

ఆంధ్రపుత్రరత్నములు తమ యాంధ్రాభిమానము చేతను, సేవచేతను సుప్రసిద్ధులైన పిట్టి త్యాగరాయశెట్టి గారును, దామెర్ల రామారావుగారును, పురాణపండ మల్లయ్యశాస్త్రి, వడలవాడ సుందరరామశాస్త్రి గారులును

*శ్రీయుత బులుసు సాంబమూర్తిగారు ఆంధ్రరాష్ట్రీయమహాసభాధ్యక్షులు. (వీరిఛాయాచిత్రము భారతి సంపుటము ౧, సంచిక ౫యందు గలదు.) శ్రీయుత దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు ఖద్దరు ప్రదర్శన ప్రారంభకులు, (వీరి ఛాయాచిత్రమును భారతిసంపుటము ౧, సంచిక ౧ యందు గలదు.) తక్కిన సభల అధ్యక్షుల చిత్రము లిందు ముద్రితములైనవి.

కీర్తిశేషులైనందుల కీసభవారు చింతించుచు వారి యాత్మలకు శాంతి నిడుట కీశ్వరుని ప్రార్థించుచున్నారు.

## ౭
## ఇతర రాష్ట్రములందలి యాంధ్రులు

దక్షిణమునను ఇతర ప్రాంతములందును కల యాంధ్రులలో నాంధ్రభాషను వ్యాపింపజేయుటకు ప్రయత్నములు ఈసభయొక్క స్థాయిసంఘమువారు వెంటనే చేయుటకు ఈసభవారు కోరుచున్నారు.

## ౮
## దక్షిణాంధ్ర భాషాభివర్ధనీ సభ

దక్షిణాంధ్ర భాషాభివర్ధనీ సభవారి కార్యక్రమమునకు తోడ్పడవలసి యున్నందున తగిన ప్రచారకులను వారి యధీనమందుంచి పనిచేయవలసినదని యీసభవారు స్థాయిసంఘము వారిని కోరుచున్నారు.

## ౯
## హిందీ ప్రచారము

హిందీప్రచార మాంధ్ర దేశమున విరళముగ జరుగుచున్నందుల కీసభవారు సంతసించుచు నింకను విస్తారముగ జరుపుటకు కాంధ్రమహాశయులు తోడ్పడుదురు గాక యని కోరుచున్నారు.

## ౧౦
## నల్లమందును తగ్గింపవలెను

ఉత్తర సర్కారులందలి జిల్లాలలోని ప్రజలకు ఆరోగ్య సంరక్షణము, వైద్యముకొరకు గావలసిన దానికన్న ఎక్కువగ నల్లమందును దొరతనమువారు విక్రయించుచున్నందున ప్రజల క్షేమమును గమనించి దొరతనమువారు దుకాణములను తగ్గించుచు వెంటనే పరిమితిని తగ్గించుట యావశ్యకమని యీసభవారు తీర్మానించుచున్నారు.

## ౧౧
## బర్మేతర నేరస్థుల బిల్లు అక్రమము

బర్మేతర నేరస్థులవిషయమునను, సముద్రప్రయాణీకుల నాదేశించు శాసనము భారతీయులకు అందులో ముఖ్యముగ ఆంధ్రులకు విపత్కరము గావున అట్టి మార్గమును బర్మాలోని ప్రభుత్వము అనుసరించుట ఆక్షేపణీయమును, అన్యాయము కావున వైసురాయిగారు సమ్మతినీయరాదనియు, నీసభవారు అభిప్రాయపడుచున్నారు.

## ౧౨
## గద్వాల సంస్థానము—నిజాముగారి చర్య

గద్వాలసంస్థానముయొక్క సహజమగు హక్కు నిరోధించి ఆ సంస్థానమును బహుకాలమునరకును తమ స్వాధీనమునం దుంచుకొన నెంచిన నైజాముగారి చర్య వారి గణనీయతకు భంగకరమై, ఆంధ్రుల కన్యాయము చేయునదై యున్నది గావున వారు వెంటనే తమ తీర్మానమును పునరాలోచించి ఆ సంస్థానమును రాణీగారికి స్వాధీనము చేయవలసినదని కోరుచున్నారు.

* * * * *

# ఆంధ్రరాష్ట్రీయ మహాసభ
## [23-10-1925]

## ౧
## సమాశ్వాసక తీర్మానము

1. కీర్తిశేషులగు దేశబంధు చిత్తరంజనదాసు, సర్. సురేంద్రనాథ బెనర్జీ, సర్ పిట్టి త్యాగరాయచెట్టి, సర్ భాండారుకారు, వి. వి. యస్. అయ్యరు, దామెర్ల రామారావుగార్ల మరణమునకు యీ సభవారు తమ విచారమును తెలియబరచుచున్నారు.

## ౨
## పాట్నా తీర్మానము

2. "పాట్నాతీర్మానములలో మొదటితీర్మానము నీసభవా రంగీకరించుచు రాష్ట్రీయకాంగ్రెసుసంఘములు, కాంగ్రెసు సభ్యులను శాసనసభలకభ్యర్థులుగ నిలువబెట్టి పనిచేయుటకు రాష్ట్రకాంగ్రెసు సంఘములకు కాన్పూరు కాంగ్రెసువా రధికార మివ్వవలెననియు, శాసనసభ్యులు మంత్రిపదవులనుగాని యేవిధమయిన ప్రభుత్వనియమితసంఘసభ్యత్వములనుగాని, బిరుదములనుగాని, యంగీకరింప

కుండుటకును, నధికారులగౌరవార్థ మియ్యబడు విందులలో పాల్గొనకుండుటకును, బడ్జెట్టులను త్రోసివేయుటకును, ద్వంద్వప్రభుత్వము నంతరింపచేయుటకును, వీలయినంతవరకు శాసనసభలలో ప్రతిఘటనములు కావించుకొని అఖిలభారత కాంగ్రెసు సంఘములవారి కవసరమని తోచినపుడు శాసనసభ్యులు రాజీనామా నిచ్చుటకును, శాసనసభ్యులకు కాన్పూరుకాంగ్రెసువా రాజ్ఞనివ్వవలయుననియు నప్పటికి కాంగ్రెసుపక్షపు శాసనసభ్యుల శిక్షణమునకు అవసరమగు నాజ్ఞల నఖిలభారత కాంగ్రెసు సంఘమువారు చేయుటకు అధికారమివ్వవలయుననియు నీ సభవారు కాన్పూరుకాంగ్రెసువారికి శిఫార్సు చేయుచున్నారు.

### ౩

### సంపూర్ణ స్వాతంత్ర్యము

భారతదేశీయ మహాజనసభయొక్క ప్రథమసూత్రములో స్వరాజ్యపదమును బ్రిటిషుసామ్రాజ్యాతీతమగు భారతదేశపు సంపూర్ణ స్వాతంత్ర్యమని నిర్వచింపవలయునని కాన్పూరు కాంగ్రెసువారిని కోరుచు యీ సభవారు తీర్మానించుచున్నారు.

### ౪

### శాసనోల్లంఘనము

ప్రస్తుత పరిస్థితులనుబట్టి భారతదేశ స్వాతంత్ర్య సంస్థాపనకు సమిష్టి శాసనోల్లంఘనము గాక మరియొక దౌర్జన్య రహితమగు విధానము లేదని యీసభవారు అభిప్రాయపడుచు నిరంతరవ్యక్తిశాసనోల్లంఘనమే సమిష్టి శాసనోల్లంఘనమునకుమార్గము కావున తదనుకూల సాధనము లాలోచించి కాన్పూరు కాంగ్రెసువారు వెంటనే వ్యక్తిశాసనోల్లంఘనము ను అమలులో పెట్టవలెననికోరుచు యీసభవారు తీర్మానించుచున్నారు.

### ౫

### స్వదేశపరిశ్రమాభివృద్ధి

హిందూదేశ విశ్వవిద్యాభివృద్ధికి స్వదేశపరిశ్రమ యొక్క విజృంభణ మవసరము గనుక సాధ్యమైనంతవరకు స్వదేశవస్తువులనే ఉపయోగించ వలయునని ఆంధ్రమహాజనుల నీసభవారు హెచ్చరించుచున్నారు.

(అ) హిందూదేశమునందు ప్రాచీన ప్రాంతములగు ఆసియాఖండ పరిసర దేశములందును యీఖండము యొక్క విజ్ఞాన ఆర్థిక రాజకీయసమస్యల వ్యక్తిత్వమును కాపాడుటకును, పాశ్చాత్యదేశము లీసందర్భములలో యీఖండవాసుల కొనరించుచున్న అపచారమును ఆపుటకును, ఆసియాఖండ సమ్మేళన మొకటి ఆవశ్యకమని యీసభవారు అభిప్రాయపడుచున్నారు.

(ఆ) అట్టిపని నెరవేర్చుటకు బౌద్ధదేశములకును మహమ్మదీయ దేశములకును మధ్యనున్న హిందూదేశమే తగియున్నదికావున, అఖిలభారత కాంగ్రెసు సంఘమువారు ఆసియాఖండ దేశమునుండి పండితులను, రాజకీయ వేత్తలనుపత్రికాధిపతులను ఆహ్వానించి, ఒకసభ సమావేశపరచి ఆసభయందు ఆప్రతినిధులతో మనదేశనాయకులు సంప్రతించి, ఆసియాఖండ సమ్మేళన ప్రణాళికను తయారు చేయుటకు తోడ్పడవలెనని యీసభవారు కోరుచున్నారు.

### ౬

### రిఫ్ఫులు-చీనాయువకులస్వాతంత్ర్యసంరంభము

మొరాకోలో అబ్దుల్ కరీముగారి నాయకత్వము క్రింద రిఫ్ఫులను, చీనాలో యువకులను, స్వాతంత్ర్యసిద్ధికై సల్పుచున్న ప్రశంసనీయమైన కార్యదీక్షను త్యాగమును ఈసభవా రభినందించుచున్నారు.

### ౭

### హిందీప్రచారము

ఆంధ్రదేశమునందు ఇంతవరకును జరిగిన హిందీప్రచారమున కీసభవా రభినందించుచు ఇకముందును భారతదేశమందు హిందీ సామాన్యభాషనుగ జేయుటకు వలసిన భాషాభివృద్ధిని జేయగోరుచున్నారు.

### ౮

### ఖద్దరు ధారణము

రాష్ట్రమునందు ఇంతవరకు జరిగిన ఖద్దరు అభివృద్ధికి యీసంఘమువారు సంతసించుచు రాష్ట్రము

యొక్క పరిస్థితుల ననుసరించి కావలసినంత అభివృద్ధి జరుగలేదని సూచించుచు రాష్ట్రములోని ప్రజలందరు ఖద్దరునే ధరింపవలెననియు, ఎన్నడు విదేశవస్త్రములను ధరింపకూడదనియు యీసభవారు ప్రజలను హెచ్చరించు చున్నారు.

## ౯
## అస్పృశ్యతానివారణము

రాష్ట్రమునందంతటను అస్పృశ్యతానివారణ నుకావించుటకు వివిధమతములవారును, జాతులవారును తోడ్పడికాంగ్రెసు సంఘమువారిచే నిర్ణయింపబడిన కార్యక్రమమునుపూర్తిగ కొనసాగించవలయునని యీసభవారు హెచ్చరించుచున్నారు.

## ౧౦
## మద్యపాననిషేధము

ఆర్థిక, సాంఘిక, నైతిక అభివృద్ధికి మద్యపాన నిషేధము అత్యవసరమని ప్రపంచమంతటను అంగీకరింపబడినను ఆదాయమే ప్రధానముగ నెంచి ప్రభుత్వమువారు మద్యపానమును తొలంగించనందుకు యీసభవారు తమ ఆగ్రహమును వెల్లడించుచు, కల్లునిమిత్తము తాటి, యీత, కొబ్బరి మున్నగుచెట్లనీయవలదనియు, కల్లు, సారా మున్నగు మత్తువస్తువుల దుకాణముల పాటలను పాడవలదనియు రాష్ట్రప్రజలను యీసభవారు హెచ్చరించుచున్నారు.

## ౧౧
## జాతీయవిద్య

ప్రస్తుత ప్రభుత్వ విద్యావిధానము జాతీయతాభివృద్ధికి విఘాతకముగ నున్నదని యీసభవారు పూర్తిగ నమ్ముచు రాష్ట్రములోని జాతీయపాఠశాలలకు ప్రజలెల్లరు తోడ్పడి తమ పిల్లలను ఆపాఠశాలలకు పంపి జాతీయవిద్యను గరపింపవలయునని ప్రజలను యీసభవారు హెచ్చరించుచున్నారు.

## ౧౨
## ఐచ్ఛికసేవకులు

ఆంధ్రరాష్ట్రమున జాతీయతాభివృద్ధికై ప్రజాసేవచేయునట్టి ఐచ్ఛికసేవకులు విశేషముగ కావలయును. కావున ఆంధ్రులు విశేషముగ ఐచ్ఛిక సేవాదళములందును గ్రామసంఘములందును చేరవలయును అని యీసభవారు హెచ్చరించుచున్నారు.

## ౧౩
## స్థానిక స్వపరిపాలనా సంస్థలు-కాంగ్రెసు సభ్యులు

స్థానిక స్వపరిపాలనా సంస్థలను కాంగ్రెసు సంఘములు వశపర్చుకొనుట అత్యవసరమని యీసభవారు ఎంచుచు మ్యునిసిపాలిటీలకు, యూనియన్, తాలూకా, జిల్లాబోర్డులకు కాంగ్రెసు సభ్యులను ఎన్నుకొనవలయునని ప్రజలను యీసభ వారు కోరుచున్నారు.

## ౧౪
## స్టేటుకౌన్సిలు అభ్యర్థులు

రాబోవు నవంబరు నెలలో జరుగనైయున్న స్టేటుకౌన్సిలు ఎన్నికలకు నిలిచియున్న స్వరాజ్యపక్ష అభ్యర్థులకు తమ వోట్లనివ్వవలయును అని రాష్ట్రములోని వోటర్ల నందరిని యీసభవారు కోరుచున్నారు.

## ౧౫
## నల్లమందు వ్యాపారము

ఇండియా ప్రభుత్వమువారి ఆదాయము నిమిత్తము నల్లమందు వ్యాపారమును పూర్తిగా మానివేయవలయును అని ఆంధ్రులు అభిప్రాయపడుచున్నారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారిచే నియమింపబడిన నల్లమందు విచారణ సంఘమునకు గోదావరిజిల్లా ప్రజలందరు తోడ్పడవలయును అని యీసభవారు కోరుచున్నారు.

## ౧౬
## దక్షిణాఫ్రికా భారతీయులు

దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారు అచట నివాసము నేర్పరచుకొనిన ఆసియాఖండవాసుల, ముఖ్యముగా, భారతీయుల, హక్కులకు భంగముకలిగించుచు కావించిన చట్టములకు యీసభవారు తమ యసమ్మతిని తెలియపర్చుచు, అచ్చటి భారతీయుల హక్కులను గాపాడుటకు, తమ

రీతిని సహాయము చేయవలయు నని రాష్ట్రప్రజలను యీ సభవారు కోరుచున్నారు.

## ౧౨
## బర్మేతర నేరస్థుల బిల్లు

బర్మా శాసనసభలో నంగీకరింపబడిన "బర్మీయులు కాని నేరస్థులను బర్మానుండి వెడలగొట్టు" బిల్లునకు యీసభవారు తమ అసమ్మతిని తెలియబరచుచున్నారు.

## ౧౩
## ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము

ప్రత్యేక రాష్ట్రము ఆంధ్రులకై ఏర్పాటు చేయించుటకై రాష్ట్రప్రజలను తీవ్రముగ ఆందోళనము చేయవలసినదిగా ఈసభవారు హెచ్చరించుచున్నారు.

## ౧౪
## తాలింఖానాలు

ఆంధ్రయువకుల ఆయురారోగ్యాభివృద్ధికై తాలింఖానాలు మొదలగునవి నిర్మించవలసినదని రాష్ట్రీయులకు యీసభవారు హెచ్చరించుచున్నారు.

*　　*　　*　　*　　*

# నవమాంధ్రగ్రంథాలయ మహాసభ

[23-10-1925]

*　　*　　*　　*　　*

## ౩

తరుణవయస్కులు మాత్రమే కాక సర్వజనులును విద్యాభివృద్ధి నొందించుకొనవలసినవారలై యుండుటచేతనున్ను, కేవల విద్యాలయములు మాత్రమే ఈవిద్యాభివృద్ధికి తగిన సాధనములుగా లేవు గనుకను, విద్యాలయములతోపాటు పౌరగ్రంథాలయముల స్థాపించి పోషణచేయుట ప్రజలయొక్కయు ప్రభుత్వముయొక్కయు ముఖ్య విధియై యున్నది గావున.

(అ) ప్రతి పురపాలక సంఘమువారును ఆయా పట్టణములందు పౌర గ్రంథాలయమును స్థాపించి పోషింపవలెను.

(ఆ) 5000 ప్రజలకు మించిన జనసంఖ్యగల ప్రతి గ్రామమందును గ్రంథాలయము లుండితీరవలయును. ఈ గ్రంథాలయములను ఆయాప్రాంతపు ప్రజలు స్థాపించవలెను. స్థానికప్రజలు ఎంతసొమ్ము సంపాదించెదరో అంతే మొత్తము స్థానికస్వపరిపాలనాసంఘములనుండి, మరియొక తమొత్తము ప్రభుత్వ, రాష్ట్రీయ ప్రభుత్వ ద్రవ్యము నుండి విరాళము తీయవలెను.

(ఇ) ఇతర గ్రామముల ప్రజల ఉపయోగము కొరకు స్థానిక స్వపరిపాలక సంఘములు సంచార గ్రంథాలయ పేటికల విధానములు వెంటనే యవలంబించి జనసామాన్యమునకు విద్యాభివృద్ధి చేయవలెను.

(ఈ) స్వంతభవనములు నిర్మించుకొను గ్రంథాలయములకు ప్రస్తుతమున విద్యాశాలా భవన నిర్మాణమునకు ప్రభుత్వద్రవ్యము నిచ్చు విధముననే ద్రవ్యమును విరాళముగ నివ్వవలయును.

## ౪

భాషాభివృద్ధి, దేశాభివృద్ధికి ముఖ్యసాధనము గనుకను ఇందునుగూర్చి మనదేశమున ప్రభుత్వమువారు కేవలమైన ప్రయత్నము చేయకపోవుటచే గ్రంథకర్తలకు ప్రోత్సాహము లేక సద్గ్రంథప్రచురణకు అంతరాయము గలుగుచున్నదిగాన,

(అ) స్థానిక స్వపరిపాలక సంఘములను, (ఆ) దేవాదాయ ధర్మదాయ ప్రతిష్ఠాపనలను. (ఇ) సహకార సంఘములను, తమతమనిధులనుండి ప్రతిసంవత్సరము వారివారి ధనసంపత్తి ననుసరించి విరివిగా ద్రవ్యమును వెచ్చించి, ఆంధ్రగ్రంథములను కొనుచుండవలయుననియు, అట్టి గ్రంథములతో సంచార గ్రంథాలయ పేటికలనమర్చి తమ్మాతలగున ప్రజాసామాన్యమునకు విద్యాభివృద్ధి చేయుచుండవలయుననియు ఈసభవారు తీర్మానించుచున్నారు.

## ౫

## కరపత్రప్రచురణము, సంచారోపన్యాసములు, తాత్కాలికపాఠశాలల వ్యాప్తి

మనదేశమున ప్రస్తుత మమలులో నున్న విద్యా విధానమందు ఈడుముదిరినవారికి విద్యాభివృద్ధి చేయదగిన సాధనము లేకపోవుటవల్ల దేశమున కనేక విధముల నష్టదాయకముగ నున్నది కావున ఈలోపమును నివారణ చేయుటకు ఈక్రింది విధానమును వెంకటనే అమలులోకి తెచ్చుటకు ఆంధ్రదేశీయుల నీసభవారు హెచ్చరించుచున్నారు.

(అ) జనసామాన్యమునకు గావలసిన అన్ని విషయములందును సులభముగ బోధపడగల కరపత్రములను, చిన్న పుస్తకములను ప్రచురించుట.

(ఆ) తాత్కాలిక పాఠశాలలను పెట్టి తన్మూలమున ఈడుముదిరిన వారికి విద్యాభివృద్ధి చేసుకొనదగిన సాధనముల నేర్పరుచుట.

(ఇ) సంచారోపన్యాసముల నేర్పరచి వారిమూలమున ప్రజాసామాన్యమునకు జ్ఞానాభివృద్ధి చేయుట.

(ఈ) మ్యాజికులాంతరు మొదలగు యంత్రములసాహాయ్యముతో ప్రజాసామాన్యమునకు విద్యాభివృద్ధిచేయుట.

## ౬

## అంగలూరుపుస్తకభాండాగారము-జిల్లాబోర్డులు

అంగలూరు బాలసరస్వతీ పుస్తక భాండాగారభవన నిర్మాణమునకు రు. 15000 విరాళమునిచ్చి మార్గదర్శకులైన కృష్ణాజిల్లాబోర్డువారి నీసభవా రభినందించుచు ఇదేవిధముగ ఆంధ్రదేశమునందు గల ఆయాజిల్లా బోర్డులవారు తమతమ జిల్లాలయందుగల భాండాగారములకు భూరివిరాళములిచ్చి భాండాగారాభివృద్ధికి తోడ్పడుటకు ఈసభవారు కోరుచున్నారు.

## ౭

## "మాలపల్లి" - ప్రభుత్వనిషేధము

గుంటూరు పట్టణమున శ్రీయుత ఉన్నవ "లక్ష్మీనారాయణ పంతులు వారిచేరచియించి ప్రచురింపబడిన మాలపల్లి" అనుగ్రంథరాజమును ప్రభుత్వమువారు "నిషేధించుట మిక్కిలి అన్యాయము, అనవసరము, ప్రమాణవిహీనము అని యీసభవారు తీర్మానించుచున్నారు.

## ౮

## స్థానికప్రభుత్వవిరాళములు నిలిపివేయుట అనుచితము

స్థానిక, స్వపరిపాలన సంస్థలు గ్రంథాలయముల పోషణార్థమై గ్రంథాలయమున కొసంగుచున్న విరాళములను, అకారణముగ రాష్ట్రప్రభుత్వమువారు రద్దుచేయుచు గ్రంథాలయముల అభివృద్ధికి అడ్డుతగులుట అనుచితమనియు, గర్హ్యమనియు, యీసభవారు తలంచుచు ప్రభుత్వమువారి చర్యను ఖండించుచున్నారు.

## ౯

## బందరు పురమందిర భాండాగారము

బందరు పురమందిర భాండాగారమునకు బందరు మ్యునిసిపల్ సంఘమువారు సం. కు రు 100 లకు తక్కువగాకుండా విరాళము ఇచ్చుటకుగానుకోరుచున్నారు.

* * * * *

# అస్పృశ్యతానివారణమహాసభ

[24-10-1925]

## ౧

అస్పృశ్యతానివారణ హిందూధర్మ సమ్మతమును, దేశాభ్యుదయ సాధనమును, కాలోచితమును అగుటచేత, భారతీయులందరును అస్పృశ్యతను నివారించుటకు సత్వరముగ ప్రయత్నములు చేయవలయునని ఈసభవారు ప్రబోధించుచున్నారు.

## ౨

మరియును రాజబాటలు జలాశయములు, తీర్థయాత్రాస్థలములు, లౌకికసమావేశములు, పాఠశాలాభవనములు వీనికి నిరాటంకముగ పంచములను అగ్రజాతు

లతోపాటు, సమానముగ రానిచ్చుట కర్తవ్యమని యీసభవారు తీర్మానించుచున్నారు.

సవరణ-౧. "హిందూధర్మసమ్మతమ"ను పదము తీర్మానమునుంచివిడదీయవలెనను సవరణను హరి నాగభూషణముగారు ప్రపాదించిరి. శ్రీ. భమిడిపాటి సత్యనారాయణగారుబలపరచిరి. సవరణ నుపపాదించిన హరినాగభూషణముగారును తీర్మానమునుఎదిరించుచు హిందూధర్మశాస్త్రమును నిర్ణయించుట కిట నధికారముగలవారు లేరనియు, అయ్యది ధర్మశాస్త్ర నిర్ణేతలు, పండితులు నగువారిచే పరిష్కరింపబడవలెనుగాని ఆంగ్లవిద్యనభ్యసించిన వారుగాని తదితరులుగాని నిర్ణయించుటకు వీలులేదనిరి.

సవరణ-౨. "అస్పృశ్యతానివారణ సందర్భములో పంచములనుద్ధరించుటకు వారికినిజమతదీక్షనొసంగి సంస్కరించుట ముఖ్యముగనుక అట్టికార్యసిద్ధికిగాను అన్ని జాతులకనుకూలించునట్లుగూడ ధర్మనిర్ణయ మావశ్యకమని ఈసభవారు తీర్మానించుచున్నారు.

## ౩

ఏతత్కార్యసాధన నిమిత్తమై ఆర్య సంప్రదాయసిద్ధమైన పరిషత్తును ఇకముందు నిర్ణయింపబడు సభ్యులతో స్థాపించుటకు తీర్మానించడమైనది.

## ౪

ఈ ధర్మనిర్మాణార్థము ఈపరిషత్తునిర్వచించు సిద్ధాంతములను అచిరకాలములో ప్రచురించి అనుష్ఠించి ఆంధ్రాచారమున ప్రవేశపెట్టుటకు తీర్మానించడమైనది.

ఇందుకు వలయు ద్రవ్యము ఆంధ్రమహాజనులు తమ సహజౌదార్యముతో సమకూర్పవలయు నని ఈసభవారు హెచ్చరించుచున్నారు.

సవరణ. "పరిషత్సభ్యుల నిర్ణయార్థము అధ్యక్షులును, శ్రీయుత దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులు, దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారులు సంప్రతించి ఏర్పాటు చేయవలెను.''

అను సవరణను ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్యగారుపపాదించిరి. నడింపల్లి లక్ష్మీనరసింహారావుగారు, దుప్పూరి సుబ్బమ్మగారులు బలపరచిరి. మరికొందరు ఆమోదించిరి. ఈసవరణను ప్రథమతీర్మానోపపాదకులగు చర్ల నారాయణశాస్త్రిగారామోదించినందున మొదటితీర్మాన మందు జేర్పబడెను.

మరియొక సవరణ

"పై తీర్మానమునందు దేవాలయముల" గూడ జేర్పవలసినదను సవరణను భమిడిపాటి సత్యనారాయణగారుపపాదించగ మొదటి తీర్మానమునకు ఆమోదముతో జేర్పబడెను.

*　*　*　*　*

# ఆంధ్ర మహిళాసభ

[25-10-1925]

## ౧

భారతదేశ స్వాతంత్ర్యమునకు తమ యావజ్జీవము నఖండధైర్యస్థైర్యములతో పోరాడి, మహామహులగు తన పుత్రరత్నముల దేశసేవ కర్పించుటయే తన మోక్షముగ నెంచి, సమస్తనారీలోకమునకు, తిలకప్రాయముగ ప్రకాశించి కృతకృత్యురాలైన నిరుపమాన స్వార్థత్యాగిని యగు శ్రీ బీ అమ్మగారి నిర్యాణమున కీసభవారు చింతిల్లుచు వారి కుటుంబమునకు తమ సంపూర్ణ సానుభూతి తెలుపుచున్నారు.

## ౨

దేశాభివృద్ధికి భాషాసేవ ముఖ్య సాధనములలో నొకటి యని సరస్వతీపీఠ మధిష్ఠించి క్షీణించిన స్త్రీవిద్య నుపునరుద్ధరించుట కనల్పకృషి చేసి కీర్తిశేషురాలైన ఆంధ్రసతీమణి శ్రీమతి గుండు అచ్చమాంబగారి యకాలమరణమున కీసభవారు దురపిల్లుచు వారి కుటుంబమునకు తమ సానుభూతిని తెలుపుచున్నారు.

## ౩

దేశాభిమానము కలిగిన ప్రతివారును తమ పిల్లలను జాతీయపాఠశాలలకు పంపుటకును రాటము పాఠశాలలయందు విద్యావిధానములలో నొకటిగా నిర్ణయించుటకును ఈసభవారు తీర్మానించుచున్నారు.

౪

దేశమోక్షమునకు ముఖ్యసాధనముగ మహాత్ము నిచే నిర్ణయింపబడినది ఖద్దరు. దాని విలువ నికనైన గ్రహించి ధరించుటకును, విశేషించి అతి పవిత్రవంతము లగు దేవస్థానములందును అనగా దేవాలయముల కేగునప్పుడును, శుభకార్యములయందును, కేవల వ్యామోహము నకు లోనై చీని చీనాంబరముల కాశింపక అమూల్య మయిన ఖద్దరును తప్పక విధిగా నుపయోగించుటకు ఈ సభవారు తీర్మానించుచున్నారు.

౫

మహాత్ముని నిర్మాణ కార్యక్రమములలో ప్రధానమును, మహాత్ము డత్యంతముగ ప్రేమించు నదియు, మహామహులగు సుప్రసిద్ధ పండితవర్యులచే విశిష్టముగ జేర్కొనబడినదియు నగు అస్పృశ్యతా నివారణ మునకు స్త్రీలుకూడ తప్పక ఘనమైన కృషిసల్పగలందుల కీసభవారు కోరుచున్నారు.

౬

మూడవది యగు హిందూముసల్మాను సఖ్యతకు సమర్థులగువారు శక్తివంచన లేకుండ కృషిచేయు సర్వస్త్రీ సామాన్యము పరస్పరైకమత్యము కలిగి స్వరాజ్యసిద్ధికి తోడ్పడక తీరదని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

౭

భావిదేశాభివృద్ధికి ముఖ్యావరోధము లగు నతిబాల్యవివాహముల ఘోర దురవస్థ గ్రహించి వర్జించుటకును, అంతకన్న దేశమును పీల్చి పిప్పిచేయుచున్న కన్యాశుల్క, వరశుల్క పిశాచముల తొలగింప ముఖ్యముగ స్త్రీలను ఈ సభవారు వినయపూర్వకముగ వేడుచున్నారు.

౮

దేశమును పాపకూపములో ముంచెడివానిలో ముఖ్యమైనది యగు వితంతువుల దురవస్థను బాపి వారిని దేశసేవకులయం దగ్రేసరులుగానొనర్చు విధానము నేర్పరుచుట కీసభవారు కోరుచున్నారు.

---

# వెన్నెల

మోచర్ల రామకృష్ణయ్యగారు, బి. ఏ.,

వేరిమి మీఱ రేచెలిని వేలుపుసానులు చందమామకుం
గూరిచి, పెండిలిం సలుపఁ గోరి, పనుల్ తమనేర్పుతోడుతన్
దీరిచి, వంటకాలకయి, తేకువ బియ్యము పిండిఁగొట్టి తా
మారఁగఁబోసిరో యనఁగ నబ్బురమై నెగడొందు వెన్నెలల్.

ఉ. చల్లని పిల్లతెమ్మెరలు సాగఁదొడంగెను హాయి నింపుచున్;
మెల్లగఁ గల్వపూగములు నిద్దురలేవఁ గడంగెఁ దావులన్
జల్లుచుఁ, గమ్మపుప్పొడి వెసన్ వెదచిమ్ముచు నెల్లవైపులన్;
దెల్లనిపండువెన్నెలలతేటలు సొంపెసలారుచుండఁగాన్.

ఉ. జక్కవవెంటి పోతుఁ గనఁజాలమిఁ దల్లడిలంగఁ జొచ్చెడిన్;
దిక్కుల గుంపులెల్లఁ దమరేనివెలుంగుకు వెల్లఁబారెడిన్;
మక్కువతోడఁ జందురుఁ దినంజను వెన్నెల పుల్గుపిండులున్;
జొక్కపుఁ దమ్మిమొత్తములు సోయగముల్ విడనాడె నక్కటా!




## ఆంధ్రమహాసభలు

ఆంధ్ర మహాసభలు నిర్విఘ్నముగను మచిలీపట్టణమునందు గతమాసాంతమునందు ముగిసినవి. అధ్యక్షుల యుపన్యాసములు, సభ్యుల ప్రసంగములు, తీవ్రవాదములు, తీర్మానములు, దేశావృతమైన నూతన ప్రబోధమును విశదము చేయుచున్నవి. సాంఘిక రాజ్యాంగ విజ్ఞానార్థికాది వ్యవస్థలందు ప్రజాహృదయము నావరించిన ప్రబోధోదయమును సభ్యులభావములు సువ్యక్తము చేసినవి. వివిధ సభలయందును భేదాభిప్రాయములు, ఖండన మండనములు, సిద్ధాంత రాద్ధాంతములు మితిమీరి పెరిగినను అంత్యనిర్ణయము లాంధ్ర హృదయ స్వభావమున కనురూపముగ నున్నవి. ప్రపంచ వ్యాప్తంబైన రాజ్యాంగ యుగమునందు, ప్రవర్ధమానంబైన ప్రజాస్వామికయుగమునందు, స్వరాజ్యసంరంభ సమయమునందు, పరదాస్యదుఃఖవేదన దశయందు ప్రత్యభిజ్ఞానముగల ప్రజలదృష్టిని రాజ్యాంగ సమస్య లాకర్షించుట సహజమైనను ఆంధ్రుల దృష్టిని నితర సమస్యలు సైత మాకర్షించుచున్న విధమును నితరసభల వ్యవహారములు విశదము చేయుచున్నవి. దేశక్షేమమునకును, ప్రజాసౌఖ్యమునకును, స్వరాజ్యము మూలసాధనమైనను స్వరాజ్యానుభవమునకు సంపద్వృద్ధియును విజ్ఞానవ్యాపనమును మానవసౌభ్రాతృత్వమును సాధనములని ఇతర సభల యం దామోదింపబడిన తీర్మానములు విస్పష్టము చేయుచున్నవి. రాజ్యాంగాందోళనము ప్రజాదృష్టి నాకర్షించుచున్న సందర్భములందు రాష్ట్రీయ సభావ్యవహారముల కెక్కువ కాలము వినియోగించుట సహజమైనను గ్రంథాలయసభ, అస్పృశ్యతా నివారణసభ, ఆంధ్ర మహాసభ, సంస్కృత సాహిత్యసభ నిర్విఘ్నముగ నుచితరీతిని ముగిసినవి. ప్రజాదృష్టి నిర్మాణవిధానము నుండి మరలి ఎన్నికల మీద నధికతరముగ లగ్నమగుచున్నను ఆంధ్రులకు నిర్మాణవిధానమునందుగల యాసక్తిని బందరుసభలు విశదము చేయుచున్నవి. నిర్మాణవిధానమునం దాంధ్రదేశమున కవసరమైన కార్యములు-ఖద్దరునిర్మాణము, అస్పృశ్యతా నివారణము.

* * * *

ఖద్దరు నిర్మాణము

అసహాయోద్యమారంభము నుండియు ఖద్దరునిర్మాణ మాంధ్రదేశమునందు

పునరుద్ధరణమునుగాంచినది. భరతఖండమునందంతటను ఆంధ్ర ఖద్దరు ప్రశస్తిని బడసినది. శ్రీమంతుల యాదరణమువలనను కొంతయూపిరితో నున్న పొందూరు నేతపరిశ్రమకు త్తేజనము కలిగినది. ముద్దులుమూటలుగట్టెడి సన్నని పొందూరుబట్టల కన్ని ప్రాంతముల నుండియును గిరాకి గలిగినది. ఆ గిరాకి వలన మాయ ఖద్దరు వెలసినది. గంజాము, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కర్నూలు, అనంతపురము మొదలగు మండలములందు మూలపడియున్న రాటములు బయటపడినవి. పెట్టెలనూలుకుబదులు వడుకు నూలు మగ్గముల కెక్కినది. పల్నాడు, తుని, జగ్గయ్యపేట, మచిలీపట్టణము, కావలి, తాడిపత్రి, నాగలాపురము ప్రాంతములందు ఖద్దరునిర్మాణము పునరుద్ధారణమునుగాంచినది. వివిధప్రాంతములనుండియును ఆంధ్ర ఖద్దరునకు గిరాకి గలిగినది. జీర్ణమైన నేత అద్దకము పరిశ్రమలు పునరుద్ధరణములైనవి. సుందరములైన బోడ సరమంచులు, రమ్యములైన అద్దకము బట్టలు బయలుదేరి ప్రాచీనవైభవమును కళానైపుణ్యమును సంస్మరింప జేసినవి. ఖద్దరు వ్యాపకము మాయఖద్దరు నిర్మాణమునకు గారణమై ఆంధ్ర ఖద్దరున కపకీర్తిగలిగించినది. ఈ సందిగ్ధ సమయమునందే దేశమునందు ఖద్దరు ధారణమునం దభిమానము, పట్టుదలతగ్గినది. శాసనసభలమీదను వ్యామోహము ప్రబలినది. శుద్ధమైన ఖద్దరును తయారుచేసెడివారు నష్టములకు బాలై ఖద్దరునిర్మాణమును సంకుచితము చేసిరి. అసహాయోద్యమము యొక్క ఉచ్చస్థితియం దాంధ్ర దేశమునందుగల ఖద్దరు వ్యాపక మిపుడు లేకుండుట సంతాపకరము. కార్య కారణ నిరూపణము దుస్తరముగ నున్నది.

* * * *

ఖద్దరుబోర్డు

అఖిలభారతఖద్దరుబోర్డు ప్రారంభము నుండియును ఖద్దరునిర్మాణమున కాంధ్ర దేశమునకుగల సదుపాయములను గ్రహించినది. ఆంధ్ర ఖద్దరుబోర్డునకు రూ. 2,50,000 అప్పును మంజూరుచేసి రూ. 1,60,000ల నిచ్చినది. ఈసొమ్ము జిల్లాలవారిగను పంపకము చేయబడి కేంద్రస్థానములను వృద్ధిచేయుట కవకాశములు గలుగక పోయినవి. గోదావరి, గుంటూరు, కృష్ణామండలములందు కాంగ్రెసు సంఘములు ద్రవ్యోపార్జనమును జేసి ఖద్దరు వ్యాపనమునకు పాటుపడినను మొత్తము మీదను కాంగ్రెసుసంఘములు ద్రవ్యోపార్జనమునకు జేసిన ప్రయత్నము లాంధ్రావనికను రూపముగనుండలేదు. కొన్ని వేలరూప్యములను కాంగ్రెసుసంఘములు సమకూర్చినను సమకూడిన ద్రవ్యము మండలముల ప్రయోజనములకే చాలకపోయినవి. అఖిలభారత ఖద్దరు బోర్డువా రప్పిచ్చిన ద్రవ్యమే కొన్ని మండలములందు ఖద్దరువ్యాపనమునకు సాధనంబైనది. కొన్ని స్థలములందు నష్టము గలిగినది. కొన్ని స్థలములందు పనియే ప్రారంభము గాలేదు. ఆంధ్ర ఖద్దరుబోర్డు ఖద్దరు నిధికి సొమ్మును సమకూర్చియుండలేదు. కాంగ్రెసు సంఘముల స్థితి యిటులుండగ వ్యక్తులస్థితియును దుర్భర

మైనది. ఖద్దరు నిర్మాణమున వారిశక్తిని ధారపోసిన శిష్టా వెంకటకృష్ణయ్య, నాళం భీమరాజుగారులు మొదలగువారు నష్టముల పాలై ధనసహాయమును బట్టి విడుదలయును, లేకను నిరుత్సాహామునందు మునిగిరి. ఆంధ్రదేశమునందు కాంగ్రెసు ప్రచారకులు ఖద్దరు వ్యాపకమునకు పాటుపడినను శ్రీమంతుల సహాయములేకను ఖద్దరు ఉద్యమము క్షీణించినది. కాంగ్రెసు సంఘములకును వ్యక్తులకును ఖద్దరు నిర్మాణమున కవసరమైన ద్రవ్యము లేకున్నది. భారత ఖద్దరుబోర్డు కోరిన ఖద్దరు నిధిని జమచేయుట కాంధ్రదేశము వెనుకంజ వేసినది. ఖద్దరునిధిని వసూలుచేయుట కాంధ్ర ప్రముఖులు చేసిన వాగ్దానములు వ్యర్థములైనవి. భారత ఖద్దరుబోర్డు శేషించిన రూ. 80,000 అప్పును ఇచ్చుటకు నిరాకరించినది. భారతఖద్దరుబోర్డువారి పెట్టుబడిసొమ్ము విషయమై జాగ్రతపడుట ధర్మముగ నున్నది. ఆంధ్రదేశము ఖద్దరు ద్రవ్యమునకు భారత ఖద్దరుబోర్డుమీద నాధారపడియుండుట యాంధ్రులయసహాయస్థితిని విశదముచేయుచున్నది. ఆంధ్రఖద్దరుబోర్డుస్థితిగతులుభారతఖద్దరుబోర్డు సహాయముమీద నాధారపడియున్నపు డాంధ్రులు వారి నియమములను సఫలము చేయకుండుట యవమానకరముగ నున్నది. భారత ఖద్దరుబోర్డువారి యప్పునకు రక్షకధనముగను రూ. 25,000 ఖద్దరునిధి వసూలు చేయవలయునని కోరుచున్నది. ఈ నిధిని వసూలు చేయనప్పుడు కాంగ్రెసు ఖద్దరు సంఘములు భారత ఖద్దరుబోర్డు స్వాధీనము లగుచున్నవి. ఈ యుపద్రవము సంప్రాప్తమైన యాంధ్రుల ప్రతిష్ఠ పోవుటయు ఖద్దరు వ్యాపకముసంపూర్ణముగ నశించుటయును సంభవము. ఆంధ్రుల ప్రతిష్ఠను, ఖద్దరు ప్రాణమును గాపాడుటకు మచిలీపట్టణమునందుగూడిన ఖద్దరుబోర్డుచేసిన నిర్ణయముల నాంధ్రలోకము వెంటనే సఫలము చేయుట యవసరము. స్వధర్మ నిర్వాహణము నం దాంధ్రు లప్రమత్తులైనచో భారత చరకా సంఘమునందును భావి స్వరాజ్య సంరంభమునందును ఆంధ్రుల స్వత్వము బలహీన మగుట నిశ్చయము.

ఆంధ్ర ఖద్దరుబోర్డు నిర్ణయించిన విధమున నాయామండల సంఘములును, ఆంధ్ర మహాజనులును విరాళముల నిచ్చియును, వాటాలను గైకొనియును స్వీయ ప్రతిష్ఠను ఆంధ్రుల గౌరవమును గాపాడుటకు భగవంతుడు తోడ్పడు గాత!

* * * *

అస్పృశ్యతా నివారణసభ

కాంగ్రెసు నిర్మాణవిధానమునం దస్పృశ్యతా నివారణము ముఖ్య విషయముగ నున్నది. సోదర దేశీయులను స్వమతావలంబనులను నిరంతర సేవాపరాయణులను దీనులను నీచజంతువులకంటెను హేయులనుగను అస్పృశ్యులనుగను భావించుట మహాపాతకముగ నున్నది. "సర్వంఖల్విదం బ్రహ్మ" "సోఽహం బ్రహ్మోస్మి" "తత్త్వమసి" ఇత్యాది ఉత్తమ ధర్మ సిద్ధాంతములను బోధించెడి హిందూధర్మమునకును, అస్పృశ్యతకును సంబంధ ముండజాలదు. అస్పృశ్యతా నివార

ణమునం దాంధ్ర దేశము ముందంజ వేయుచున్నవిధమును శ్రీయుత నరసింహేశ్వర శర్మగారు మొదలగువారు నిర్వహించుచున్న యానందనికేతనము, రాంజీరావుగారు నిర్వహించుచున్న పాఠశాల, వసతిగృహములు మొదలగు సంస్థాపనలు విశదము చేయుచున్నవి. అస్పృశ్యతా నివారణసభయందు కచ్చినసభయందువలె గాకను అస్పృశ్యు లన్ని వర్ణములవారితోను కలిసి కూర్చుండిరి. అయినను నితరప్రాంతములందువలె బందరుసభయందును కొంత ప్రతిఘటనము బయలుదేరినది. కావ్యకంఠ గణపతిశాస్త్రిగారి యధ్యక్షోపన్యాస మత్యంత ప్రౌఢముగను హేతుయుక్తముగను హృద్యముగను నున్నది. శాస్త్రిగారి వేద శాస్త్ర పరిశోధనలు గాఢములై మనోహరముగ నున్నవి. నారాయణ శాస్త్రిగారు ప్రతిపాదించిన ప్రతిపాదనమును, బ్రహ్మశ్రీ హరి నాగభూషణముగారును, పురాణం సూరిశాస్త్రిగారును ప్రతిఘటించినను, తీర్మానమధిక సంఖ్యాకులచే నామోదింపబడినది. ప్రతి ఘటకులు కోరిన ధర్మనిర్ణయమును జేయుట వర్తమానస్థితియందు సాధ్యముగాని విషయమని సర్వత్ర తెలిసియున్నది. ధర్మనిర్ణయము వారి వారి సంస్కారముల కనుకూలముగను జరుగుచున్నది. ప్రతిఘటకుల భావములు ఆమోదకులనుగాని, యామోదకుల భావములు ప్రతిఘటకులనుగాని నిర్బంధింపజాలవు. మహాసభయందు గలిగిన ధర్మప్రబోధాను సారముగను సభ్యులు విషయములను నిర్ణయించుచుందురు. మహాసభాభిప్రాయమే ధర్మాభిప్రాయము. భేదాభిప్రాయము గలవారు వారి యభిప్రాయమును వ్యక్తము చేయవచ్చును. కాని సభాభిప్రాయము నాటంకపరచుట యసంగతము. శ్రీయుత ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిసవరణతో నొకతీర్మాన మంగీకరింపబడినది. [అది వేరొకచోటను ప్రచురింపబడినది.]

ఆంధ్రధర్మ పరిషత్తును స్థాపింపవలయునని గోపాలకృష్ణయ్యగారు కోరుచున్న కోరిక యీ మహాసభయందు బీజరూపమునుదాల్చినది. భావపరిణామమును కాలము నిర్ణయింపగలదు. అస్పృశ్యతాసమస్యను పరిశీలించుటకు మాఘఫాల్గుణమాసములందు పండితమండలిసమావేశము గావచ్చును. ఆమండలి సమావేశమునకు పండితులు దయచేసి విషయమును చర్చించిసందేహనివృత్తిని జేయుట సకల విధములను శ్రేయస్కరము.

*  *  *  *

గ్రంథాలయ మహాసభ

ఆరంభశూరత్వము దాక్షిణాత్యుల లక్షణమని పెద్దలుచెప్పుట యాచారము. విద్యాభ్యాసమునకు సామాన్యజనులకుసాకర్యములు లేని భరతవర్షమునందు విజ్ఞానవ్యాపనమునకు గ్రంథాలయములు పరమప్రయోజనములు. దేశభక్తి పరాయణులైన విద్యావంతులు గ్రంథాలయముల ద్వారా దేశోద్ధరణమునకపారమైన సేవనుజేయుట కవకాశములు గలవని గ్రంథాలయోద్యమము విశదముచేసినది. అసహాయోద్యమము గ్రంథాలయోద్యమమునకు మందగతిని గలుగజేయుట యసంగతము.

అసహాయోద్యమము బలీయముగనున్న సమయమునందు సయితము గ్రంథాలయోద్యమనిర్వాహకులు వారిదృష్టి నీయుద్యమమునందు లగ్నముచేసియుండిన నీ దురవస్థ గలిగియుండదు. ఏకొలదిమందియో అన్ని యుద్యమములను నడుపుటకు బూనుకొనుటవలన నిట్టి యనర్థములు గలుగుట సహజము. గ్రంథాలయోద్యమనిర్వాహకులు ముందిట్టి యంతరాయములు గలుగకుండ కట్టుబాటులను జేయుదురు గాత!

ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీయుత పురాణము సూరిశాస్త్రి గారును సభాధ్యక్షులు శ్రీయుత గద్దె రంగయ్యనాయుడు గారును చేసిన యుపదేశములను ఉద్యమాభిమానులు సఫలముచేసి గ్రంథాలయోద్యమమును జనోపయోగముగ జేయుదురు గాత! గ్రంథాలయ సభయం దామోదింపబడిన తీర్మానములందు ప్రభుత్వమును ప్రజలును గ్రంథాలయోద్యమమును వ్యాపనము చేయగల సాధనములు సూచింపబడినవి. అందు మూడు, నాలుగు, అయిదు తీర్మానములందు గల సూచనలననుష్ఠించుటకు దగిన ప్రయత్నములు రాగలసంవత్సరమునందు జరుగు గాత యని విశ్వసించుచున్నాము.

* * *

సంస్కృతసాహిత్య సభ

సంతర్పణ గలిసివచ్చునని అన్ని సభలనేకకాలమునను సమావేశము చేయుటవలనను సభాప్రయోజనము సంకుచిత మగుచున్నది. నాలుగైదు గంటలలో సభాధ్యక్షుల యుపన్యాసములు, సభ్యుల ప్రసంగములు, తీర్మానములు ముగియవలయును. ఈసందర్భములందు ముఖ్యవిషయములనైనను సావకాశముగ విమర్శించి కార్యవిధానమును నిర్ణయించుట కవకాశము లుండవని వ్యవహారక్రమము విశదముచేయుచున్నది. సభానిర్వాహకులు వారిదృష్టిని జనసంఖ్య మీదను ఆడంబరములమీదను నిలుపకను కార్యవిధానమునందు లగ్నముచేయుట ప్రయోజనకరము. సంస్కృత సాహిత్యసభకు నానాప్రాంతముల నుండియును మహాపండితులు వచ్చియుండిరి. మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రిగారు, నోరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మొదలగు పండితుల సద్బోధలను వినుట కవకాశములు గలుగలేదు. సాహిత్యసభాదృష్టిని సంస్కృతవిజ్ఞానోద్ధరణ సాధనముల నన్వేషించుటకు వినియోగించుట ప్రయోజనకరముగాని సాహిత్యపరీక్షల సౌకర్యార్థమై వినియోగించుట ప్రయోజనకరముగాదు. సాహిత్యశాస్త్రాది పరీక్షలకై పోరాడుటకు ప్రత్యేక వ్యవస్థ లేర్పడియే యున్నవి. మహాపండితుల యుపన్యాసములను వినుటకైనను నవకాశములు గలుగలేదు. సభలయం దనవసరమైన వాదప్రతివాదములు జరిగి కాలహరణము గాకుండుటకు కార్యవిధానమును నిర్ణయించుటయును ప్రయోజనకరము. ఈ యోచనలు సాహిత్యసభకేకాక యితరసభలకును చెల్లుచున్న విధమును గ్రంథాలయాదిసభల వ్యవహారములు విశదము చేసినవి. ఆంధ్రమహాజనసభావ్యవహారక్రమ మీవిషయమును నెక్కుడుగను విస్పష్టము చేయుచున్నది.

### ఆంధ్ర మహాజన సభ

ఆంధ్రరాష్ట్రీయ మహాసభ నాయకుల దృష్టిని ఆంధ్రమహాజనసభనుండి మరల్చి యీసభావ్యవహారములకు నిశ్చేష్టతను గలుగ జేసినను కొనయూపిరితో నాంధ్రమహాసభ జీవయాత్రను గడుపుచున్నది. ఆంధ్ర మహాసభను ఉపసంహారము చేయవలయు నను తీర్మానములు ప్రతియేటను పొడసూపుచున్నను మహాసభ జీవించియున్నది. ఈ యేడు బందరుపురమునందును సభను అంతముచేయ వలయునను భావము అంకురించినవి. భావాంకురములు బహిర్గతము గాకపూర్వమె సభకు ప్రాణోదకమును పోయుట సంప్రాప్తమైనది. ఆంధ్రమహాసభయందు వాదగ్రస్తముగాని తీర్మానము లేకగ్రీవముగను నంగీకరింపబడినవి. సభాధ్యక్షులు వెంకటాచల శ్రేష్ఠిగారు రెండుగంటలకాలములో సభా వ్యవహారములను ముగించి వారిచాకచక్యమును విశదము చేసిరి. తిరిగి స్థాయిసంఘ మొకటి నియమింపబడినది. ఈ స్థాయిసంఘము గతించిన స్థాయి సంఘమువలె నిదురింపకను పనిచేయు నని నమ్ముచున్నాము. స్థాయిసంఘనిద్రావస్థకు దేశకాలపరిస్థితులు కారణములు గాని సభ్యులు బాధ్యులుగారు ఒకవ్యక్తియె పౌరసేవోద్యోగివలె సకలసందర్భములందును జోక్యమును గలుగజేసికొని సర్వజ్ఞునివలె కార్యభారమును నిర్వహింపజాలడు. ఆంధ్రనాయకులును ప్రజలును దేశవ్యవహారముల నీ విషమస్థితినుండి కాపాడుటకు సమర్థులను ప్రత్యేక వ్యవస్థలకు నియోగించి సర్వతోముఖమైన వికాసమును సాధ్యము చేయుదురు గాత!

* * *

### ఆంధ్రరాష్ట్రీయ సభ

శ్రీయుత బులుసు సాంబమూర్తిగా రాంధ్రరాష్ట్రసభను అంతరాయముల నుండి కాపాడి జయప్రదముగను ముగించి యభివందనములకు బాత్రులైరి ఆరంభమునందు సాంబమూర్తిగారును వారితో గార్యనిర్వాహకవర్గమును రాజీనామా నిచ్చుట యపోహాలకు గారణంబైనను సభావ్యవహారక్రమము వివిధ పక్షములకును విశ్వాసమును గలుగజేసినది. సాంబమూర్తిగారు స్వరాజ్యపక్ష సౌకర్యమునకే రాజీనామా నిచ్చినారని విశ్వసింప వలసియున్నది. రాజ్యాంగ వ్యవహారములను నడుపుటకు నడుమును కట్టుకొనినస్వరాజ్యపక్షము వ్యవహారమును నడుపుటకు శక్తినిగూడ గలిగియుండుట ధర్మము. సాంబమూర్తిగా రాంధ్రరాష్ట్రీయ సంఘమున కీ సందర్భములందుగల శక్తిని స్వరాజ్యపక్షవశముచేసి వారియవ్యాజదేశసేవాపరాయణత్వమును విశదము చేసిరి. శ్రీయుత కాళేశ్వరరావుగారును ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్యగారును ఈ భారమును స్వీకరించి వారి కార్యపరత్వమును విశదము చేసిరి. శ్రీయుత ప్రకాశంపంతులుగారి నధ్యక్షులనుగను, గోపాలకృష్ణయ్యగారిని కార్యదర్శిగను నెన్నుకొని స్వరాజ్యపక్షాధ్యక్షులు వారి విచక్షణతను విశదముచేసిరి. కాని శ్రీరామనగరమునకును జార్జిటవునునకును కార్యనిర్వాహణమునందు సౌకర్యములు సాధనములని తోపదు.

స్వరాజ్యపక్షాధికారమును ఆంధ్ర రాష్ట్ర జాతీయసభోపసంఘాధికారమును స్వాధీనము నందుగల స్వరాజ్యపక్షము రాజ్యాంగభాగాధికారమును వినియోగించుటకు బాటుపడి స్వధర్మనిర్వహణమును జేయుట సమంజసము.

విషయనిర్ణయ సంఘమునందును మహాసభయందును జరిగిన వాద ప్రతివాదములు సహనభావనమునందును నిగ్రహణమునందును విశ్వాస ప్రకటనము నందును విషాదమును గలుగ జేసినను వ్యవహారాంతము శుభ ప్రదముగ నున్నది. ఆంధ్ర రాష్ట్రీయమహాసభ యామోదించిన తీర్మానములు దేశమునందు ప్రవర్ధమానంబగుచున్న తీవ్ర వేదనను విశదము చేయుచున్నవి. ఈయావేదనమునకు గారకులాంగ్ల రాజనీతిజ్ఞులని నిత్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. రీడింగు బర్కెను హెడు ప్రభువుల ప్రసంగములు ముడ్డిమను కమిటీ నిర్ణయము సామ్రాజ్య శాసన సభాభిప్రాయముల నిరాకరణము నిర్బంధ విధానములు భారత ప్రభుత్వ నిరంకుశ స్వరూపమును విస్పష్టము చేసినవి. జోహుకుముభావ నిర్వాహకులకు ప్రభుత్వవిధానమునందవకాశములు గలుగును గాని ఆత్మగౌరవముగలవారికవకాశము లేదు. స్వరాజ్యపక్షనాయకులు పండిత మోతీలాలు నెహ్రూగారెంతటి సహనమును జూపినను సహకారశీలమును జూపినను నిరంకుశ ప్రభుత్వమునకు హృదయపరివర్తనముగలుగుట కలలోనివార్త. ఈ సందర్భమునందు రాష్ట్రీయ సభలయందుద్ధృతములైన తీర్మానములామోదితములగుటయందు వింతయుండదు. సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానామోదమునకు బాధ్యులు నిరంకుశ ప్రభుత్వముగాని నాయకులుగారని నిత్యవ్యవహారములు విశదముచేయుచున్నవి.

ఆంధ్ర రాష్ట్రీయసభయందు పాట్నా తీర్మానమంగీకరింపబడుటయేకాక తీర్మానాంతర్గతభావము ప్రస్తావరూపమునను విస్తరింపబడినది. రాజ్యాంగాందోళనమునుసయితము కాంగ్రెసు నడుపవలయునని నిర్ణయింపబడినది. స్వరాజ్యపక్షమువారధికారలోభమునందు మునుగకుండునటులు కట్టుదిట్టము లేర్పాటుచేయబడినవి. ఆంధ్ర దేశమునందు రెండు పక్షములవారునుగలిసి యీతీర్మానమును జేసి ఆంధ్రులసరళస్వభావమును విశదముచేసిరి. కాంగ్రెసునందు రెండుపక్షములున్నపుడు బలీయపక్షమైనను వ్యవహారమును కాంగ్రెసు పక్షమునను నడుపుట భావ్యముగాని స్వపక్షనామమున నడుపుట భావ్యముగాదు. స్వరాజ్యపక్షము స్వపక్షనామమునను వ్యవహరించుటకంటెను కాంగ్రెసు నామమునను వ్యవహరించుట వలనను గౌరవబలములు గలుగునని సర్వత్ర తెలిసిన విషయము. శాసనసభా ప్రవేశమును కాంగ్రెసు అంగీకరించినపుడు రెండుపక్షములును గలిసి పనిచేయుట ప్రయోజనకరము. ఆంధ్రసభ యీధర్మమును స్థిరపరచుచున్నది. రాష్ట్రీసభ చేసిన వ్యక్తిశాసనోల్లంఘనతీర్మానము దేశావృతమైన స్వరాజ్యానుతాపమును విశదముచేయుచున్నది. శాంతిసాధనమునను స్వరాజ్యమును బడయుటకు శాసనోల్లంఘనమేసాధనమని యన్ని పక్షములవారును నంగీకరించుచున్నారు. శాసనోల్లంఘనమునకువాతా

వరణ మెప్పుడును సిద్ధముగనె యున్నది. ఒక మూలను నారంభమైనపుడు దేశమునం దంతటను దావానలమువలెను వ్యాపింపగలదు. ఆంధ్రరాష్ట్రమహాసభ చేసిన తీర్మానములను కాన్పూరుకాంగ్రెసు సమాదరించి స్వరాజ్య సంపాదనమునకు కార్యప్రణాళికను నిర్ణయించు నని నమ్ముచున్నాము. త్యాగమూర్తులైన సాంబమూర్తిగారు రాష్ట్రీయసభను జయప్రదముగను ముగించి యభినందనములకు పాత్రు లగుచున్నారు.

* * *

ఆంధ్రవిశ్వవిద్యాలయము

మద్రాసు శాసనసభయందు ఆంధ్రవిశ్వవిద్యాలయశాసనము త్వరితగతిని రూపవిలాసములను బొందుచున్నది. ఆవేగవిలాసములు విద్యాప్రియులకును నాంధ్రదేశ భక్తులకును భయకంపములను గలుగజేయుచున్నవి. సర్ పరశురామపాత్రోగారును, వారిపక్షమువారును నాంధ్రవిశ్వవిద్యాలయశాసనమును నిర్మించుటకు గల కారణములు వారిహృదయములకే విదితములై యుండవలయును. విద్యాంగమంత్రి స్వపక్షప్రయోజనముల కింతటి పెద్దమెత్తునెత్తినాడనుట యసంగతము. ఆంధ్రుల విద్యాభివృద్ధియే శాసనమునకు ప్రయోజనమైయుండును. శాసనమును, శాసనసభయందలిచర్చా ధోరణిని పరిశీలించినపు డీప్రయోజన మసంభవమని హృద్గతంబగుచున్నది. ఈ శాసన మిపుడున్న గోడునుగూడ చెడగొట్టునను సందియము గలుగుచున్నది. మద్రాసు విశ్వవిద్యాలయమునం దాదర్శములు విశాలములు గాకపోయినను పునాదులు విశాలములగనున్నవి. విద్య విశేషవ్యయోపేత మైనను దేశమునం దంతటను కళాశాలలుండి విద్యయందరకును నందుబాటునం దున్నది. తిరుచినాపల్లి, కుంభకోణము, కోయంబత్తూరు కాలికటు, మొదలగుప్రదేశములందుండువారు చెన్నపురికి రావలసిన యవసరము లేకను స్వస్థలములందు సయితము విద్య సామాన్యులకును నందుబాటునం దున్నది. ఆంధ్ర దేశమునందును మద్రాసు విశ్వ విద్యాలయము వంటి అనుబద్ధ విశ్వవిద్యాలయముల నేర్పరచిన విద్యాంగమంత్రి మామూలుమార్గము నవలంబింపవలసి యుండును. వారి ప్రతిభకు భంగము గలిగియుండును. స్వీయప్రతిభను గాపాడుకొనుటకు పాత్రోగా రేకదేశబద్ధ విశ్వవిద్యాలయముల నిర్మాణమును జేయుటకు బూనుకొనిరి. రాజమహేంద్రవరమునందును, అనంతపురము నందును, విశాఖపట్టణమునందును విశ్వవిద్యాలయము లేర్పడును. రాజమహేంద్రవరమునకు చుట్టుపట్లను కళాశాలలు లేవు. రాజమహేంద్రవరమునందు విద్యార్థులకు దగిన సౌకర్యములు లేవు. అనంతపురము కళాశాలనూతనము. విశాఖపట్టణమునందు నూతననిర్మాణముగావలసియున్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయమేర్పడినను నాంధ్ర విద్యార్థు లిప్పటివలెనే మద్రాసు విశ్వవిద్యాలయముమీద నాధారపడి యుండుట సహజము. ముఖ్యముగను నెల్లూరు, చిత్తూరు, గుంటూరు, కృష్ణామండలములవారీమార్గము నవలంబించుట తథ్యము. ఏకప్రదేశస్థ విశ్వవిద్యా

లయములు సార్థకములును ప్రయోజనకరములును నగుటకు కేంద్రములు విద్యార్థులకందుబాటునం దుండుటయును చాలకేంద్రములుండుటయును నవసరము. స్వస్థలములందలి విద్యాలయములు నిరర్థకములగుటయును, కేంద్రములుసంకుచితములుగ నుండుటయును, విద్యావ్యాపనమునకే భంగమునుగలుగజేయును. ఈయసంగతము చర్చయందు బయలుదేరినను పాత్రోగారు తగినసమాధానముకొసంగియుండలేదు. ఆంధ్రవిశ్వవిద్యాలయ శాసనమేకప్రదేశ విశ్వవిద్యాలయ నిర్మాణములకేర్పడినను అనుబద్ధవిద్యాలయములను నయితమంగీకరించుచున్నది.విజయనగరము, బందరు, కాకినాడ, గుంటూరు, నెల్లూరు మొదలగు ప్రదేశములందు గల కళాశాల లున్నతవిద్యాశిక్షణమునకు నిరుపయోగములు గాకుండుటకుగాను రెడ్డినాయుడుగారి సవరణను పాత్రోగారంగీకరించుట వలనను నైదేండ్ల లోపలను నున్నత కళాశాలలుగ మారిన కళాశాలలు విశ్వవిద్యాలయ కళాశాలలగుచున్నవి. ఈసవరణమూలసూత్రమునకే భంగమును గలుగజేయుచు విశ్వ విద్యాలయమునకు సంకరరూపము నొసంగు చున్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయ శాసనము భావములందును సూత్రములందును ననందిగ్ధముగ నున్నపుడు భావిరూప పరిణామమును తర్కించుట నిరుపయోగము.

పాత్రోగారు రెడ్డినాయుడుగారి 'తెలుగు' నామధారణమును హర్షించుటయును విచిత్రముగనున్నది. 'ఆంధ్ర' 'తెలుగు' పదములందేపదమర్థవంతమైనదియో బాలిశులు సయితము చెప్పగలరు. స్వపక్షాభిమాన ముదారాశయములను సంకుచితము చేసెడివిధము నీవిషయము విశదము చేయుచున్నది. స్వస్థల స్వభావాభిమానమును బూని రామేశ్వరరావుగారు, శివరావుగారు దత్తమండలములను వదలకోరుట యందు విచిత్రములేదు గాని బళ్లారిని విడువవలయునని సత్యమూర్తిగారు పట్టుబట్టుట విచిత్రముగ నుండగలదు. ఆశ్రితపక్షపాతము బుద్ధిని చలింపజేయునుగదా! జస్టిసు స్వరాజ్యకక్షులు బలాబలములను దెలుపుకొనుటకు పట్టుబట్టి కేంద్రస్థానములందు గుంటూరు బెజవాడలకు స్థానము లేకుండజేయుట మాత్రము భళిభళీయని మెచ్చదగియున్నది. ప్రజ లీవిషయమును బరికించినపుడు ప్రతినిధులపస తెలియగలదు. ఈయవ్యక్తాచరణము నుండి గాపాడుకొనుటకు కార్యాలయస్థానము బెజవాడయం దుండవలయునని శాసనసభనిర్ణయించుటయును విచిత్రముగ నున్నది. విశ్వవిద్యాలయస్థానమే లేనిచోట కార్య స్థానముండు టెటులు పొసగునో తెలియకున్నది. ఏయూరివారు వారి పురమునకై వాదించుటయును, మంత్రులు మానమునుదాల్చుటయును తీర్మానమును నిరర్థకముచేయుచున్నను ప్రజాభిప్రాయము మాత్రము బెజవాడనుసూచించుచున్నది. పాత్రోగారీతీర్మానమును గ్రహించియైనను బెజవాడనుసయితము కేంద్రస్థానమునందు జేర్చి యాంధ్రదేశపు భావిభాగ్యోదయమునకు దోడ్పడుదురుగాత! ఈ వ్యవహారమునంతయును గమనించునపుడు విశ్వవిద్యాలయ.

శాసనము విషయమై ఉపసంఘమారంభమున గూడినపుడు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు తెలిపిన భావములు చెవులయం దిపుడును గింగురుమని మ్రోగుచున్నవి.

ఆంధ్రాశయములను సఫలము చేయుట కాంధ్ర విశ్వవిద్యాలయము నిరర్థకమని శాసన నియమములును, చర్చలు, విశదము చేయుచున్నవి. ప్రాతాంగ్లవిద్యాలయ వాసన లెసభ్యులను, విద్యాంగమంత్రిని బలీయముగను బాధించుచున్నవి. ఆయావరణమునుండి బయట పడనంతవరకును దేశమునకు మోక్షములేదు ఆంధ్రభాషాముఖమునను విద్యాశిక్షణమును జేయుట ఏయుగమునందో సఫలముగావలసిన సదాశయము. శాసనము నాచరణమునందు బెట్టుటకు దగిన ధనము మృగ్యము. విద్యావ్యాపనమున కవసరమైన కేంద్రస్థానములు సంకుచితములు. స్వాతంత్ర్య నిరోధమున కేర్పడిననియమములనంతములు. ఈయసంబద్ధస్థితియం దాంధ్రవిశ్వవిద్యాలయ ప్రయోజనము దైవాధీనమునం దుండును.



# కోకిల

కేశవరపు కామరాజు గారు (భారతీసమితి)

శ్రీరామ జననంబుఁ జిత్తజరతిలేక, సర్వసమ్మోదంబుఁ బర్వకున్న
నవనవాంకురములు నవ్యప్రభలులేక, వనసీమ దంపతుల్ వాడియున్న
సహకారఫలరసాస్వాదన లేకున్న, సుమనఃప్రమోదంబు సుడిమకున్న
జన్నముల్ శుభములు చక్కఁగాజరుగక, కల్యాణదినములు గ్రాలకున్న
గీ. ధరమహాలయకాలము దాపురించి, కలుషజీవన మెల్లెడఁ గ్రమ్ముఁగాని
కాఋన, సుకవికోకిల కంఠమెత్తి, కూయునే కప్పయుంగాకి కూయుఁగాక।

మ. కలకంఠీ కవిరాజ కోకిల సుధాగానంబు శ్రోత్రాళికిన్
లలితంబౌచు సుఖంబుఁగూర్చు ఋతుకాలస్ఫూర్తి నొప్పారినన్
దలఁపంగా, సమయప్రబోధకలనం గాదే "కుకోకో"యటం
చిలఁ గోళ్లార్చిన హర్షమొందుదురు హంసీంద్రాదిసత్కర్మఠుల్.

ఉ. మాయురె! కోకిలా, యమృతమాన్య భవత్కలకంఠసామ్యతన్
కూయఁగఁ బూని కొండజిలఁ గోయనియూర్చిన కంఠశోషయాఁ
బూయునె పూలతోఁట? రసపూర్ణవసంతము రాఁదొడంగునే?
హాయిగఁ గూడి స్త్రీపురుషు లాడటఁ గాంతురె గాఢసౌఖ్యముల్.

---

# శ్లిష్టాక్షరపదబంధము
## (CROSSWORD PUZZLE)
(భారతీ చందాదారులకు మాత్రము)




అడ్డపుటింట్లు

1 నీటిలోఁ బెరుగుపువ్వు
5 ఉదకమునందలి జంతువు
8 మన్మథుఁడు
11 అలంకారము
13 తీక్ష్ణమగు వేసవి
14 కలసి
15 పద్యమందలి యొకనియమము
16 గుంతకల్లు మదరాసులకు మధ్యనున్న యొక రైలుస్టేషను
17 లక్క
19 చిడిముడి మొదటి భాగము
21 చతుర్భుజుఁడు
22 ఒడ్డు
24 విశాలమైనది
25 దూరముయొక్క కొలత
27 సంతోషము
29 విష్ణుమూర్తి రక్షించినది
30 ఈశ్వరుఁడు
32 జర
33 సుందరమగు స్త్రీ
35 నీటిచేఁ గడగఁబడి పారఁదోలఁబడు నది
36 విసురుము

నిలువుటింట్లు

2 పర్వతము
3 విష్ణువు
4 అద్దమందలి కాంతి
5 సురతము
6 అత్యంతము
7 సద్గుణములలో నొకటి
9 మా గుర్రము
10 విద్వాంసుడు
12 పోకడ
14 ఒకపాత్ర
18 దురితము
20 ఒకరుచి
21 శుభమును గూర్చునది
23 సంతోషము
24 ప్రపంచము
25 మృదువైనది
26 ఒక బ్రాహ్మణుఁడు
28 ఆఁడుది
30 ప్రఖ్యాతిఁజెందిన యొక శిక్షకుఁడు
31 ప్రేలు
33 యుగములలో నొకటి
34 సంతోషముఁ దెల్పుచేష్ట

---

## నమూనా:—భారతీ సంపాదకులకు;

శ్రోభన కార్తికమాసపు భారతిసంచికయందు ప్రకటించిన శ్లిష్టాక్షరపదబంధమును పూర్తిచేసి యిందువెంట పంపినాను. దీనివిషయమై తాము ప్రకటించిన నియమములకు సంపూర్ణముగా బద్ధుడనగుచున్నాను.

పేరు..................................

ఊరు..................................

తపాలాఫీసు..............................

జిల్లా..................................

తేది..................................

సంతకము..................................

'భారతి' చందాదారు నెంబరు....................

## ఈ క్రిందబంధము ఉదాహరణము

**అడ్డము**

| ప్రశ్నలు | ప్రత్యుత్తరము |
|---|---|
| 1 ఒకచిరజీవి | పావని |
| 5 సంగీతాంగము | లయము |
| 7 భూమి | మహి |
| 9 శ్రీపదార్థము | తిరు |
| 10 ఋషిగుణము | దమము |
| 12 ఆడుది | ముదిత |

| | | | | |
|---|---|---|---|---|
| ■ | 1 పా | 2 వ | 3 ని | ■ |
| 4 ప్ర | ■ | 5 ల | య | 6 ము |
| 7 మ | 8 హి | ■ | 9 తి | రు |
| 10 ద | మ | 11 ము | ■ | గు |
| ■ | 12 ము | ది | త | ■ |

**నిలువు**

| ప్రశ్నలు | ప్రత్యుత్తరము |
|---|---|
| 2 బెస్తవారిసాధనము | వల |
| 3 నియమము | నియతి |
| 4 స్త్రీ | ప్రమద |
| 6 ఆభరణము | మురుగు |
| 8 చల్లనివస్తువు | హిమము |
| 11 ఒకయవస్థ | ముది |

ఈశ్లిష్టాక్షరపదబంధమును పూర్తిజేసి పంపువారలు ఈక్రిందివిషయముల గమనించునది.

1 పదములన్నియు నిఘంటుప్రసిద్ధములై యుండవలెను.

2 మాటలు, నల్లగడివెంట నారంభమయి, నల్లగడితో నంతమొందుచుండును.

3 ప్రతి తెల్లగడిలోమాత్రము యొక్కొక్క అక్షరముండవలెను.

4 అడ్డపుమాటలు; ఎడమనుండి కుడివైపునకు వచ్చును. నిలువుమాటలు పైనుండి క్రిందికి దిగును.

# శ్లిష్టాక్షరపదబంధము

ఈశ్లిష్టాక్షరపదబంధమును పైన సూచించిన నియమముల ననుసరించి సంపూర్ణముగ వ్రాసి మాకార్యాలయమునకు నవంబరు 15 వ తేదీకి లోపల పంపవలెను. జయమునుగాంచినవారు మూడుతరగతులుగ నెన్నుకొనబడుదురు. ఒక్కొక్క తరగతికి నొక్కొక్క బహుమాన మొసగబడును.

| | | |
|---|---|---|
| మొదటితరగతికి బహుమానము | | రు 10 |
| రెండవతరగతికి | ,, | రు 5 |
| మూడవతరగతికి | ,, | రు 3 |

జయముగాంచినవారి పేరలు రాబోవుసంచికయందు ప్రకటింపబడును. తరువాత ఆనెల 15 వ తేదీలోపల బహుమానములు పంపబడును. బహుమానార్హులను నిశ్చయించు నధికారము సంపాదకునిది. ఈ బంధమును పూర్తిచేసి పంపువారు దానితోపాటు వెనుకనున్న నమూనాలో తమ పేరును, విలాసమును, సరిగా సుస్పష్టముగా వ్రాసి సంతకముచేసి మా కార్యాలయమునకు బంపవలెను.

సంపాదకుడు, భారతీకార్యాలయము, 7, తంబుశెట్టివీథి, మదరాసు.

# దేవస్తుతి

శ్రీ రంగనాయకమ్మ గారు

[శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరాయ బహద్దరు జమీందారువారి పుత్రిక.]

సీ. ప్రోచినాఁడవుగదా యాచించినకుచేలు, ధనకనకాదు లెంతయు నొసంగి
కరుణించితివిగదా కడుదయ శబరిని, సాక్షాత్కరించుచు మోక్షమిచ్చి
రక్షించితివికదా రామదాసుని నల, పాదుషావలని సాధ్వసము మాన్పి
కాచినాఁడవుగదా కంజాక్షి ద్రౌపది, నక్షయాంబరముల నాప్తి నిచ్చి
గీ. నీవు చేయంగఁబూనిన నేరనట్టి, కార్యముండునె యెద్దైనఁ గమలనయన
కృపఁ గనవుగాని ప్రోవ నీ కెంత నన్ను, భూరిభక్తజనాపదుద్ధారకుఁడవు.

సీ. వంచించి వైరంబుఁ బెంచి సద్గతిని సాధించెడివారల తెన్నెఱుంగ
నిర్జనస్థలి యోగనిష్ఠ నానందంబుఁ, గోరెడివారల దారి యెఱుఁగ
గాఢమూఢతను నిగ్గనఁగోరి శఠులయి, పరగెడువారల సరణి యెఱుఁగ
భక్తిసంభవపారవశ్యంబునను నిను, స్తుతిసేయువారల త్రోవ యెఱుఁగ
గీ. ముక్తిసామ్రాజ్యసౌధ మాసక్తిఁ జేరు, మార్గ మెద్దియు నాకుఁ బ్రేమమునఁ జూపి
తత్పదంబున నడుపఁగాఁ దగును నన్ను, భక్తజనభవ్యదివ్యకల్పద్రుమంబ!

సీ. వట మెంత సుకృతసంభవమును గాంచెనో, నిను జలార్ణవమున నెమ్మిఁ దేల్చె
మద్ది యెంతటి పుణ్యమహిమంబుఁ జెందెనో, నిను రజ్జువునను బంధించుకొనియె
పున్నాగ మెంతటి పూజ నొనర్చెనో, నిను మంజుగతితోడ నిలుపుకొనియె
పారిజాతం బెంత భవ్యత్వ మొందెనో, నిను గోరికొనఁ జేసి నిలిచె నింట
గీ. స్థావరంబులె యింత ప్రశస్తిఁ గాంచె, జ్ఞానవంతులు నరులకుఁ గలుగకున్న
నిన్ను సేవింప కుంటయే నిందులోప, మాదిమధ్యాంతరహిత! దేవాదిదేవ!

సీ. వేదాంతవేద్యుఁడ వాదంబు నెటఁ గనుఁ, గొన్న నద్ది యగమ్యగోచరంబు
తనరఁ బురాణగాథాలభ్యుఁడవటన్న, నయ్యవి బహువిధవ్యాపకములు
నిశ్చల స్వాంతంబు నిర్ణయించు నటన్న, నెంచిచూచిన నది చంచలంబు
నెమ్మి నీయంతట నీవె యెవ్విధినైనఁ, గాన్పింతువన్నను గల్ల యద్ది
గీ. కలవొ లేవో యనెడిభ్రాంతి గలిగె మాకు, దానిఁ బోఁగొట్టఁదలఁపఁ బ్రత్యక్ష మగుము
కాకయుండిన లేవని వాకొనియెద, నిందు నాచేత దుర్యశ మందవలదు.

సీ. ఒనర నంతట నిండియున్నాఁడ వనునది, ప్రహ్లాదభక్తుచే స్పష్టమయ్యె;
అఖిలంబు నీలోన నమరినసంగతి, యల యశోదాదేవివలనఁ దెలిసె;
ఆపద ల్బాపంగ నోపు దన్విషయ మా, ద్రుపదవరేణ్యునిచేతఁ దెల్లమయ్యె
మహి భక్తకల్పద్రుమం బనువిఖ్యాతి, వెసఁ గుచేలునిచేత విదితమయ్యె
గీ. సకలవిధముల లోకంబు సాకుచుంటి, మూఢులము గాన నీయందు గాఢభక్తి
నిల్పఁగాఁ జాల మదియును నీ దయావి, శేషమునఁ గల్గఁగావలెఁ జిత్స్వరూప!

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7 Thambu Chetty Street, G. T., Madras.